పురాణవైర గ్రంథమాల 11



# వేదవతి

గ్రంథకర్త:

కవిసమ్రాట్
విశ్వనాథ సత్యనారాయణ




పబ్లిషర్సు:
ఉమా పబ్లిషర్సు,
విజయవాడ-1

# పీఠిక

ఇది పదునొకండవ నవల. సర్వభారతదేశమున మరచిపోరాని విక్రమార్క చక్రవర్తియొక్క కథ. ఈ విక్రమార్కుండుజ్జయిని రాజధానిగా నేలెను. ఈయన శకకర్త. ఈయన మున్మనుమడు శాలివాహనుడు మరియొక శకకర్త. ఈరెండు శకములయొక్క సం॥లు మన పంచాగముల యందు ప్రతిసం॥రము ముద్రింపబడుచునే యుండును. ఇట్టి ఈ ఇద్దరును లేరని, కల్పితపురుషులని పాశ్చాత్య చరిత్రకారులు వ్రాసిరి. అది మన పిల్లలచేత చరిత్రగా చదివించుచుండిరి. ఎప్పటికప్పుడు పెద్దలు పిల్లలుగా నాచరిత్రను చదివినవారేగాన దానినే విశ్వసింతురు. ఈయన క్రీస్తుపూర్వము 82 నుండి క్రీస్తుతరువాత 19 వరకు నుజ్జయినిలో రాజ్యము చేసెను. పాశ్చాత్యులు ఈ విక్రమార్కుని గుప్తచంద్రగుప్తుండుగా వ్రాసిరి. ఈ విక్రమార్కునిపేరు విక్రమాదిత్యుండు. ఆయనకు హర్షుండన్న బిరుదుగలదు. విక్రమాదిత్యుడు, హర్షుండు, అశోకుండు మొదలైన పేర్లు పూర్వరాజులలో పలుమందికిం గలవు. ఈ నాణెముమీదనున్న పేరెవ్వరికి చెందునో తెలియకుండ మోకాటికి తలకు ముడివేసెడి పాశ్చాత్యులును, వారి అనుయాయులును మూలభూతములైన పురాణములును వదలి ఈ యకాండ తాండవమును చేసిరి. గుప్తచంద్ర గుప్తునకు విక్రమాదిత్యుడన్న బిరుదు గలదు. ఆయన పాటలీపురము రాజధానిగా క్రీ. పూ. 300 ఏండ్లక్రింద పాలించెను. అలెగ్జాండరు దండెత్తిన కథ ఆనాటిది. ఈగుప్త చంద్రగుప్తుని మౌర్య చంద్రగుప్తుడని వ్రాసిరి. ఈతలయు తోకలేని వ్రాతలు మనచేత చదివించిరి. ఇదికాదని ఎవరైన చెప్పినచో

వీనరు. క్రీ. పూ. మొదటి శతాబ్దములో రాజ్యముచేసిన ఈ విక్రమార్క మహారాజు క్రీ. శ: నైదవ శతాబ్దములో పాటలీపుత్రములో రాజ్యము చేసినట్లు పాశ్చాత్యులు వ్రాసిరి.

కల్హణ పండితుఁడు వ్రాసిన 'రాజ తరంగిణిని' పాశ్చాత్య చరిత్రకారులు చాలవరకు వారిచరిత్ర రచనాదృష్టి ననుసరించి ప్రమాణముగా స్వీకరింతురు. ఆకల్హణుఁడుకూడ తనరాజ తరంగిణిని వీరి ప్రమాణముల ననుసరించియే వ్రాసెను. అతఁడు పూర్వరాజుల శాసనములను, వారి దాన శాసనములను, వారి కట్టడములను పూర్వ గ్రంథములను జాగ్రత్తగా పరిశీలించి తాను రాజ తరంగిణిని వ్రాసి తినని చెప్పుకొనెను. ఆయన లెక్క ప్రకారము ఈ విక్రమార్కచక్రవర్తి క్రీ. పూ. మొదటి శతాబ్దములో రాజ్యముచేసినట్లు తెలియుచున్నది. దానినికూడ పాశ్చాత్యులు పరిగణించలేదు. కాశ్మీర దేశమున శ్రేష్ఠశయుఁడన్న రాజుండెను. అతనికి ప్రవరసేనుఁడని తుంజినుఁడని మఱిరెండుపేర్లు గలవు. ఆయనకిద్దఱు కుమారులు-ఒకఁడు హిరణ్యుఁడు, రెండవవాఁడు తోరమానుఁడు. హిరణ్యుఁడు క్రీ. శ. పదునాఱవ ఏట రాజ్యము చేసెను. మిహిరకులుఁడు క్రీ పూ. 700 సం॥ రమునందు రాజ్యముచేసెను. పాశ్చాత్యులు ఆ మిహిరకులుని, ఈతోరమానుని కుమారుఁడని వ్రాసిరి. హిరణ్యుఁడు తన తమ్ముఁడైన తోరమానుని బందిచేసెను. హిరణ్యుని తరువాత రాజు లేక పోయెను. మంత్రులు ఉజ్జయినీ నగరాధిపతియయిన, ఉజ్జయిని యందు పరిపాలించు ఈవిక్రమార్క మహారాజును తమకొక రాజును పంపుమని విన్నపముపంపిరి. విక్రమార్కుఁడు మాతృగుప్తుఁడన్న వానిని పంపెను. ఇక్కడ కల్హణుఁడిట్లు వ్రాసెను.

ఆదినములలో సాటిలేని ఉజ్జయినీ నగరమునందు హర్షుఁడన్న బిరుదము కలిగిన ఏకచ్ఛత్రాధిపతియైన మహానుభావుఁడైన విక్రమాదిత్యుఁడు పరిపాలించుచుండెను. లక్ష్మి విష్ణువు యొక్క చతుర్బాహువులను సముద్రమునవదలి, ఈమహా రాజు నాశ్రయించెను. ఆయన శకులను నిర్మూలనముచేసి. మ్లేచ్ఛులను సంహరించుటకు నవతరించవలసిన బాధ్యత విష్ణువునకు తొలగించెను.

ఈ రాజు కాలమునందే కాళిదాసాదు లుండిరి. ఆయన యాస్థానమున నవరత్నములని పేర పిలువఁబడు మహాపండితు లుండిరి. ధన్వంతరి, క్షపణకుడు, అమరసింహుడు, శంకుభట్టు, భేతాళభట్టు, ఘటకర్పరుఁడు, వరాహమిహిరుఁడు, వరరుచి, కాళిదాసు. ఈ పండితు లాయన యాస్థానము నందుండిరి. కాళిదాసు 'జ్యోతిర్విదాభరణ' మన్న కావ్యమును వ్రాసెను. అందులో తాను రఘువంశ, మేఘసందేశ, కుమార సంభ వము లన్న కావ్యములు వ్రాసితిననియు, తనకు విక్రమా దిత్యుఁడు స్నేహితుఁడనియు వ్రాసెను. ఆ కావ్యములను తాను క్రీ. పూ. ౩౪ వ ఏట వ్రాసితినని చెప్పికొనెను. ఇంత విస్పష్టముగా నున్న కాలమును రాజును వదలిపెట్టి పాశ్చాత్యులు విక్రమాదిత్యుఁడే లేఁడని వ్రాయుట, వ్రాసినది పరిగణింపఁబడుట ఈ దేశమునకే చెల్లినది. కొందఱు పాశ్చా త్యచరిత్రకారులు మన పురాణములను, కావ్యములను చదివి భారతీయ పూర్వ చరిత్ర న్యాయముగానే వ్రాసిరి. కాని స్మిత్, బుహాలర్, స్టిమ్, మొదలైనవారు వారి యిష్టము వచ్చినట్లు మార్చిరి. పర్గిటరు మొదలైనవారు కొంత న్యాయముగా వ్రాసిరి. వ్రాసిరని స్మిత్ మొదలైనవారే

అంగీకరించిరి. గాని వానిని తుడిచివేసిరి. విక్రమార్క చక్ర వర్తి యాస్థానము నందున్న సర్వ పండితులును మహా జ్యోతిశ్శాస్త్ర వేత్తలు, అందఱును ఖగోళశాస్త్ర వేత్తలు. వారు పలు గ్రంథములు వ్రాసిరి. ఇంచు మించుగా నన్ని గ్రంథములలోనను తాము విక్రమాదిత్యుని యాస్థానము నందుంటిమనియు ఆ చక్రవర్తి కాలము కలి శకమున నింత యనియు వ్రాయుచునే వచ్చిరి. వాని నన్నింటినీ పాశ్చాత్యులు దిగదుడిచివేయుట పురాణముల యొక్కయు భారత దేశచరిత్ర యొక్కయు దౌర్భాగ్యము. విక్రమా దిత్యుఁడు కలిలో 3020 సం॥ లనాఁడు రాజ్యమునకువచ్చి 3120 వరకు రాజ్యము చేసెను. దానిని పురాణములు చెప్పు చున్నవి. కాళిదాసాది మహాకవుల గ్రంథముల నుండికూడ తెలియుచున్నది. ఇంతకును మెగస్తనీసు మొదలైనవారు వ్రాసిన గాండ్రకోటస్ అన్న శబ్దము చంద్రగుప్తశబ్దముగా తీసికొని అప్పుడు పాలించువాఁడు గుప్త చంద్రగుప్తుఁడని కొందఱు తెలియకయు కొందఱు తెలిసి మోసముచేయవలయుననియు, మౌర్య చంద్రగుప్తుఁడని వ్రాసి చేసినతప్పును కప్పిపుచ్చుటకు పడిన తంటాలలో వారియిష్టమువచ్చిన దుష్టపువ్రాతలు వ్రాసిరి. మౌర్య చంద్రగుప్తుఁడు క్రీ పూ. 1534 వ నాఁటి వాఁడు. యుధిష్ఠిరశకము 1600 ల నాఁటివాఁడు. గుప్తచంద్ర గుప్తుఁడు క్రీ.పూ. 327 ఏండ్లవాడు, ఇద్దఱినడుమ 1200 ఏండ్లు వారడియున్నది. దీనిమూలముగావారు నాఁటివిక్రమార్కచక్ర వర్తిని రెండవ చంద్రగుప్త చక్రవర్తిగా వ్రాయవలసివచ్చెను.

ఈదోషము లన్నిటిని మన జాతీయతాభిమానముగల పెద్దలు నిరూపించుచునే యుండిరి. వారి వాదనలకు తావు

లేకుండ చేసిరి. కాని వానినెవరుచదువుదురు? పి. నారాయణ శాస్త్రిగారన్న మదరాసులోని నొకన్యాయవాది శంకరుని కాలమును నిరూపించుచు పాశ్చాత్యుల వ్రాతలను ఖండించెను. నర్సారావుపేటలోని కీ. శే. శ్రీ నడింపల్లి జగన్నాథ రావుగారు మహాభారత యుద్ధకాలమును నిరూపించిరి. చివరకు బ్రహ్మీభూతులైన శ్రీ కోట వెంకటచలంగారు మన పూర్వచరిత్రనుగూర్చి బహుపరిశోధనలుచేసి ఎన్నియో గ్రంథములు వ్రాసిరి. అనంతపుర రాజకీయ కళాశాలలో గణితోపాధ్యాయులైన తిరువెంకటాచార్యులుగారు బిగాండెట్ అన్న పాశ్చాత్యుని గౌడమజీవితము "గౌతమ"ను తీసికొని యిది యంతయు తప్పని ఖగోళ విజ్ఞానముచేత నిరూపించిరి. బుద్ధుడు క్రీ; పూ. పదునేడవ శతాబ్దివాడు. అతనిని పాశ్చాత్యులు క్రీ.పూ. మూడవ శతాబ్దివానిగా మార్చిరి. బుద్ధుడు క్రీ. పూ. 1807 లో చనిపోయెను. దీనిని శ్రీ తిరువెంకటాచార్యులుగారు నిరూపించిరి. ఈనడుమ నొక దినపత్రికలో బుద్ధునికాలము క్రీ. పూ. పదునెన్మిదివందల సం॥ రమని ప్రకటించబడినది. అట్టివానిని మనచరిత్రకారులు పరిగణించుట లేదు. నా యీ పురాణవైర గ్రంథములలోని నవలలు పండ్రెడును తత్తత్ పురాణములందు చెప్పబడిన కాలములనునిరూపించిన నేను పేర్కొన్న పండితుల రచనల ననుసరించి రాచరికపు పాఠశాలలవారి యాదరణము లేకపోవుగాక, పాశ్చాత్యులు వ్రాసినదే నిజమని నమ్మినట్టి కొందఱు మహానుభావుల నిందకు నేను పాత్రమైన నగుదును గాక, అచ్చమైన జాతీయతా భావము హృదయములందు నెలకొనిన భారతీయతాభిమానులు, వారి సంఖ్యకంటె నెక్కువ సంఖ్య

కలవారు దేశములో నున్నారని నాకు తెలియును, ఈ నవలలు వారి కొఱకు వ్రాయుచున్నాను.

శ్రీ విక్రమాదిత్యుడు విక్రమార్కుడు హర్షుడన్న బిరుదము కలవాడు. కాళిదాసాది మహాకవులను పోషించిన వాడు, శకకర్త, అవతార పురుషుడు, ఉజ్జయిని యందు 100 ఏండ్లు రాజ్యము చేసెను. ఆయన క్రీ. పూ. మొదటి శతాబ్దములో రాజ్యము చేసెను. దీనికి కాళిదాసాదికవుల రచనలు పురాణములును, కల్హణుని రాజ్యతరంగిణియు సాక్ష్యములు. ఈ నవల ఆ మహా ప్రభువు యొక్క చరిత్ర కొద్దిలో వ్రాయుటకు నిర్దేశింపబడినది. తరువాత నెప్పుడో ఈ పురాణవైర గ్రంథముల కాక, హిరణ్యుడు, తోరమానుడు. మిత్రగుప్తుడు, శ్రీ విక్రమార్క చక్రవర్తి వీరిని గుఱించి పెద్ద నవల వ్రాయుదును. దానికి కల్హణుని రాజతరంగిణియే యాధారము. ఆనవల పేరు 'భ్రమరవాసిని.'

పండ్రెండవ నవల పేరు నివేదిత. హేలీనాలో, ఈ నవలలో నివేదితలో పాశ్చాత్య చరిత్ర కారుల పూర్వ రూపములు పాత్రలుగా ప్రవేశపెట్ట బడినవి. వారి ద్వారానే పాశ్చాత్య చరిత్రకారులు చేసిన ఈ యన్యాయము చెప్పబడుచు వచ్చినది వ్రాయబడినవి. నవలలు గాక వేఱె గత్యంతరము లేదు. మన మొక్కటి వ్రాసినచో మరియొకటిగా భావించు విమర్శకులున్నారు. వారికి డబ్బిచ్చి వ్రాయించు పత్రికాధిపతు లున్నారు. వారు జన్మించినది భారతదేశమునందేగాని, వారి బుద్ధులు విజాతీయ బుద్ధులు. వారందఱకు నమస్కారములు. చెప్పితినిగదా, నా గ్రంథము లెవరికొఱకు వ్రాయుచున్నానో! దుర్బుద్ధి శాంతించునుగాక.

# వేదవతి



## ప్రథమాధ్యాయము

"చక్రవర్తి దివాభాగమంతయు నిరంతరము కార్య నిమగ్నులై శ్రమపొంది యున్నారు. అంతఃపురాంతిక మల్లీ సుమోద్యాన చంద్రకాంత మంటపమున విశ్రాంతి తీసికొను చున్నారు. వారి దర్శనమునకిది యదను కాదు. మఱియొక సారి రారాదా?"

"నేను చాల దూరము నుండి వచ్చితిని. వయసు మీరినవాడను. పవలెల్ల భోజనము లేదు. కొన్ని క్రోశములు నడచి వచ్చితిని. నేను చక్రవర్తి దర్శనము చేయకుండ మరియొక చోటికి పోలేను. వారి దర్శనమైన తర్వాత నోపిక వచ్చినచో మరి యింకొక చోటికి పోగల్గుదునేమో? సర్వ శుభమూర్తియైన చక్రవర్తి ముంగిట నపర సంధ్యా కాలమున మంగళమైన యొక బ్రాహ్మణ శవము నేల వాంఛింతువు?. అర్ధరాత్రముల నపర రాత్రములనైనను చక్రవర్తి జనులకు తన దర్శనము నొసంగునని రాజాజ్ఞగా నాల్గు దిక్కులు ఘోషించు చున్నవి."

"అయ్యా! నిజమే, కాని అట్టి చక్రవర్తి యారోగ్య మును సంరక్షించుకొనవలసిన బాధ్యత ప్రజల కున్నది గదా! మనము ప్రజలము. తమ రుత్తమ ప్రజలు. తమవంటి వారు కూడ చక్రవర్తి యొక్క ఈ విశ్రాంతిని భంగము చేసినచో నేమనవలయును?"

"అయ్యా! శరీరము విశ్రాంతిని వాంఛించును. శరీరము శ్రమ పడగలదు. ఒక మహాకార్యము సంఘటిల్లినపుడు విశ్రాంతి తీసికొనుట యాత్మ ద్రోహము. తత్కార్యము జగద్రక్షా హేతువైనచో జగద్ద్రోహ హేతువు నగును."

"తమరట్టి కార్యముమీద దయచేసిరని మాకు తెలియదు. నేను చక్రవర్తి యొక్క యంగరక్షకులలో నొకడను. తమయొక్క కార్యమును తొలుత దెలిసికొని దాని ప్రాముఖ్యము ననుసరించి చక్రవర్తికినివేదింపవలసిన వాడను. తమ పని యేదియో నాతో జెప్పినచో యాగామములు నిశ్చయించి మిక్కిలియు నవసరమైనదని, నేను భావించినచో చక్రవర్తికి విన్నవించెదను. కానిచో మీరు క్షమించ వలయును."

"ఒక మహా విషయము యొక్క ప్రాముఖ్యము సర్వ జనులకు దెలియక పోవచ్చును. తదధికార నియమిత పురుషున కవగతి కలుగకపోవచ్చును. చక్రవర్తికే తెలియక పోయినచో రాజు కాలాత్మకుడు కనుక కాలమనుకూల మను కొందుము. అధికారికి తెలియక చక్రవర్తి చెవిని బడక, కార్యము చెడినచో కాలముయొక్క ఋజుత్వము చెడదు. వ్యక్తియొక్క శీలముచేత మలినమగుట సంభవించును. తమరు పండితులే కావచ్చును. వివేకవంతులే కావచ్చును. ఒకొకప్పుడు పరమ రహస్యమైన విషయము సంగతమైన సామాగ్రి యందు పరమ సూక్ష్మముగా నుండును. దానిని భగవదంశసంభూతులే తెలిసి కొనగలరు. శ్రీ విక్రమార్క మహారాజు భగవదంశ సంభూతుడు. లోకమునకు పరాక్రమ వంతుడు, రాజనీతివేత్త, ధర్మనిరతుడునని మాత్రమే తెలి

యును. నా కధికముగా తెలియును. గుప్తచక్రవర్తులైన తర్వాత భారతదేశము మరల యవనాక్రాంతమైనది. అధర్మము చెలరేగినది. మేకతోళ్ళు కప్పికొని తోడేళ్ళవలె భారతీయధర్మము నవలంభించు చున్నట్లు నటించుచు, మ్లేచ్ఛ జాతులను వారి జగద్ద్రోహకర సిద్ధాంతములను లోన విశ్వసించు చున్నభారతీయులైన యితరులును చెలరేగిరి. మూల సూత్రములలో లేకుండ విచిత్రముగా నహింస యున్న సిద్ధాంతము ననలంభించిన బౌద్ధుల మార్గము పట్టిన మరి కొందరు ధర్మభ్రష్టులై తమదియే ధర్మమనుకొనుచు భారత దేశమును కలుషితము చేయుచుండగా, మృదుతర హిమానీసుషీమ వశీకృమైన కైలాసగిరి నధివసించి యున్న పార్వతీజాని భారత ధర్మమును మరల సంరక్షింపవలయునన్న దయా భావముతో మహామహిముడైన యొక యక్షుని, గుహ్యాకేశ్వరుని పిలిచి, 'ఓయీ! నీవు పోయి భారతదేశమున జన్మింపుము. అస్మన్నివాసమైన యుజ్జయినీనగరమున నగ్నివంశీయులైన రాజులలో ప్రమర వంశీయులు రాజ్యము సేయు చున్నారు. వారిలో గంధర్వసేను డన్న రాజు పాలించు చున్నాడు. అతడు వృద్ధుడు. అతని కిదివరకొక్క కొడుకు గలడు. అతని పేరు శంఖుడు. గంధర్వసేనుడు పూర్వ మేబదియేండ్లు రాజ్యము చేసి శంఖునకు రాజ్య మప్పగించి తాను మరల శ్రీశైల మహాక్షేత్రమునందు నా సన్నిధికి వచ్చెను. మరల ననగా నితనికంటె పూర్వులైన ప్రమర వంశ రాజు లుజ్జయిని నుండి యవనులచేత దరుమబడి సుమారు200ఏండ్లు శ్రీశైలమున మత్సన్నిధానమున దపస్సు

చేయుచు జీవితములు గడిపిరి. చివరకు గంధర్వసేను డుద యించెను. ఇత డుజ్జయినీ రాజ్యమును గెల్చికొని యేబది యేండ్లు పాలించెను. ఓయీ! ఉజ్జయినీ నగరము యొక్క తొలుతటిపేరు అంబావతి. మా పార్వతికి మిక్కిలి ప్రియ మైన నగరము సుమీ! శంఖుడు ముప్పదియేండ్లు పాలించెను. అతడనపత్యుడై మరణించెను. వంద యేండ్ల వయస్సుగల గంధర్వసేనుడు మరల నేగిరాజ్యము స్వీకరించ వలసివచ్చెను. అత డంబావతిలో నిన్న మొన్ననే రాజ్యము చేయ నారం భించెను. ఆయనకు మరల పురుష సంతానము కలుగవల యును. అతడు మరల రాజు కావలయును. ఈ భారతీయ ధర్మము రక్షింపబడవలయును. భారతదేశము మరల వేదవతి కావలయును. ఓయీ! వేద ధర్మము నందలి సూక్ష్మాతి సూక్ష్మములైన మహా విషయములు మరుగుపడిపోవుచున్నవి. తత్త్వపరమ సూక్ష్మ విషయికి విజ్ఞానమూర్తులమైన నా యొక్కయు, శ్రీమన్నారాయణుని యొక్కయు, తత్త్వము తెలియక స్థూలవిషయ పరిజ్ఞానమాత్రదూషిత చిత్తవృత్తు లైన మ్లేచ్ఛులచేత పరమమైన తత్త్వము మరుగు పడు చున్నది. మేము సృష్టిగా వికార మందినపుడు సృష్టి మమ్ము వదలి సాగవలయునని మా సంకల్పము కాదు. తిరిగి తిరిగి మేము దానిని నిలబెట్టుచుందుము. నీవు నా యంశనుగొని గంధర్వసేనుని గర్భమున నుదయింపుము. కలి ప్రవేశించి యిప్పటికి మూడువేల సంవత్సరములు దాటి పైన నొక యేడు గడచినది. నీవు గంధర్వసేనుని మూడవ భార్య గర్భమున నిలువుము. ఆమె శ్రీశైలమున నిరతము మత్సే

వాపరాయణురాలై ప్రవర్తించినది." అని యాజ్ఞాపింపగా నా గుహ్యకుడు గంధర్వసేనునికి కుమారుడై యుదయించెను. ఈ మహారాజు శివాంశ సంభూతుడు. గుహ్యకేశ్వరుడు ఈ చక్రవర్తి తన మైదవయేట హిమాలయ పర్వతములకేగి పంౕడెండేండ్లు తపస్సు జేసెను. పదునేడవయేట తిరిగి వచ్చెను. పదునెన్మిదవయేట పట్టాభిషిక్తుడయ్యెను. ఈ చక్రవర్తి సర్వ భారతదేశమును జయించి సామ్రాజ్యమును స్థాపించుటకు ముప్పది రెండేండ్లు పట్టెను. కలి ప్రవేశించి యిప్పటికి మూడువేలపైన నేబది రెండేండ్లు గడచెను. సర్వ శత్రువులు నిర్మూలింపబడిరి గాని ప్రధాన శత్రువుని నిబర్హింపబడలేదు. ఆ ప్రధాన శత్రువు రూమ్యక దేశాధిపతి. దానినే బాహ్లీక దేశమందురు. అతని గెలుచుట సాధ్యము కాదు. అది యొక పరమ రహస్యము. రెండు మూడు దండయాత్రలు చేసి కూడ చక్రవర్తి యీ రాజ్యమును స్వాధీనపరచుకొనలేక పోయెను. ఏదియో యిబ్బంది కలుచుండెను. ప్రధానమైన హేతువు నాకే తెలియును. అది నా గడుపున బుట్టిన బిడ్డ. ఈ సంగతి చక్రవర్తితో జెప్పవలయును."

"మరి యిన్ని దినములేల యాలస్యము చేసితిరి. ఆ హేతువు మీ కడుపున బుట్టిన బిడ్డ యగుట యేమి? నా కర్థమగుటలేదు." అని యంగరక్షకుడు పోయి చక్రవర్తితో విన్నవించెను. చక్రవర్తి యనుజ్ఞ వచ్చెను. బ్రాహ్మణుడు చక్రవర్తి యెట్ట యెదట నిలుచుండెను. ఆ బ్రాహ్మణుఁ డెఱ్ఱనివాఁడు. విశాల వక్షస్స్థలము కలవాఁడు. నేత్రముల యందెఱ్ఱని జీరలు కలవాఁడు. మెడలో పీమ రుద్రాక్ష

లున్నవి. కరములయందుఁ గంకణములు కలవు. దినదిన మునుకుట చేతఁ గావిరంగూదిన ధోవతియు నుత్తరీయ మును ధరించి యున్నాఁడు. కాని మిక్కిలి డస్సియున్నాఁడు. ఆయనను జూచి నంతనే చక్రవర్తి హృదయము నుండి యొక గౌరవము పెల్లుబికి వచ్చెను. చక్రవర్తి లేచి నిలు చుండెను. సాయంకాల మలయపవన విహార భూమియయిన యీ మల్లీసుమోద్యానమున భవిష్యత్కుడుంగమైన యొక కఱ్ఱలమర్పబడిన మండపమునందు చంద్రశిలా వేదిక మీఁద చక్రవర్తి కూర్చుండియుండెను. ఆ వేదిక కెదురుగా నున్న మఱియొక వేదిక మీఁద బ్రాహ్మణుఁడు కూర్చుండెను. తీగ లల్లుకొన్న మండపమైనచో మందపవన సంచారము కలుగదని చక్రవర్తి యీ క్రొత్త మంటపమునఁ గూర్చుండెను. ఇట్టి క్రొత్త మంటపము లందందుఁ గలవు. వాని పైకి మల్లీ లతలను బ్రాకింతురు. బ్రాహ్మణుఁడు చక్రవర్తి చేసిన గౌరవమునకు మిక్కిలి సంతుష్టుఁడయ్యెను. చక్రవర్తి యిట్లనెను - గుహ్య కాధిపతిని గెలుచుటకు మహాభ్యంతర మున్నదని తమరు చెప్పితిరఁట? దానిని వినఁగోరుచున్నాను. బ్రాహ్మణుఁడు- నాకు కుమార్తె గలదు. ఆమె పేరు వేదవతి. ఆమె వయస్సు పదుమూఁడేండ్లప్పుడు అనగా నాలుగేండ్ల క్రింద నామెను యవనులు తీసికొని పోయిరి. మాది సింహపుర దేశము. ఉరగ కటక దేశముల మధ్య నున్నది. ఉరగమునకు ప్రాగ్దిశ యందు నభిసార కాంభోజ త్రిగర్త దేశములున్నవి. ఈ నాల్గుదేశములను తమ సేనావాహినులు ముంచి మెత్తినవి.

ఉత్తర జ్యోతిష శకకిరాత దరద దేశములు సమ్రాట్టునకు వశమయినవి. ఒక్క బాహ్లీక దేశమే కాలేదు. నాలుగేండ్ల నుండి తమరికది వశమగుటలేదు. తమ సేనలు మా దేశము రాక ముందు సర్వము యవనమయముగా నుండెను. మఱియు మా దేశమున ననాది నుండియు బ్రాహ్మణుల సంఖ్య ఎక్కువగా నుండెను. త్రిగర్త కాంభోజాభి సారోరగదరద శకకిరాతోత్తర జ్యోతిష దేశములన్నియు యవనమయము లయ్యెను. తత్రత్యులైన బ్రాహ్మణులు కూడ యవనా చారములనే యవలంబించు చుండిరి. యవనాచారులైన బ్రాహ్మణులు కూడ యవనుల క్రోధమునకు గుఱియగు చుండిరి. కొన్ని వందల యేండ్లుగా నా యవనుల యీ బాధ బ్రాహ్మణులును, బ్రాహ్మణ మతాభి మానులును పొందు చునే యున్నారు. ఇన్నాళ్ళకు మహా చక్రవర్తులు తమరు సంభవించి భారత దేశమున వేదధర్మమును మరల ప్రవర్తింప జేయు చున్నారు. అ యవనులు వేదమతానుసారుల యొక్క యిండ్లకు నిప్పుపెట్టుదురు. ఆస్తుల నపహరింతురు. స్త్రీలను చెఱపట్టుదురు. పురుషులను వధింతురు. అవివాహి తలనెత్తికొని పోదురు. వారిని పెండ్లియాడుదురు. ఈ మహా బాధ వందల యేండ్లుగా ననుభవించుచున్న యీ జాతి నేడు తమ మహాకరవాలము యొక్క నీడయందూర్పుతీసి కొనుచున్నది. మా సింహపుర దేశము మీదికి వారి దాడులు సాగుచునే యున్నవి. మహారాజా! ఎక్కడి సింహపురి? ఎక్కడి యర్థబాహతీ నగరము? నేను విడుపని ప్రయాణము లతో పంచనదములను దాటి సరస్వతీ దృషద్వతులను దాటి

గంగా యమునలను దాటి వింధ్యములను దాటి తమ దర్శ నార్థము వచ్చితిని. నన్ను పాలింతురని యాశించుచున్నాను.

చక్రవర్తి:- తమరు మిక్కిలి శ్రమపడి వచ్చితిరి. మీ కుమార్తెను వారు దొంగిలించుకొని పోయి నాలుగేండ్లయినది కదా! అప్పటి కామె యవివాహిత యని చెప్పితిరి. ఆమెను వారిదివరకే యెవనికో యిచ్చి పెండ్లి చేసి యుందురు కదా! ఇప్పుడేమి చేయఁగలము? రుమ్యక దేశమును జయించుట యన్న మే మెట్లును చేయుదుము. మీకు సాహాయ్యము చేయుట యనునది నేఁడు సాధ్యమయిన విషయము కాదు.

బ్రాహ్మణుడు:- అది యట్లుకాదు. ఆమె నెవ్వరును వివాహ మాడలేరు. ఆడి యుండరు. ఆడి నందు వలన ప్రయోజనములేదు. ఆమెను బాధించుటకే తీసికొనిపోయి నారు. ఆమె యెచ్చట నున్నదో తెలియదు. అమె నే పల్లెలో దాచినారో తెలియదు. ఆమె యొక విచిత్రమైన బాలిక. సౌందర్యవతి కాకపోలేదు. సౌందర్యవతి యనుటకు వీలులేదు. శరీరపుష్టి తక్కువ యయిన పిల్ల. కాని యెంతటి శ్రమమైన నోర్వఁగలదు. ఆమె నెవ్వరును వివాహమాడుటకు వీలులేదు. ఆమె యొద్ద కొన్ని శక్తులు కలవు. చిన్న ప్పటి నుండి యామె దేవీ భక్తురాలు. చిన్నప్పుడే చనిపోవు ననుకొన్నాము. నాకుఁ గొంత జ్యోతిషము తెలియును. ఆమె జాతకమును బరిశీలించితిని. ఆ యమకుఁ బూర్ణా యువు కలదు. ఒక వృద్ధ పండితుఁడు, దేవీభక్తుఁడు మా యింట నొకనాఁడు వచ్చెను. ఆయన కామెను చూపించితిని.

ఆయన నా యందలి గౌరవముచేత నా పిల్లకు దేవీ మంత్ర మువదేశించెను. ఆమె నాలుగేండ్లు నిరాహార దీక్ష బూని నిద్రకూడ లేకుండఁ దన్మంత్రానుష్ఠానము చేసెను. ఆమెకు దేవి ప్రత్యక్షమయ్యెను. ప్రత్యక్షమయ్యెనో యేమో తెలి యదు. నాటి నుండి యామె ప్రకృతి మారిపోయెను. ఆమె మొగమునందొక విచిత్రమైన కాంతి వ్యాపించెను. ఆమె విషయమున నామె కిష్టములేని పని యెవ్వరును చేయరాదు. ఆమెను స్పృశించరాదు. తల్లి కూడ కోపముతో నామెను గొట్టినచోఁ దల్లి మూర్ఛపోవును. అప్పటి నుండి మా కందఱ కామెను స్పృశించుటకే భయమయ్యెను. ప్రేమతో స్పృశిం చుట వలన నపాయము లేదని మాకు క్రమక్రమముగాఁ దెలిసెను. అట్టి పిల్లను యవనులు దుష్టులై ధూర్తులై పెండ్లి యాడుట యెట్లు? నాకా భయములేదు.

చక్రవర్తి:- ఆమె యంగీకారము మీఁదనే పెండ్లి యాడవచ్చును గదా!

బ్రాహ్మణుఁడు:- ఈ మాట చక్రవర్తియే యను చున్నాఁడా ?

చక్రవర్తి:- నాకామెను జూడవలయు ననిపించు చున్నది.

బ్రాహ్మణుఁడు:- చూచుటకు ముందాయమ యెచ్చట నున్నదో తెలిసికొన వలయును. తెలిసికొని చూడ వచ్చును.

చక్ర:- ఆబాహ్లీక దేశమునందు రెండువేల గ్రామము లున్నవి. రాజెత్తుకొని పోయినచో వాని యంతి పురమును వెలికింప వచ్చును. దుర్జనులు, ధూర్తులు, నవిద్యావంతులు

పసుబలము మీఁద నాధారపడినవారు నెత్తికొని పోయిన బాలిక యెచ్చట నున్నదో తెలిసికొనుట యెట్లు? వేయి గ్రామములు గాలించవలయును. గ్రామ గ్రామమున వేయి యిండ్లు వెతుకవలయును. ఇట్టి కష్టములన్నియు పూర్వము పడినవే. భారతదేశ స్త్రీలు వారి యిండ్లలో నుందురు. వారి వేషములతో నుందురు. ఈమె యీమె యని తెలియదు. తాను తానని చెప్పుటకా స్త్రీ భయపడును. భర్త వచ్చి యీమెయే నా భార్య యనును. సోదరుఁడు వచ్చి యీమె నా సోదరి యనును, కొందఱు స్త్రీలు తమరికి వీరికి సంబంధము లేనట్లు మాటాడుదురు.

బ్రాహ్మ:- మహారాజా! ఇది చాల క్లిష్టమయిన సమస్య. ఇచట నొక భారతధర్మావలంబి యయిన యొకని భార్యను యవనులు దొంగిలించుకొని పోయిరి. ఒక యవనుఁడామెను బెండ్లియాడెను. ఆమె కిష్టములేదు, బలవంతముగా జరిగెను. ఈ సమస్యకు బరిష్కర్త యెవరు? వాఁడామెతో సంసారము చేయును. ఆమె మరణించుటయా? వాని నెదిరించి బంధితురాలై య్యునెడి తెగని హింసలపాలగుటయా? వానికి వశమగుటయా? మరణించుటయెట్లు? విషాదులుగాని, కరవాలముగాని యామె చేతి కందనీయరు. అయినను ప్రాణము యొక్కతీపి మిక్కిలి చెడ్డది. అలవాటు కొలది నదియే తన గృహమనుకొనును. ఏదో కష్టపడి యామె భర్తయు సోదరులు నామెను వెదకి కనుగొందురు. మరల తీసికొని వత్తమనుకొందురు. తీసికొని వచ్చి యేమి చేయవలయును. ఆ భర్త మరల నామెతో సంసారము చేయునా?

ఒకవేళచేసినను నా స్త్రీ ఏమి కావలయును? ఏమని భావించును? ఒక స్త్రీజీవితములో పదిసారులిట్లు బలవంతముగా బలవంతులైన భిన్నభిన్న పురుషులచేతఁగొనిపోఁబడి యప్పటప్పటికి వానివాని భార్యగానుండుటయే స్త్రీ యభిలషించును? కులటయైన స్త్రీకిని సత్కుల ప్రసూతయైన స్త్రీకిని భేధమేమున్నది. మనస్సు హృదయము ధర్మము వీని చేతఁ భావింపఁబడుచున్న ప్రకృతి గల స్త్రీ యేమి కావలయును? ఆమె కర్మ యందుమా? పాలించెడి రాజు యొక్క యప్రయోజకత్వ మందుమా? ఈ ప్రశ్న కెవ్వరు సమాధానము చెప్పగలరు? ఆ యవను లకు స్త్రీ స్త్రీ. భారతీయులకు స్త్రీ దేవత. దేవత లుపాసకుల చేతఁ భావింపఁబడుదురు. వారి దేవతాత్వసిద్ధికి నుపాసకులకు నిష్ఠయు, నాచారము, దానిని భగవంతుఁడు పాలించుటయు జరుగవలయును. కాలము మీఁద నొక యధర్మము తుపాను వలెఁ జెలరేగినచో నన్నింటితో పాటు ధర్మముగూడఁ దుడిచి కొని పోవును. అట్లు తుడిచికొని పోవుట వలన నేమి యగును? ఏమగునో తెలియదు. నా కెంత యాలోచించినను జీవుల యొక్క యీ మహా యాత్రా విచిత్రత్వము గోచ రించుటలేదు. తమవంటి ప్రభువు లుదయించి కొంత భూ భాగమున ధర్మమును ప్రతిష్ఠింతురు. ధర్మమన్నదే విచిత్ర మైన శబ్దము. వేదమార్గానుయాయుల కొక ధర్మమున్నది. తదితరులకును ధర్మమున్నది. భారతదేశము నందలి ధర్మశబ్ద మొక విలక్షణమైన యర్థము కలది. పెరలకు గల ధర్మశబ్దము యొక్క యర్థమునందు వైశిష్ట్యము లేకపోయిన నది కూడ ధర్మమే. సింహములు మహా క్రూరమృగములు. వాని యం

దొక ధర్మమున్నది. ఒక పురుషసింహ మొక్క స్త్రీ సింహము తోడనే సంగమించును. అది యన్యస్త్రీ సంగమమును వాంఛించదు. మరణించనైన మరణించునుగాని వేఱొక పెంటి నవలంభించదు. కొన్ని జంతువుల వివక్షిత స్త్రీ సంగమము చేయును. పురుష జంతువులందు కంటె స్త్రీ జంతువుల యందే ధర్మము పరాకాష్ఠ నందియుండుట జగద్ధర్మము యొక్క ప్రధాన లక్షణము. ఒక పోతు సింగము నొక పెంటి సింగము కలసి యున్నవి. మరియొక సింగమా పెంటిని వచ్చి వాంఛించి పోతుసింగముతో యుద్ధముచేసి దానిని సంహరించును. ఆ పెంటిసింగము క్రొత్తపోతు సింగము నవలంబించునా? అవలంబింప వలయునా, వలదా? సింహజన్మము శక్తియు, క్రౌర్యమును కలది. పెంటియైనను సింగము సింగమే. అది పోరాడగలదు. తక్కిన జంతువులట్లు కాదు గదా! ఈ మహా సమస్యకుఁ బరిష్కర్త యెవరు? ఒక్కడే కలఁడా పరిష్కర్త. అతఁడు భారతీయ ధర్మమును పాలించు చక్రవర్తి. నేటికి మహా ప్రభువవగు నీవు జన్మించితివి. నిన్ను శరణుఁ జొచ్చితిని.

చక్ర:- అయ్యా! నీ యుపన్యాసము విన్న కొలది నా కొక్కటియే తోచుచున్నది. ఆ యవనదేశ పరిసర ప్రాంతముల యందున్న మీ రెంత క్షోభించిపోవుచుండిరో నాకు తెలియుచున్నది. మీ కొక్క జీవిత సమస్యయే కాదు, విజ్ఞాన సమస్య, ధర్మసమస్య, సృష్టియొక్క సమస్య మీ ప్రాణములు బెగ్గడిల్లిపోవుచున్నవి. స్వామీ! మీరు జ్యోతిష్కులమని చెప్పితిరిగదా? మీదుహిత్రు జాతకము మీ యొద్ద లేదా?

ఆమెకుఁ బూర్ణాయుర్దాయమని మీరు చెప్పితిరి! ఆమె జన్మ యెట్టిది! ఆమె భవిష్యత్తెట్టిది? మీ గణితముచేత నామెయే గ్రామముననున్నదో తెలిసికొనలేరా! ఏ స్థితిలో నున్నదో తెలిసికొన లేరా? అపుడామెను తీసికొనివచ్చుట సులభము గదా ! మనస్సునకుఁ గల యొత్తిడిచేతఁ దమరీ గణితమునే భావించలేదా? పూర్వము చేయనిచో నిప్పుడు చేయవచ్చును. ఆ బాహ్లిక దేశ పరిసర దేశము లిప్పుడు మా వశమందే యున్నవి. మేమచటి రాజుల కాజ్ఞాపత్రములను బంపింతుము. వారా గ్రామమునకుఁ బోదురు. ఆ బాలికను దెత్తురు.

బ్రాహ్మ:- ఆ బాలిక యినుప పందిరమున నున్నది. ఆమె స్థితి యిట్టిదని ప్రభువులకు నేను మనవి చేసినచో మీ రచ్చెరువు పొందుదురు. దాష్ట్యమున కింతటి పరాకాష్ఠకలదా యని మీరు నివ్వెరవోదురు. ఈకార్యమనన్య సాధ్యము. ప్రభువులొక్కరే చేయగల్గుదురు. దాని యందన్ని సూక్ష్మ క్లిష్ట విషయములు సంయోజింపఁ బడియున్నవి. ఇవి యన్నియు పురాతనములైన యొక కర్మతంతు సమ్మిళితక్లిష్ట పంజర నిబద్ధమైన విషయములు. జ్యోతిషము నందలి గణిత మునకు పరమ సూక్ష్మ విషయములు మహర్షుల కందునేమో కాని సామాన్యుల కందవు. పైగా నేను ఖగోళ విషయము లందెంత పరిశ్రమ చేసితినో జాతకభాగమందంత చేసినట్లు కనుపించదు. ఈ నాకుమార్తె విషయమున ఖగోళసిద్ధాంత విషయములు రెండును మిశ్రమమై యున్నవి. ఆమెనుగూర్చి ఖగోళవిషయ మధికమై జాతకవిషయ మల్పమై యున్నది. తద్విషయిక ఖగోళ సంబంధ్యంశము లన్నియు నాకు సువ్య

క్తముగా భాసించుచున్నవి. ఆమె యే యూరిలో నున్నది, ఎంత దవ్వున నున్నది, నేడేమి చేయుచున్నది, మొదలైన జాతకమునకు సంబంధించిన విషయములు నా కందుటలేదు. స్థూలముగ పశ్చిమ దిశయందు దవ్వున నున్నదని మాత్రమే పొడకట్టుచున్నది. అందుచేత నేను ప్రభువుల ప్రశ్నకు సమాధానము చెప్పలేకున్నాను. సువ్యక్తముగా తెలిసికొనియే వచ్చెడివాడను, ఎప్పుడైనను, తమవద్దకు రావలసినదేకదా! భగవంతుడిప్పుడే రప్పించినాడు.

విక్ర:- ఇందు నాజోక్యమేమున్నదో నాకవగతమగుట లేదు. మఱియు నింత శీఘ్రముగ నీవిషయము నాతో మాటాడి సాధింపబడెడి తొందరతనము కూడ నాకు గోచరింపలేదు. మీరు పండితులు. తమదర్శనము మాకుపూర్వము కాలేదు. మహా వర్చస్వంతులు. మీదర్శనము వలన ప్రస్తుతము నాకు కలిగినంత కృతార్థత మీ కార్యమునకు గలుగలేదని యనుకొను చున్నాను.

బ్రాహ్మ:-మహాప్రభూ! ప్రొద్దుప్రుంకకముందె తమరు జపమారంభింపకముందె, తమరు ధ్యాననిష్ఠులు కాకముందె, మీ దర్శనము చేయవచ్చితిని. తమ యాత్మలక్షణము నాకు తెలియును. తమ పూర్వజన్మ వృత్తాంతము తమకు తెలిసియుండవచ్చును. తమరు మిక్కిలి పసినాడు, పంచాబ్దమ్ముల నాడుఁ ప్రాలేయగిరి కందరముల తపస్సు చేయుటకు బోయితిరి. పన్నెండేండ్లు తపస్సు చేసితిరి. ధ్రువుని తర్వాత పంచాబ్దములవాడు, తపస్సుచేయుటకు వెళ్ళినవాడు మీ రొక్కరే. ఐదేండ్లనాటి కింద్రియ వికాసమేలేదు. మనోజీవాది వికాస

మెట్లు సంభవించును. బహుజన్మతపఃఫల పరిణతజన్ములకు గాని యిది సిద్ధించదు. ఆ పన్ద్రెండేండ్ల తపస్సులో తమ కనంతశక్తులుకలగినవి. అందులో నొకడు బహువిషయ గత సూక్ష్మాంత దర్శనము. తమరు కొన్ని యామినీ వేళలయందు వేదవతీ విషయమును తెలిసికొన వలయునన్న తాత్పర్యము ననుసంధించి ధ్యాన నిష్ఠులైనచో నాయా విషయములుతమకు గోచరింపగలవు. నేను తమ దర్శనము చేయవలయునని నిశ్చయించుకొన్న రాత్రులు సింహపురము నుండి ఇచ్చటికి నేను చేసిన ప్రయాణములో గడపిన రాత్రులు ఇప్పటికే వ్యర్థమైనని. ఈ రాత్రికూడ వ్యర్థముచేయుట నా కిష్టములేదు. రాత్రి యనునది యొకజాగ్రదవస్థా ప్రతియోగియైన కాలము. జాగ్రదవస్థ క్రియాభిముఖి: రాత్రివేళ క్రియానభిముఖి. యోగముచేత ననుసంధింపబడని రాత్రివేళా దేవత నిద్రపోవు చుండును. ఆమె నిష్క్రియ. తత్తత్క్రియాచరణ యోగ్య సమయైక దేశము నిష్క్రియమై యపవర్గవేళయందు ఫలము నందా కించిల్లోపమును భాసింపజేయు చుండును. అందుచేత తొందర పడితిని.

చక్ర:- మహాపండితుడా! జీవులు గ్రహచారబలమున నుద్భవించు చున్నారు. ఏతద్గోళపరిస్తీర్ణ గ్రహసంచార తజ్జనిత జీవిలోకసంచరణ సమాహారభూతమై కాలము ద్యోతమానముగుచున్నది. స్ఫురించు చున్నది. అనంతజీవులు ననంత గ్రహచలనభూతులై యుద్భవించు చున్నారు. గ్రహముల యొక్క సంచరణ లక్షణము జీవులయందున్నది. జీవులయొక్క యాచరణ ప్రవర్తనములు గ్రహములను

బాధింపవు. ఇట్లుండగా మీ వేదవతి యొక్క జీవితము నంను ఖగోళాంశ యెక్కువ యున్నదనియు, జాతకాంశ తక్కువ యున్నదనియు తమరు చెప్పుట నా యవగతికంద లేదు. ఆమె నే మ్లేచ్ఛుడు నేటివరకు వివాహ మాడలేదనుట నాకు నర్థమైనది. తక్కిన విషయము లర్థము కాలేదు. ఆమె మ్లేచ్ఛుల యధీనములో నున్నందువలన ధర్మమున కేమి ప్రత్యక్షమైన యాపత్తికలదో తెలియుటలేదు. ధర్మమను మహాపదార్థము లేదా మహా గుణమను నది యధర్మముచేత భంగింప బడునన్నది భావనారూపమైన విషయము. స్థితి విషయము. అది ప్రత్యక్ష విషయమగుటకు నొక జీవియొక్క జన్మయందలి బహువిలక్షణ విషయ సమాహార భూతమైన వైలక్షణ్యము కావలయును. అట్టి వైలక్షణ్యము సృష్టిలో నుండునా యన్నది ప్రశ్న. దశావతారముల యందు కూడ నిట్టి వైలక్షణ్యమున్నదో లేదో తెలియదు. ఒక ఋశ్యశృంగుని యందిట్టిదున్నదని భావింపవచ్చును. ఇట్టి విలక్షణత మీ వేదవతి యందున్నదని తమరు చెప్పుచున్న మాటల యొక్క తాత్పర్యము అపరిస్ఫుష్టమైన, అసమీచీనమైన కాలము క్రియయందు సామంజస్యమున కించిల్లోపము నాధాన పరచవచ్చును. ఎంత విశిష్టమైనను ద్రవ్యముయొక్క క్లిష్టస్థితి కాలమును వికారించుననుట యుంశునేమి! స్వయంవ్యక్తమైన కాలమును వికారించునా? ఖండమై జీవకోటి మనస్సునకు ద్యోతమానమగు కాలమును వికారించునా? ఇది యెట్లు తెలియనగును?

బ్రాహ్మ:- ఇట్టి ప్రశ్న యుదయించుటయే క్లిష్టమైనది. కొన్ని విషయములు పట్టి భాష్యములు వాగ్వికారమును పొందవు. వాక్కునకా శక్తిలేదు. అందుచేతనే మహా తపశ్శీలురగు ప్రభువుల వద్దకు నేను వచ్చినది. ఇందులోని రహస్యము తమరు ధ్యానగతులై పరిశీలించవలయును. తమ కిన్నియు విదితము కాగలవు. ఇది తమకు నివేదించుటకు మాత్రమే నా కార్యము. తక్కిన దంతయు తమరు నిర్వహించవలసినది.

చక్ర:- తమరు ఖగోళవిజ్ఞానవంతులు. కాలము, సృష్ట్యాది, కళలు, లిప్తలు మొదలైన వన్నియు తమకు సుపరిచితములు. గణితముచేత సాధ్యములు. నాకు చాల దినముల నుండి యొక కోరిక కలదు. సూర్యగ్రహచారము చేత దృశ్యమానమైన యీ ఖండకాలము కల్గుచున్నది. తక్కిన గ్రహములు, తక్కిన నక్షత్రములు విద్యమాన ఖండకాలైకదేశ వైశిష్ట్యసూచికలు. రాత్రులును, దినములును పక్షములను మాసములను చేయుచున్నవి. సూర్యగతి చేత దినములు కల్గుచున్నవి. గణితమునకు సంబంధించి నంతవరకు లెస్సగా నున్నది. పంచాంగములు లిఖింపబడుచున్నవి. సూర్యుని యొక్క అయనాది గమనము గణితమాత్రానుమేయమే కాక పూర్వము దృశ్యమానముగా కూడ పూర్వపు మహర్షులచేత చేయబడుచుండెడిదని విద్వాదుపదిష్టమైన విలయము ఒకరాతికట్టడముసుకట్టిగగనముయొక్క పరిమాణమును విభజించి సూర్యకిరణ ప్రసారమును దైనందినముగా రేఖల చేత చూపించు కట్టడములు తొల్లిహస్తినాపురమునందుకల

వని వృద్ధోక్తి కలదు. ఈ విద్య నెవరో మ్లేచ్ఛులు సంగ్ర హించి వాడుకొనినట్లు కూడ ప్రథ కలదు. మహాకవి కాళి దాసుని పేరు తమరు విని యుందురు. ఆయన మా యాస్థా నమునందున్నారు. ఆయన గొప్ప జ్యోతిష్కుడు. ఆయన మొదట జ్యోతిష్కుడు, తర్వాత కవి. ఆయన చెప్పగా విన్నాము. అట్టికట్టడముసాధ్యమనియు దానికిపట్టిజ్యోతిష్కుడే కాక వాస్తుశాస్త్ర పరిజ్ఞాతకూడ కావలయుననియు, అట్టివాడు మీ సింహపుర రాజ్యమందున్నాడనియు కాళిదాస మహా కవి చెప్పినారు.

బ్రాహ్మ:- మా సింహపుర రాజ్యమందీ విద్య యున్నది. యవనులీ విద్యను నిరాదరింతురు, ఈ జ్యోతిషము వేదాంగము. సర్వ యజ్ఞ కర్మలు కాలము ననుసరించి చేయ దగినవి. యజ్ఞ కర్మకు జాహిం'గాలైనవారు, కర్మ కుచితమైన కాలమున్నదని గ్రహింపలేనివారు నుచితకాలమునందు చేయ బడిన కర్మ మహాఫలదాయి యగునని విశ్వసింపనివారు గ్రహ ములు తచ్చలనము, దేశములు, నదులు, సాగరములు, జీవ కోటి భూమండలము సర్వమును గలసి ఒకటియే మహావస్తు వనియు, నివి యన్నియు గలిసి పరస్పరా కర్షణము కలిగి చలన కార్యము జరుగుచున్నదనియు నభౌమములైన విషయ ముల శక్తిచేతనే భౌమములైన విషయముల మనుగడ తీర్ప బడుచున్నదనియు నన్నది వేదము యొక్క మహా తాత్ప ర్యము. ఈ తాత్పర్యము గ్రహించలేనివారు వేదములను నిందింతురు. వారే మ్లేచ్ఛులు. అట్టి మ్లేచ్ఛుల యొక్క యొత్తిడి కల్గిన మా దేశములందీ విజ్ఞానము సర్వతాగ్రము

నందు కురిసిన వానవలె నెచటనైన కొంచెము పల్లమున్నచో నచట నిలచి, విస్తారతమాలి, స్వచ్ఛత్వమునందు చెపక కొం దగు పండితుల యందున్నది. ఆ మహాకవి యాఖగోళవేత్త పేరును చెప్పెనా? మా దేశమునందు మేము మువ్వుర మున్నాము. ఆయన పేరు చెప్పినచో, ప్రభునాజ్ఞయైనచో నతడు నిమేషము నందిచట నుండగలడు.

చక్ర:- మేమిదివరకే వారిని పిలిపింప దలచితిమి. ఈ బాహ్లీక దేశాధిపతి యొకడు మాకు పానకములో ఘల్లవలె దగులొన్నాడు. ఇంతవరకు నడుగ మరచితిని. తమ నామ ధేయమేమి ?

బ్రాహ్మ:- క్షమించవలయును. ఆ మహా పండితుని పేరు తొలుత వినవలయును. నేను నా పేరు మనవి చేయు దును. ఆ విద్య నాకు తెలియునని మనవి చేసితిని. ఆ పేరు నాది కాదు. నేను వ్యామోహపడవచ్చును. తమరును వ్యామోహపడవచ్చును. తమరాపేరే చెప్పుడు. నే నాతనిని తీసికొని వత్తును.

చక్ర:- ఆయన పేరు వరాహమిహిరుడు.

బ్రాహ్మ:- అతడు నేనే. తక్కిన యిద్దరునాశిష్యులు. ఒకవేళ నా శిష్యులలో నెవడైన నన్ను మించిన ప్రతిభా శాలి యని కీర్తివడసినచో నా వలన వానికపకారము జరుగ రాదు కదా!

అన్నంతలో చక్రవర్తి లేచి నిలుచుండి చేతులు జోడించి యిట్లనెను, మహా విద్వాంసుడా! తొలుతనే తమరి నామ ధేయము నడుగని దోషము మన్నింపుడు. కాళిదాసు

మహాకవి ఆయన మా యాస్థానములో నున్నారు. వ్యాస వాల్మీకుల తర్వాత నంతటి కవి లేడు. పతంజలి మహర్షి తన మహాభాష్యమున కంసవధాది మహానాటకముల జేర్కొన్నాడు. ఆ నాటకములు నిలువలేదు. ఆ కవులును నిలువలేదు. కాళిదాసు మాకు మిత్రము మా యాస్థానమున భారతీయ సర్వ సంస్కృతి భిన్న విజ్ఞానపు మాకారులైన విద్వాంసు లుండవలయునని మా సంకల్పము. తమరు దీని కామోదించ వలయును. మేము ప్రభువుల మైనను మమ్ము మీరు మిత్రులవలె నాదరించవలయును.

బ్రాహ్మః:- 'మహారాజా! ఇది మే మభ్యర్థింపదగినది. మీరభ్యర్థించుచున్నారు. సత్పురుషుల యొక్క వినయము బ్రహ్మపదార్థ చూడా కుసుమమువంటిది.

చక్ర:- అట్టికట్టడమునుతమరుజయినీ నగరమునకట్టించ వలయును ఉజ్జయనీనగరముజ్యోతిశ్శాస్త్రభూమి కావలయును. సూర్యకిరణ ప్రసారము యొక్క గణన ముజ్జయినీ నగరాంశ నుండి ప్రారంభింప బడవలయును. బాహ్యోద్యానస్థిత హరశిర శ్చంద్రికా ధౌతమైన యుజ్జయనీ నగరము నుండి సర్వ మధుర సంస్కృత సారస్వతమెట్లు సమావిర్భవించుచున్నదో, ఉజ్జయనీ నగరము నుండి వరాహమిహిర పండితుని ఖగోళ విజ్ఞానమట్లు సమావిర్భవింపవలయును. ఇది మాయభ్యర్థనము.

వరాహ:- మహాప్రభూ! నేనా సంకల్పముతోడనే బయలుదేరి వచ్చితిని. మా వేదవతి యొక్క యునికియు, ఇప్పటియామెస్థితియునాకుసంపూర్ణముగ దెలిసినచో, నామెను విడిపించినచోని సన్నిధానమునకు వత్తునని భావించితిని. ఇతర

ప్రయత్నముల నైష్ఫల్యము తెలిసియే ఇంతయాలస్యముగ వచ్చి తిని. నేను చెప్పెడి మాటలలోని యాథార్థ్యము శర్వరీచరమ యామవేళయందు విస్పష్టము కాగలదని భావించుచున్నాను.

అంతట నుభయులకు సంధ్యావందన వేళయైనది. ఆ యుద్యానవనమున నొక చిన్న సరస్సుకలదు. అది శిలా నిర్మితతటములు కలది. చంద్రకాంత సోపానములు కలది. ముప్పేపున నుత్తాల ఖండితపత్ర వంశనాళములమీది కెగ బ్రాకింపబడిన మల్లీలతలు కలది. అవి చెరువు మీదికి వ్రాలిం పబడినవి. గాలికి రాలిన మాఘ్య కుసుమములు సరస్సునందు బడుచుండును. తత్పరి లఘువారి మల్లీకుసుమ వాసనామనో జ్ఞమై యుండును. ఆ చెరువు నుండి కొంత జలము నిర్మిత ప్రణాళికముల ద్వారా వెలికి పంపింపబడును. నూత్న జలము వచ్చుచుండును. ఈ రీతిగా దానియందు ప్రవాహత్వము సిద్ధింపజేయబడుచున్నది. చక్రవర్తిస్నానాభిముఖుడై నంత నేసం మృద్ధిగా నుపకరణములు వచ్చెను, వరాహమిహిరుడు రాజో చిత స్నానమును జేసెను ఇద్దరును సంధ్యావందనము ముగిం చిరి. ఆ నాడు శుక్లదశమి. పొట్టూదిన గోధుమరంగు గల్గిన వెన్నెలలు తటాకము మీద, వారు ధరించిన క్షీరసాగర వర్ణము కల్గిన పీతాంబరములమీద, నానాటి యుషోవేళ పరిచ్యుతములై ప్రణాళికలు ద్వారా కొట్టుకొని పోగా మిగిలి యుండి నిరంతర జల సంసర్గముచేత తిరస్కృతాతప త్రైణ్యా ములై యున్న రెక్కలు విచ్చియున్న మాఘ్యకుసుమముల మీద; రజిత పాత్రలమీంద, నుద్ధరిణెలమీద వరాహమిహిరుని తర్జనిమీద భాసించుచున్న దర్భముడి యుంగరముమీద,

బంగరు పొడికలిపిన విభూతి చేత ప్రకాశించుచున్న విక్రమార్క చక్రవర్తి యొక్క ఫాల భాగముమీద, పులకాంకురములు పొందుచున్న సోపాన పార్శ్వస్థ చంద్రశిలా నిర్మిత సాలభంజికలమీద, రమణీయ తావధిగ ప్రకాశించెను.

# ద్వితీయాధ్యాయము

వెలుఁగు, చీఁకటి. సూర్యుని కాంతి పడ్డంత మేర వెలుఁగు లేని మేరచీకఁటి. సూర్యుని కాంతి యున్నప్పుడు వెలుఁగు. లేనప్పుడుచీకఁటి. ఆకాశమునందు రాత్రివేళ ననేక నక్షత్రములు కనిపించుచున్నవి. అవి యన్నియుఁ జీకటి ముద్దలే. సూర్యకాంతి వాని పైన నెంతవఱకు పడునో యంత వఱకవి ప్రకాశించును. కొన్ని వేల యోజనముల దూరము మహాగగన మండలమున సూర్యకాంతి ప్రసారము జరుగుచున్నది. ఆ యంధకార గోళములన్నియు చంద్రుఁడు, కుజుఁడు, బృహస్పతి, బుధుఁడు, మొదలైన గ్రహముల వలెనే కాక నక్షత్రములవలెఁ గూడ కనిపించుచున్నవి. ఈ సూర్యకర ప్రసారమున లేని భాగము మహా వియత్తున నెంత యున్నదో తెలియదు. మానవుని యెంత జ్ఞానమైనను సూర్యకాంతి ప్రసార పర్యంతమైన గగన మండలము ననుసరించియే యుండును. ఆ తరువాతనే మున్నదో తెలియదు.

మానవుని జ్ఞానము ద్విధాభూతమై యుండును. ఒకటి యనుభవము రెండవది తత్స్మృతి. జీవులయందు భేదముచేత

స్మృతిలేని జీవులుదయింతురు. ఆ జీవుల యందు తత్కాలాను భూతి యెక్కువపాళ్ళు కలిగి స్మృతి తక్కువగా నుండును. వారి యందు వెలుఁగు తక్కువ. వెలుఁగుచేత స్మృతి కలుగును. అధికమైన వెలుఁగు, నధికమైన దాని స్మరణము కలచోట వెలుఁగుయొక్క పరిణాహమెంత? భిన్న దేశముల యందు దాని స్వరూపమెట్టిది? ఇది యంతయుఁ గలిసి యొక మహా జ్యోతీరూపమై భాసించుచున్నదన్న యభిజ్ఞ కలుగును. వెలుఁగనగా జ్ఞానమన్నచో నాజ్ఞాన మొక విధముగా నుండదు. మానవుఁ డుదయించుచున్నాడు. అనంత కాలము జీవించు పురుషుల మాట కాక యనంతార్బుద సంఖ్యలలో నుదయించి మరణించుచున్న జీవకోటి యేక దేశమున నొక కాలమున నెవనికి వాఁడుదయించి కొన్ని యేండ్లు బ్రదికి చనిపోవు చున్నాఁడు. ఒకటి, పది, వంద, వేయి, పదివేలు, లక్ష, కోటి, యర్బుదము, సబ్జము, ఖర్వము, నిఖర్వముమహాపద్మము, శంకువు, జలధి, యంత్యము, మధ్యము, పరార్ధ్యముగా నెన్నుకొనఁ బడిన దశగుణోత్తరములైన సంఖ్యాసంజ్ఞలకునందనిదీ కాలము నిరవధికముగా నున్నది. వెలుఁగు చిత్రమైనది. వస్తు వొకటి యైనను భిన్నస్థలములయందా వెలుఁగుపడి భిన్నములుగా కనిపించును. మానవుఁడు తాను బ్రదికిన నాల్గు దినములు క్షుదాదులచేత బాధితుఁడై తాను బ్రదుకుటకుఁ దెన్ను వెదుకవలయును. ఆ తెన్నొక జ్ఞానము. ఆహారస్వరూపము, దానిని సంపాదించు లక్షణము, ఆహారము లభ్యమానము కానిచో దాని కొఱకు చేయవలసిన విశేష పరిశ్రమ యిది యొక జ్ఞానము. ఈ పరిశ్రమయందు

భిన్నమానవులకు సంఘర్షణ కలుగును. ఒకరి నొకరు చంపి కొందురు. అట్లు జరుగకుండఁ జూచుటకు నొక రాజు కావలయును. వాఁడు పాలించుట కాక నీతి కావలయును. దానికి రాజనీతి యని పేరు. అది యొక జ్ఞానము. బ్రదుకు సుఖముగా నున్నప్పటి మానవుని ప్రవర్తన వేఱు, క్లిష్టముగా నున్నప్పటి ప్రవర్తనవేఱు. జీవయాత్ర సుఖముగా జరుగుచున్నప్పటి ప్రవర్తన సహజమైనది. క్లిష్టముగా జరుగుచున్నప్పటి ప్రవర్తన యసహజమైనది. క్లిష్టముగా నున్నప్పుడు కూడ సహజముగా ప్రవర్తించుటకు నేర్పఱచెడి యొక నీతి కలదు. అది సంఘనీతి. ఇట్లు జ్ఞానమనునది బహున్యర్బుద వత్సరముల మానవుని జీవన వశమున శాఖోప శాఖలుగా వృద్ధి పొందినది. ఈ జ్ఞాన ఖండములకు పరస్పర సంఘర్షణ సంభవించుచున్నది. ఈ జ్ఞానమును నిజముగా పాలించున దెవరు? మహర్షులు పాలింపవలయును. మహర్షులుగాని ఋషి ప్రాయులుగాని జ్ఞానమును పాలించుటయే మానవ చరిత్ర యొక్క సారాంశము. ఆ ఋషులలో ననంత భేదములు కలవు. వెలుఁగనునది యొక్క మానవ జీవితమున నాహారాదిపదార్థసంపాదన మాత్ర విషయికమై యుండదు. ఆహార సంపాదన యనునది తత్తద్దేశ తత్తత్కాల ప్రాణధాయులకే సంబంధించినది. ఒక కాలమునందు బ్రదుకువాఁడు భవిష్యత్కాలికులైన జీవులకు సుఖముకలిగించ వలయుననియో, సంఘము సువ్యవస్థితము చేయవలయుననియో ప్రయత్నించు చున్నాఁడు. అనఁగా నతఁడు భూతకాలముమాట యెట్లున్నను భవిష్యత్కాలమును గూర్చి తాను నివసించు దేశమునందలి

ప్రజలే కాక యితర దేశములందలి ప్రజలను గూర్చి కూడ భావించుచున్నాఁడని యర్థము. అనఁగా వెలుఁగు భిన్న దేశ ములను, భిన్నకాలముల నాశ్రయించిన దని యర్థము. వీని యన్నిటిని సమకూర్చుకొనిన వెలుఁగొక విలక్షణమైనది. సంఘ నీతియు, రాజనీతియు, జీవనవ్యవస్థయు నీ వెలుఁగునకు విషయము లగుచున్నవి. భూతకాలమును గూర్చి చూచినచో నొకానొక జ్ఞానము అనఁగా వెలుఁగు పూర్వకాల వ్యాప్తినొంది యది మఱియొక విశిష్టమైన వెలుఁగుగా భాసించుచున్నది. ఆగామి జీవుల బ్రదుకును గూర్చి నీవు వ్యవస్థ చేయవచ్చును. భూతకాలపు జీవులను గూర్చి యేమి చేయుదువు? వారినిగూర్చి యాలోచించుట వ్యర్థమా? వారిని గూర్చి యాలోచించి నందువలన భవిష్య జ్జీవులను గూర్చి నీవు చేయు వ్యవస్థకుఁ గొంత యుదాహరణ భూతమైన జ్ఞానము సంపాదింపఁ గలిగినచో వెలుఁగంతయు నొక్కటి యగుచున్నది. అప్పుడు వెలుఁగు యొక్క సర్వంకషమైన స్వరూపము భాసించునుగదా! సూర్యుని యొక్క కాంతి వెలుఁగు. సూర్యుని యొక్క కాంతి లేనిది చీకటి. సూర్యుని కాంతి చిత్రముగా నుండును. ప్రత్యక్ష కాంతి, పరోక్షకాంతి. అతని యొక్క పరోక్షకాంతి నక్షత్రములు నుండి వచ్చు చుండును. ఆయన కాంతి యగ్ని యందుండును. ఇది యంతయు విజ్ఞాన విషయ మగుచున్నది. ఈకాంతియో, తత్స్పర్శయో లేనిచోట జీవ ములేదు. సాగరాధో భాగమున జీవములున్నచో సాగరమహా తరంగజల బిందుపరిషచ్ఛేదన సమర్థములై సూర్య కిరణములు లోనికి

పోవుచునే యున్నవి. వాని ప్రసరణ శీలత్వమిట్టిదని చెప్పుటకుఁ జాలదు. సంఘనీతి, రాజనీతి, యుద్ధనీతి మొదలైన వాని పరిజ్ఞానము కలుగుటకునది యభ్యస్తమగుటకు వెలుఁగు వాగ్రూపము నవలంభించినది. వాక్కు ఆ వెలుఁగు యొక్క వివర్తము. వెలుఁగు వాక్కుగా మాఱి తనచేత తానే వ్యాఖ్యాత మగుచున్నది. భూమి, సముద్రములు, నరణ్యములు, పర్వతములు, నదులు, మానవులు, నాకాశము, సూర్యచంద్రులు, నక్షత్రములు సర్వము నొక వెలుఁగు ముద్ద నుండి పుట్టిన పదార్థములు. ఆ వెలుఁగునకు మహాప్రతీక సూర్యదేవుఁడు. ఆ వెలుఁగు తిరిగి తానైన మాట నుండి తన్ను తెలిసి కొనుటకు, మరల తన స్వరూపసిద్ధి కలిగించుకొనుటకుఁ బ్రధానముగా మానవుని సృజించుకొన్నదని చెప్పవచ్చును. వాఁడు భిన్నకాల పతితుఁడై భిన్నదేశ పతితుఁడై తత్కాల దోషముచేత, తద్దేశదోషముచేత మహావిజ్ఞానాది గమము పొందలేనిచోఁ గలుషితమైన ప్రదేశమున బడిన మేఘవారి బిందులవలె దుష్టప్రదేశమునందు బడిన సూర్యకాంతివలె స్వచ్ఛత్వమును గోలుపోయి స్వస్వరూపానభిజ్ఞుఁడగును. ఒక సూర్యుని వెలుఁగు చొఱరాని యంధకార ప్రదేశముననున్న నీరు ముఱికియై యుగములట్లే యుండి మరల మేఘాకృతిపొందు నవకాశము లేక వినష్టమైనట్లు లోక జీవుఁడు గుహాకుహరములయందుండి సూర్యకిరణ స్పర్శలేక, జ్ఞానముయొక్క యనంతత్వము స్ఫురించక సర్వ వినష్టుఁడగుట సంభవించును గదా! సంభవించవచ్చును. వెలుఁగు రేకలు పడునట్టి స్థలమునుబట్టి, వేళనుబట్టి యిట్టి

దుర్దశయుఁగలదు. దేశమును కాలమును వెలుఁగుయొక్క లక్షణమును వికారించుచున్నవని చెప్పవలయును. ఈ యుపమానము మేఘము కురియు వర్షమునందు సువ్యక్తముఁగా భాసించును. అది మరుభూమియందు వ్యర్థమై, పర్వతముల యందు సెలయేళ్ళ రూపమును బొంది సముద్రమునందు స్వస్వరూపానుసంధానము కలిగి, మురికి కాలువలయందు దుర్గంధభూయిష్ఠమై, కదలనిచోట క్రిమి సంజనక హేతువై చిత్రముగా నున్నది. ఇట్లాలోచించినచో వెలుఁగునకుఁగూడ నిన్నిదశలున్నవని చెప్పవలయును. జలమునకంటె నెక్కువ దశలున్నవనవలయును. మేఘము సాగరమునందుఁ గురియును, లేనిచో ధాత్రియందుఁ గురియును. అది జీవరాసుల మనస్సుల యందుఁ గురియదు. వారి రక్తబిందువులయందుఁ గురియదు. ఈ వర్షము జ్ఞానవర్షము విలక్షణపాతము కలది. మేఘముసందొక లక్షణమున్నది. అది యెంత క్రుమ్మరించుకొని పోయినను సర్వబిందునిపాతము లేదు. మిగిలిన బక్క మొయిలు గాలిచే దిక్కులకు త్రొక్కబడును. జ్ఞానముకూడ నట్టిదే. పరిణామమునందు భేదమధికమైనను వాని రెంటికిని నిపతనము నందు సాదృశ్యమున్నది. పడిన స్థలముయొక్క లక్షణములను స్వీకరించుట దాని మొదటి లక్షణము. అందుకనియే సృష్టి జరుగుటలోననే సృష్టియనఁగా సర్జనము, సర్జనమనఁగా విడివడుట, యదియు వానకురియుట వంటిదే! ఈ సృష్టి రెండు చోట్ల పడినది. అదియే దేవాసురవిభాగము. కొంత చీఁకటి యందు పడినది. కొంత వెలుతురునందు పడినది. చీఁకటి

వెలుఁగును పరామర్శించదు. వెలుఁగు చీఁకటిని పరామృశించును.

జ్ఞానము బహువిధములుగా నుండును. మానవుఁ డెన్ని విద్యలు తాను సృష్టించితినని యనుకొనుచుండెనో యన్ని విద్యలు నీ వెలుఁగుయొక్క వికారములు. అన్ని విద్యలకు మూలభూతమైనది గణిత శాస్త్రము. గణితమనఁగా వేఱే మియులేదు. లెక్కపెట్టుటయే. ఇంతకుముందు నుడువబడిన యేకదశ శతసహస్రాది జ్ఞానముయొక్క పరామర్శ. తోలుత కాలమును లెక్కపెట్టవలయును. పైనుండి క్రిందికి లెక్కపెట్టెదవో, క్రిందినుండి పైకి లెక్కపెట్టెదవో యరువది తత్పర లొక విపర, యరువది విపరలొక పర, యరువది పరలు విలిప్త యరువది విలిప్త లొక లిప్త, యరువది లిప్తలొక భాగ, ముప్పదిభాగ లొక రాశి, పండ్రెండు రాశులు భగణము. ఇది యాకాశ విభాగస్వరూపము. దీని యందు దినములు, మాసములు, పక్షములు, సంవత్సరములు భాసించుచున్నవి. గణనము రెండు విధములుగదా. మూలపదార్థ పరిజ్ఞానము కలిగి యిట్లిట్లు వికారము పొందినదని గణించుట యొకటి. ప్రత్యక్షమైన లిప్తజ్ఞానమునుండి యనంతకాల స్వరూపావగతి కలిగించుకొనుట రెండు. రెండవది క్లిష్టమైన పని. సాధ్యమైన పని కాదు. ఒక నది పుట్టినచోటునుండి బయలుదేరి సముద్రము వఱకుఁ బ్రయాణించుచో నడుమనడుమ వచ్చిన శాఖానదులను గుర్తుపెట్టుకొనవచ్చును. సముద్రమునుండి బయలుదేరినచో వంద శాఖానదులు కలవు. ఏ శాఖానది వెంటఁబోయిన యదియే జన్మస్థానమందుము. కనుక సనాది

నుండి వచ్చు విజ్ఞానము యథార్థ నిరూపకము. కాలము యొక్క స్వరూపము, ఖగోళాది స్వరూపము తొలుత బ్రహ్మయే మహర్షులకు బోధించెను అది సంప్రదాయముగా భారతదేశమునందు వచ్చుచుండెను. విక్రమార్క మహారాజు కాలము నాటికి వరాహమిహిరుని నాటికి నది పంచ సిద్ధాంతిక యయినది. పౌలిశము, రోమకము, వాసిష్ఠము, సౌరము, పైతామహమని, వరాహమిహిరుని కాలమున నీ ఖగోళ విజ్ఞాన సిద్ధాంతము లయిదు గలవు. వానియందు వరాహమిహిరుడు పండితుడు. ఆయన పంచ సిద్ధాంతిక యన్న గ్రంథమును వ్రాసెను. ఆయనను విక్రమార్క చక్రవర్తి తన సభయందుంచెను.

ఇది యిట్లుండ వెలుగుయొక్క సంపూర్ణ స్వరూపమిదియని తెలిసికొనుట మానవునకు సాధ్యముకాదు. అది యతీంద్రియ వ్యవహారము. అందుకనియే యీ పంచ సిద్ధాంతములు వెలసినవి. బ్రహ్మనుండి, సూర్యునినుండి, మహర్షుల నుండి యీసిద్ధాంతములు బయల్వెడలినవి. సువ్యక్తములయినవి. ఇంతజ్ఞానము జ్ఞానములో నేకదేశమైనది. రాజనీతివలె, యుద్ధనీతివలె, సంఘనీతివలె, శ్రుతిస్మృతులవలె, బురాణేతిహాసములవలె ఖగోళ విద్యకూడ నీ జ్యోతిర్విజ్ఞానముకూడ మానవునియందు వివేకరూపమున వెలసిన వెలుగులో నొక భాగమైనది. అచ్చమైన వెలుగునుగూర్చి చెప్పిన యీ శాస్త్రము ప్రాధాన్యము వహించుటకు బదులు మూలబడిపోయెను. దీనియొక్క నిరాకరణచేత మానవుడేక దేశవిషయ పరిజ్ఞానమాత్ర దురహంకారి యగుచున్నాడు. అట్లగుటకు

శరీరమున్న ప్రదేశమునందు పడిన యీ వెలుఁగుయొక్క పడుటయే కారణము. ఈ శరీరము నశించిపోవునది. మిక్కిలిగా నున్నచో వందయేండ్లకు మించి యుండనిది. అంతగా వ్యాపించినచో నొక దేశమును మించి వ్యాపించనిది. ఈ శరీరము ఖండమైన కాలముచేత, ఖండమైన దేశముచేత నిబంధింపఁబడుచున్నది. అంతియే కాక బ్రదుకుదల దుర్ఘటమగుటచేత జీవన సమస్యయొక్క ప్రాబల్యముచేత వెలుఁగువంక ముఖము పెట్టుకున్నది ఎంతదూరము పోయినదనగాఁ గొన్నిచోట్ల వెలుఁగుయొక్క యునికినే శంకించుచున్నది. మానవజీవితావసర విషయ పరిజ్ఞానమే యబ్బో యెంతయో వెలుఁగని యనిపించుచుండఁగా సూర్యాది గ్రహనక్షత్ర మహాగగన పరిజ్ఞానము తెలిసికొనుటకుఁగూడఁ గష్టమైన దగుచుండఁగా సూర్యకరప్రసరణ క్రియాశ్లక్ష్ణత్వపరిజ్ఞానము కలిమి దుర్ఘటమై తదుపరి వర్తమానమైన పరమేశ్వర స్వరూపభావనయే తత్సర్వ విషయ సమాహార పరిజ్ఞానముచేత ననుమీయమానము కాఁదగిన యీ మహా పరమేశ్వరభావన మానవుని యందు ఖండితమై ఖండితమై మిక్కిలి విఘటితమైనచోట మ్లేచ్ఛమగుచున్నది. ఆ విఘటన హేతువు లనేకములు. దేశకాలములు, రక్తనిష్ఠగుణములు, నహంకారము, స్వార్థము, నీర్ష్య, యధికారవాంఛ, శత్రుసంహారాభిలాష మొదలైన వెన్నియైన కలవు. ఈ రీతిగా సృష్టియందే శరీరయాత్రాసాధనములైన యింద్రియముల యందే యీ దోషములు పాతుకొనియుండి మ్లేచ్ఛభావమునకు దోహదములగుచున్నవి.

ఈ జ్ఞానము దేవభావము. మ్లేచ్ఛత్వ మసుర భావము. పుట్టుటలోననే రెంటును జతగాఁ బుట్టెను. అనాది పురాణములయందుఁగూడఁ దొలుత నసురులుగాఁ దరువాత మ్లేచ్ఛులుగా వర్ణింపబడినవారు వెలుఁగు చీఁకట్లకుఁ బ్రతీకలై యున్నారు. రామాయణాదులట్లుంచి యైదువేలయేండ్లక్రింద జరిగిన కురుపాండవ యుద్ధకథయైన మహాభారతమునఁగూడ మ్లేచ్ఛరాజ్య ప్రశంసకలదు. కిల్కిల యవనులని భీష్మపర్వమునందుఁ జెప్పఁబడిరి. ఈ యవన శబ్దము చ్యవన శబ్దము యొక్క వికృతి కావచ్చును. స్వైరశబ్దమునందలి వకారము లోపించి సైరంధ్రీ శబ్దమైనట్లు. ఇతర జాతులవారి చరిత్ర లక్షలాది సంవత్సరములుగా లేదు. అప్పుడు వారు వేరుగనుక భారతదేశచరిత్ర కోట్లవత్సరములుగా నున్నది. వీరప్పటినుండి యున్నారు గనుక, పూర్వము నుండి లేనివారు పూర్వము నుండి యున్నవారిని మీరును లేరని చెప్పినచో వీరిలోఁ గొందఱు మేమును లేమనుకొనుట హాస్యాస్పదమైన విషయము. ఈ దేశమునందు శకయవన బాహ్లీకాదులు తొలుతటినుండి యున్నారని చెప్పవచ్చును. అయిదువేల యేండ్ల నుండి యున్నారన్నది భారత ప్రసిద్ధమైన విషయము. ఇది కర్మదేశమగుటచేత కర్మభ్రష్టులైనవారిని దేశమునుండి తరిమివేసి వారికి నిలువనీడ చూపించుట మన పూర్వరాజులు చేసినట్లు కనిపించుచున్నది. వారే శకయవన కిరాత బాహ్లీక దేశస్థులు. వారిలోఁ గొందఱు సేశ్వరులు, కొందఱు నిరీశ్వరులు. కాశ్మీరదేశముగూడ నా భాగమునందలిదే. ఈ యవనులలో భగవంతునియందు విశ్వసించువారు కొందఱు.

భగవంతుఁడు లేడన్నవారు కొందఱు. భగవంతుఁడున్నాఁడన్నవారు నాగారాధకులు. కల్హణ, పండితుఁడు తాను వ్రాసిన రాజతరంగిణిని ప్రారంభించుచు కాశ్మీరదేశము యొక్క తొలుతటిస్థితి తెలియదు, అప్పుడది నాగులచేత సమావరింపఁబడియున్నదని వ్రాసెను. వారందఱు నాగారాధకులు.

ఈ కిల్కిల యవనులు వింధ్యపర్వతవాసులు. వింధ్యపర్వతప్రదేశము కిల్కిల యవనులకు ముఖ్యస్థానము. కర్మభ్రష్టులైన వీరిని ధర్మప్రభువులైన భారతీయ రాజులు సర్వనాశనము చేయలేదు. పర్వత ప్రాంతములకు తఱిమిరి. అచట నివాసమేర్పఱచికొన్ననిరి. ఈ కిల్కిల యవనుల చరిత్ర మిక్కిలి గొప్పది. కర్మభ్రష్టులై, మ్లేచ్ఛులై, యవనులైనంత మాత్రమున వారిలో శక్తిమంతు లుదయించరనిగాని, రాజ్యనిర్మాతలు ప్రభవింపరనిగాని, మహావీరులు సంభవింపరాదని గానియున్నదా? సింహములు లేనియడవిలో పెద్దపులి రాజ్యము చేయవచ్చును పులిలేనియడవిలోఁదోడేలురాజ్యము చేయవచ్చును. బలహీనమైన సింహమును బలిష్ఠమైన పెద్దపులి చంపవచ్చును. అందుచేత సింహముకంటెఁ బెద్దపులి యధికమైన మృగమని చెప్పుటకు వీలున్నదా? ధర్మవంతుఁడొకప్పుడు బలహీనుఁడు. అధర్మి బలవంతుఁడు. వింధ్యపర్వతము నివాసముగానున్న యీకిల్కిల యవనులలో భూతనంది యను పరాక్రమవంతుఁ డుదయించెను. అతఁడు లక్షన్నర సంఖ్యగలిగి మహాయుద్ధవీరులైన కుబేరయక్షమానజాతులను గెలిచెను. పుండరీక నాగుఁడన్నవాఁడు వింధ్యపర్వతములలోఁ

గిల్కిల మను పేరుగల నగరమును నిర్మించెను. ఈ భూత నంది దానికిరాజయ్యెను. భూతనంది సేశ్వరవాది. నాగారాధ కుఁడు. నాస్తికులైన యువకులకు వీరికి సంబంధములేదు. పుండరీక నాగుఁడు మానవుఁడుకాఁడు. అతఁడు దేవత. భూతనంది రాజ్యములోఁ బ్రతి గృహమునందుఁ బుండరీకుని పూజించుచున్నారు. ఆ పూజ స్వాహాస్వధా వషట్కారవిరహితమైనది. భూతనంది యేఁబదియేండ్లు రాజ్యము చేసెను. ఆ పర్వతములందు బంగారమును మణులు దొరకెడివి. అచటి జనులు వానిని తీసికొనిపోయి భూతనందికి గానుకలుగా సమర్పించుచుండిరి. భూతనంది కుమారుఁడు శిశునంది. శిశునంది కుమారుఁడు యశోనంది. భూతనంది తరువాత వారిద్దఱును నలువదియైదేండ్లు రాజ్యము చేసిరి. యశోనంది కుమారుఁడు ప్రవీరకుఁడు. అతఁడు పదునొకండు వత్సరములు రాజ్యము చేసెను. ఇతఁడు మహావీరుఁడు. ఇతఁడు బాహ్లీక దేశముమీఁద దండెత్తిపోయెను ఈశ్వరవాదులైన యవనులు నాగజాతి యనియు, నిరీశ్వరవాదులైన యవనులు పిశాచజాతియనియుఁ జెప్పఁబడుచుండిరి. బాహ్లీకులుగూడ యవనులయ్యు, నిరీశ్వర వాదులగుటచేత వారికి వీరికిఁ బడెడిదికాదు. ఆ యుద్ధములో నుభయపక్షములయందు లక్షమంది చనిపోయిరి. అప్పుడు బాహ్లీక దేశము రోమకవంశీయుఁడైన బాదలుఁడనుపేరుగల వానిచేఁ బాలింపఁబడుచుండెను. బాదలుఁడు ప్రవీరకుని పరాక్రమమునుముందు నిలువలేక తన కూతురైన జాలావతిని ప్రవీరకునకిచ్చి సంధి చేసికొనెను. బాదలునకుఁ గొడుకులు లేరు. ప్రవీరక జాలావతుల కుమారుఁడు బాహ్లీకమునకు

రాజయ్యెను. అతఁడు పదునొకండు వత్సరములు పాలించెను. ఇది కిల్కిలరాజవృత్తాంతము. ఈ వంశములు పోయిన తరువాత బాహ్లీకరాజ్యము పరహస్తగతమైనది. ఈ బాహ్లీక రాజ్యపాలకులైనవారు రోమకులని, రుమ్మకులని, రుమ్ములని పిలువఁబడెడివారు. వారు వేదధర్మదూషకులు.

ఈ యవన రాజ్యములు బలవంతుఁడైన రాజుదయించినప్పుడు భారతదేశమునందలి యితర రాజ్యముల నాక్రమించుకొనుటయు భారతదేశమునందు బలవంతుఁడైన రాజున్నప్పుడు తమ దేశములకు తఱుమఁబడుటయు సంభవించుచుండెడిది. వీ రెచ్చట నుండియో వచ్చినవారు కారు. అందఱు నిచ్చటివారే. అయిదువేల యేండ్లక్రింద గాంధారముదాఁటి ప్రజలు లేరు గ్రీకురాజ్యమే యుదయింపలేదు. తత్పూర్వ రాజ్యములును లేవు. ఇచటినుండియే జనము పరదేశములకుఁబోయి యందందు నివాసము లేర్పఱచుకొని జనసంఖ్య పెరిగి రాజ్యములు, మతములు నిర్మించుకొనిరి. ఒకొక్కప్పుడు ముందు వచ్చిన చెవులకంటె వెనుక వచ్చిన కొమ్ములు వాడిగదా! మానవునియొక్క లక్షణము తన పదిమంది పూర్వులను లెక్కపెట్టికొనుట. వారు గొప్పయని చెప్పికొనుట. ఆ పది మందిలో మొదటి వానితోడనే సృష్టి ప్రారంభమైనదనుట. అందుచేత వేదధర్మ దూషకులు కాలము యొక్క యనంతత్వము తెలియనివారు, సూర్యుని యొక్క వేయి కిరణముల యొక్క సంగతి తెలియనివారు, వెలుఁగనఁగా నగ్ని వికారమనుకొనెడివారు, జ్ఞానస్వరూపానభిజ్ఞులు, దురహంకారులు, తమ చేతిలోని కత్తి పదునుగా

నున్నంత కాలము తమకు యౌవన మున్నంత కాలము తామే సృష్టికర్తల మనుకొనెడి వారు, వేదధర్మ దూషకులై, మ్లేచ్ఛులై యవనాది నామముల వ్యవహరింపఁబడుచు నుండిరి. వేదధర్మ మార్గకులకు వారికి నొక భేదమున్నది. వేదధర్మ మార్గగాములు సృష్టిరహస్య విజ్ఞాతలై యే జాతిని సమూలముగా నశింపజేయరు. భగవంతుని యొక్క పద కము మన కేమి తెలియునని యూరకుందురు. జనమేజయాదులు సర్పవంశనాశనము చేయఁబోఁగా మహర్షులు వారించిరి. కాని వేదధర్మ బాహిరులు వేదధర్మమును సర్వథా నశింపఁ జేయవలయునని నిత్య ప్రయత్నము చేయుచుందురు. వేదధర్మ మార్గగాములను నశింపఁజేయవలయునని వారు నిత్య ప్రతీక్షావ్యగ్రులై యుందురు. ఈ యిద్దఱియం దీ భేద మున్నది.

ఈ బాహ్లీక రాజులలో ద్విమిత్రుఁడని యొకఁ డున్నాఁడు.* ఈశబ్దములోని వకారముకూడ లోపించి వాఁడు దిమిత్రుఁడైనాడు. వాని వంశము దిమిత్రీయ వంశము. ఈ ద్విమిత్రీయులలో నందీశుఁడను మఱియొక రాజు కలఁడు. అతఁడశ్వమేధ యాగమును జేసెను. అతని రాజధాని కాంచనకము. అప్పటి నుండి వింధ్య పర్వత నివాసులైన కిల్కిల యవనులకు బాహ్లీక దేశపురాజులైన రోమకులకు సంబంధ బాంధవ్యము లుండెను. భారత ధర్మ చరిత్ర చూచినచో మహా చక్రవర్తు లుదయించుటయు వారు తమ శౌర్యము చేత నీ యవన రాజ్యముల నదుపులో పెట్టుటయు నట్టి మహా చక్రవర్తి లేనప్పుడు యవనులు సర్వ దేశములయందుఁ

జొచ్చి తమ దురాచారములను తమ దుర్విశ్వాసములను సమాలోచనా విరహితులైన సామాన్యుల యందభివ్యాపింపఁ జేయుటయు జరుగుచునే యుండెను. గుప్త చక్రవర్తులు వేద ధర్మమును నిలువఁబెట్టిరి. శుంగవంశ రాజులైన పుష్య మిత్రాగ్ని మిత్రులు తరువాత గుప్త చక్రవర్తులు వచ్చు వఱకు బౌద్ధమతము విజృంభించినది. సముద్రగుప్త చక్రవర్తి వేదమార్గగామియైనను హెలీనా యన్న గ్రీకు దేశ యువతీ సౌందర్య వశంవదుఁడయి యవనులకుఁ బెద్ద పెద్ద యుద్యోగము లిచ్చెను. తక్కిన గుప్తరాజు లందఱు గ్రీకు దేశము, సిరియా దేశముల నుండివచ్చిన వారితో సంబంధ బాంధవ్యములు పెట్టికొని దేశమును యవనభూయిష్ఠము చేసిరి. భారతదేశ వాయవ్య దిశయందు నున్న యవన శక దరద బాహ్లీక సింహ పుణ్యాది రాష్ట్రములవారు బహుశః వేద ధర్మ విరోధులు. ఆ దేశముల నుండి వచ్చినవారు వేదమన్న పేరే వినలేదు. ఇరువురకు జతకుదిరెడిది. ఎవరెవ్వరో తెలియదు. అందఱును యవనులే! అందఱును వేదవిరోధులే! ఇట్టి పరిస్థితి యొకఁడుండుటచేత భారతదేశ వాయవ్యభాగము నిత్యము పరదేశీయులచేత నాక్రాంతము నభివ్యాప్తమన్న భావము కొందఱు వ్యాప్తింపఁ జేసిరి. ఆ వాయవ్యదిశ యందున్న దరద శక యవన బాహ్లికాదులు భారతీయులే. వెలివెట్టబడిన క్షత్రియులు. వేదధర్మ భ్రష్టులైన క్షత్రియులు. అంతే!

ఈ రీతిగా వేదధర్మ బాహిరులను మన మహా చక్రవర్తులు సర్వ నాశనము చేయని హేతువున వారు మరల

మరల వృద్ధిపొంది భారత దేశమునందలి రాజ్యములమీఁదికి దండెత్తి వచ్చుట సంభవించినది. ములగచెట్టు మొదలు పెల్లగించినఁ గాని చావదు. మొదటి వఱకు నరకినను మరల చివుళ్ళు వేయును. వేళ్ళతోఁ గుళ్ళగించుట వేదధర్మము కాదు. మౌర్యులు, శుంగవంశీయులు, కణ్వ వంశీయులు, నాంధ్రులు. గుప్త వంశీయులు మూఁడు వేల యేండ్లు కల్యారంభము నుండి మగధ దేశమునందు పాలించుచున్నప్పుడు నడుమ నడుమ యవనులు వృద్ధి పొందినను నిత్యమదుపులో ననే యుంచఁబడిరి. వింధ్య పర్వతయవనులకును, బాహ్లీక దేశయవనులకును చుట్టరికము బలిసిన తరువాత వారి బలము కొంత యెక్కువయ్యెను. వారికి వీరు సాయము, వీరికి వారు సాయము. చంద్రగుప్త, సముద్రగుప్త చక్రవర్తులనాఁడు సముద్రగుప్తుని మహా పరాక్రమము ముందు వారి మైత్రియు పనిచేయలేదు. నేడు విక్రమార్క మహారాజు సర్వ భారతదేశమును జయించినప్పుడు వారు తమ మైత్రిని దృఢపఱచుకొని యొక విలక్షణమైన తిరుగుబాటును చూపుచుండిరి.

ఈ యవనులలో రెండు తెగలుగదా! ఒక తెగ నాస్తికులు. రెండవ తెగ నాగారాధకులు. భూతనందినుండి నాగారాధకుల బలమెక్కువయ్యెను. బాహ్లీక దరద, శక, కాశ్మీరాది సర్వదేశములయందు నాగారాధకులైన యవనుల సంఖ్యయే యెక్కువ. వింధ్య పర్వతములలోని కిల్కిల యవనవంశీయులకు బాహ్లీక దేశము ప్రధాన స్థానముగా మనుచున్న రూమ్యకాది యవనులును నాగారాధకులై కొన్ని

శాబర మంత్రములు, కొన్ని తంతులు, కొన్ని సాధనలు చేసి వారిలో కొందరు తద్విద్యల యందు సిద్ధులై యితరులకు భయహేతువులుగ నుండుచుండిరి. కొన్ని దేవతా సర్పములు వారి వశము నందుండును. కాశ్మీరదేశము నందు గూడ నిది సమృద్ధిగా నుండి యాదేశము క్రమక్రమముగ వేద మార్గగాములైన రాజుల చేతులలోనికి బోయినను నాటి యాచారములు కొన్ని మిగిలినవి. కొందరి యిండ్లలో వంశగతముగ కొన్ని సర్పము లుండును. ఆ సర్పము వారి గృహదేవత. ఇంటిలోనన దిరుగుచుండును. పాలు మొదలైన పదార్థములు పెట్టి యా సర్పరాజును వారు పోషించుచుందురు. అది యింటిలో నెవ్వరి నేమియు చేయదు. వారి శత్రువుల మీఁదికి వారు దానిని ప్రయోగింతురు. ఏ యర్థరాత్రముననో పోయి యా సర్ప మా శత్రువును గరచి వచ్చును. ఇట్టి కొన్ని కుటుంబములు నేటికిని కాశ్మీరదేశమందున్నవి. భారత యుద్ధమునాటి వరకు కాశ్మీరము పూర్తిగా నాగదేశము. నాగరాజులే యుండెడివారు. భారత యుద్ధములో కాశ్మీరాధిపతి వధింపఁబడెను. ఆ రాజులకు కర్కోటక రాజులని పేరు. ఆతరువాత శ్రీకృష్ణదేవుఁడు కాశ్మీరము మీఁదికి దండెత్తిపోయి దానిని జయించి తాను స్వయముగా నొక క్షత్రియునిఁ గాశ్మీరమునకు రాజుఁగా జేసెను. అతని పేరు గోనందుఁడు. కాశ్మీర చరిత్రమునకు మహాభారతయుద్ధమునకు పూర్వము మూఁడువందల నలుబది యెనిమిది యేండ్లనుండి లభ్యమాన మగుచున్నది. అప్పటి రాజు గోనందుఁడు. అతని కుమారుఁడు దామోదరుఁడు. దామోద

రుని భార్య యశోవతి. శ్రీకృష్ణదేవుఁడు దామోదరుని సంహరించినపుడు యశోవతి గర్భవతి. ఆ పిల్లవాని పేరు మరల గోనందుఁడై ఈ గోనంద వంశీయులే వందల యేండ్లు కాశ్మీరమును బాలించిరి. నాటి నుండి యవనులకు కాశ్మీరము రాజ్యములలో నొకటి కాలేక పోయెను. యవన ప్రాబల్యము కాశ్మీరము నుండి పోయినను, తొలినాటి నాగారాధనము కాశ్మీరము నుండి పోలేదు. ఒక కథ కలదు. ఒక చాకలిది చెరువులో గుడ్డ లుతుకుచుండెనట. పిల్ల వాడు గోలచేయు చుండెను. ఆమె యొక విషసర్పమును తీసికొని వచ్చి వానినిఁ గరపించెను. వాఁడు చనిపోయెను. ఈమె తన గుడ్డలన్నియు నుదికికొనుట యైనతర్వాత నేనో యొక యోషధిని తెచ్చి పామును గరపించిన చోట నంటించఁగా వాఁడు బ్రదికెను. కార్యాంతరము మీఁద గాశ్మీర దేశమునకు వెడలిన యొక దాక్షిణాత్య బ్రాహ్మణుఁడు దీని సంతయుఁ జూచి యామెను బతిమాలి బామాలి యా యోషధినిఁ దెచ్చి యిచట గొప్ప విషవైద్యుఁడయ్యెనని తెలుగు దేశమున జెప్పికొనుట కలదు. కాశ్మీర దేశమీ యహివిద్య యందెంత గొప్పదో బాహ్లీక దేశము శాబర మంత్రములందంత గొప్పది. వైదికములైన యథర్వ మంత్రములును తంత్ర గ్రంథముల యందున్న మహోపాసనా మంత్రములును, సదాచార పరులైన బ్రాహ్మణులకుఁగాని వశముగావు. సత్యము, అహింస, ధర్మబుద్ధి ఏకపత్నీవ్రతము మొదలగు నియమములు కలవారికే మహా మంత్రములు సిద్ధించును. శాబర మంత్రములకు నియమము లక్కఱలేదు.

కాని యొక్కొక్క మంత్రమునకు కొన్ని కొన్ని నియమము లుండును. పామును(మం)త్రగాఁడు పొట్లకాయ తినఁడు. షష్ఠీదివసములయం దుపవాసము చేయును. అట్లే భిన్న భిన్న మంత్రముల నుపాసించువారికి తత్తదుచిత నియమములుండును గాని వేదమంత్రోపాసకులకువలె శాంతిదయా ధర్మాదు లవసరము లేదు. ఈ సర్వవిద్య శ్రీ విక్రమార్క చక్రవర్తి నాటికి కాశ్మీరమునందు రహస్యముగా నుండెను. పరిశిష్టములైన యవన కుటుంబములందుండెను. అదిరహస్యముగా నుండెను. ఈ సర్వవిద్యచేత శాబర మంత్రములచేత వింధ్యలోన కిల్కిలులకు, బాహ్లీకములోని ద్విమిత్రీయులకు రానుపోను బంధుత్వమును, వారి వారి సేనలు పర రాజ్యములలోనుండి ప్రయాణములు చేయుటకును వీలేర్పరచినవి. ఈ రెండు రాజ్యములలో నెవరిమీఁద దండెత్తినను, రెండు రాజ్యముల నడుమ దూరమెక్కువైనను, నడుమ పర రాజ్యములున్నను వారొకరి కొకరు సాయపడుటకు వీలేర్పడెను. శ్రీ విక్రమార్క చక్రవర్తికి దరద, కిరాతోరగ, సింహపుర శక, కటక గాంధార దేశముల స్వాధీనములయ్యెను. ఈ దేశము లన్నియు బాహ్లీక దేశము నంటి యుండెను. వింధ్య ప్రాంతము లందు వత్స, మలాద కరూశాపర మత్స్యమాలవ ఇంద్రప్రస్థ మరు రాజ్యము లున్నను నివి యన్నియు కిల్కిల యవనుల భయము మాలినవికావు. బాహ్లీక దేశము ప్రాక్ బాహ్లీకమని యొకటి, ఉత్తర బాహ్లీకమని మరి యొకటి. విపాశాశతద్రూ నదులనడిమిది తూర్పు బాహ్లీకము. శకకిరాత కాశ్మీర దేశములకుఁ బడమట నున్నది. యుత్తర

బాహ్లీకము. విక్రమార్క చక్రవర్తి తూర్పు బాహ్లీకము జయించెను. వారందరు నుత్తర బాహ్లీకమునకుఁ బారిపోయిరి. పూర్వము తూర్పు బాహ్లీక రాజ్యము ప్రాధాన్యమువహించి కిల్కిలులకు బాహ్లీకులకు కొంత దగ్గర తన ముండెడిది. కరూశమాలవ కురురాష్ట్రోపహిత దేశములు వారికిమార్గముగా నుండెడివి. వారందరు వీరికి భయపడుచుండెడివారు. భయము రాజుల యందు కంటె సామాన్య ప్రజలయం దెక్కువ. ఇపుడు సర్వ యవనశక్తులు నుత్తరబాహ్లీకమునందు సమ కూడి యుండెను. వింధ్య కిల్కిలు లసమర్థులై యుండిరి. సౌరాష్ట్రి నిషధ మదధార వక్షు, మలాగ మత్స్య దేశములు విక్రమార్క చక్రవర్తికి వశంవదములై యుజ్జయినీ నగరము నకు సన్నిహితములై యుండుటచేత కిల్కిలుల ప్రతిభ లోపించెను. కానికిల్కిలులలో సమర్థులైనయుద్ధవీరులు మంత్ర గాండ్రు, సిద్ధులైన నాగోపాసకులు నుత్తర బాహ్లీకదేశమును జేరిరి. ఈ బాహ్లీకులు పరరాజు సేనను వశముచేసి కొనుటలో నొక విచిత్రమైన నైపుణ్యమును ప్రదర్శింతురు. వారా విద్యయందు నిష్ణాతులు.

మానవుడు తనకు తన కుటుంబమునకు ప్రధానముగా నాపదలు లేకుండ చూచికొనుటయు, తనకు ధనాధికారము లధికముగా ప్రాప్తించుటయు చూచుకొనెడిజీవి. సంఘము, దేశము, ధర్మము నీ మూఁటికి ప్రాధాన్యమిచ్చు మానవుల సంఖ్య తక్కువ. తానును తన పెండ్లము బిడ్డలును సుఖముగా నుండవలయును. తన బిడ్డలు చిఱ్ఱున చీదరాదు. తమ కేవ్యాధులు రారాదు. వచ్చినవి శీఘ్రముగా పోవలయును.

సామాన్య మానవులే కాదు, గొప్ప యధికారులును గొప్ప పండితులును గూడ నిట్టి ప్రకృతి గలవారై యుందురు. ఒక తీరని వ్యాధి వచ్చినది. వైద్యుఁడౌషధములు చేత దానిని నివారించును. మరికొందరు మంత్రములచేత నివారింతురు. కొందరు విభూతినిచ్చి, మంత్రజలమిచ్చి అంతులుకట్టి నివారింతురు. ఎంత ప్రత్యక్ష ప్రమాణ వాదులైనను దీనిని కాదనలేరు. నిరౌషధముగ మంత్రాది శక్తులతో వ్యాధులను నివారించుట, లాభములును కల్గించుట, యధికారాభివృద్ధి కలిగించుట కొందరి వలన జరుగును. వారు యోగులని, సిద్ధులని దైవములేయని స్వార్థపరుడైన మానవుఁడు భావించుట కలదు. వాఁడు మహా పండితుఁడు కావచ్చును. మహోద్యోగి కావచ్చును. మహా ధనికుఁడు కావచ్చును. వాని బుద్ధి యందలి యల్పత్వము చేత నీయుపకారము లెవనివలన జరుగుచున్నవో వాఁడే భగవంతుఁడని వీఁడు విశ్వసించును. వాఁడు గీచినగీతదాటఁడు. స్వధర్మ స్వదేశ స్వసంఘములకు వాని యుపదేశముచేత వీఁడు ద్రోహము కూడ చేయును. ఇది యధిక సంఖ్యాకులైన మానవుల సామాన్య స్వభావము. వేదమత మిట్టివారికి మహాధర్మము లుపదేశించి వారి బుద్ధుల యొక్క యల్పత్వము తొలగించి యధికపరచుటకు ప్రయత్నించును. మ్లేచ్ఛజాతు లిట్టి యులిర్పి జనమును తన రాజనీతి కుపయోగించుకొనును. వీరిచేత తన పనులు చేయించికొనును. వారి కుపకారము చేయును. వారికి భీతి కల్పించును. లాభములు చూపించును.

సర్వ యవనశక్తులు సమకూడిన యుత్తర బాహ్లీకము పెడత్రోవలంబో నీత్రోవ వెంటపోవునీత్రోవ వెంటపోదనిలేదు. చుట్టుపట్లనున్న రాజ్యములలోనొకచోటిమంత్రి, యొక చోటి సేనాపతి యొక చోటి సర్వరక్షక భటాధికారి మరియొక చోటి రాజపురోహితుఁడు చిల్లర జనము వారి యీ తుచ్ఛ శక్తులకు వశంవదులై యుందురు.

# మూడవయధ్యాయము

విక్రమార్క చక్రవర్తి తూర్పు బాహ్లీక రాజ్యమును గెలిచెను. చక్రవర్తి విజయ సేనావాహినులు కొండంతయెత్తున లేచిన సముద్రపు కెరటము విరిగిపడు చున్నట్లు వచ్చుచుండఁగా చిన్న రాజ్యము లెచ్చటి వచ్చట దద్దరిల్లిపోయెను. ఒక దేశము తరువాత నొకటి తలయొగ్గి, తలయొగ్గనిచోఁ దల తీయఁబడి, సార్వభౌముని పతాకముక్రింద నణిగిపోవుచుండఁగా మల్లదేశము, కోసలదేశము, పంచానల దేశము, పుష్కర దేశము, నింద్రప్రస్థము, సింధు రాష్ట్రము, రోహితరాష్ట్రము నొక్కొక్కదాని వెంట నొక్కొక్కటి చక్రవర్తికి వశమై పోవుచుండెను. తూర్పు బాహ్లీకము శతద్రూవిపాశానదుల నడుమ నుండెను. అది చాల దుర్భేదమయిన దేశము. ఒక జలదుర్గమువలె సంవత్సరము పొడుగునను శుష్కించిపోని ప్రవాహములు గల రెండు నదులు పోయి సింధునదిగా నేర్పడుటచేత ముప్పైపుల జలమును దాటి గాని పోవుటకు వీలులేదు. తక్కిన దేశములవారు విక్రమార్కుని సైన్యములు

బాహ్లీక దేశము నొద్ద భంగింపఁ బడునని తలఁచిరి. చక్రవర్తి సైన్యము లుజ్జయిని నుండి సూటిగనే ప్రసారణము చేసెను. ఆయన విజయయాత్ర యుత్తరముగా నేగి హిమాలయపర్వతముల వెంట, త్రిగర్త దశార్ణదేశములను గెలిచి, మద్రరాష్ట్రమును జయించి, యచటి నుండి తూర్పు బాహ్లీకమునకుఁ బ్రయాణము కట్టినచో నదుల నవతరించు బాధ్యత చక్రవర్తి సైన్యముల కుండెడిది కాదు. చక్రవర్తి యట్లు చేయక శతద్రూనదిని దాటి యే తూర్పు బాహ్లీకమును గెలుచుటకు నిశ్చయించెను. ఆ సేనావాహిని ముందు శతద్రూవాహిని పనిచేయలేదు. చక్రవర్తి ధానుష్కులు శతద్రూనదీ తీరమున నిలుచుండి పడవల మీఁద సైనికులు సురక్షితముగా నాతలి యొడ్డు చేరునట్లు చూచుచుండిరి, అ ధానుష్కుల ముందు శత్రువులు నిలువలేకపోయిరి. వారు కించురథాల వారు. వారి బాణములు రెండు వందల గజాల దూరమున నున్న లక్ష్యమునుగూడ సులభముగా భేదించు చుండెను. వారమ్ములేసి యమ్ము తొడుగు సమయము కూడ నున్నదా లేదా యనిపించుచుండెను. ఈ నడిమిదేశములవారు కొందఱెదిరించిరి, కొందఱుదాసోహమనిరి. వింధ్య పర్వతములైన కిల్కిలుజయినీ రాజ్యము వెనుకతట్టున నుండుటచేత చక్రవర్తి వారిని కురూశమలదాది దేశములతో పాటు తత్పూర్వము నందే యదుపు పెట్టుటచేత వెనుకనుండి కిల్కిలుల సాయము వచ్చునన్న యాశ తూర్పు బాహ్లీకులకు లేకపోయెను. చక్రవర్తి సైన్యము ముందు కురురాష్ట్రమే నిలువలేక పోయెను. మహా భారత యుద్ధానంతరము హస్తినాపుర రాజ్యము

యొక్క ఔద్ధత్యము తగ్గిపోయెను. కురువంశీయులే హస్తినాపురమును వదలి పోయిరి. కాని హస్తినాపుర మితరరాజుల క్రింద దృఢమైన రాజ్యములు శత్రువులకు భయము కలిగించును. సైన్యములతో పోడిమి చెడకుండ నున్నదనియే చెప్ప వలయును. ఈ మూఁడు వేల యేండ్లలో చాలనాళ్ళు మగధ రాజ్యమునకు రాజధాని యయిన గిరివ్రజపురమును, తరువాత పాటలీ పుత్రమును రాజధానులుగా సామ్రాజ్యాధినేతలు వెలసినను కురుక్షేత్రము ప్రాబల్యము పోలేదు. కాని హస్తినాపుర రాజ్యమునం దొక విశేషమున్నది. వేలయేండ్లు గడచినను మానిసుల కోరికలు తమ పూర్వులు పొందిన యౌన్నత్యము మరల పొందవలయు ననియేయుండును. సర్వభారత దేశమునకు తలకట్టు వంటి హస్తిననుండి భారతయుద్ధముతో దశ తొలఁగిపోయినను మరల భారత దేశను సామ్రాజ్యమగుటకు హస్తినకే సాధ్యమగునని యారాజవంశీయులు తలంచుచుందురు. వారు సామ్రాజ్యమును నిర్మించలేరు. వారికి సామ్రాజ్యనిర్మాణము నందెంత యభిమానమో భారతీయ ధర్మమునందంత యభిమానము. అది భగవంతుఁడు గీతోపదేశము చేసిన స్థలమని వారికి మక్కువయు; పట్టుదలయు. ఎన్నెన్ని భాగములు యవనభావదూషితములయినను బౌద్ధభిక్షుక సంచారక ప్రవణములయినను కురుక్షేత్రము మాత్రము గీతాధర్మమునకుఁ గట్టుబడియే యుండును. ఉజ్జయిని యందొక మహాపురుషుఁ డుద్భవించెను. అతఁడు మహాపరాక్రమశాలి. అతఁడు మరల భారత దేశమున వేదధర్మమును స్థాపింపఁబోవుచున్నాఁడు.

ఆసేతుశీతాచలము మరల నొకఁ త్రాటికిఁ దేఁగలిగినవాఁడు. ఇట్టిభావముచేత మెత్తనైన కురుక్షేత్ర భూభాగము విక్రమార్కునకు సులభముగా వశమయ్యెను. కురుక్షేత్రము వశమయ్యెననఁగా బాహ్లీకాది దేశములుభయపడనక్కఱలేదు. కురుక్షేత్రరాజ్య మోడిపోయెననఁగా పరరాజ్యములు భయపడవలయును. కాని తూర్పు బాహ్లీకమునకుఁ గురుక్షేత్రము వెనుకతట్టున నున్నది. భారతదేశమున ప్రాగ్దక్షిణ భాగముల నుండి పెద్ద దండయాత్రలు వచ్చినచో బాహ్లీకయవనులకు భయములేదు. పెట్టనికోటగా మన కాగ్నేయదిశయందు కురుక్షేత్ర దేశముకలదు. వారు సాహసులు మహావీరులు. వారిని గెలిచికాని తమమీఁదికి వచ్చుటకు వీలులేదు. అట్టి హస్తినాపురసైన్యము చక్రవర్తిని సమాహ్వానముచేసి వానికి కప్పము కట్టుదునని సామంతరాజ్యముగా నంగీకరించినప్పుడు తూర్పుబాహ్లీక యవనరాజ్య మేమికావలయును? యవను లెప్పుడును తూర్పుబాహ్లీక దేశమునం తమ సుస్థిరనివాసముగా మన్నించలేదు. దేశమంతయు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులచేత నిండియుండును. యవనులు పేరునకు రాజులు. ప్రజలు రాజునకుఁ బన్నులు చెల్లింతురు. యవన భావములనుగూడ స్వీకరింతురు. యవనుల పండుగలనుకూడ చేయుదురు. యవన వేషములను ధరింతురు. కాని సమయము వచ్చినచో నొక్కపెట్టున భారతదేశీయులై కూర్చుందురు. కిల్కిల యవనసాహాయ్యము లేదని తెలిసినవెంటనే హస్తినాపురరాజ్యము తలవంచినదని తెలిసినవెంటనే తూర్పుబాహ్లీకములనుండి యవనులు తమ నగలతో, ధనముతో, సేనలతో

పతాకాలతో, రథములతో, గుఱ్ఱములతో నుత్తర బాహ్లీకము లకు చేరిరి. అచట నామమాత్రమైన యుద్ధము జరిగెను. సైన్యములు, దాడి వెడలుట, పొలముల నాక్రమించుట మొద లైనవి జరుగుచునే యున్నవి. తూర్పు బాహ్లీకముల నుండియు, వింధ్య పర్వతములనుండియు కిల్కిలయవనులును, రోమన యవనులును మారు వేషములతో గొందఱు; స్వస్వరూ పములతోడనే గొందఱు భారతదేశ వాయవ్య ప్రాంతమున నున్న యుత్తర బాహ్లీకములని పిలువఁబడుచున్న రోమన్ దేశమునకు వాహినులుగా పోవుచునేయుండిరి. వారిలోఁ గొందఱు తత్ప్రాంతములయందు పరిచితులైన వ్యక్తులు. ఒకఁడు సిద్ధుఁడు, ఒకఁడు మంత్రశాస్త్రవేత్త, ఒకఁడు సాధు వని ప్రశస్తినందినవాఁడు. ఒక్కొక్కని వెంట వందమంది యుందురు. వారికి దారిలోఁ బల్లెలలోఁ బట్టణములలో స్వాగతమే చెప్పఁబడుచుండెను. వారి ప్రమాణము సుల భముగా నుండెను. ఇట్లు నిర్యవనమైన ప్రాగ్బాహ్లీక దేశ మున విక్రమార్కుఁడు తమ ప్రమరవంశ క్షత్రియునొకనిని రాజుగా నియమించి ముందునకుఁబోయెను. కేకయగాంధార దేశములు యుద్ధమునకు సిద్ధపడెను. చక్రవర్తిసైన్యము వానిని నిర్మూలనము చేసెను. దానిలో భారతదేశ వాయవ్యమున నున్న చిన్న చిన్న రాజ్యములకు భయము వేసెను. త్రిగర్త కాంభోజ కాశ్మీర దరదాభిసారోరగ సింహపుర కటక బర్బ రోత్తర జ్యోతిష శకకిరాత దేశములు తేలికగా వశమయ్యెను. అందఱును చక్రవర్తి సైన్యమునకు స్వాగతము నెఱపిరి. ఇంత సులభముగా వశమైన వాయవ్యప్రాంత రాజ్యములయందు

చక్రవర్తి కప్పములను తీసికొని వెడలిపోయెను. ఆయూపులో నుత్తర బాహ్లీకము తలవంచినట్లులేదు. ఉత్తర బాహ్లీకము నకు చక్రవర్తి సైన్యములు పోలేదు. తదితర దేశ ములు చక్రవర్తిని చిత్రముగా వంచించెను. ఎవనినో యొకనిని రూమ్యకాధిపతిగా చూపించి వానిచేత చక్రవర్తికి జోహారులు చేయించి రూమ్యకదేశముగూడ వంగినట్లు వెల యింపించిరి. దీనిరహస్యము చక్రవర్తికిఁ దరువాత క్రమక్రమ ముగా నాలుగైదేండ్లకుఁ దెలిసెను. ఉత్తరబాహ్లీకముల యందు క్రమక్రమముగా పెద్దసైన్యము సమకూర్పఁబడు చున్నది. దరదాభిసారోరగ సింహపుర కటక శక కిరాతదేశ ములు వానివెనుకనున్నవి. ఈదేశములు చక్రవర్తికి వంగి నట్లు నటించెను. ప్రతి సంవత్సరమును కప్పము చెల్లించు చుండెను. చక్రవర్తి మరలదండెత్తివచ్చినన్నైన నీ దేశ ములయం దెదురొక్కనుట యుండదు. ఈ దేశములనుండి జనులు సమృద్ధిగాపోయి రూమ్యకాధిపతి సైన్యములోఁ జేరుచుందురు. ఈదేశములలోని ప్రజలు యవనులుకారు. వేదమతానుయాయులే! అనుయాయులనుటకన్న వేదమతము నందుఁ బుట్టినవారు మాత్రమేయని చెప్పవలయును. ఆచార ములచేత, విశ్వాసములచేత యవనులు పారలౌకికములైన విషయములయందు, మత విషయములైన విశ్వాసముల యందు యవనుల భావములు కలవారు. బ్రహ్మ క్షత్రియ వైశ్యు లుపనయనములు చేసికొందురు. జందెములు ధరింతురు. కర్మలు చేయుదురు. ఇది వట్టి లౌకికము. తొల్లిఁటినుండి వచ్చుచున్న సంప్రదాయము. పరలోకము

లున్నవని వారు విశ్వసింపరు వారు యజ్ఞవిరోధులు. పురాణములను విశ్వసింపరు. ధర్మశాస్త్రము లన్నచో మర్యాదలేదు. భారత భాగవతములయందు ద్వేషము. ఏ మాట చెప్పినను దాని కెదురుమాట చెప్పుదురు. బౌద్ధులును జైనులును పురాణ కథలను యథేచ్ఛముగా మార్చి వారి యిష్టమువచ్చిన వ్యాఖ్యానములు చేసిరి. వీరు వానినైన విశ్వసింపరు. పురాణములను విశ్వసింపకుండుట కిదియొక సాకు. ఒకానొక ప్రాంతమున వైదికధర్మ మెంత యధఃపతనము పొందినను దాని పతనమునుగూర్చి గాఢముగా దుఃఖపడువారు కొలదిమంది యుందురు. వారి కాలనయుఁ బాలనయు నుండదు. కొందఱు వైదికధర్మ విరోధులు వారి మీఁదఁ గత్తికట్టుదురు. ఎవని విశ్వాసము వానిదన్న సాధుత్వము మానవులలో నుండునే! యవనులలో నంతకన్న యుండదు. ఆ దేశములన్నియు యవనభావదూషితులైన కుక్షత్రియుల చేతఁ బరిపాలింపఁబడుచుండెను. ఈ స్థితి క్రమక్రమముగా చక్రవర్తికిఁ తెలిసెను. ఆయన కేమిసేయవలయునో తెలియ లేదు. ఆ రాజ్యాధిపతులు తనకుఁ గప్పము చెల్లించుచుండిరి. వారిమీఁదికి దండెత్తి పోవలయునా! పోయి యెవరితో యుద్ధము చేయవలయును ? ఒక్క రూమ్యక దేశముతో యుద్ధము చేయవలయును. ఈ సర్వదేశములయందలి వీరులు రూమ్యకాధిపతి పతాకముక్రింద నిలచియుండిరి. చక్రవర్తికి మరల వార్తలు వచ్చెను. వెనుక పేటీననున్న కటక సింహపురోరగ శక కిరాతాది రాజ్యముల యందు రహస్యముగా నాయుధాగారములు కలవు. ఆయుధ నిర్మాణశాలలు కలవు.

సామాన్య ప్రజలవలె నుందురు. తెలియకుండ వారు వెనుక నుండి ముట్టడింతురు. ఇదియంతయు రూమ్యకాధిపతి పన్నిన వ్యూహము. విక్రమార్కునిసేన రూమ్యకదేశము మీఁదికిఁ బోవును. ఆ చుట్టుపట్లనున్న దేశములవారు చక్రవర్తికి పన్నులు కట్టుచున్నారు. వారిని గురించి శ్రద్ధవహింపనక్కఱ లేదు. ఆదేశాధిపతుల సేనలు చక్రవర్తి సేనలతోఁ గలసి యుద్ధమునకు వచ్చును. యుద్ధవేళ వారు చక్రవర్తి సేనల కననుకూలముగా వర్తింతురు. చక్రవర్తి స్వసైన్యమును మధి యింతురు. ఇంతియకాక రహస్యాయుధ నిర్మాణశాలలనుండి, యాయుధాగారములనుండి వేలకొలఁది సైన్యములు బయలు దేరి చక్రవర్తి సైన్యములను నిర్మూలించును. ఈసారి దండ యాత్రకు సామ్రాజ్యసేన వెంట చక్రవర్తియే రావలయును. ఆయన సేనతో వచ్చుటకుఁ బలువిధములైన యెత్తులెత్తఁ బడుచుండెను. చక్రవర్తి వచ్చుట మట్టుపెట్టవలయును. ఈ మహాప్రయత్నము జరుగుచున్నది. చక్రవర్తి గూఢచారులు రూమ్యకదేశాశ్రయములైన రాజ్యములయందుఁ దిరుగు దురు. వారి కేవార్తయు సరిగా పొడకట్టదు. పొడకట్టిన వాఁడు తిరిగిరాఁడు. గాంధారదేశమున విక్రమార్కుని రాజ శాసనము సుస్థిరముగా నున్నది. గాంధారము పెద్దదేశము. ఈ చిన్న చిన్న రాజ్యములు గాంధారపతికిఁగూడ వశమగుట లేదు. ఈ యవనభావ దూషితాల్ప బహురాజ్యములయందు స్త్రీరక్ష లేదు. ధర్మరక్ష లేదు. ఆస్తులు రక్షింపఁబడవు. వేద ధర్మ విశ్వాసులు సంహరింపఁబడుదురు. వారి స్త్రీలు చెఱ పట్టఁబడుదురు. వారి యాస్తులు వశముచేసికొనఁబడును. పట్టి

యప్పుడు గ్రుడ్డిలో మెల్లగానుండును. ఒకవైదిక మతావలంబి యయిన చక్రవర్తి యుదయించి ధర్మమును ప్రతిష్ఠింపఁదలఁచి నపుడు వారి క్రూర కర్మములు మితిమీఱి పోవును. ఆ దేశ ములయందలి భారతధర్మసంగత బుద్ధులు వైదికధర్మప్రతిష్ఠా పనాచార్యభూతుఁడైన రాజుదయించుట వారి ప్రాణములకు సంకటముగా భావింప నారంభించిరి. అయ్యో! పలుమంది యవనభావముల నాశ్రయించి సుఖపడుచున్నారుగదా! జన్మ మెత్తినందుకు బ్రతికిన నాల్గునాళ్ళు సుఖపడవలయునుగదా! కొనసాగని యీ ధర్మమునందు విశ్వాసము పెట్టికొని యేల బాధపడవలయుననికూడ కొందఱు భావించుట కలదు.

ఈ పరిస్థితియంతయు సర్వాంకషముగా నర్థముచేసికొన్న చక్రవర్తి దివారాత్రములు దీనినిఁగూర్చి భావించును. శకదరదోరగ కటక సింహపురి రాజ్యములు తమ సైన్యము లలోఁ బ్రవేశించి ప్రజలనొక మునుముపెట్టి నరకుచు పోవల యునా! అప్పుడు దేశ మేమియున్నది? రహస్యాయుధా గారము లెచట నెచటనున్నవి? ఆయుధ నిర్మాణశాలలెచట నెచటనున్నవి! అవి యెన్నియున్నవి! తొలుత వానిని నిర్మూలింపవలయును. తన రహస్యచారులకు వాని గుర్తు చిక్కుట లేదు. అనేక వార్తలు వచ్చుచున్నవి. దరదదేశపు రాజు యవనభావదూషితుఁడు. పైకి క్షత్రియునివలెనుండును. క్షత్రియ వేషము వేయును. క్షత్రియాచారములు నెఱపును. ఉరగదేశపు ప్రధానమంత్రి యట్టివాఁడు. సింహపురకటక శకదేశముల సేనాపతులంగఱు యవన రాజ్యాభిమానులు. యుద్ధములో వారి సైన్యములను నమ్ముటకు వీలులేదు.

ముందఱ నీ తలకాయలను దొలఁగించవలయును. వారు చక్రవర్తి భయముచేతఁ బైకి సామ్రాజ్యానుకూలురుగానే ప్రవర్తింతురు. యుద్ధవేళ వారి నడుమున్లోఁ బెట్టుట యెట్లు సాధ్యమగును!

ఇప్పుడు వరాహమిహిరుఁడు వచ్చి చెప్పినకథ విచిత్రముగా నున్నది. ఈ వేదవతి సింహపురమునం దెందు కుదయించెను? ఆమెను రూమ్యకదేశమున కెందుకుఁ గొనిపోయిరి? ఎవరు కొనిపోయిరి? ఆమె స్వరూప మిట్టిదని వరాహమిహిరుఁడెందుకుఁ జెప్పఁడు? తనకు ధ్యానవేళనే యావిషయమేల ప్రత్యక్షము కావలయును. శుక్లపక్ష దశమినాఁటి వెన్నెలలు పిండియారఁబోసినట్లువిరిసి తనకార్య సానుకూలతను చెప్పుచున్నవా? నాఁడు వరాహమిహిరుఁడెక్కడ విడియును? ఈయనది పంచ సిద్ధాంతికా సిద్ధాంతము. తన యాస్థానమున మహా జ్యోతిష్కులు కలరు. వారందఱును నెంతటి సిద్ధాంతవేత్తలో యంతటి మహాకవులు. వరాహమిహిరుఁడు తన సభ కలంకార భూతుఁడగును. ఇంతటి వేదధర్మాభిమాని కుటుంబము సింహపుర రాజ్యమున సురక్షితముగా నెట్లుండెను? ఆయన కుటుంబమును వెంటనే యుజ్జయినికి రప్పింప వలయును. వరాహమిహిరున కొక విడిది యేర్పఱచెను. ఈ రాత్రి యందాయన వంట చేసికొని భోజనము చేయును. నిదురపోవునా? ఈయనయు తపశ్శాలి కదా! నేను ధ్యానమగ్నుఁడనై యున్నప్పు డీయనకూడ నా ధ్యానములోఁ దన ధ్యానము ననుసంధించి నాకు భాసించెడి విషయములను భాసింపఁ జేసికొనునా? తన ధ్యానబలము చేత

నా బుద్ధియందుఁ దగను కూలభావన రేకెత్తించునా? ఆయన కుటుంబమును వెంటనే యుజ్జయినీకి రప్పింప వలయును. చక్రవర్తి యిట్లనుకొనుచునే తన తపో మందిరమునకుఁ బోవుచు పదిమందికి వార్త పెట్టెను. వారు వెంటనే వచ్చి తన దర్శనము చేయవలయును. ఆ పదిమందియు రెండు ఘటికల వేళలో వచ్చిరి. రాజిట్లనెను. మేము తపోగృహము నకుఁ బోవుచున్నాము. నేఁడు ధన్వంతరిక్షపణక శంకు కాళిదాసాదులతో పాటు మఱియొక రత్నము దొరకినది. ఆయన పేరు వరాహమిహిరుఁడు. ఆయన కుటుంబము సింహ పురమునం దున్నది. ఆ యుత్తర బాహ్లీక రాజ్య పరిసర రాజ్య విషయములు మీకును దెలియును. పోయిన గూఢ చారి తిరిగిరాఁడు. వార్త లనేకములు. ఈ వరాహమిహిరున కొక కుమార్తె కలదు. ఆమె పేరు వేదవతి. ఆమె రూమ్యక దేశమున బంధితురాలై యున్నది. ఆమె శీలభంగము చేయుట కెవ్వరును చాలరు. దురూహతో నామెనుస్పృశించిన వాఁ డగ్నిసాత్కృతుఁడగును. ఆమె యెందుకు బంధింపఁ బడినది? ఎచట బంధింపఁ బడినది! ఎట్లు బంధింపఁ బడినది! మీరు పదిమందియు గూఢచార శాఖాప్రధానభూతులు. మాఱు వేషములు వేసికొనుట యందు, భిన్నభాషలు మాట్లాడుటయందు సిద్ధులై కన్నమునఁబోయి కన్నమున రాఁగలిగిన వారి చేత నీ వర్తమానము తేవలయును. నాల్గు దినములు గడచిన తరువాత మా దర్శనమునకు వచ్చినచో నామెను గూర్చి కొన్ని సంగతులు చెప్పఁగలము. వానిని మీరా గూఢాచారుల కందించవచ్చును. రాని గూఢ

చారుల స్థితి యెట్టిది? వారు యవనరాజ్యపక్షపాతులై మనకు వ్యతిరేకించిరా? అచట గుర్తుపట్టఁబడి సంహరింపఁబడిరా? గుర్తుపట్టఁబడు నవివేకి గూఢచారియా? అని చక్రవర్తి తన తపోగృహమునకుఁ బోయెను. వారు దీర్ఘాలోచనాపరులై వెడలిపోయిరి. ఈమాటలు రహస్య ప్రదేశమున జరిగెను.

వెడలిపోయిన గూఢచార శాఖాధిపతుల వాలకములు చూచిన యంతః పురోద్యోగులకు భయమయ్యెను. అప్పటికి జాము ప్రొద్దుకడచెను. చక్రవర్తి నిద్రాయోగ్యమైన యుడుపులు ధరింపలేదు. దూరము నుండి వీణావాద్యము వినవచ్చుచుండెను. ఒక యంతఃపురకాంత తన సౌధాంతంరమున చక్రవర్తిని సమాహ్వానించుటకు వీణను వాయించుచుండెను. కల్యాణి రాగము నాలపించుచుండెను. ఆరాగము యొక్క నివాదము లంతఃపుర బహుప్రదేశముల యందు నగుర్వాది వస్తుదహన జనిత ధూమాల్ప మేఘములలోఁ జొచ్చి సువాసనా భరితములన్నట్లుండెను. ఆ, యుడుపుల యందు చిత్రింపఁబడిన దేవకన్యకల భంగిమలందు నారాగము నాస్వాదించుటచేతఁ గలిగిన యొక తన్మయత్వము భాసించుచున్నదా యన్నట్లుండెను. ఎచట నుండియో సన్ననిగాలులు తదంతఃపురాంతర్భాగముల యందు సిగ్గుపడు కన్నియలవలెఁ దారాడఁ జొచ్చెను. చక్రవర్తి వానివంకఁ జూడకుండఁ బోవుచుండెను. ఏ ప్రదేశము నుండి యీ వీణానిక్వాణము వచ్చుచున్నదో తత్ప్రదేశము నుండి స్తంభములు చాటు చేసికొని పూలబుట్టలు చాటు చేసికొని స్త్రీలు చక్రవర్తి

వంకఁ జూచుచుండిరి. చక్రవర్తి వీని నన్నింటిని పరామర్శిం పక పోవుచుండెను ఆయన తపోమందిరమునకుఁ జేరి నంతనే వీణానిక్వాణము లంతరించెను. సన్నని గాలుల ప్రచారము తగ్గెను. ధూపములు శరదంత మేఘములవలె నయ్యెను. జాలరులుగాఁ గట్టిన మణులనుండి ప్రసరించు కాంతులు తిరోహితములు చేయఁబడెను. ప్రతి ద్వారము వద్ద కరవాల పాణులైన భటులు స్తంభాకృతులవలె నిలుచుండిరి. అంత ద్వారముల యందు కరవాలహస్తలైన స్త్రీలు దిగ్భ్రాంతి వహించి నిలిచిరి. బయటి తోఁటలో నుండి యొక మయూ రము కేకారావమును చేసెను. ఆ ధ్వని సౌధకుడ్య తాడి తమై మలఁగి ద్వారము నుండి లోనికి వచ్చి పై నుండి మరల మలఁగి నాలుగు వంపులు తిరిగి శక్తియుడిగినట్లు సన్నగా విక్రమార్కుని చెవులకుఁ దగిలెను. చక్రవర్తి శరీరము మలుపులు తిరిగినట్లయ్యెను. ఆయన స్తబ్ధుడై నిలబడెను. ఇది నలువది యేండ్ల క్రిందటి మాట. తాను హిమాలయ పర్వతమునఁ దపస్సు చేసిన దినములలో నొక హృదయ విదారకమైన ధ్వని తన యొడలును గంపింపఁ జేసెను. ఒక హరిణము నొక సింహము చంపుటకు దానిపై దూఁకెను. హరిణము ఖడ్గముచే నఱుకఁబడి నడుమనందుఁ గూలిన గుజ్జమువలె వంగిపోయి కూయివెట్టెను. హరిణము యొక్క కూయియు, సింహము యొక్క లోగొంతు గర్జయుఁ గలసి యొక విరోధి స్వర సమ్మిళిత ధ్వనివలెఁ దనకు వినిపించి తన శరీరము నందలి రక్తనాళములను చేతితోఁ బట్టికొని కలియఁ బెట్టినట్లయ్యెను. ఆ నాఁడు తాను నిస్తబ్ధుఁ

డయ్యెను. నిస్తబ్ధతా లక్షణము వట్టి శరీర బహిర్లక్షణము. అంతర్లక్షణము కుల్యయొక్క తూములలో నుండి వెనుక నిండియున్న ప్రవాహము యొక్క శ్లేశ నిర్గమాన వేళా సడిండీర నిర్ధునన పరస్పర సంఘటిత జల బిందు సమూహ రోదనమువంటిది. తపోముఖుఁడైన యాయనకు నలువదియేండ్లక్రిందటి యీ యనుభూతియేల? ఏ లేడి నేసింహము పట్టుకొన్నది? కొన్ని లిప్తలలోఁ చక్రవర్తికీభయము నివారితమై నాఁటిసంగతిలోని తరువాతజరిగిన విషయములు స్ఫురించినవి. అప్పుడు తానట్లు దిగ్భ్రాంతుఁడై తాను సింహమునదలించెను. సింహము గుఱ్ఱుపెట్టెను. తన చేతిలగుడములో సింహమును తాడించెను. సింహము లేడిని వదలి తనమీఁదికి రావలయును, తనను సంహరింపవలయును. సింహము మిక్కిలి కోపముతో నిస్సహాయమయినట్లు లేడిని వదలి వెడలిపోయెను. తన కేయాశ్చర్యముకలిగెను. తాను పదిపండ్రేండ్ల బాలకుఁడు ఇది యెట్లుజరిగెను? ఆలేడిని తెచ్చి తన యాశ్రమమున నుంచెను. ఇతర సంయములు వచ్చిరి. దానిని రక్షించిరి. ఈ కేకారావము శుద్ధస్వరము. దీనియందు విరోధి స్వరసంయోజనములేదు. కార్శ్యమున్నది. నెమలి కూయుటకు యోగ్యమైన వేళ కలదు ఈ ఋతువులో నెమళ్ళు కూయవు. మేఘదర్శనములేదు. దోహదక్రియా సంపాదితములైన ధూపము లుద్యానవనమున నుండవచ్చును. రాలినయాకులను ప్రోగుచేసి తోటమాలులు తగులఁబెట్ట వచ్చును. ఆధూమములు జలదభ్రాంతి కలిగింపవచ్చును. పట్టపగలు దావధూమమును జలదమనుకొనెడి జంతువు నిశా

భాగముల దగ్గరసుష్కపత్రనిర్గత ఘ
నేలభావింపదు? చక్రవర్తి మరల భ
శుద్ధస్వరమేనా? దీనిలో మఱియేదియైన
అతర్కితోపపన్నమైన తత్స్వర ప్రథమశ్రవ
మున నింకనేమైన మిళితమైయున్న దేమోయన్న
విస్పష్టముగా భావింపబడలేదు కాబోలును. ఎంతకైన
శుద్ధస్వరమున కింత బాధాజనకత్వశక్తి కలుగునా? రాజట్లే
నిలచియుండెను. ద్వారమునందలి దౌవారికులు చక్రవర్తి
తపోగృహమును ప్రవేశించువఱకు తద్గతదృష్టులై నిలచి
యుండిరి.

కాకపాదియన్న వృద్ధదాసి శుకోపదేష్ట్రి. అది గంధర్వ
సేనుని తొలుతటి రాజ్యమునందుండియు నుజ్జయినీ రాష్ట్రాధి
పతులైన ప్రమరవంశీయుల యంతఃపురమందున్నది. ఆమెకు
రాజులేడు. రాణిలేదు. ఎవరు చెప్పినమాటయు వినదు. వినును
కాని వినదు. దానియిష్టమువచ్చినట్లు ప్రవర్తించును. దానికి
వయస్సు నూరుసంవత్సరములు. కనుచూపుతగ్గలేదు. దంత
పటిమ తగ్గలేదు. ఒడలుమాత్రము ముడుతలుపడినది. వంగియే
నడచును. చిలుకలకు చదువుచెప్పుట దానికిగల ప్రావీణ్యము.
చిలుకలను శిక్షించు నాయుధములు దానివద్ద కలవు.
మూరెడుకూడలేని సన్నని బెండ్లు దానిబెత్తములు. ఆబెండ్లు
విఱుగవు. వంగును. స్పర్శకు మెత్తగా నుండును. దెబ్బ
చురుక్కుమని తగులును. ఆమెవద్ద సన్నని త్రాళ్ళుండును.
అరటియూచ తరుగుచుండగా వచ్చెడి దారములతో ఆమె
యా త్రాళ్ళు పేనును. ఆ త్రాళ్ళు మూరెడు మూరెడు

...యందు సన్నని ముల్లువేసి ముడులకు
...ను. పంచదార చిలుకలు, దాడిమీబీజ
... పలుకులు చిలుకలను మోహపెట్టుటకై
...దు నాహారపదార్థములు. కొన్ని చిలుకలు
...హారముల కాసపడవు. త్రాటి దెబ్బలకు
...త్తవు చురకలకు లొంగవు. అట్టి బండ చిలుకలను
స్వాధీనము చేసికొనుటకు కాకపాది వద్ద రెండు మూడు
సుకుమారతరములైన యాయుధము లున్నవి. అవి సన్నని
సూదులు. ఇనుముతో చేసినవికావు. ఇనుముతో గ్రుచ్చి
నచో చిలుక యొడల పుండుపడినచో నది గాయమై
మానదు. చిలుక చనిపోవచ్చును. రాజోద్యానపు కోరడి వెంట
కొన్ని ముండ్లచెట్లు కలవు. ఆ ముండ్లతో గ్రుచ్చినచో
బాధకు బాధపెట్టును. పుండుపడదు సరికదా, ఆ ముల్లుతో
గ్రుచ్చుటవలన జంతువుల రక్తము పరిశుభ్రమగును. కాని
యా ముల్లు పెట్టెడిబాధ విపరీతముగా నుండును. భగవంతుని
సృష్టిలో నెన్ని విచిత్రములు కలవు. తేనెటీగలు కుట్టినచో
బాధకల్గును, వాని ముఖనాళములయం దొక విషముండును.
కత్తితో నొకఁడొకనిని పొడుచును. ఆ బాధవేఱు. విష
విలిప్తమైన కత్తితో పొడుచును. దాని బాధవేఱు. కీళ్ళనొప్పు
లకు తేనెటీగలచేత కుట్టించుకొందురు. ఆబాధపోవును. కుట్టిన
బాధబాధయే. పోవునది కీళ్ళనొప్పులబాధ. ఈ కంటకముల
యం దేదో యౌషధీయ పదార్థమున్నది. దానితో గ్రుచ్చి
నపుడు విపరీతమైన బాధకలుగును. జీవియొక్క యారోగ్యము
నకు భంగము లేదు. సన్నని వెండికాడల చివర బెజ్జములుచేసి

యీ కంటకముల నా బెజ్జములలో చొప్పించి కాకపాది మాటవినని చిలుకలను వానితో పొడుచును. ఎచట పొడిచి నచో నా చిలుకకు మిక్కిలి బాధకలుగునో ఆమెకు తెలి యును. మేనిలో రెక్కలుదయించు సంధిప్రదేశములందు పొడిచినచో చిలుకకు బాధయెక్కువ. చర్మమునుండి ముక్కు బయలుదేరు స్థలమునందు పొడిచినచో బాధయెక్కువ. ఇట్టి స్థలములయందు చిలుకలను పొడుచును. ఆ సమయములందు చిలుకలు గీపెట్టును. శుకములు సామాన్యముగా పలుకు నప్పటి వాని కంఠస్వరమునందలి నినాదములకు నీ గీపెట్టు నప్పటి కంఠనినాదమునకు సంబంధముండదు. చిలుకలు కూయవు, పలుకును. సహజముగా వాని కంఠధ్వని దీర్ఘముగా రాదు. ఈ బాధాసమయమున దీర్ఘముగావచ్చును. చిలుక యొక్క కంఠస్వరములో విస్పష్టముగా రెండు స్థాయి లుండును. దాని కంఠధ్వని ద్విస్థాయి. ఉచ్చైర్నీచైర్నినాద సమ్మిళితము. దాని సహజ కంఠస్వరమునం దొక క్రౌర్యత కలదు. వసంతవేళ పరభృతము కూయును. ఆ కూత యొక సుకుమారమైన మధురిమను ప్రకటించును. వేటకాఁడు దానిని బాణముతో కొట్టును. అది బాధపడును. అపుడు దాని కంఠ స్వరమునందు పంచమస్వర ముండునా? గాయకుఁడుకూడ మానవుఁడే. అతడేడ్చుచున్నపుడు సంగీతముండునా? సంగీత మునందు స్వరసంయోజనముండును. ఏ రెండు స్వరములు కలిసినను మైత్రికల స్వరములే కలియును. విరోధి స్వరములు కలయికయుండదు. కావ్యగత శృంగారాది రసములయందు వలెనే రెండు విరోధిస్వరముల కలయిక యుభయమిత్రము

లైన స్వరముచేత వ్యవహితము కావలయును. ఒక్కొక్క రాగము కొన్ని స్వరములయొక్క సంఘటి. ఆ సంపుటీకరణ మందలి రహస్యమిది. ఒకజీవి దుఃఖించుచు రోదించినపు డీ సంపుటియుండదు. మనోజ్ఞత యుండదు. ఆహ్లాదజనకము కాదు. ఇది సంగీతవిద్యా పరమార్థభూతమైన రాగ నిర్మాణ పారమేశ్వర మనీష. సంగీతవిద్యేతరమైన ప్రాణులయొక్క వాగ్వృత్తియందు తాదృశమనోజ్ఞతాధిక్యము లేకున్నను, పరమశ్రవణసుఖ సంపాదనములేకున్నను శ్రవణేంద్రియ దుఃఖ కృత స్వరసంపుటి యుండదు. ఒకానొకని కవిత లేదా సర్వ కవిత సంగీతమువలె నున్నదనుటలోని యర్థమిది. సంగీతము లోని పరాకాష్ఠ స్వరసంయోజనజనిత మనోజ్ఞతాధిక్య జనకత్వ లక్షణము మానవుఁడు ప్రయోగించు శబ్దములయందలి చారుత సామాన్యశ్రవణసుఖ సంపాదిని. కవితయందు నీ సంపాదనము కొంచె మధికముగా నుండవచ్చును. కవనము శబ్దార్థాదిక ప్రాధాన్యము కలది. గానము స్వరసంయోజన జనిత శ్రవణేంద్రియతర్పణాహేతుక పరాకాష్ఠా పరమార్థము కలది. జీవుఁడు దుఃఖించునపు డీ మాధుర్య ముండదు. ఈ సౌకుమార్యముండదు తత్ప్రియత్న ముండదు. సహజముగా గొంతు నాళములనుండి విడివడిన వట్టి సవ్వడి. ఈ సవ్వడు లలో వైవిధ్యము కలదు. సరిగా తెగని కత్తితో గొంతు కోయుచున్నపుడు ప్రాణికంఠనిర్గత స్వరము వేఱు. సుకుమార మైన యాయుధముతో దేహకృంతన మాచరించునపుడు కంఠనిర్గతమైన ధ్వనివేఱు. హఠాత్తుగా ముల్లు గ్రుచ్చుకొన్న పుడు నిర్గతమగు బాధానినాదము వేఱు. ఈ సవ్వడులు భిన్న

జంతువులయందు భిన్నభిన్నముగా నుండును. కాకపాది యామంటితో జిలుకను పొడువఁగా నది పెట్టినకూత యుచ్చై శ్శ్రీర్ష్ణైర్ని నాద విస్పష్టతాలక్షణము మాలియున్నది. చక్రవర్తి శ్రవణములకు వినిపించిన కేకికేకానినాదము నందిది కలసివచ్చెను. ఆ కేకానినాదమే సహజమైనది కాదు. ఆ నెమ్మికి మహాసర్పమునకు కొన్నాళ్ళుగా విరోధమున్నది. ఉద్యానవనదూరగత వల్మీకమునందు నివసించు నా సర్పము యొక్క యునికి మానవులకు తెలియదు. అది దివావేళ వెలికి రాదు. కొన్నాళ్లుగా నా సర్పము దాగియుండి ఈ రాత్రి వేళ వెనుకనుండి వచ్చి యీ మయూరమును కరచుటకు నా సర్పము వచ్చెను. కఱవబోవువేళ నెమలికిఁగనుపించెను. భయగ్రస్తమైన యా మేఘనా దానులాసి కంఠమునుండి వినిర్గతమైన తద్భయసూచి కంఠనిర్గతకేకాధ్వని మిళితమై యీ శుక కంఠ నిర్గత బాధానిర్గతధ్వని యిది విస్పష్టమై అది కృశమై విలక్షణముగా విక్రమార్క చక్రవర్తి శ్రవఃపథము తాడించెను. అచట నిలబడిన చక్రవర్తియొక్క స్తంభావస్థా ప్రథమ మంథర దశతొలఁగిన తర్వాత రాజున కీ వివేచనము కలిగెను. అహో! అనుభూతి దశయందు వివేచనయుండదే. వివేచన తదనంతర స్థితి. ఈ కాకపాది తనమాట వినదే! ఇది తనయన్నగారినాఁటి తన తండ్రినాఁటి దాసి. తన్నుఁజేతులలో పెంచినదాసి. తన విషయమున దానియందొక మాతృత్వమున్నది. వినని ముద్దు చిల్కలను బాధించవద్దని చెప్పినను కాకపాది వినదు. తపోమందిర దేహళీస్థితుఁడైన చక్రవర్తి కిది యశుభ శకునమా? ఉపశ్రుతియా? వేదవతీ స్వరూపావ

గతి ప్రథమ విజ్ఞాన సోపానమా ! నలువదియేండ్ల క్రిందటి తన రక్తమనుభవించిన యొక యనుభూతి మరల నేటికి వచ్చినది ! వరాహమిహిరుఁడు తనకుముందే జపమునందు కూర్చుండియుండును.

## నాలుగవ యధ్యాయము

ఉరగదేశము భారతదేశ వాయవ్యమున ననాది నుండియు సుక్షత్రియులైన రాజుల చేతఁ బాలింపఁబడు చుండెడి దేశము. ఉరగ దేశమున కొకవైపున నభిసార దేశము, నొక వైపున సింహపుర దేశమును కలవు. ఈ మూఁడు దేశములు భారత యుద్ధము నాఁటి నుండియు భారతీయ ధర్మమునకు జీవగఱ్ఱలు. అభిసారదేశము నంటి కాశ్మీర కాంభోజ దేశములు కలవు. కాశ్మీర దేశము ప్రబలమైన బౌద్ధమతము నవలంబించి నపుడు కూడ కాంభోజాభిసార దేశములు బౌద్ధమతావలంబులు కాలేదు. ఉరగ సింహపుర దేశములు కాంభోజాభి సారముల ననుసరించి యుండును. ఆంధ్ర భృత్య వంశపురాజులు మగధసింహాసన మధిష్ఠించు వఱకు నీ నాల్గు దేశముల రాజులు భారత ధర్మావలంబులై యవనుల యొత్తిడిగాని బౌద్ధుల ప్రాబల్యము కాని భారత వాయవ్య దిశయం దధికముగా నుండకుండ సేతువులై యుండిరి. ఆరాజులందఱు పురాతన రాజవంశీయులు. ఆంధ్ర భృత్య వంశము వఱకు వారి వంశములు పరంపరగా వచ్చు చుండెను. ఆంధ్ర భృత్య చక్రవర్తులు భారతదేశ సామ్రా

జ్యాధిపతులై నంతనే భారత దేశము నందంతయు వారు పెద్ద మార్పులు తెచ్చిరి. ఆంధ్రభృత్యులు ప్రధానముగా బౌద్ధులు. మొదటి యాంధ్ర భృత్య చక్రవర్తి సింధుకుఁడను వాఁడు తత్పూర్వ కర్ణవంశపుఁ జివరిరాజైన సుశర్మను మడియించి రాజ్యమునకు వచ్చెను. సింధుకునకు శ్రీముఖుఁడు సిముకుఁ డనిగూడ పేర్లుకలవు. ఈ యాంధ్రభృత్యులు తొలినాఁడాంధ్ర దేశీయులు. వారి రాజ్యమునందు సర్వ దేశరాజులును పూర్వము వారు తొలగింపఁబడి రాజవంశీయులు, రాజబంధువులు రాజులుగాఁ జేయఁబడిరి. వాయవ్య దిశయందున్న యీ చిన్న చిన్న రాజ్యములన్నియు నాంధ్ర భృత్య బంధువులైన క్షత్రియుల వశము నందుండెను. ఈ రీతిగా నాంధ్ర భృత్యులు వాయవ్యదిశయందున్న పురాతన వేదధర్మ భ్రష్టులైన క్షత్రియ కుటుంబములను లేకుండఁ జేసిరి. ఆ రాజులు భ్రష్టులయ్యు వేదధర్మాభి మానులుగా నుండిరి. కొందఱు వేదధర్మము నాచరింపరు. కాని దాని యందధికాభిమానులుగా నుందురు.అట్టివారిని తొలఁగించి యాంధ్ర రాజవంశీయులైన పాలకుల నేర్పఱచుటచే, నాంధ్ర రాజులు బౌద్ధులగుటచే నీ రాజవంశీయులందఱు బౌద్ధమత మనుసరింతురని యాంధ్ర చక్రవర్తులు భావించిరి. ఆ రాజ వంశీయులు రాజవంశ బంధువులు, వారు సామంతులుగానే యుండిరి. సర్వ రాజకార్యముల యందు సామ్రాజ్యాధిపతుల కనుకూలముగానేయుండిరి. కాని మతము, నాచారము, భాష, యీమూఁడింటివద్దకు వచ్చువఱకు వారుస్వతంత్రులై మెలఁగు చుండిరి. వారు పైకి బౌద్ధధర్మావలంబులు లోపల సుక్షత్రి

యులు. పైకి బౌద్ధపిటకముల యొక్క భాషను సమా దరించువారు. లోన సంస్కృతము నభిమానించువారు. వారి సంస్కృతము సంస్కృతముకాదు. అది యాంధ్రభాష ఈ నాల్గు దేశముల రాజుల యీ విరోధముచేత యవనులు తమ సిద్ధాంతములను వ్యాపింపఁజేయుటకుఁగాని వారి యాచా రములను ప్రజలయందుఁ బ్రబలముగా వ్యాప్తి చేయుటకుఁ గాని సమర్థులు కాలేకపోయిరి. వేదధర్మము పోయి బౌద్ధ ధర్మము వ్యాపించుటతో యవనులకుఁ దృప్తికలిగెను. బౌద్ధ మత సిద్ధాంతములన్నియు వారి కనుకూలముగా నున్నట్లుం డెను. దేవుఁడు లేఁడు. వర్ణవ్యవస్థలేదు. ఒక కుల మింకొక కులముకంటె గొప్పయన్న మాట లేదు. అందఱును మోక్షార్హులే. స్వర్గమన్నదిలేదు. యజ్ఞాదులు చేసినఁగాని స్వర్గము లభింపదన్న సిద్ధాంతములేదు. దయ, జాలి, యహింస, యీమూఁటికి ప్రాధాన్యము. నిజమైన బౌద్ధులెదిరించరు. వారిని హింసించుచున్నను 'బుద్ధం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి' యందురు, హింసపొందుచుందురు, మంచిమాటలు చెప్పుచుందురు. వారి ప్రవర్తన యవనులకు మిక్కిలి యను కూలముగా నుండెను. ఆభారతదేశ వాయవ్య దిశయందు యవనులుకూడ బౌద్ధులవేషములువేసి వారిపనులు వారు చేసికొనుచు యథేచ్ఛముగా నుందురు. వీనిలో నభిసార దేశము పేరు తొలుత నాభీరదేశము. అభీరశబ్దమునకు గొల్ల వాఁడని యర్థము. వారు ప్రధానముగాఁ బశువులకాపరులు. పశువుల కాపరులు మేదకులై, నిరాయుధులై యుందురు.

కాని యీ యాభీరదేశవాసులు మహావీరులు, నెత్తురు త్రావుదురు. వారు తమ ప్రాణములు పోయినను తమ మతమును పరిత్యజింపరు. వారికి శ్రీకృష్ణుఁడు దేవుఁడు. ఆభీరమును వశముచేసికొనుట యవనులకుఁగాని బౌద్ధులకుఁగాని సాధ్యముకాలేదు. బౌద్ధసన్న్యాసులు పోయి వారికి బౌద్ధమతము బోధించినపుడు వారు వేయిప్రశ్నలు వేయుదురు. ఈబౌద్ధమతము పరమార్థము సన్న్యాసము. చాతుర్వర్ణ్యములోఁగూడ సన్న్యాసము కలదు. ఆసన్న్యాసము పరిపక్వహృదయులైన వారికే. ఈసన్న్యాస మందఱకును. అందఱును సన్న్యాసులైనచో సృష్టిసాగుటయెట్లు? సర్వజగత్తును నేఁడు సన్న్యాసులైనచో నందఱు సన్న్యాసులును మరణించిన మఱునాఁడు సృష్టిలేదు. కాదు. అందఱును సన్న్యాసులు కానక్కఱలేదు. బుద్ధునియందు విశ్వాసము కలిగియుండవలయుననఁగా బౌద్ధసన్న్యాసులు కానివారి జీవనవ్యవస్థ యెట్టిది? రాజు రాజ్యము చేయును. సేనాపతి యుద్ధములు చేయును. కాపుపొలము దున్నును. గొల్లవాఁడు పశువులను కాచును. వీరందఱు కులములుగా నుండనక్కఱలేదని మీవాదనయా? కులములు కాకుండ నారిగించెడిదేమి? ఎప్పటికైనను సంఘవ్యవస్థ యున్నది యనిర్ణీతముగా ననిశ్చితముగా లేకుండ సువ్యవస్థితముగా నుండుటయే మంచిది. బౌద్ధ మతావలంబి రాజైనచో యుద్ధమెందుకు చేయవలయును? ఎట్లుచేయును? వాఁడు సేనాపతియైనచో శత్రువుల నెట్లుచంపును? అహింసా సిద్ధాంతముతో నీవు శత్రువుల సాధింతువేని సేనలెందుకు, కత్తులెందుకు, కటారు లెందుకు? అందఱును గావి

గుడ్డలు కట్టుకొని తిరుగుదురు. పొలము దున్నెడివాఁడు లేఁడు. తిండిలేదు. ఈ రీతిగా వాదింతురు. పండితులైన బౌద్ధ సన్న్యాసులు వారందఱు మూర్ఖులని చెప్పి వెడలిపోదురు. ఆభీరులు వీరులగుటచేత నురగదేశవాసులు వారి ననుసరింతురు. దాని చేత నెల్లప్పుడును నురగదేశము వేదధర్మమున కనుకూలముగా నుండెడిది. ఉరగదేశ సేనలో సగానికి సగ మాభీరసైన్యము. ఇట్లుండఁగా యవన బౌద్ధులకు నీనాల్గు దేశములు కొఱకరాని కొయ్యలై వారిని కృత్రిమోపాయములచేత సాధించుచుండిరి. నాఁటి యురగ దేశపురాజు సౌమ్యుఁడన్న పేరు గల వాఁడు. అతనికిఁ గలుగక కలుగక కుమారుఁడొకఁడు కలిగెను. వాని కైదవయేట బ్రహ్మాండమైన జ్వరము వచ్చి కాళ్ళు పడిపోయెను. మాట నంగి యయ్యెను. ఎంతటి వైద్యులు నేమియుఁ జేయలేకపోయిరి. బౌద్ధ భిక్షులు చాల మంది వచ్చి తీర్థ జలమిచ్చిరి. తపస్సులు చేసిరి. వాని కాళ్ళు కొంచెము వచ్చినట్లు కనిపించినను మాట నంగి నంగి గానే యుండెను. యవనులలోఁ జాలమంది సాధువులు కలరు. వారు పేరునకు యవనులు కాని యొకవిధమైన శూద్ర సన్న్యాసము వంటి నివలంబింతురు. వారు మహా మంత్ర వేత్తలు. గొప్ప తాంత్రికులు. ఈ విద్య ఉత్తర జ్యోతిషమున నధికముగా నున్నవి. వారిలో నొక యోగి కలఁడు. అతనిని కటకట యోగి యందురు. అతఁడు మూఁడువేల యేండ్లనుండి జీవించుచుండెననియు నతని మహిమ లనంతము లనియు నతనికిఁ దెలియని విద్య లేదనియుఁ జెప్పుదురు. యుద్ధ విద్యలయందుఁ గూడ నతఁ డారితేరిన వాఁడట!

అతఁడు ధనుర్విద్యాపారంగతుఁడు. ఖడ్గవిద్యానిష్ణాతుఁడు. ప్రళయములైన కొండనాగులు గండశిలలు మీఁద దొరలి పోవుచుండఁగా నతఁడు సుఖముగా ప్రవాహములో నడచి పోవునని వదంతి. అనేకములైన భూత ప్రేత పిశాచములు వానికి వశములై యుండును. ఈ కటకట యోగి యొక గుహలో నివసించుచుండును. అతఁడు నిత్య యౌవనుఁడు. ఎప్పుడును పాతికయేండ్ల యువకునివలెఁ గనిపించును. అతని జటాభారము పెద్దది. గడ్డములు మీసము లుండవు. వానికి క్షౌరము చేయించికొన్న జాడలేదు. నిత్యమందహాస వదనారవిందుఁడు. ఉరగపతియైన సౌమ్య భూపాలునకుఁ బలుమంది వాని కొడుకునకు మాటలు రావలయునన్నచో కటకట యోగికిఁ దప్ప పెరలకు సాధ్యము కాదని చెప్పఁ జొచ్చిరి. ఆ కటకట యోగి శుద్ధయవన భావసంపన్నుఁడు. వాని సిద్ధాంతము విచిత్రమైనది. మానవుఁడు చనిపోనక్కఱలేదు. మృత్యువు లేదు. వ్యాధి లేదు. పరలోకములు లేవు. మోక్షము లేదు. యోగమున్నది. యోగశక్తులు కలవు. యోగశక్తులు సహజముగా నందఱకు నుండును. వానిని పండింపించుకొనలేనివాఁడు మృతిపొందును, వ్యాధిపీడితుఁడగును. మానవునకు సహజముగానున్న యోగశక్తిని గ్రహించి యభ్యాసముచేసి సిద్ధిని పొందలేనివారు మరణింతురు. మరణమనునది వేఱే లేదు. యోగశక్తి శరీరమునుండి వెడలిపోవుటయే మరణము. వ్యాధికూడ నిట్టిదే! అతని సిద్ధాంతములిట్టివి. అతనికి గొప్ప శక్తులుకలవు. సౌమ్యధరాపతి పలుమందిచేత బోధింపఁబడి కటకట యోగిని తన రాజగృహమునకుఁ దీసికొనిరమ్మని

వారితోఁ జెప్పెను. కటకట యోగిరాఁడు. అతనివద్దకే నీవు పోవలయును, ఉత్తర జ్యోతిషమునకు నురగరాజ్యమునకు మిక్కిలి దవ్వు. ఇట్టిస్థితిలో యవననాయకులు పదిమంది కటకట యోగివద్దకుపోయి యభ్యర్థించిరి. సౌమ్యుఁడు వైదిక ధర్మావలంబి. కటకటయోగి వలన నీయుపకారము సౌమ్యునకు జరిగినచో నతఁడు యవన మతాభిమాని యగును. సింహపుర కటక దేశాధీశులు నిత్యము వాని ననుసరింతురు. ఆభీరదేశములోని పెక్కురు సైన్యములోఁ జేరిగాని తదితర నాగరకవృత్తు లవలంబించిగాని యురగదేశముమీఁద నాధారపడియుందురు. సౌమ్యుఁడు మారినచో నీ నాల్గు దేశముల బ్రదథిమయుఁ దగ్గును. యవన సేనలకు యవన ధర్మమునకు నీనాల్గు దేశములు నసివారు బయ లగును. కటకట యోగిని బ్రార్థించిరి. అతఁడు గుహ కదలఁడు కాని కదల్చిరి. ఉరగదేశమునకుఁ దెచ్చిరి. యోగి కుఱ్ఱవానిని జూచెను. అతఁడొక ప్రతిజ్ఞ చేసెను. 'వేదధర్మము నిశ్శక్తికము; యవన ధర్మము సశక్తికము'నని విశ్వసింపక పోయినచోఁ దనయోగశక్తి పనిచేయదనెను. రాజు కుమారునియందలివ్యామోహము చేత నిట్లనెను. 'ఇతనియందు వేదధర్మము పనిచేయలేదు. ఆయుర్వేదము పనిచేయలేదు, బహు వనమూలికలు నిష్క్రియము లయ్యెను. యువరాజునకుఁ గాళ్ళువచ్చినచో మాటలు వచ్చినచో నది మీశక్తియేకదా! మీరితని నిరామయుని జేసినచో నాకా విశ్వాసము దానియంతట నదియే కలుగును. కటకట యోగి చికిత్స బ్రారంభించెను. కొన్ని తంతులు జరిపెను. కొంత మంత్రపురశ్చరణ చేసెను. ఒక మంత్రము

తలిదండ్రులుకూడ జపించవలయుననియెను. ఆమంత్రము సంస్కృతభాషకాదు. ఏభాషయుఁగాదు. దినదినము పిల్లవాని యారోగ్యము వృద్ధియగుచుండెను. రోజునకొక క్రొత్తమాట వాఁడనుచుండెను. ప్రతిదిన నూత్న శబ్దోచ్చారణమువలన రాజునకుఁ బ్రతిదినోత్సాహముగా నుండెను. ఆకటకట మోఁగి రాజగృహమునంతయు నాఱునెలలో యవనాచారయవన ధర్మయవనమంత్రవిశ్వాసిగా మార్చివేసెను. రాజీవైపునఁ దన వేదాచారములను నడపును. వేద ధర్మానుసరణము చేయును. ఆవైపునఁ గుమారునికొఱకు యవన మంత్ర ములు పఠించును. యవన తంత్రములు నెఱపును. ఒక యేడాదిలో సౌమ్యుఁడు యవనుఁడో భారతీయుఁడో తెలియలేదు. యువరాజు నిరోగియయ్యెను. అతఁడు గాఢ యవన భావనాశీలియయ్యెను.

ఇట్లు తొలినాఁడు వేదధర్మమునకుఁ బెట్టనికోటగా నుండిన యురగదేశము నేఁడు యవనధర్మమున కంతరాస్థాన భూమియయ్యెను. ఉరగదేశమిట్లగుట యాభీరుల కిష్టములేదు. కాని వారి ప్రజలలోఁ బెక్కుమందికి జీవనోపాధి యురగ దేశమున నున్నది. వారంగీకరింతురు. అంగీకరింపరు.

రెండవది దరదదేశము. దరదదేశము వేఱు, నురగదేశము వేఱు: ప్రజలు దానినే యిదియనుకొందురు. దీనినే యదియను కొందురు. దరదదేశ మురగదేశమునకుఁ బైన నుత్తర బాహ్లీకముల నంటియున్నది. దరదదేశమునకు రాజులేఁడు. ఉరగదేశపురాజే దరదదేశపురాజు. దారదులు మోటువారు,

పార్వతేయులు. కొండలలో నివసింతురు. ఏకొండప్రక్కనో పదిగుడిసెలుండును పేరునకవి వారియిండ్లు. వారెప్పుడు గుఱ్ఱములమీఁదనే నివసింతురు. భోజనము గుఱ్ఱములమీఁద, నిద్ర గుఱ్ఱములమీఁద భార్యాభర్తలు కలిసికొనుట కాగుడిసె లుపయోగించును. వారిస్త్రీలుకూడ నిత్యాటనశీలలు. కాని వారిదేశములో స్త్రీలయందు పాతివ్రత్యము పరమావధి నంటి యుండును. వా రేకపురుషలగ్నచిత్తలు. వారి వేదధర్మాభిమానమంతయు నావిషయమున నుత్తాలమైయుండెను. ఇతర దేశములవారికి దరదదేశ పురుషులన్న నెంత భయమో దరదదేశస్త్రీలన్న నంతభయము. వారందఱు కటారికత్తియలు. వారి మతముయొక్క పరమార్థము రామాయణ భారతముల లోని కొందఱు వీరులు. ఆంజనేయుఁడు, భీముఁడు వారి దేవతలు. సృష్టిచేసినది వారే. ప్రపంచము వారివలననే నడచుచున్నది. సృష్టియంతము నెపుడైన నాశనమైనచో వారికిఁ గోపమువచ్చినచో నాశనమగును. ఇది వారి వేదమత సారము. సౌమ్యుఁడు వారినిఁ గాదనలేఁడు. సౌమ్యుఁడు బహిరంగముగాఁ దాను యవన మతమును స్వీకరించినచో మఱు నిముసమున నతఁడు దరదదేశాధిపత్యమునకు నీళ్లువదలుకొనవలయును. ఉరగదేశములో సగముసేన యాభీరదేశపు జనులు. సగముమంది యురగదేశ ప్రజలు. ఉరగదేశసైన్యముయొక్క బలము వారి గుఱ్ఱపు దళములందున్నది. ఆ గుఱ్ఱపు దళము లన్నియు దరదదేశీయులు. అశ్వదళాధిపతి దరదదేశీయుఁడు. మహాసేనాధిపతి దరద దేశీయుఁడు. ఈ దరదదేశీయుల వేద ధర్మభావనకు మహాభారతముననున్న వేదధర్మభావమునకు

నెక్కువ సంబంధములేదు. కాని వారికి వేదవేదాంగము లన్నచో శాస్త్ర పురాణేతిహాసము లన్నచో నవియన్నియుఁ దమ విద్యలనియు, వాని సారమంతయుఁ భావమానులనియు నొక పరమ విశ్వాసమై వారు భారతదేశమునందిలి వేద ధర్మానుకూలురైన సామ్రాజ్యాధిపతులకు ననుకూలమైన మనఃప్రవృత్తికలవారుగా నుందురు. వారు రాజభక్తిపరాయణులు. సౌమ్యుఁడు గీచినది వారికి గీత. కాని సౌమ్యుఁడు వేదమతబాహిరుఁడని తెలిసినచో నతనిని జంపరు. అతని యాజ్ఞలు పాలింతురు. యవనాదుల కనుకూలములైన యాజ్ఞలు రాజు చెప్పినను జేయరు. ఈ రీతిగా దరదాభీరోరగ దేశములు మూఁడును ముడివడియున్నవి. అచట సౌమ్యుఁడు విక్రమాంక చక్రవర్తికి వ్యతిరేకి. ఆ దేశములందు యవను లేమియుఁ జేయలేరు. కాని యేమిచేయుటకును సామ్రాజ్యాధిపతికిని శక్తి లేదు.

ఇచట నురగదేశమున ననఁగా దరదాభీరోరగదేశములయందు రాజెట్టివాఁడో ప్రధానమంత్రి యట్టివాఁడు. రాజు తన కొడుకునకు సుస్థితి లభించు హేతువున యవనాభిమానియైనాఁడు. ప్రధాని పేరు వీరదత్తుఁడు. అతఁడును యవనాభిమానియే. అతని యవనాభిమానమునకుఁ గారణము వేఱు. వాని శరీరమునందే యవన రక్తమున్నది. రెండు తరముల క్రింద వారు సుబ్రాహ్మణులు. అతని తాత యొక యవనస్త్రీని పెండ్లియాడెను. అతని తండ్రి తీవ్రమైన బ్రాహ్మణ మతాభిమాని. అతని తాత రామశర్మ అతఁడు

కూడ నురగ దేశపు మంత్రియే. ఒకనాఁడొక యవన వినోద కారి సమాజము కోటలో వినోద ప్రదర్శనము చేసెను. రామ శర్మ యప్పటికి నవివాహితుఁడు. పాతిక యేండ్లవాఁడు. ఏడాది క్రితము తండ్రి చనిపోవుటచేతఁ గ్రొత్తగా మంత్రి యైనవాఁడు. ఆ సమాజములో నొక స్త్రీయున్నది. ఆమె యువతి, పరమ సౌందర్యవతి. ఆమె గాంధార దేశమునందలి యొక బ్రాహ్మణుని కుమార్తె. యవనుల గుంపు వారి పల్లె మీఁద దాడిజరిపి పదియేండ్ల యీ బాలిక నెత్తుకొనివచ్చిరి. ఆమెను వినోదహేతువులైన పలు విద్యలు ప్రకటించు నీ గుంపున కమ్మిరి. ఆమె యీ విద్యల నభ్యసించెను. ఆమె పామువలెఁ బ్రాకును, గరుడ పక్షివలె నెగురును, కొండ సెలయేఱు జలజల దూకినట్లు దూకును. అన్ని మృగముల కూఁతలను గూయును. ఆమె శరీరము మైనముఉండవలె నగును. ఆమె తండ్రియింట నున్నప్పుడు తండ్రి యామెకుఁ గొన్ని సంస్కృత శ్లోకములు చెప్పెను. ఆమె యా శ్లోకము లను మఱచిపోలేదు. వానిని గొంతెత్తి పాడును. వసంతోదయ వేళా నూత్నారుణ కిసాలయఖాది పికీకంఠమునకు నామె కంఠ స్వర మధ్యాహారము. రామశర్మ యామెనుజూచి మోహిం చెను. ఆమె బ్రాహ్మణుని కూతురు. పది పండ్రెండు సంవ త్సరములు యవనులలో నున్నను నామె కులమెట్లు భంగింపఁ బడెను ? ఆమె శీలము సురక్షితముగా నుండెను. ఆ వినోద కారుల గుంపునకామె జీవనదాత్రి. ఆమె శీలము భంగింపఁ బడినచో నామెయందీ శక్తులు సన్నగిల్లును. వారి సంపాదన తగ్గిపోవును. అది వినోదకారుల గుంపన్న పేరేకాని వారం

దఱు కటారికాండ్రు. అందఱు నాశ్వికులు, యుద్ధనిపుణులు. ఈ పిల్లను దొంగిలించుటకుఁ జాలమంది ప్రయత్నములుచేసిరి. ఈ గుంపు యుద్ధశక్తిముం దాఁగలేక వ్యర్థప్రయత్నులైరి. ఆమె తొలుతటి పేరేదియో తెలియదుగాని యవనులుపెట్టిన పేరు మధుగుంజ. అప్పటి యురగదేశపు రాజు మంత్రి యొక్క వాంఛ చేతమాత్రమేకాక బ్రాహ్మణస్త్రీ రక్షింపఁ బడునన్న యభిమానముచేతఁగూడ నా వివాహము పొసగింపించెను. వారికి వంద గుఱ్ఱములిచ్చి తన దేశమునఁ గొన్ని గ్రామములు వారికిఁ గైవసము చేసెను. ఆ రామశర్మ మనుమఁడే వీరదత్తుఁడు. వీరదత్తుని తండ్రి సాగరదత్తుఁడు. ఆయన తీవ్ర వేదమతాభిమాని. కొడుకైన వీరదత్తుఁడొక యవనస్త్రీని ప్రేమించెను. తండ్రివిఘటన పఱచెను. తరువాత వీరదత్తుఁడు మరల నొక బ్రాహ్మణస్త్రీనే వివాహమాడెను. కాని తొలినాఁటివలపు లోపల మానని పుండువలె మాటి మాటికి సలవేయుచుండును. తాను ప్రేమించిన యవనస్త్రీని మరెవ్వఁడో యవనుఁడు పెండ్లాడెను. ఆ భార్యాభర్తలును వారి సంతానమును వీరదత్తుని యింటికి వచ్చుచుందురు, పోవుచుందురు. చిన్ననాఁడు తాను ప్రేమించిన స్త్రీ యొక్క భర్తకు వీరదత్తునివలన నెన్నో లాభములు జరుగుచుండును. వీరదత్తునియింట బ్రాహ్మణాచారము లేదు. వారును వీరును గలసియేభోజనము చేయుదురు. అతని తొలి వలపుకత్తె యెంతచెప్పిన వీరదత్తుఁ డంత. తరువాత సౌమ్యుఁడు యవనాభిమాని యగుట వీరదత్తున కెంతో

యనుకూలించెను. సౌమ్యుని సురగదేశాధిపతి యనరు. దరదదేశాధిపతి యందురు. వీరదత్తుని సురగదేశపు మంత్రి యందురు. రాజును మంత్రియు సేనాధిపతులకు లొంచ్చు, రాజు కాదనవచ్చును. మంత్రికి శక్తి చాలదు. సేనాధిపతి దరదదేశీయుడు, వాని పేరు కరాళఖడ్గుఁడు. అశ్వదళాధిపతియు దరదదేశీయుఁడే. వాని పేరు నిరాలంబుఁడు. నిజముగా రాజ్యము కరాళఖడ్గ నిరాలంబుల యధీనమున నున్నది. వారు సౌమ్యున కెదురుతిరుగరు. వీరదత్తుని యాజ్ఞను పాటించరు.

ఈస్థితియంతయు మృగేంద్రసింహునకుఁ దెలియుటకు నాల్గునెలలు పట్టెను. నాఁడు తపోమందిరమునకుఁ బోవుచు శ్రీ విక్రమార్క చక్రవర్తి పదిమందినిఁ బిలిపించి వరాహమిహిరుని కథ చెప్పినవానిలో మృగేంద్రసింహుఁ డొకఁడు. మృగేంద్రసింహుని వేషము యవనవేషముకాదు, భారతీయవేషముకాదు. అతఁడు జ్యోతిష్కుఁడు. జ్యోతిషము విచిత్రమైన విద్య. అందఱును దానిని దిరస్కరించెడివారే. కాని తన భవిష్యత్తు తెలిసికొనవలయు ననుకొననివాఁ డొక్కఁడు లేఁడు. జ్యోతిషవిద్యా పరమద్వేషికూడ జ్యోతిషశాస్త్రమును నిందించును. తన భవిష్యత్తు చెప్పించుకొనును. మృగేంద్రసింహుఁడీ సాధనమును జేతఁబూని సగము సంసారి సగముసన్న్యాసిగా విభూతికుంకుమ విభూషిత ఫాలభాగుఁడుగా నడవితీగలతో నిర్మించిన దండకడియము కంకణముగా యవనులవలె నొక యుష్ణీషము, బ్రాహ్మణులవలె దానిపైన చుట్టిన తలగుడ్డయు మాసిన కూర్పాసముతో రెండు తాళ

పత్రగ్రంథములు కక్షభాగమున నిడికొని యీమూఁడు దేశములయందు సంచరించెను. ఎవఁడధికారియో, యెవఁడు ధనవంతుఁడో, యెవఁడు పలుకుబడికలవాఁడో వారివారి నందఱిని తెలిసికొని బలవంతముచేసి జ్యోతిషము చెప్పును. నీకు నీవలువదియవయేట పదివేల దీనారములు వచ్చునని చెప్పును. అవి రావని నీవెంత నిశ్చయించుకొన్నను జీవగతమైనయాశ నిన్నభిముఖుని చేయును. ఒకనికిఁ బురుషసంతానము లేదు. వానికి నాలుగేండ్లలోఁ బురుషసంతానము కలుగునని చెప్పును. వాని కిష్టములేకపోయినను జ్యోతిష్కుని చేతిలో నొక దీనారమునుబెట్టి పంపించును. కొన్నిచోట్ల నతనికి సుస్వాగతము. అచట లోకాభిరామాయణము జరుగును. బహువిషయములు గ్రహించును. ఇట్లు మృగేంద్రసింహుఁడు కొందఱు సేనాపతుల యిండ్లలోఁ గొందఱు రాజవంశీయుల యిండ్లలో జ్యోతిషముచెప్పి జాడలుతీసెను. కావలసిన సర్వవార్తలు గ్రహించెను. కాని యతనికొక్క సందియము విడివడలేదు. సేనలకు రాజునందు భక్తికలదు. సేనాధిపతులకు రాజభక్తి కలదు. వీరదత్తునియందు సేనాపతులకుఁ బ్రత్యయములేదు. ఈ రాజ్యములయందు వీరదత్తుని బలమెట్టిది? అతఁడేల గౌరవింపఁబడుచున్నాఁడు! ఈసంగతి మృగేంద్రసింహునకుఁ దెలియలేదు. ఈరహస్యము తెలిసికొనుటకు వీరదత్తుని యింటికిఁ బోవలయును. తనవంటివారు వీరదత్తుని వీధిగుమ్మమునుండియే మరలింపఁబడుదురని యతఁడు విన్నాఁడు. అచటికిఁబోవుట ఎట్లు? మృగేంద్రసింహునకుఁ బూర్వమొకటి రెండుసార్లు కటకటయోగినిఁబోయి చూడవలయుననిపించెను.

ఇచటి వార్తాసంగ్రహణపు త్రొక్కిడిచేతఁ దాను వెళ్ళుట సాధ్యము కాలేదు. ఇచటి పని ముగించుకొని యుత్తర జ్యోతిషములు పోవలయును. గూఢచారి ప్రధాన నాయకుఁడు తన కీపని నిర్ణయించెను. బర్బరోత్తర జ్యోతిష కటక సింహపురోరగాభి సారత్రిగర్త దేశముల యెల్లలు గాంధారపు టెల్ల నంటుకొని కొన్ని వందల యామడలున్నవి. ఆయా దేశముల యెల్లలయందు రహస్యాయుధ కర్మాగారము లున్నవని రహస్యసైన్యము లున్నవని వానినిఁ దెలిసికొనుటకుఁ దమ నేత యితరులను బంపించెను. తన్నిచ్చటికిఁ బంపించెను. ఉత్తరజ్యోతిషమున మురారిభట్టను నొక గూఢచారిని నియమించెను. ఈ కటకట యోగివార్త మురారిభట్టునుండి తెలిసికొనవలయును. ఈ తొమ్మండుగురు గూఢచారులవార్త లొకరినుండి మరియొకరికిఁ దెలియుటకుఁ బదిమంది వార్తాహరులున్నారు. వారు నెలకు రెండు నెలలకుఁగాని కనిపించరు. వారి కోసము తానొక నియమిత ప్రదేశమునకుఁబోయి యచట పదేనిరువది దినములున్నఁగాని వారిలో నెవఁడో కలియఁడు. అంతవఱ కితర వార్తాగ్రహణము భంగింపఁబడును. వారిలో నెవఁడో యొకఁడు కలిసినఁగాని కటకటయోగి వార్త తెలిసికొని తనకుఁ బంపింపవలయునని మురారిభట్టునకుఁ దెలియఁ జేయుటకు వీలులేదు. వీరదత్తునియింటికిఁ బోవుట యెట్లు? వీరదత్తుని యింటికిఁ బోవుటకు వీలులేదుగాని యతని తొలి వలపుకత్తె యింటికిఁ బోవచ్చును. మృగేంద్రసింహుఁ డురగ దేశపు రాజధానికిఁ బోయెను. రాజధానిలోనికిఁ బోవుట మిక్కిలి కష్టము. పదిమంది యధికారుల పరీక్షలు నెగ్గిపోవల

యును. తాను తొలుత నే గ్రామమును బ్రవేశించినను దదధికారుల పరీక్షకుఁ బరిశీలనకు నాగవలయును. ఈ పరిశీలన మూఁడు రాజ్యముల నడిమిభాగపు ప్రదేశములయందు తక్కువ. మృగేంద్రసింహుఁడు కాశ్మీరదేశము పోయి యచటినుండి దరద దేశములకుఁబోయి యచటినుండి యాభీర దేశమునకుఁబోయి యీవార్తలు సాధించెను. ఆభీరమునుండి యురగదేశమునకుఁ బోవుటయు గష్టమే. దరద దేశమునుండి సులభము. కాని రాజధాని యురగ దేశముయొక్కయు గాంధార దేశముయొక్కయు నెల్లలు కలిసినచోట నున్నది. ఉరగదేశ గ్రామములు ప్రవేశించుట సులభమైనను రాజ ధానిలోఁ బ్రవేశించుట క్లిష్టము. తా నచ్చటివారి కెవ్వరికో సమీప బంధువగుటయో రాజాజ్ఞయుండుటయో, యొక మహాధికారి యనుమతి యుండుటయో మిక్కిలి యవసరము. మూఁడు నెలలక్రింద మృగేందసింహుఁడు దరదదేశోత్తరదిశా గ్రామములందు సంచరించుచున్నపు డొక వార్త వినెను. ఆ వార్త యిపుడతని స్మృతి పథమున దగిలినది. అయ్యో! తా నెంత యవివేకి ననుకొనెను. ఆవార్త యేమనఁగా నొక నాడతఁడొక పర్వతదరీప్రాంతములనుండి తన గుఱ్ఱముమీఁద తానుపోవుచుండఁగా కొండమలగినచోట మరియొక యాశ్వికుఁ డెదురువచ్చెను. మలుపులో గుఱ్ఱములు తప్పించుకొని పోవ టకు వీలులేదు. మలుపు వచ్చుచుండఁగా నాశ్వికుఁడు తనవద్ద నున్న కొమ్మూఁదవలయును ఇతనికి కొమ్ములేదు. ఊదలేదు. ఇతఁడుపోవు పర్వతముల సందిగుకు. ఎదుటివాఁడు వచ్చుసందు వెడల్పు. ఈ కొమ్ముధ్వని విని వాఁడాగును. ఇద్దఱును మలు

పులో కలిసికొనిరి. ఇరువురి యశ్వప్రోథములు కలిసికొనెను. వానికిఁ గోపమువచ్చెను. కత్తిదూసి వీనిమీఁద విసరెను. ఇతఁడు తప్పించుకొనెను. తన కొమ్ముపోయినదని యబద్ధ మాడెను. అతఁడు కటువుమాట లాడెను. ఆ దేశపు రాతులతో నెవఁడు సాత్త్వికపుమాట లాడునో వాఁడు నెగ్గలేఁడు. మృగేంద్రున కిది తెలియును. వానికంటె నెక్కువ దురుసుగా మాటాడెను. ఇద్దరు నొకరినొకరు వధించుటకు సిద్ధపడుచుండఁగా మృగేంద్రసింహుఁడు "భీముఁడు బకాసురుని సంహరించినట్లు నిన్ను సంహరింతు"ననెను. వాఁడు వెనుకకు తగ్గి "నీవు దారదుడవు. మా దేశమున రెండు మతముల వారున్నారు. ఒక రాంజనేయ భక్తులు. రెండవవారు భీమ భక్తులు. నేను భీమభక్తుఁడను. నేను భీమ భక్తులతో యుద్ధము చేయను" అనెను. ఇద్దఱు చెలిమికాండ్రైరి. అతఁడు మృగేంద్రసింహుని తన యింటికిఁ దీసికొని పోయెను. వారి యింట నితఁడు రెండు దినము లుండెను. ఇద్దఱును కలిసి రెన్నాళ్ళు కొండలయందుఁదిరిగిరి. ఆ మిత్రునియింట వాని మేనమామ కూతురు కలదు. ఆపిల్ల మృగేంద్రసింహునితోఁ జనవుగా మాటాడఁజొచ్చెను. ఆమె ప్రాస్తావికముగాఁ దనది యచటికి నాలుగు యోజనముల మేరనున్న గ్రామమనియు తన తల్లిదండ్రులచట నుండిరనియు తన మేనత్త యొకామె చిన్నపుడొకనిని ప్రేమించి తర్వాత నెవనినో పెండ్లిచేసికొనెననియు, తొలుత నామె ప్రేమించినవాఁ డామెతో మిక్కిలి స్నేహముగా నుండుననియువారు రాజధానిలో నుందురనియుఁ జెప్పెను. అపుడు మృగేంద్రసింహుఁడు వారి వైసము కను

గొనలేదు. ఆ కథయే యీ కథయేమో! ఇది స్ఫురించుట యాలస్యముగ నతఁడు మరల దరద దేశమునకుఁబోయెను. ఆమె జన్మగ్రామమునకుఁ బోయెను. ఆ పిల్ల యచటనే యుం డెను. ఇతఁడచ్చటికి చేరిన మూఁడు దినముల క్రిందటనే ఆ పిల్ల తండ్రి చనిపోయెను. ఈ వార్త రాజధానిలోని యతని మేనత్తకు నెవరిచేత పంపింపవలయు నాయని వారనుకొను చుండిరి. ఇతఁడు కనుగొనెను. వీరదత్తుని తొలివలపుకత్తెయే యీ మేనత్త. ఇతఁడు తాను రాజధానికి పోవలసియుండె ననియు, వార్తతీసికొనిపోవుటకు తన కభ్యంతరము లేదనియు చెప్పెను. అచటి వార్తాహరులు కొన్ని చిహ్నములను తీసి కొనిపోవలయును. ఆ దేశము నందే తెగవారే దైవము నారాధింతురో ఆ దైవముయొక్క చిన్ని శిలాప్రతిమ యొక దానితో కలిపి యొక చిన్న కత్తియు వానికి చుట్టిన దారముతో వెడలవలయును. వివాహవార్తయైనచో పచ్చని దారములు చుట్టుదురు. దుఃఖవార్తయైనచో నల్లని దార ములు చుట్టురు. పురుషుఁడు వీరోచితముగా మరణించినచో ఎఱ్ఱని దారమును చుట్టుదురు. మువ్వన్నియల దారము లచట నుండఁగా నా స్త్రీ యెఱ్ఱదారముతో దానిని చుట్టనారంభిం చెను. ఇతఁడూరకయే నల్లదారము చుట్టరాదాయనెను. ఆమె యిట్లనెను "కాదు, నా భర్త వీరోచిత మరణము నొందెను. ఒక భల్లుకి యొకచోట నొక పిల్లను పెట్టెను. ఆచోటాయనకు తెలియకయచ్చటికి పోయెను. ఆ భల్లుకి యితనిమీాద పడెను. దానితో జాముసేపు పెనఁగెను. చివరికి దానిని వధించెను. అచటఁ బడిపోయెను. మేము వెదకి తీసికొనివచ్చితిమి. మే

మతనిని వెదకుటకే నాల్గు దినములు పట్టెను. కొనయూపి రితో నున్న వానిని తెచ్చితిమి. మందులు మాకులు పని చేయలేదు. ఇంటికి తెచ్చిన తర్వాత రెండు దినములలో చనిపోయెను. వీరమరణము పొందినచో నెఱ్ఱదారము కట్టి మరణమైనచో నల్లదారము శుభకార్యమైనచో పసుపుపచ్చ దారము వాడుదుమని నీకు తెలియునుగదా" యనెను. అతడు తనకు తెలిసినట్లు తల యూపెను. ఆమె పేరు, ఆమెను పెండ్లియాడిన వాని పేరు, రాజధానిలో వారి యిల్లు స్థలము వారి యితర పరిస్థితులు, యిచటి వారి బంధుత్వము, వీరి నామ ధేయములు సర్వమును హృద్గతములుచేసికొని యితఁడు రాజధానికి బయలుదేరెను. దుర్గము చుట్టును అగడిత కలదు. అయ్యగడిత సింధునది నుండి త్రవ్విన పెద్ద కాల్వ నుండి ప్రవహించు జలముచేత నిత్య పరిపూరితమై యుండును. పవళ్ళు ఉదయమున జాము, సాయంకాలమున జాము జనుల ప్రవేశ నిష్క్రమణముల కనుకూలముగా నొక కొయ్య వంతెన వ్రాల్తురు. తక్కిన యపుడు ప్రవేశములేదు. నిష్క్రమణనులేదు. ఇతఁడు తటివేచి గుర్తు చూపించెను. అది వీర దత్తునకు సాన్నిహిత్యముకల కుటుంబము. జాగులేకుండఁగనే ప్రవేశము కల్గెను. ఆవీరదత్తుని తొలివలపు కత్తెపేరు కలాపిని. ఆమె భర్తపేరు ప్రస్తరఖని. మృగేంద్రసింహుఁడు వారి యింటి చుట్టమయ్యెను. గుర్తుపట్టుటకు వీలులేని ఏదో చుట్ట రికమును చెప్పెను. వారి యింటనే భోజనము. ఇతఁడు క్షత్రి యుఁడు. వారు యవనులువారిభోజనమితఁడుచేయుఁడు. చేయక తప్పదు. మొదట మోమోటపడి యెంతకాదన్నను వారి

యొత్తిడి యెంతయెక్కువైనదనఁగా ఇతఁడు భోజనము చేయనిచో ఇతఁడొక గూఢచారియని వారనుకొందురన్న సందియమితనికి కల్గునంతవరకు వచ్చినది. ఇతఁడు వారియింటనే నిలిచిపోయెను. ఆహా ! రాజసేవ నీయాచారములను నిన్ను చేయనీయదు. నీకిష్టము లేకపోయినను దురాచారములు నీచేత చేయించును.

కలాపిని తన యన్నగారిని జూచివత్తుననెను. ప్రస్తరఖుఁడు వీరదత్తునితో చెప్పిపోవలయుఁగదా యనెను. వీరదత్తునిభార్య యెన్నిమిదేండ్లయిన తర్వాత మరల గర్భవతి. ఇదివరకామెకు మువ్వురు సంతానము. వారికి పండ్రెండేండ్ల కూతురున్నది. ఆమెపేరు మధుగుంజ. పితామహిపేరు పెట్టుకొన్నారు. వీరదత్తునిభార్యను పురుటికి పుట్టింటివారు తీసికొనిపోయినారు. మధుగుంజ యిచటలేదు. సాయంకాలముల యందు కలాపినీప్రస్తరఖులైన కన్పించనిచో వీరదత్తుఁడేకాకిగా నుండవలసి వచ్చును. కలాపిని ప్రయాణము ప్రస్తుతములేదు.

## అయిదవ యధ్యాయము

ఉత్తర జ్యోతిషము, కటకదేశము రెండును గొంత మేర కలసి యుండును. కటకదేశపు దక్షిణపు టెల్లలో సగముత్తర జ్యోతిషపు టుత్తరపుటెల్ల. ఆ రెండును గలసిన చోట నొక పల్లె. ఆ పల్లెలోఁ జివరిభాగమున నొక విశాలమైన స్థలములో నొక చిన్న యిల్లున్నది. ఆ స్థల మెవరిదో

తెలియదు. ఆ యిల్లెవరిదో తెలియదు. పాడుపడి యున్నట్లు కనిపించును. నూటికి కోటికెవఁడో యొక బైరాగి దాని యందుఁ గనిపించును. రెండుమూఁడు నాళ్ళుండును. అతఁ డెవఁడో మహామహిమ కలవాఁడని జనులుపోయి వాని చేత సాముద్రికము చూపించి కొందురు. రక్షరేకులు కట్టించి కొందురు. అతఁడు వెళ్ళిపోయిన తరువాత మఱల నాయింటికిఁ బోయెడి వారుండరు. ఒకనాఁడొక సన్న్యాసి వచ్చెను. అతని వద్దకును జనులు పోనారంభించిరి. ఆయిల్లు రెండు సావడులు. ఈసన్న్యాసి తన్ను దర్శించుటకు వచ్చిన కొందఱి చేత వెనుకటి సావడి యంతయు పెద్దగోయిగా త్రవ్వించెను. అది మానిసి లోతు గోయి. అతఁ డందులోఁ గూర్చుండి తపస్సుచేయ నారంభించెను. జనుల కట్లనిపించెను. ఏసన్న్యాసి వచ్చినను రెండు మూఁడు నాళ్ళుండిపోవును. ఈ సన్న్యాసి వచ్చి రెండు నెలలైనది. పోలేదు. పోలేదు సరికదా యా గోతిలో నగ్ని కుండములు త్రవ్వెను. హోమములు చేయు చుండెను. ఏవో యేవో పదార్థములు కొని తెచ్చెను. ఆ చావడిలో సగము మేర పరులు రాకుండ నడ్డుకట్టెను. ఆ లోపల నే పదార్థములున్నవో తెలియదు. అతఁడు గంధకము సురేకారము మొదలైన యగ్ని దీపక ద్రవ్యములు కొని తెచ్చు చుండెనని యొక వదంతి బయలుదేరెను. అతనికి నలువురు శిష్యులు బయలుదేరిరి. వారును బైరాగులే ఈ వార్త క్రమక్రమముగా కటక దేశపు రాజునకుఁ దెలిసెను. ఆయన సేనాపతినిఁ బిలిచి దానిని కనుగొమ్మనెను. సేనాపతి యా ప్రాంతము లందలి రక్షకభట నిర్వాహకునకు వార్త

పెట్టెను. అతఁడు పోయి యీ బైరాగిని కలిసికొని ప్రశ్నించి గోయి యంతయుఁ బరిశీలించెను. అచట పటాసు, గంధకము, సురేకారము మొదలైన వస్తువులతో సిద్ధముచేసిన గుండ్లు కలవు. ఇవి యేమని యడిగెను. ఆ బైరాగి చెప్పెను. "ఇవి శత్రువిధ్వంసక మారణ సాధనములు. నాకీ విద్య చాల తెలియును. నా కొక విరోధి యున్నాఁడు. అతఁడొక దేశపు రాజు. మీదేశపురాజు నాకు సాహాయ్యపడినచో నే నిట్టి సాధనములు వేనకు వేలు సిద్ధము చేయఁగలను. శత్రుసైన్య ములో వీనిని విసరినచో గుండు యొక్క ప్రమాణము కొలఁది సైన్యము ధ్వంసమగును. తక్కిన నా చరిత్ర మీరాజులతోఁ గాని సేనాపతితోఁ గాని చెప్పఁగలను. నీ కిష్టమున్నచో నన్ను మీ రాజు వద్దకు తీసికొని పొమ్ము. ఆయనకు సర్వము యథాతథముగ నివేదింతును. లేనిచో నాయీ కొద్ది సాధన ములు నీవు వశపఱచుకొనుము. నన్ను బంధింపుము. లేదా సంహరింపుము' ఆ రాజభట నిర్వాహకుఁడు వానిని వాని శిష్యులను బందీలు చేసి సేనాపతి వద్దకుఁ బంపించెను. సేనా పతి పేరు నీలాంజనుఁడు. అతఁడీ బైరాగిని చూచి, యితని మాటలను విని, యితని సాధనములనుఁ బరిశీలించి, వానిని పేల్పించి వాని పటుత్వమరసి నిన్ను సంహరింతు" ననెను. ఇతఁడంగీకరించెను. "ఇట్టివి మాకు చేసి పెట్టెదవా?" అనెను. బైరాగి "నన్ను సంహరించినచో నే నెట్లు చేసిపెట్టఁగల" ననెను. నీలాంజనుఁడు "మాకీ విద్య నేర్పిన తరువాత నిన్ను సంహరింతు" ననెను. బైరాగి యిట్లనెను. "నేను మీకు నేర్పను. నన్ను సంహరించినను సరే. నాకొక వాగ్దా

నము చేసినచో నేర్పెదను! ఆ వాగ్దానమేమనఁగా నీయా యుధములు విక్రమార్క చక్రవర్తి సైన్యములమీఁద నుప యోగింపవలయును. వాని సైన్యములను ధ్వంసముచేయ వలయును. మీరు విక్రమార్క చక్రవర్తికి సామంతులు మీ రట్లుచేయరు. అందుచేత మీరునన్ను సంహరింపవచ్చును.

నీలాం:- నీవు సిద్ధముచేసిన యీచిన్ని యగ్నిగోళ ముల నేమిచేసెదవు? మా రాజ్యపు పొలిమేరలో నెందుకు చేసితివి!

బైరాగి:- అది మూఁడు రాజ్యముల పొలిమేర. అచట మూఁడు రాజ్యములు కలియుచున్నవి. ఉత్తర జ్యోతి షము, మీకటకము, గాంధారదేశము. అది మూఁడు రాజ్యముల కూడలి. నిజాని కాస్థలమెవ్వరిదియు కాదు. అచ్చట జరిగినది యేరాజ్యమువారునుఁ బట్టించుకొనరు. నాసేత భద్రముగా నుండునని యచట చేసితిని. మీ రెందుకు పట్టుకొంటిరో యుత్తర జ్యోతిష గాంధార దేశాధికారు లెందుకు పట్టుకొనలేదో నాకుఁ దెలియదు. నన్నెవ్వరును పట్టుకొనరని నేనూహించితిని.

నీలాం:- వీనికెట్లుపయోగింపవలయునని నీవెంచితివి?

బైరాగి:- దానికి చాల పథకమున్నది. ఈ యాయు ధముల కేమాత్రపు టొత్తిడి కలిగినను నవి ప్రేలును. ఇవి ప్రేలకుండ నుండుటకు దూదిబస్తాలలో నుంచవలయును. కురుక్షేత్రమునుండి యుజ్జయినికి ప్రత్తియెగుమతి యగును.

అచటిప్రత్తి యేక బడి పరుపులకొఱ కుజ్జయిని కెగుమతిచేయఁ బడును. విక్రమార్కుని యంతఃపురమున మాసమునకు రెండు వందల బారువుల ప్రత్తిని కొనుచుందురు. పరుపులు కుట్టెడి వారు నాకు స్నేహితులు. ఆప్రత్తి నింపఁబడిన పెద్ద గోనెలలో వీనినిపెట్టి నేను వారితోఁ బోఁదలచితిని. రాజు పండుకొని నిద్రపోవు పరుపులలో వీనినిపెట్టి కుట్టనెంచితిని. అతఁడు నిదురపోవుచుండఁగా నెప్పుడో యేయొత్తిడికో యివిప్రేలును. రాజు మరణించును. నాపగ యట్లు తీర్చికొనవలయునని నేను సంకల్పించితిని. భగవంతుఁడు నాకనుకూలుఁడుకాఁడు. నేను మీకు పట్టువడితిని.

నీలాం :- నిన్ను వదలిపెట్టెదము. నీవుపోయి నీపగను సాధించుకొనుము.

బైరాగి ;- మీరు విక్రమార్కుని సామంతులుకదా! నన్ను చంపకుండ వదలిపెట్టెదరా!

నీలాం :- నీయీ కార్యము ఫలవంతమగునని నమ్మకమేమి? నీవొక మూఢుఁడవు. రాజుయొక్క పరుపులు కుట్టునపుడు రాజభటులు వేయికనులతోఁ జూచుచుందురు.

బైరాగి :- అట్లనా? పదివేల కన్నులున్నప్పటికిఁ బ్రతివానికి నొక గ్రుడ్డికన్ను గూడనుండును.

నీలాం :- ఇంతకు నీకు చక్రవర్తిమీఁద కోపమునకు హేతువేమి?

బైరాగి : నేను నిజముగా బైరాగినికాను, సంసారినే. మాది మరుదేశము. చక్రవర్తి సైన్యములు సౌవీరసింధు దేశములను జయించి యచటినుండి రోహితదేశమునకుఁ బ్రయాణముచేయుచు మాదేశములోనుండి పోవుచుండెను. వారిసైన్యములు మాచిన్ని గ్రామములోఁ బ్రవేశించి విచ్చల విడిగాఁ బ్రవర్తించెను. నేనును మరికొందఱమునుపోయి చక్రవర్తితో మనవిచేసితిమి. ఆయన మాసేనలట్టివి కావు, పొమ్మనెను. అయ్యా! ప్రత్యక్షము నందు సందేహమేల? తమరు వచ్చి స్వయముగా చూడవచ్చునని చెప్పితిమి. ఆయన నిరాకరించెను. ఎవరినో సేనాపతులను బిలిచి యడిగెను. వారు మామాట లబద్ధమనిరి. మమ్ము సంహరింపకుండ వదలి పెట్టుటకూడ తమ దయావిశేషమని చెప్పిరి. అయ్యా! నాకూతురు పదునాఱేండ్లది. ఎవరో యప్సరస్త్రీ నేలకవతరించినదని జనము చెప్పుకొనునంత యందకత్తియ. ఎందరో యామెను బెండ్లియాడ రాయబారములు పుచ్చిరి. నాకు పదివేల దీనారముల నిచ్చినవాని కిత్తునని నేను చెప్పితిని. వారందఱు కోట్లకుఁ బడగలెత్తినవారు. పదివేలు నాకిచ్చుటకు వారిప్రాణములు పోయెను. ఒక కోటీశ్వరుఁ డిత్తుననెను. మాది పేదసంసారము. ఆపిల్లకుఁ బెండ్లియయినంతనే జ్యేష్ఠాదేవి మాయింటి యిరుగుపొరుగులగూడ నుండకుండ లేచిఁ పోవునని మేమనుకొంటిమి. అప్పటికే యామె వివాహము కావలసినది. ఆకోటీశ్వరునకు సమీపబంధువులెవరో పోయి, పెట్టుకొనిన ముహూర్తమే యాగిపోయినది. మాది మరుదేశమని మనవిచేసితినిగదా. అది యెడారియొక్క యంచు. వర్ష

మసగా నెల్లుండునో మూప్రాంతప్రజనులు వందయేండ్లు జీవించియు నెఱుఁగరు. మాకు తిండిలేదు, తిప్పలులేదు. ఆమెడారిలో నచటనచట నేవో దుబ్బులుగా లేచును. ఒక జాతిదుబ్బు మురికినీళ్ళలో నొక బీజమువంటి పదార్థము లభించును. వానిని తెచ్చికొందుము. అచటి యాకులనే తిందుము. ఆమడ పైభాగమునుండి నీరుతెచ్చుకొని నిలువ చేసికొందుము. అధనము వచ్చును. మరుదేశము వదలిపోయి యింద్రప్రస్థరాజ్యపు టెల్లగానున్న సరస్వతీ నదీతీరమునఁ గొంతయాస్తి సంపాదించి జీవితశేషమును గడపికొననెంచు మాకు మాపిల్ల పెండ్లి దగ్గఱకువచ్చి మెరసిన సౌదామని వలెఁ గనిపించెను. ఇంతలో నేమేఘగర్భమునగ నాసౌదామని మెఱసెనో యామేఘమునుగూడ విక్రమార్కుని సైనికులు తగులఁబెట్టిరి. మాబాలిక నెత్తికొనిపోయిరి. ఇది పదివండ్ల క్రిందవార్త. నాభార్య చనిపోయెను, నాకొడుకును సైనికులే సంహరించిరి. నేనీ యణచరాని పగను, ఆరిపోనిపగను మండింప నెంచితిని. దేశదేశములు తిరిగితిని. ఈవిద్య నేర్చి తిని. నాకు సైన్యమా? చట్టుబండలా? నల్గురైదుగురురాజుల దగ్గఱకుఁబోయి నేనీపనిని పెద్దఎత్తున చేయఁగలను. విక్ర మార్క మహారాజుమీఁద మీరు కత్తికట్టినచో నేను పాయ పడుదునని మనవిచేసికొంటిని. వారు నన్ను వెఱ్ఱివానిక్రింద లెక్కగట్టి తోలివేసిరి. ఒకటిరెండుచోట్ల నేను ప్రాణములతో బయటపడితిననికూడఁ జెప్పవచ్చును. అంతట నాపగ నేనే తీర్చికొనవలయుననిపించినది. నేను బైరాగినైతిని. ఇంద్రప్రస్థ ముననున్న యొక స్నేహితునితో నుజ్జయినీ రాజాంతఃపుర

మున పరుపులు కుట్టువానితో నిది చెప్పితిని. వాఁడెట్టకేల కంగీకరించెను. ఇవిచేయుటకు నెవ్వరిజోక్యములేని యొక ప్రదేశమును వెదుకఁగా నీమూఁడు రాజ్యములలో వందయేండ్లుగా నెవ్వరును పట్టించుకోని యీస్థలము నాకుదొరకెను. నావంటి నభాగ్యుఁడెవఁడు? నావిరోధ భావనకంటె పరమవ్యర్థమైన భావన యెచ్చటనుండును? స్వామీ! మీరు నన్ను వధింపుఁడు. లేనిచో నన్ను తీసికొనిపోయి యావిక్రమార్కున కప్పగించుఁడు. అదో యిదో మీరుచేయనిచో నేనిందు ప్రాయోపవేశమునుచేసి మరణింతును. లేనిచో నేను సిద్ధముచేసిన యొక ప్రేలుడుగుండు నాకిందు. ఇచటనే దానిపై నేను పరుండి నాశరీరమును దగ్ధపటలము చేసికొందును.”

నీలాంజనుఁడేమియు మాటాడకుండ వెడలిపోయెను. సైనికులుగూడ నెవరిదారినవారు పోయిరి. సేనాపతియొక్క విశాలమైన గృహాంగణ మందు బైరాగి యొంటరిగా సలుచుండెను. రెండుయామములు గడచెను. అతనికేమిచేయుటకును తోచలేదు. అచటికిఁ గొంతదూరములో నొక పెద్ద బావియున్నది. ఆబావినుండి యూరిలోని జనములు ప్రొద్దెక్కువఱకును నీరు తోడికొని పోవుచుండిరి. రెండుజాములవేళ సర్వము నిశ్శబ్దముగా నుండెను. ఇతఁడటునిటు చూచెను. చుట్టుప్రక్కల నెవ్వరునులేరు. ఆబైరాగిపోయి యగాధమైన యాబావిలో దూకెను. ఎచటినుండి వచ్చిరో పదిమంది సైనికులు వచ్చిరి. అతనిని పైకిలాగిరి. అతనికిఁ బ్రాణములు కిడబట్టినట్లుండెను సేదతేర్చిరి. భోజనముపెట్టిరి. వాఁడాత్మహత్య చేసికొనునన్న భయముతో నారాత్రియంతయు

సంరక్షించిరి. మఱునాఁడు మరల సేనాపతి దర్శనమయ్యెను. నీలాంజనుఁడిట్లనెను. 'నీపగ చాలగొప్పది. చంపినచో, శత్రువును చంపవలయును లేనిచో నీవు చావవలయును.' బైరాగి మాటాడలేదు.

నీలాం :- నీవు సిద్ధముచేసిన యీ యగ్నిగోళములలో నొక్కసారి యెంతమందిని సంహరించుటకు చాలిన దానిని చేయగలవు ?

బైరాగి :- అయ్యా! నన్నెందుకు బాధింతురు! నేను చనిపోవు మార్గముల నరికట్టితిరి. మీరు నన్ను చంపరు. చావనీయరు. ఈమాటలవలన నేమిప్రయోజనము ? - మరల నీలాంజనుఁడు మాటాడలేదు. బైరాగి సేనాపతియింటిలోననే యుండెను. అచటనే నిద్రాహారములు జరుగుచుండెను. అచట నితఁడు నమ్మినబంటయ్యెను. ఒకరినొకరు నమ్మఁజొచ్చిరి. తరువాత పదిదినములలో సేనాపతి యితనితో రహస్యము లాడనారంభించెను. విక్రమార్కుని సేనలను సంహరించుటకు సేనాపతి మార్గములను దెలియఁజేయుమని బైరాగి నెన్నియో సారులడుగఁగా నితఁడు 'స్వామీ! నేనది మఱచిపోయితిని. నన్నెందుకు వేధింతురు. మీకు నామీఁద దయకలిగినది. నేను చక్రవర్తిమీఁది పగను పరిత్యజించితిని. మీరు చక్రవర్తికి సామంతులు, నన్ను మన్నించితిరి. నాపరిశిష్టమైన యాయువు మీ యింట సేవకుఁడుగా గడుపుదును'' అని నాలుగైదుసార్లు చెప్పెను. నీలాంజనుని యొత్తిడి వలన, ప్రోత్సాహము వలన నితఁడా యాయుధములను

చేయుటకు మరల నంగీకరించెను. ఆ యంగీకరించుట యెట్లున్నదనఁగా నతఁడు విక్రమార్క చక్రవర్తి మీఁది పగతో కాదు, తన యొక్క శత్రుమారణ సాధన నిర్మాణశక్తిని ప్రకాశింపజేయుటకు మాత్రమే యన్నట్లుండెను.

తరువాత మూఁడు నెలలు గడచెను. అందఱును బైరాగిని నిరంజనుఁడని పిలువ నారంభించిరి. సేనాపతి నీలాంజనుఁడు. ఇతఁడతనికి నచ్చినబంటు. అందుచేత నిరంజనుఁడు అది యొక పేరు. ఆ బైరాగి యసలు పేరెవ్వరికిఁ దెలియదు. అతఁడు దానిని తానే మఱచిపోయితినని చెప్పెను. ఈ అగ్ని వికిరణ గోళములు చేయుటకు నెంతయో ధనము వెచ్చింపఁబడెను. నిరంజనుఁడు క్రమముగా కటకరాజ్యపు పొలిమేరలలో సింహపురపు పొలిమేరలలో నున్న మహా నగరములయందుఁ గనీసము ముప్పదిచోట్లకు తీసికొని పోఁబడెను. అచట రహస్యాయుధ నిర్మాణాగారములున్నవి. ప్రతిస్థలము నందితఁడు మూఁడు నాల్గు దినములుండును. ఈ యాయుధములను నిర్మించుపద్ధతి వారి కుపదేశించును. మఱల వచ్చి చూచును. దోషములున్నచో సవరించును. ఇట్లు నాల్గు నెలలు గడచెను. ఒకొక్క రహస్య కర్మాగారమున కనీసము పాతిక ముప్పది యగ్ని విదళన గోళములు నిర్మింపబడెను. ఈ మహాకార్యములో నిరంజనుఁడు శ్రమపడెను. అతఁడు నీలాంజనుని యింటికిఁ బోయి విశ్రాంతి తీసికొనుచుండెను. ఒకసారి నీలాంజనుఁడెదో రాజకార్యము మీఁద నుత్తర బాహ్లీకములకుఁ బోయెను. అతఁ డిరువది దినములకుఁ గాని తిరిగి

రా లేదు. సేనాపతి తిరిగి వచ్చునప్పటికి పది దినముల క్రింద టనే బైరాగి యెచ్చటికో పోయినాఁడని చెప్పిరి. అదివఱకే నిరంజనుఁడు నాల్గయిదు సార్లు నీలాంజనునితో వారికీ విద్య నేర్పి తాను వెడలి పోవుదుననెను. ఎచటికిఁ బోవుదు వనఁగా హిమాలయమునకుఁ బోదును. అచట నీ. కామక్రోధములను పరిత్యజంచి తపస్సుచేసికొందు ననెను. అందుచేత నీలాంజ నుఁడతనినిఁ గూర్చి పట్టించుకొనలేదు. పిచ్చివాఁడు పోనిమ్మ నెను. అతని విద్య యిచట చాల మందికిఁ దెలిసెను. కాని యింతవఱకు నా గోళములు ప్రేలునో ప్రేలవో పరీక్షింపఁ బడలేదు. నాల్గయిదింటిని నిరంజనుఁడు ప్రేల్చెను, అవి శతఘ్నులగుట నిశ్చయము. తక్కినవి కూడ నట్టివి కావల యుట నిస్సంశయము. ఈ శతఘ్నులన్నింటికి పైన నేవో వృక్షముల పత్రములు చుట్టి పైన తడిమన్ను రాచి త్రాళ్ళతో బిగించి మఱల నిట్టి పత్రాచ్ఛాదనము బిగింపు రెండుమూఁడు సార్లు చేయవలయును. తత్పూర్వము మందునంతను సన్నని కుండవంటి దానిలోఁ బోయ వల యు ను. వానిలో చురకత్తు లుండవలయును. చిన్ని మూతులుగల గుండ్రని కుండలలో నీమందు నింపకముందు నిరంజనుడుఁ దానిని పరీక్షింపవలయును. అట్లుజరిగి దానియందు మహాగ్నివిడళన శక్తి సంపూర్ణముగా సమకూర్పఁబడినదని నిరంజనుఁడు చెప్పకముందు మూయరాదు. ఆశక్తి వానియందు సమ కూడెనో సమకూడలేదో సరిగా పరీక్షించునేర్పు వీరిముప్వు రకుమాత్రమే తెలియును. వారికిమాత్రమే నిరంజనుఁడు చెప్పెను, నేర్పెను. ఆముప్వురు కటకదేశీయులు. వారికిని

నిరంజనునకును మిక్కిలి చెలిమిగా నుండెడిది. వారు సామా న్యులుకారు. దళవాయులు. దళవాయియనఁగా రెండువందల సైన్యముమీఁద నధికారి. ఈముగ్గురు సుక్షత్రియులు. కటక దేశరాజునకు దూరపుబంధువులు. వారిముగ్గురి పేరులు–సహ దేవుఁడు, భరతుఁడు, సుమంతుఁడు.

కటకరాజ్యసేనలో సైనికులెక్కువ భాగము వేదధర్మ మెఱుఁగనివారు. ఆసంప్రదాయములు లేనివారు. వారికీమత మనిలేదు. ఈధర్మమనిలేదు. ఏదియైన నొక్కటియే. ఏ దేశ ములోనవైన సామాన్యజనులకు మతాభిప్రాయములు తక్కు వగానుండును. కొన్నివందల యేండ్లుగా యవన భారతీయా చారములు కలిసిపోయి యిదమిత్థమని నిర్ణయింపరాని యొక స్థితి, కటకారి దేశములయందు సామాన్య జనులలో నభి వ్యాప్తమైయున్నది. వారేపండుగపడిన నాపండుగయే చేయు దురు. నాగయవనులతోపాటు పుండరీకోత్సవములు చేయు దురు, మఱల శ్రీరామనవమి చేయుదురు. దరదదేశము లందు హనుమదుత్సవములు నెఱపుదురు. అనఁగా సంవత్స రములో నొకదినమున హనుమన్నాటకము నాడుదురు. ఒక పురుషునకు స్త్రీవేషమువేసి యొకతోటలో నొక వృక్షము క్రింద నతనిని కూర్చుండఁబెట్టుదురు. హనూమద్వేషధారి వచ్చును. ఆమెతో నేదియో మాటాడును. తోఁటచివర కొన్ని పందిళ్ళును పాకలును నిర్మింతురు. అతఁడు వానికి నిప్పుముట్టించును. వందమంది రాక్షసులవేషములు వేసి కొందురు. వారు తలలకు మొలలకు పెద్ద నారకుచ్చులు

ధరింతురు. ఈ హనుమంతుఁడు తనతోఁకనిప్పు వాని కంటిం చును. అవి మండు చుండును. ఆరాక్షస వేషధారులు వానిని తేలికగా నూడదీసి పారవేయవచ్చును. ఈయుత్సవము లురగ శకసింహపుర కటక దేశములయందుఁగూడఁ జేయుదురు. వారిమత ముత్సవబుద్ధి. సైనికులందఱు నిట్టివారే. కాఁగా కటక దేశసైన్యము నాల్గువేలు. మహాసేనాధిపతి నీలాం జనుఁడు. అతనిక్రింద రెండువేల సైన్యముండును. తక్కిన రెండువేల సైన్యము నలువురిక్రింద నుండును. ఆనల్వురి క్రింద నలువురు దళవాయులుందురు. ఆనలువురకు చమూ పతులని పేరు. మహాసేనాధిపతిక్రింద చమూపతులుండరు. పదిమంది దళవాయులుందురు. ఆ రెండువేలసైన్యము సేనా పతి యదుపులోనిది. నీలాంజనుఁడు క్షత్రియుఁడుకాఁడు. అతని దళవాయులు క్షత్రియులుకారు. నలువురు చమూపతు లలో నిద్దఱు క్షత్రియులు. ఈ నలువురు దళవాయులలో పైముప్వురు క్షత్రియులు. వారిలో సుమంతుఁడొక్కఁడే క్షత్రియచమూపతి క్రిందివాఁడు. తక్కినయిద్దఱు క్షత్రియులు కాని సమూపతులక్రింది యుద్యోగస్థులు. వారికి సులభముగా సెలవుదొరకదు. వారిని వారి చమూపతులు బెసగనీయరు. అధికారము కొద్దిదైనను చమూపతులు నల్వురు స్వాతంత్ర ముగాఁ ప్రవర్తింపవచ్చును. వారు నల్వురు సేనాపతివంటి వారే. ఆయిద్దఱు క్షత్రియచమూపతులలో నొకని పేరు సింహ వర్మ. అతనిక్రిందివాఁడు సుమంతుఁడు, సుమంతుఁడు సింహ వర్మతో తనకుఁ గలిగిన సుంతదూరపు చుట్టరికము ననుస రించి తాను చమూపతివలెనే నటించును. అతఁడుత్తర

జ్యోతిష దేశవాసి. అతఁడేడాదికి రెండు మూఁడుసార్లు తన దేశమునకుఁబోయి వచ్చుచుండును. యుద్ధములు లేనపుడు సేనాపతులెచటనుందురో యెవరికిఁ గావలయును? ఏమిచేయు చుందురో ఎవరికిఁ గావలయును? సుమంతుఁడు లేనపుడు సింహవర్మయే వానిదళము వ్యవహారములు చూచుచుండును. ఏడెనిమిదేండ్లక్రింద వచ్చెనువచ్చెనన్న యుద్ధము యుద్ధము కాకుండఁబోయెను. ఈదేశముల రాజులందఱు చక్రవర్తికి తలలు వంచిరి. కప్పములు చెల్లించిరి. చక్రవర్తి సైన్యములు తమదారినవిపోయెను. నిజముగాచక్రవర్తిసైన్యము నెదిరించఁ గల శక్తి యురగదేశాధీశ్వరుఁడైన సౌమ్యునకున్నది. అతని సేనాపతులు యుద్ధాభిముఖులుగాలేరు. వారందఱు దరద దేశీయులు. సౌమ్యుఁడు గతిలేక తానుగూడ సంధిచేసికొనెను. మఱియు నప్పటికి సౌమ్యునకంత యవనాభిమానములేదు. కటకటయోగి వచ్చి సౌమ్యుని కుమారుని వ్యాధిని నాఁటికి నివారింపలేదు. కటకటయోగిలో నాఁడు వట్టివార్తలు మాత్రమే పచరింపఁబడుచుండెను. సౌమ్యునకు భయము వేసెను. యుద్ధముచేసినచోఁ దనరాజవంశము నిర్మూలింపఁ బడినచోనీయవధ్యుఁడైన కుమారుఁడు రాజు కాకపోవును. తన రాజ్యము నిలువవలయును. తనకొడుకునకు వ్యాధి నిమ్మదించ వలయును. వాఁడు రాజుకావలయును. ఇట్టిగాఢమైన కోర్కెగల సౌమ్యుఁడు యుద్ధమునకంత యభిముఖుఁడుగాఁగూడ లేఁడు. చక్రవర్తి సైన్యముల నెదిరించవలయునన్నచో నాభీరదరదోరగ దేశసైన్యము లెదిరింపవలయును. అవియే మెత్తఁబడినపుడు కటకసింహపురీ శకోత్తర జ్యోతిష దేశ

ముల కేమిపట్టినది ? అవి యేదేశమున కాదేశము నాల్గుదేశ ములు కలసిననైనను కొంత ఎదిరింపవచ్చును. వారును దలలు వంచిరి. తరువాత తూర్పుబాహ్లీక యవనులు కిల్కిల యవనులు క్రమముగా నుత్తర బాహ్లీకమునకుఁ జేరిన తరువాతఁ గాని యొక రహస్యమైన ప్రయత్నము జరుగుట కారంభింపఁ బడలేదు. ఈరాజ్యములలో నెవని తెన్ను వానిదిగా నున్నది. ఒకచోట రాజు యవనాభిమాని. ఒకచోట మంత్రియవనాభిమాని. మరియొకచోట సేనాపతి యవనాభిమాని. సేనలే మరియు నేకముఖాభిముఖముగా నుండునట్లు సవరింపఁబడుటకు వీలులేకుండెను. మహాసేనాపతి, చమూపతి, దళవాయులు ననఁగా విభక్తులైన యీసేనాపతులలో సగానికిపైన క్షత్రియులు. వారు యవనాభిమానులగుట జరుగలేదు. ఈబాధ యున్నది. క్రమక్రమముగా నుత్తర బాహ్లీకాధిపతి రుష్యకుఁడు పలువిధములుగా సాధించుచు వచ్చుచుండెను. సింహపుర సేన సంపూర్ణముగా వాని యధీనములో నున్నదనవచ్చును. దరదోరగాభీర దేశముల సేనలమాట తరువాత చూడవలయును. కటకి దేశపుసేన ముప్పాతిక వాని కనుకూలమని చెప్పవచ్చును. ఇట్లుండఁగా నతనిప్రయత్నము బహిరంగముగాఁ జేయుటకు వీలులేదు. ఏక్షత్రియసేనాని యుజ్జయినికి వార్త పెట్టునోయన్న భయముండెను. ఏ చమూపతి క్షత్రియుఁడైన రాజుతో పోయిచెప్పునోయన్న భయముండెను. అందుచేత క్షత్రియ చమూపతులను యవనాభిమానియైన సేనాపతి యేమియు ననఁడు. వీరైనంతవఱకు క్షత్రియులైన దళవాయులను క్షత్రియులుకాని చమూపతుల

క్రింద నుంచును. భరతుఁడును, సహదేవుఁడును కదలుటకు వీలులేదు. సుమంతుఁడు కదలవచ్చును. నిరంజనుఁడు తన పరమరహస్యములను వీరికి మాత్రమే చెప్పుట నీలాంజనున కిష్టములేదు. కాని యతనికి నిరంజనునియందు నిస్సంశయమైన నమ్మకము కుదిరెను. ఆవిద్య వారి ముప్వురికి గట్టిగా వచ్చెనుకాబోలు. అందులో నిద్దఱు క్షత్రియులైనను వారు వెసకుటకు వీలులేదు. ఈయొక్కఁడేమి చేయును? ఉత్తర జ్యోతిషమునందున్న సర్వసేనయు యవనాభిమానము కలది. అచట సేనాపతులు, చమూపతులు, దళవాయులు సర్వవేళలయందు నుత్తర బాహ్లీకదేశమునకు వెనుకనిలిచెడివారే. సుమంతుఁడు మాటిమాటికి సెలవుతీసికొనెడివాఁడని నీలాంజనునకుఁ దెలియును. సేనాపతి చమూపతితోఁ జెప్పవచ్చును. నీలాంజనుఁడు సింహవర్మతోఁ జెప్పెను. సుమంతుఁడుత్తర జ్యోతిషమునకు వెళ్ళినచో వెళ్ళవచ్చునుగాని గాంధారాది దేశములకుఁ బోరాదని. నీలాంజనుఁడు కాలాంతకుఁడు. తానంత నమ్మిన నిరంజనుని భరత సహదేవ సుమంతులతో నెక్కువకాల మేకాంతముగా నుండుటకు వీలియలేదు. సుమంతుఁడు మాత్రము తన ప్రత్యక్షాధికారము లోనివాఁడు కాఁడు గనుక నితనికిఁ దెలియని కొన్నివేళలయందు నిరంజనునితో నెక్కువకాలముండుట సంభవించెను. సుమంతుఁడుకూడ నీలాంజనుని దర్శనమైనప్పుడెల్ల తొలినాఁటి వినయమును బ్రదర్శించుటయేకాక యతఁడు కటకసింహపుర సేనల శక్తి నభివృద్ధిచేయుచున్నందులకు బ్రశంసచేయుచున్నట్లు, నీలాంజనుఁ డధికశక్తిమంతుఁడని తాననుకొనుచున్నట్లు ప్రవర్తిం

చెను. సుమంతునియొక్క పునఃపున స్స్వదేశగమనము నీలాం జనునకంత సందేహాస్పదముకాలేదు. సుమంతుఁడు తన చిన్న నాఁడే కటక సేనలోఁజేరెను. అచటనే యుద్యోగాభివృద్ధి పొందెను. ఇతని నుత్తరజ్యోతిషమున నెవ్వరు నెఱుఁగరు. ఏఁడాదికి రెండుసార్లు తనదేశమున కేగినను తన గ్రామము నకుఁ బోవును, తిరిగివచ్చును. ఇతఁడు కటకదేశసేనలో దళవాయియని యెవరో కొద్దిమందికి మాత్రమే తెలియును. పైగా దళవాయితనము పెద్ద యుద్యోగముకాదు. చమూపతి యైననైనచోఁ బదిమంది యెఱుఁగుటయు గౌరవించుటయుఁ దటస్థించును.

సుమంతుఁడు తనగ్రామమునకుఁ బోయెను. ఆగ్రామ మునఁ బది క్షత్రియ కుటుంబములు కలవు అందఱును యవనాచారులే. క్షత్రియవంశ చిహ్నముగా యజ్ఞోపవీతము లను మాత్రము ధరింతురు. వారికి రామాయణ, భారతకథలు గూడఁ దెలియవు. సింహవర్మ పండితుఁడు. సంస్కృతము నందు భారత భాగవత రామాయణములు చదివినవాఁడు. సింహవర్మవలన సుమంతుఁడు తాను క్షత్రియుఁడనని, తమది భారత ధర్మమని, భారతదేశమున రాజ్యములు తమవని, ధర్మమును పాలింపవలసినవారు తామని తెలిసికొనెను. అతఁడు స్వగ్రామమునకుఁ బోయినపుడు తన బంధువులైన యువకులతో నీమాటలు చెప్పును. వారు నిరాదరింతురు. వారిలో నొకఁడితని పినతండ్రి కుమారుఁడు. అతఁడు శ్రద్ధగా వీనినాలకించును. ఈసారి సుమంతుఁడు తనగ్రామమున నిరు

వది దినములుండెను. ఆ పినతండ్రి కుమారునిపేరు సవ్యసాచి. ఆయిరువది దినములలో నొక్కనాఁడైన సుమంతుఁడును సవ్యసాచియు నొకరినొకరెడఁబాసి యుండలేదు. సుమంతుఁడు మఱల కటకదేశమునకుఁ బోయెను. సవ్యసాచి తన గ్రామమును వదలిపెట్టి యుత్తర జ్యోతిషమున పట్టణములు పల్లెలు తిరుగనారంభించెను. అతనివేషము యవనవేషము. అతనిభాష యవనభాష. ఆభాషయందతఁడు ప్రవీణుఁడు. వాఁడొక వెఱ్ఱివానివలెఁ దిరుగుచుండెను. ఆ తిరుగుటలో నతనికి నొక స్నేహితుఁడు కుదిరెను. వాఁడు గాయకుఁడు. ఏకతారపూని వాఁడు నిశావేళలయందు గొంతు దానితో జోడించి పాడుచున్నపుడు నక్షత్రములు వానివంక తొంగి చూచును. సన్నని గాలులువచ్చి పాములవలె వానిఏకతారను చుట్టుకొనును. ప్రియా సంగమానంతర ఖిన్నమైన పికరాజు కూడ నోపికతెచ్చికొని యర్ధరాత్రమున వానిపాటతో శ్రుతి కలుపును. వాఁడు యవనుఁడు. వానిది యుత్తరబాహ్లీక దేశము. వాఁడీనకఱ్ఱఖుల్లవలె నుండెను. చింపిరిజుట్టు. వాని వెంట తిరుగుచున్న సవ్యసాచికిఁగూడ మర్యాద నష్టము. వాని పేరు టికటిక. వాఁడు తన సంగీతమును నిశావేళల చేయును. పర్వతములు నడవులు కలచోట దివావేళల యందైన వాని గుండెలో నుండి యొక యుబుకు వచ్చి నపుడు పాడును. సవ్యసాచి వాని సంగీతమునకు వశుఁడై పోయెను. టికటిక యెంత సేపటికిఁ బర్వతములవైపునకు నరణ్యముల దారివైపునకు తీయును. సవ్యసాచి పట్టణముల యందు దేనికో వెతకుచున్నట్లుండును. ఆతఁడు టికటిక

సంగీతమునకు వశుఁడై తనచేత నన్వీష్యమాణ మగుచున్న వస్తువును గూడఁ బరిత్యజించి పవళ్ళయందు వీనితో నడవుల లోనికిఁ బోవును. అతఁడెప్పుడు తన యేకతార నెత్తికొనునో యెవనికిఁ దెలియును? పది దినము లూరక తిరుగుటయే కాని సవ్యసాచి వాని సంగీతమును వినలేదు. ఒకసారి సవ్యసాచి వాని నడిగెను. వాఁడు వీని మొగమునం దుమిసెను. సవ్య సాచి వానిని నిముసములోఁ జంపఁగలడు. అది నిర్జన ప్రదే శము. చంపినగుర్తు గూడ కనిపించదు. కాని ఇతఁడు తన మొగమును దుడుచుకొని ప్రక్కన ప్రవహించు సెలయేటిలో మొగము కడిగి కొని తిరిగి వచ్చెను. టికటిక వానిని జూచి నవ్వెను. టికటిక యంతటి జానపదుఁడు. అంతటి యనా గరికుఁడు. అంతటి సంఘమర్యాదా పరిజ్ఞాన విహీనుఁడు. తనకది యిష్టము లేదని చెప్పుటయే యీ యంబూకృతి చేయుట. గుఱ్ఱము ధైవతస్వరము చేయును. ఎద్దు ఋషభ స్వరము వెలార్చును. వాని కేమి తెలియును? అది తన్నును. ఇది పొడుచును. అట్టి వాఁడు టికటిక.

పదునొకండవ దినమున వారిద్దఱును కలిసి మూఁడు నాల్గు పర్వతములు దాటి యా వెనుక నున్న యొక మహా పర్వతము నంటి యున్న యడవిలోఁ బోవుచుండిరి. అచట దారి లేదు. తెన్నులేదు. అది యొక వాగు. కొంతమేర నీరు. కొంతమేర తడిసిన యిసుకనేల. మఱికొంతమేర పొడియిసుక. ఒడ్డునరాళ్ళు. వాగుమీఁదికి వ్రాలియున్న వృక్షములు. ఒక కుందేలు నొక జంబుకము తఱుముచుండెను. శశమెదిరించి

జంబుకము కనులు పీకి యిది గర్గోలుపడు చుండగాఁ దన బొరియలోనికిఁ దాను దూరెను. దూరముగ నొక యడవి నెమలి షడ్జాలాపనము చేసెను. ఆ వృక్షాగ్రమున నున్న యొక వానరము కిచకిచలాడి తన యున్న కొమ్మ నూగించెను. అది యారగ్వధవృక్షము. కొన్ని సితకిసాలయములు టికటిక మీఁదఁ బడెను. వాఁడేకతారను దీసికొని పాడనారంభించెను. పది నిముసములు పాడెను. ఇంతలో దూరమునుండి మఱియొక మధురసంగీతము సమావిర్భవించెను. సవ్యసాచి యా సంగీతమును వినుచుండెను. ఇద్దఱు వంతులు వేసికొన్నట్లు పాడఁజొచ్చిరి. టికటిక యా సంగీతము వినవచ్చుచున్న దెసకు నడచుచు వాయించుచుండెను. ఆ సంగీతము తమ దెసకు వచ్చుచున్నట్లు సవ్యసాచికిఁ దోచెను. పోఁగాపోఁగా కొండమలుపు తిరిగి సెలయేఱు పడియకట్టి నిబిడ వృక్షాచ్ఛాదితమై కల్పిత శిశిరర్తువైన యొక చోట రెండు గీతములు కలసికొనెను. ఆమె యొక స్త్రీ. పదునాఱేండ్లుండవచ్చును. యౌవనమామె సర్వాంగముల యందు సన్నద్ధమై యుండెను. వేష మాటవిక వేషము. కాని నాగరికతా చిహ్నములైన భూషణములు రెండు మూఁడామె యొడల తళతళలాడుచుండెను. ఆమె శిరోజములు సంస్కృతములు, నసంస్కృతములును. టికటిక పాట యాపెను. ఆమెయు తన పాట మానెను. మానిన లిప్తలో నామె తిరిగిపాడఁబోవుచుండెను. సవ్యసాచి "నీ పేరేమి?" ఆమె:- మధుగుంజ.

# ఆఱవ యధ్యాయము

సింహపుర రాజ్యమునకు సింహపురి రాజధాని. ఉత్తర బాహ్లీకములు దీర్ఘ ద్విభుజమైన చతురస్రాకృతి. అది ఐమూలలుగా నుండును. అనగా దానిమూలలు ప్రాగ్దక్షిణ దిశాభిముఖములుగా నుండునుగాని దాని ప్రాగ్దిశాదుల కభిముఖముగా నుండవు. సింహపుర రాష్ట్రమునకు ఉత్తర బాహ్లీకములకు కలిసిన సరిహద్దు చాల కొంచెము. మిక్కిలి యున్నచో నామడలో నాల్గవవంతుండును. రాజధానియైన సింహపురము తత్ప్రదేశమునందు నిర్మింపఁబడి యుండెను. అనాదిలో నీరెండు దేశములు నొకటియే. తదనంతరమున నుత్తరబాహ్లీకములు యవనాక్రాంతము లగుటచేత పొలిమేర యందు యవన రాజ్యమున్నచో అది క్లిష్టమైన సమస్య కావున సింహపురము రెండు దేశములుకలిసిన సరిహద్దులోననే నిర్మింపఁబడుట సింహపుర రాష్ట్రమునకు రక్షగానుండెడిది. పొరుగు దేశము యవన దేశమైనచో ఒకటి యవనరాజ్యము మరియొకటికాదు. రెండు నిరుగుపొరుగు రాజ్యములు. ఆయిద్దఱు రాజులును సంధిచేసికొనిరి. వారిమీఁద వీరు దండెత్తరాదు, వీరిమీఁదవారు దండెత్తరాదు. సంధి నియమములకు యవన దేశములోని ఎల్లలయందు నివసించు జనములకు సంబంధములేదు. ఎల్లలయందున్న యవనగ్రామవాసులు పరిసర దేశపు పల్లెటూళ్ళమీఁద దండెత్తుదురు. రాత్రులందు నాయుధధారులై యశ్వములమీఁద గుంపులుగా పోదురు. పల్లెటూళ్ళు తగులఁబెట్టుదురు. యువతులను దొంగిలించికొని పోదురు. ఈరాజు మీప్రజలిట్లు చేయుచుండిరని యవనరాజు

నకు వార్తపెట్టును. అతఁడు మాటాడఁడు. యవనరాజ్యము పొరుగురాజ్యమైనచో నీదేశపురాజు సర్వదా తన సరిహద్దు పొడుగునను రక్షకసైన్యము నుంపవలయును. అట్టి సరిహద్దు యొక్క దైర్ఘ్యము సింహపురమునకు తక్కువగనుక మఱియు నచ్చటనే రాజధాని నగరమున్నదిగనుక యవనులు సింహపురి రాష్ట్రముమీఁది పొరమేరలుల్లఘించి వచ్చుటకు వీలుండెడిదికాదు. తూర్పుబాహ్లీకమునుండి పారిపోయిన కిల్కిలాది యవనులు, ప్రధానముగా ఉత్తరజ్యోతిష శకకిరాత దేశములలోనుండి ఉత్తరబాహ్లీకము చేరుదురు. ఆభీరోరగ దేశములనుండి ఉత్తర బాహ్లీకములకు పోవుటకు వీలులేదు. ఆపైన దరదదేశమున్నది. దరదములోనుండి పోవలయును. దారదులు తీవ్ర భారతీయ ధర్ములు. వారు వీరిని తమదేశములోనే షట్టుపెట్టెదరు. రాజధాని నగరమైన సింహపురములలోనుండి వారు తమదేశములకు పోరాదు. ఉత్తర బాహ్లీకముల ధరాపతిపేరు రోమకుఁడు. ఆదేశమునకు రుమ్యక, రోమక, రుమ్మదేశములన్న పేర్లుకలవు. ఆరాజునకు మూఁడుపేర్లు కలవు. పూర్వము పుష్యమిత్ర అగ్నిమిత్రులు, కాణ్వుఁడైన వాసుదేవుఁడు, మౌర్యుఁడైన చంద్రగుప్తుఁడు, చక్రవర్తులై యవనులను తూర్పుబాహ్లీకదేశమునుండి పాఱఁదోలలేదు. - వారిని శాసించిరి. కప్పములు గొనిరి. భారతీయ ధర్మావలంబులైన రాష్ట్రముల మీఁదికి పోకుండ నదుపుపెట్టిరి. తరువాత నాంధ్ర శాతవాహనుల నాఁడు శాతవాహనులు బౌద్ధులగుటచేత యవనులు కూడ తత్కాలమున పలుమంది బౌద్ధధర్మాభిమాను

లుగా నుండుటచేత నీ యిక్కట్టు లేకపోయెను. తర్వాత గుప్తచక్రవర్తులు వచ్చిరి. వచ్చుచునే వారికి గ్రీకు యవనుల బంధుత్వ మేర్పడెను. ఆయవను లీయవనులు కలిసి పోయిరి. దేశమునందు యవన బాహుళ్య మేర్పడెను. ఇప్పటికి విక్రమార్క చక్రవర్తి వచ్చెను. ఇతఁడు సంపూర్ణముగా భారతీయుఁడు, వేదధర్మావలంబి. ఆంధ్రశాతవాహను లైదువందల యేండ్లు రాజ్యము చేసిరి. గుప్తరాజులు రెండువందల నలుబది యైదేండ్లు రాజ్యముచేసిరి. ఏడువందల ఏఁబదిఏండ్లుగా లేని యెద్దడి నేఁడు యవనులకు సంప్రాపించెను. కొన్ని కోట్ల యవనులను సంహరించిన భారతీయ చక్రవర్తి శకకర్త యగునని పురాణములలో నున్నదఁట. ఇతఁడు శకకర్త యగుటకు ప్రయత్నించుచున్నాఁడు. ఇదివఱ కెంతమంది యవనులను సంహరించెనో తెలియదు ఈ కాలములన నున్న యవనరాజు కూటనీతి నవలంబించనిచో నెగ్గలేఁడు. నిరంతర సైన్యసంగ్రహము చేయనిచో తట్టుకొనలేఁడు. యవనుల యందొక లక్షణమున్నది. వారు పరమ సోమరులు. పొలము దున్ని పండించరు. చెరువులకు కట్టలుపోసి నీరు తెచ్చికొనరు. తాము ధరించవలసిన దుస్తులకోసము ప్రత్తి పండించరు. వారందఱు ఖడ్గధారులు, నాశ్వికులు, దోపిడికాండ్రు. లొంగిరానిచో సేనావృత్తి సేయుదురు. లొంగి వచ్చినచో దోచుకొందురు. సంహరింతురు. వారిలోనను చాలమంది సాధువులుందురు. కాని జాతి మొత్తము మీఁద నీజాతి లక్షణము లధికముగాఁ గన్పించును. అందుచేత రుమ్మకునకు సైన్య సంగ్రహణ ప్రయత్న మల్పమైనది. అందఱును సైన్యమే.

వృద్ధులుకూడ సైన్యమే. పదియేండ్ల బాలకులుకూడ ముందు కొట్టి మాటాడుదురు. ఇది ఆ జాతి లక్షణము. ఒక జాతి యొక్క లక్షణ మొకవిధముగా నుండుటకు హేతువేమి? దీనికి పలుకారణములుండును. మొదటిది ఆ జాతికి పరమేశ్వరునిచేత నిర్దిష్టమైన యాహారము. నిత్యమాంస ఖాదులైనచో వారియందు సాధుత్వము పెరుగదు. మాంసము జంతువులనుండి లభించును. జంతువు లనినంతనే వివేకరహితము. కొన్నిజంతువులు క్రూరములు. వాని సహజలక్షణము పెఱ జంతువులను చంపి తినుట. ఈలక్షణము లాజంతువుల శరీర గత మాంసమునందు నిష్ఠమై యుండును. తత్ఫలలఖాదికా గుణములు సహజముగా వచ్చును. రెండవకారణము సంప్రదాయము ఆజాతియందు మహామేధావులైన ఋషికల్పు లుదయించి సంఘాది వ్యవస్థ నిర్మించి మహాగ్రంథములు వ్రాసి, వానియొక్క పఠనపాఠనాదులు దేశమునందించినచో తాముతిన్న యాహార గుణములవలన సహజమైన మనస్సులు సంప్రదాయ సమాయాత సద్గుణ ప్రబోధక విద్యాహేతుకమై పైనుండివచ్చిన యదుపుతో నణఁగియుండును. మనోనియమ మేర్పడును. మూఁడవది దేశమునందు కృషిచేసి ప్రజలకు కావలసినంత పండించికొని యాహారదారిద్ర్యము లేకుండ చేసికొనుట కొన్ని దేశములకు తగినంత కృషిచేయుటకు వీలైన భూభాగము లేనిచో, ఆదేశముయొక్క సంపత్తి పరిశ్రమల మీఁదనాధారపడవలసి యుండవచ్చును. కృషికి పరిశ్రమలకు భేదమున్నది. కృషియందు అసత్యము, హింసయు, దుర్భాషణము మొదలైనవి సహజముగా సిద్ధింపవు. ఈదుర్గుణముల

యొక్క ప్రసక్తి యధికముగా నుండదు. పరిశ్రమచేత నుత్పత్తియైన వస్తువులు విక్రయించుట యందీదోషముల సంక్రాంతి కలదు. కొన్ని మహాపర్వత దేశములయందు పరిశ్రమలు చేయుటకూడ సాధ్యములేదు. జంతువుల ననగా గోమహిష మేషాశ్వాదులను పెంచుటయు వాని నమ్ముటయు మాత్రమే ధనాగమహేతువగును. ఈ వృత్తియందుకూడ నెక్కువదుశ్శీలమునకు వీలులేదు. కాని యట్టిస్థలములయందు చౌర్యాది దుర్గుణములు వృద్ధిపొందును. ఇట్లిట్లు సాగు సంప్రదాయము మూఁడవది. నాలుగవది రాజశాసనము ఈశాసనము భిన్నదేశములయందు భిన్నాకృతిగా నుండును. సహజముగా నేదేశమునందైన కొన్ని యాచారములుండును. అవి అజ్ఞాతమైన దైవమును గూర్చిన విశ్వాసములమీఁద ధనాదికములైన లాభాదులమీఁద వ్యక్తిగతాహంకారాదులమీఁద మానవ ప్రకృతియందు సహజములైయున్న సుఖములయు వినోదములమీఁద నాశమీఁద, మరణించిన జీవులమీఁదగల ప్రేమాదులమీఁద నాధారపడియుండును. దేశము విశాలమై నదీజలపూరితమై, పర్వతారణ్య విహీనమై కృషియోగ్యమై, బహుగ్రామ సంభరితమై, మానవుల పరస్పర సహకారముచేత సుఖాదులు వృద్ధిపొందిఁచు కొనుటకు వీలైనచో నచట సాధుత్వము వృద్ధిపొందును. ఆహారాదులకు లోపముండదు. రాజుయొక్క పాలన సువ్యవస్థితమై సుఖముగా నుండును. దేశము పర్వతమయమై కృషికయోగ్యమై ఏపర్వత ప్రత్యంత పర్వతదరీ భాగముననో నాలుగైదు గుడిసెలు నిర్మించుకొని బ్రదుకవలసిన జనసంఖ్య

కలదై జలాధార పరిహీనమైయున్నచో నచట నాచారములు సువ్యవస్థితములు కావు. రాజశాసనము సర్వతోవ్యాప్తి పొందదు. ఎప్పుడో అధికసంఖ్యాకులైన రాజభటులు పోవుటయు నా పల్లీజనులు నుండి బలవంతముగా పన్నులు వసూలు చేయుచుండుటయు జరుగును. అచ్చట నాగరికత మిక్కిలి స్వల్పముగా నుండును. జనులయందు సాధుత్వము మృగ్యముగా నుండును. కొన్ని దేశము లిట్టివయ్యు కొంతమేర విశాలములై పర్వతములు లేనియెడ కొన్ని యడవివాగులు ప్రవహించునవియైయుండును. అచటనా దేశపురాజు రాజధానినిర్మించును. నిశ్శిలోచ్ఛయములైనచోట్లనది యొకరాజ్యమన్న నడక నడచును. కానినీరాజకమైన తత్సర్వ పర్వతములునచటి జనులునువీనిరాజ్యములోనివారే. వారికిఁగలవృత్తులుస్వల్పము. నియమ ముండదు. ఎప్పుడెవనికేవృత్తి చేసిన లాభించునో వాఁడావృత్తి చేయును. ఇది అనాగరక సంఘలక్షణము. నాగరకులు నియుత వృత్తులై వంశపారంపర్యముగ ననోన్నదకములకు లోపము లేకుండ నుందురు. సంప్రదాయ సమాగత పూర్వమహర్షి వాక్యబోధనము వలన దురాశాగ్రస్తులుకారు పరలోక విశ్వాసాధిక్యము వలన సాధువు లగుదురు. రాజులు సులభముగా శాసించుటకు వీలు కలుగు కతమున ప్రజ లధికారభీతి కల్గి యుందురు.

ఉత్తర బాహ్లీకము పర్వతదేశము. రాజు శాసనము స్వల్పము. ప్రజలలో నీ యాచారము లిట్టివని చెప్పుటకు వీలులేదు. పరదేశములు దోచవలయును. వారికి సమృద్ధిగా

తిండి లభించవలయును. ఇది భగవంతుఁడే చేసెనేమో తెలి యదు. జనసంఖ్యయొక్క వైపెఱి భూములాక్రమించ వలసిన యవసరము వలన జనులు వలసపోయినవారు తొలుతనాగ రకు లగుటవలన నచటియనాగరకులైన యరణ్యవాసులను, సమైక్యమెఱుఁగనివారిని చిన్నచిన్న గుంపులుగా నున్నవారిని సులభముగా నిర్జించి ఆదేశము తమదిగా చేసికొని వీరొక రాజ్యము నిర్మించుకొని రాజ్యపాలనమునందు నిపుణులై యాదేశముయొక్క స్థితినిఁబట్టి కృషివివర్జితులై తమరును మఱల ననాగరకులై అదియొక అనాగరకమైన రాజ్యమై సంఘాచారవ్యవస్థలచేత ననాగరకులు. తొలుతఁటి వారు తామువచ్చిన దేశమునుండి తెచ్చుకొనిన రాజనీతిసైనిక శిక్షణాదులయందు నాగరికులై ప్రవర్తించుట యనంతకాల మున జరిగిన ఈప్రపంచ చరిత్రమునందు దృశ్యమానమగు విషయమే.

అది ఏమిలక్షణమోకాని యీ యథార్థ నాగరకా నాగరకులు తమ యాచారములను మార్చికొనరు. తమ విశ్వాసములను మార్చికొనరు. వానిని నాగరకజాతులచే తనవలంబింపఁజేయవలయునన్న తీవ్రత్వము కల్గియుందురు. ఇతరదేశములన్నియు తామాక్రమింపవలయు ననుకొందురు. పైనిచెప్పిన యాహారాది కారణములచేత వారి యాలోచనా శక్తికొక హద్దుకలదు. దానినిమించి యూహించలేరు. వారి ఆలోచనామార్గమున కొంతమేర నొక యయఃకవాటము కలదు. వారి పరలోక విశ్వాసము, నతీంద్రియ విషయగత

విశ్వాసముఁ సాధుత్వాదిగుణగత విశ్వాసము మొదలైనవి యచ్చటికిపోయి అగును. ఆపైన ఏవియు లేవందురు. దీనికి ప్రధాన కారణమేమనగా, తరముల కొలది నజ్జాతీయులు భోజనముకొఱకు చేయవలసిన నిత్యాన్వేషణము. ధార్ట్యము చేతకాని బ్రతుకుటకు వీలులేకపోవుట. పర్వతప్రాంత నివాసముచేతను, కఠినాహారముచేతను దృఢశరీరులగుటయు, శ్రమ సహిష్ణుత కల్గియుండుటయు మోటతనము, సంఘజీవనము లోని మార్దవము తెలియకపోవుటయు చంపినఁగాని తిండి దొరకదన్న లేదా తిండికొఱకు చంపవలయునన్న యొక భావన రక్తనిష్ఠమై సహజమగుటచేత వారట్లగుదురు. ఈ యుత్తర బాహ్లీకులట్టిజాతి. వారి దాడులను తట్టుకొనుటకు సింహపుర రాజ్యముద్రఢిష్ఠమై యుండెడిది. బాహ్లీకులకు నితర రాజ్యపుటెల్లలలోనీ యిక్కట్టులేదు. ఈ సరిహద్దు రాజధానియే మైయుండుటచేత సింహపురము వారికి బలవచ్ఛత్రువయ్యెను. అందుచేత వారి నీతి సింహపురమున మఱియొక మార్గమవలంబించెను. రుమ్యకులు దృఢకాయులు. శ్రమసహిష్ణువులు, నాశ్వికులును. వారిలో ననేకులు భోజనవస్తు దారిద్ర్యమధికమైన కొలఁది సింహపుర సైన్యములో చేరిరి. సింహపుర సేన రుమ్యకాశ్వికదళ విశేషముచేత నప్రతార్యము దుస్సాధమునై యుండెను. వారిలో కొందఱు పెద్ద యుద్యోగస్థులుండిరి. రాజునకు క్రమముగాఁ దెలిసెను. తన రాజ్యశక్తి బాహ్లీక సైంధవదళాధీనమై యున్నదన్నమాట. అతఁడు రుమ్యకులన్నచో నభిమానము పెంచికొనెను. చివరకు వారు వీరు నొకటియైరి. మఱియును చక్రవర్తి బాహ్లీక దేశమును

తన వశము చేసికొన వలయునన్నచో సింహపురమునందు విడియును. అదిఅతనికి వీలుకదా! చక్రవర్తియు చక్రవర్తి సేనయు సింహపురమును నివాసము చేసికొని కొన్ని నెల లుండినచో సింహపురమునకు స్వాతంత్ర్య మేమున్నది? దానికి స్థితి యేమున్నది? పూర్వము పొరుగు రాజ్యములు తల వంచెనని తాను కూడ గాంధారదేశపు పొలిమేరలలో చక్రవర్తి దర్శనము చేసికొని కానుక లర్పించి సామంతత్వ మంగీకరించి వచ్చెను. ప్రస్తుత పరిస్థితులు భిన్నముగా నున్నవి. ఉరగ దరదాభీరములలో వదలినచో తక్కిన రాజ్యములన్నియు సామంతరాజ్యము లనుకొనఁబడుచున్నను చక్రవర్తి యందు విరోధముపాటించుచున్నవి. ఇవి యన్నియు నాలు రాజ్యములు. రామఠ, హూణ హార రాజ్యములును కలిసి రావచ్చును. దారదులు తమతోఁగలిసి యుద్ధముచేయక పోయినను సౌమ్యుని యొక్క ఆజ్ఞాబలముచేత చక్రవర్తి పక్షము నుండి యుద్ధము చేయరు. అతఁడు సంపూర్ణముగ రుమ్యకుని పక్షము వాఁడు. ఆ రాజ్యమునకు నీ రాజ్యము నకు ప్రజా బాహుళ్యమున సంబంధ బాంధవ్యములు కలవు. వీరి బాలకులను వారెత్తికొని పోవుదురు. వారి కూతుంద్రను వీరికిచ్చి పెండ్లి చేయుదురు. సింహపురి యందలి పూర్వ మర్యాదలు కృశించిన భారతధర్మాభిమాన దూరులైన ప్రజల యందు బాహ్లీకులు తమ బాలికలను దొంగిలించు కొని పోయి పెండ్లియాడుట రాక్షస వివాహము క్రింద పరిగణింపఁబడు చుండెడిది. అదియు నార్షములైన వివాహ ములలో నొకటియే కదా! కాని యీ దేశము ద్విధావిభక్త

మైనదని చెప్పవలయును. ఇది యుత్తర సింహపుర రాష్ట్రము. తూర్పు సింహపుర రాష్ట్రమని ఆచారాది వ్యవహారముల చేత రెండు రాష్ట్రములైనట్లు కన్పించును. రాజొకఁడే. పన్నులు చెల్లించునది యొక్క రాజునకే. గాంధారదేశము నంటియున్న తూర్పు రాజ్య యవనసంపర్క దూషితము కాలేదు. ఇచటి చాతుర్వర్ణములో నధికసంఖ్యాకులు వారి యాచారములను వారు నెఱపుకొందురు. దానికిఁ గారణ మచటి వైశ్యులు మహాధనవంతులు. క్షత్రియులును బ్రాహ్మణులునుమహాపండితులు. క్షత్రియులుమహాపరాక్రమవంతులు. అందుచేత ధర్మభ్రంశము జరుగలేదు. ఇచటివాఁడు వరాహ మిహిరుఁడుఇచటితూర్పుసింహపుర రాష్ట్రక్షత్రియులుసామాన్య ముగా భారతదేశమునందలి సుక్షత్రియుల వంటివారే. అనఁగా మహావీరులు, పరాక్రమవంతులు, అసహాయశూరు లనవలయును. అసహాయశూరులనఁగా నెవనికి వాఁడు తన శత్రువుతో యుద్ధముచేయును. పదిమందితోనైన చేయును. తాను వెనుకఁగా వెళ్ళి పొడవఁడు. వెనుకనుండి యెవఁడైన దొంగపోటుగావచ్చి పొడుచునేమోయని యూహచేయఁడు. అతఁడట్టిపనులు చేయఁడు. ఏక్షత్రియుఁడును చేయఁడను కొనును. క్షత్రియుఁడేకాదు, ఎవ్వఁడును చేయఁడనుకొనును. దానిని విశ్వసించును. ఎవఁడైన నట్లుచేసినచో వాఁడు తుచ్ఛుఁడు. అధర్మయుద్ధము చేయును. నరకలోకములకుఁ బోవునను. తాను స్వర్గలోకములకుఁ బోవుననుకొనును. స్వర్గనరకలోకములమాట తరువాత చూచికొందము. ప్రస్తుతము తాను చనిపోవుచున్నాఁడుగదా! తనమాట యేమి?

తాను స్వర్గమునకుఁ బోవుచున్నాఁడు. వాని కంతేకావలయును. తనభార్యయు, బిడ్డల నేమికావలయును? తనకును వారికిని ఋణానుబంధము తీరినది. బ్రతికియున్నంతవఱకే తమ యనుబంధము. తానిట్లు చావవలసియుండెను. అదికర్మ. తప్పించుకొనరాదు. తానొక్కఁడు పదిమందికలసి తనమీఁదికి వచ్చుట యధర్మము. వారట్లు చేయరాదు. తనయెదుట పది మందియు నిలువలేరు. ఇట్టి ధర్మబుద్ధులై యుందురు. సింహపురరాజు సేనయంతయు ననఁగా కాల్బలమంతయు నిట్టి క్షత్రియులవశమునం దున్నది. వారు యుద్ధనీతినిపుణులే. కూటనీతి వారికిఁ దెలియనే దెలియదు. తెలిసినను వారు పట్టించుకొనరు. సింహపురీశ్వరుని యాశ్వికదళము బాహ్లీక దేశీయులచేత నిండియున్నది. బాహ్లీక దేశీయుల యధీనములో నున్నది. కాల్బలమును ధానుష్కులును క్షత్రియుల వశమం దున్నారు. గొప్ప యధికారులందఱు సింహపురమునందే యుందురు. యవనులు వారి కుటుంబములజోలికిఁ బోరు. పోయినచో వారికిఁ దమప్రాణములు నిలువవని తెలియును. ఈక్షత్రియుల బంధువులు సేనలో లేనివారు తూర్పు సింహపుర రాష్ట్రమున వేఱ యుద్యోగములలో నున్నవారు సీప్రాంతముల యందుందురు. వారి శౌర్య చ్ఛటాదీప్తి మిఱు మిట్లుగొలుప తక్కిన కులముల భారతీయ మతస్థులునుఁ గొంత సుఖముగానున్నారనియే చెప్పవలయును. కటకసేనాపతి నీలాంజనుఁడు సింహపురీ గాంధారదేశముల సరిహద్దులలో రహస్యాయుధ నిర్మాణ గృహములను నెలకొల్పెను. ఈసంగతి యాక్షత్రియులకుఁ దెలియదు. ఎవరైనను చెప్పి

నచో నమ్మరు. వారట్లు జరుగదందురు. సింహపురిరాజు సుక్షత్రియుఁడు, మంత్రి సుక్షత్రియుఁడు. సేనాపతులు సుక్షత్రియులు. కటకపుర సేనాని యిచ్చటకు వచ్చుటకు గుండెలెట్లు నిలుచును? ఇది వారి ధైర్యమును, వారి వాదన యును. అట్లు రహస్యాగారములు కలవని చెప్పెడివారేకాని నిరూపించెడివారు లేరు. అది వదంతియేకాని యథార్థ నిరూపణము జరుగుటలేదు. అచటి బ్రాహ్మణులున్నారు. వారి ధైర్యము క్షత్రియులును, భారత ధర్మానుయాయులైన శూద్రులును వారును వీరును బ్రాహ్మణధర్మమును రక్షించు చుందురు. ఏయెద్దడి వచ్చినను ముందు వారికి రావలయును, తరువాత బ్రాహ్మణులకు రావలయును. ఆ క్షత్రియులలో నెంతమంది పండితులు కలరో యుత్తమకులజులైన శూద్రులలో నంతమంది పండితులు కలరు. వారందఱు శ్రుతిస్మృతి పురాణేతిహాసముల సారాంశ మెఱిఁగినవారు. బ్రాహ్మణులకు భయములేకుండెను. వరాహమిహిరునివంటి పండితులకు నది దివ్య నివాసభూతిగా నుండెను. ఈదేశ మంతయు కలిపి నాల్గయిదువందల గ్రామములు. జనసమ్మర్దముకలవి. మఱియు నడిమి గ్రామములయందు భద్రత యధికము. వరాహమిహిరుని కుటుంబమట్టి యొక గ్రామములో నున్నది. ఆయనను బూవులలోఁ బెట్టి పూజింతురు. ఆయన యొద్దకు వచ్చి పలుమంది విద్య నభ్యసించుచుందురు. అవి సుభిక్షములైన గ్రామములు. ఆబ్దికము జరుగుచున్న యింటియొద్ద తప్ప లేదన్న వాక్కు ఏ గ్రామము నందలి యింటియందును బుట్టదు. భిక్షుకు లనంతవిధములుగా నుందురు. ఏ భిక్షుకుఁ

జెట్టివాఁడో పరిశీలన చేయవలసిన యగత్యము వానికి లేదు. అది రాజు యొక్క ధర్మము. రాజాధికారుల పని. ఇట్లుండఁగా వరాహమిహిరుని గ్రామమున కొకనాఁడొక యవన భిక్షుకుఁడు వచ్చెను. వాని లీల లద్భుతములు. వాని వేషము హాస్యాద్భుత రససమ్మిశ్రితము. వాని తలవెంట్రుకలెఱ్ఱగా నుండెను. వాని కనుబొమలును గడ్డమును మీసలును గూడ నెఱ్ఱగా నుండెను. రంగువేసినట్లులేదు. వాఁడాజాను బాహుడు. బక్క పలుచని వాఁడే. కాని యినుప చువ్వవంటి వాఁడు. వాఁడు తాల్చిన యంగీ మోచేతుల వఱకు నుండెను. నడుము వఱకు నుండెను. అది పది వన్నియల గుడ్డపీలికలతోఁ గుట్టబడి యుండెను. వాని చేతిలో నెమ్మిపించియము కట్టగాఁ కట్టినది కలదు. ఒక సింహాళపు సొరకాయ బుఱ్ఱ కలదు. వాఁడొడలినిండ గంధమలందుకొనెను. వానికాలికి గండపెండెరము కలదు. వాఁడు గ్రామమునఁ బ్రవేశించక మున్న వానిని గూర్చి కొన్ని కథలు వ్యాపించెను. అవి యెట్లు వ్యాపించినవో యెవ్వరికినిఁ దెలియదు. ఒకటి వాఁడౌషధ సిద్ధుఁడన్నది. రెండు వానికిఁ బరకాయప్రవేశవిద్య తెలియునన్నది. మూఁడవది వానినిఁజూచి సింహాది జంతువులు గూడ గడగడ వణఁకి పోవునని. అట్టి వికృత వేషమునుఁ జూచి సామాన్యముగా గ్రామసింహములు మొఱుగును. వాఁడు చనినంత మేర శ్వానములు తలలు వంచి లోగొంతులో భయమున్మరములు చేయుచు తోకలుముడుచుకొని తొలఁగిపోవుట ప్రత్యక్షముగా కనిపించెను. అతఁడు వీధివెంట నడచుచు పోవుచుండును. ఏ గృహము ముంగిటను

నిలిచి బిచ్చమడుగఁడు. ఎవరైన తెచ్చి యిచ్చినచోఁ దన చంక నున్న జోలెలో స్వీకరించును. సామాన్య భిక్షుకులకు గోధుమలో మొక్కజొన్నలో తెచ్చి పెట్టుదురు. ఆతని కందఱును నాణెములే యిచ్చుచుండిరి. ఆ నాణెములను ప్రజలు వాని సొరకాయ బుఱ్ఱలో వేయుచుండిరి. అట్లు నాణెములను వేయుట వాఁడు పరిగణించుట కూడ లేదు. ఒక మత్తగజము దారి వెంట నడచి పోవుచున్నట్లుగా వాఁడు నడచుచుండెను. వాని వెంట జనులు గుంపులు కూడి వచ్చుచుండిరి. పలుమంది బాలురును, బాలికలును వాని ననుసరించు చుండిరి. నాల్గు వీథులు కలిసినచోటవాఁడు నిలుచును. ఏదియో పాడును. ఆ భాష యెవ్వరికినిఁ దెలియదు. వాని కంఠమునందు మాధుర్యములేదు. వాని కంఠస్వరము వికృతముగా నున్నదని చెప్పవలయును. కాని వాని కంఠమునుండి వచ్చు నీ స్వరము వాఁడుచ్చరించు భాషాశబ్దములతోఁ గలసి యా శబ్దములను వాఁడొసంగుచున్న విశ్రాంతి ననుసరించి తచ్ఛబ్దముల యందలి హల్లుల యొక్క ద్వంద్వాక్షరముల యొక్క పౌనఃపున్యమును బట్టి వాఁడు పాడుచున్నప్పటి వాని కంఠనాళములు యుబ్బునుబట్టి వాని మొగము నందలి యొక తీవినిబట్టి జనుల నొక యాకర్షణ కలుగుచుండెను. ఆ నాఁడు వరాహమిహిరుఁడు గ్రామములో లేఁడు. ఆ వీథిలో నున్న పురుషులైన క్షత్రియులు కూడ గ్రామములో లేరు. వారందఱు సింహపురమునకుఁ బోయిరి. రాజు వారి నెందుకో పిలిపించెను. ఆ నాఁడా గ్రామములో రాజాధికారి యున్నవాఁడు లేడు.

పండితుఁడన్నవాఁడు లేఁడు అనాఁడేకాదు. తత్పూర్వ మైదాఱుదినములనుండి లేరు. ఊరిలో సామాన్యమైన పురుషులున్నారు. కృషికులున్నారు. సేవకులున్నారు. సామాన్యమైన వైద్యులున్నారు. పురుషసమృద్ధియున్నది. తలకట్టినవారులేరు. ఆ గ్రామములో నొక రాజభటాలయ మున్నది. దానియధికారి కలఁడు. పదిమంది రాజభటులు కలరు. రాజునకు పన్నులు చెల్లించుకొను రాజాధికార గృహము కలదు. అదియంత పెద్దయూరుకాదు, చిన్నయూరు కాదు. ఈభిక్షుకుఁడు నాల్గువీథులు కలియుచోటనేకాక యెచ్చటనో తనకు తోఁచినచోట నిలుచుండి పాడును. అది వట్టిస్థలము కావచ్చును. ఒక యింటిముంగిలి కావచ్చును. ఎంత విలక్షణమైన భిక్షుకుఁడు వచ్చినను కొన్నియిండ్లలోని స్త్రీలు బయటికివచ్చి చూడరు. వారియింటి పనులమీఁద వారుందురు. ఇది తొమ్మిదేండ్లక్రింది మాట. వరాహ మిహిరుని కుమార్తె వేదవతి కప్పుడెనిమిదేండ్లు. ఆపండితు నకు లేకలేక యీసంతానము కలిగెను. అప్పటికే వరాహ మిహిరున కేఁబదియేండ్లు. ఆయనభార్యకు నలువదియేండ్లు. ఈవేదవతి గౌరవర్ణముకలది. తుమ్మెదఱెక్కలవంటి జుట్టు కలది. బాల్యమునందుఁగూడ పుష్టిగల యవయవములుకలది. ఆమె చిన్నప్పటినుండియు నేదో యొకవ్యాధిచేత బాధిత యగుచునే యుండెను. ఆమెమీఁద నౌషధములు పనిచేయవు. ఆమెదగ్గును, ఆయాసపడును, కృశించిపోవును. జ్వరిత యగును. కన్నులు లోనికిఁ జొచ్చికొని పోవును. ఒడలు పీలయగును. కాని మంచమునఁబడదు. ఈపిల్ల యారోగ్య

మునఁగూర్చి తలిదండ్రులు మిక్కిలి భయభీతులైరి. ఒకనాఁ డామె దగ్గుచుండెను. ఆదగ్గున కవధిలేకుండెను. గ్రామములో మహావైద్యుఁడు కలఁడు. అతఁడు త్రిదోషవేత్త, వచ్చెను. నాడిచూచెను, పరీక్షించెను. ఆమెయందేదోషములేదు. దగ్గుట కవధిలేదు. సితోపలాది, తాళిసాది వాడెను, లాభములేక పోయెను. రసభూపతి సమాధానమీయలేదు. ఏమిచేయవల యును? ఇట్లుండఁగా నాఁటిరాత్రి యొక గొప్ప రాచవాని యింట నొక గొప్ప నాయకుఁడువచ్చి సంగీతము పాడు చుండెను. వరాహమిహిరుని రమ్మని యా క్షత్రియుఁడు బలవంతముచేసెను. వేదవతి తండ్రివెంటఁ దాను వత్తుననెను. 'నీకు సుస్తీగానున్నది. నీవు రావల'దనెను. తల్లిదండ్రులిద్ద ఱును చెప్పిరి. ఆమె వినలేదు. 'నీదగ్గుటచేత సంగీతమున కంతరాయము కలుగు'నని తండ్రియనెను. ఆమె యల్లారు ముద్దుబిడ్డ. సరేయని యామెతోఁ దల్లియు బయలుదేరెను. ముగ్గురు నాసంగీతసభకుఁ జేరకముందే యాగాయకుఁడు పాట నారంభించి పాడుచుండెను. అతఁడేదో రాగమును బాడు చుండెను. ఆనాఁటి సంగీతమునకు నేఁటిసంగీతమునకును చాల భేదమున్నను గాయకుఁడు పాడుచున్న రాగము నేఁటి మల హరికి దగ్గరిదని చెప్పవచ్చును. ఇంక నాముగ్గురు లోనికిఁ బోఁబోవుచుండిరనఁగా వేదవతికి దగ్గు ముంపువచ్చెను. ఇంతలో సంగీతము వినిపింప నారంభించెను. ఇదివఱకు ముంపువచ్చినప్పు డయిదునిముసములవఱకుఁ బట్టుకొనశక్యము కాకుండెడిది. వరాహమిహిరుఁడు భయపడ నారంభించెను. వెనుకకుఁ దిరిగి పోద మనుకొనుచుండెను. ఇంతలో నా

ముంపు వెనుక పట్టెను. తల్లిదండ్రులు సంతోషించి లోనికిఁ బోయిరి. రాత్రి రెండు జాములగు వఱకు సంగీతసభ జరిగెను. అంతసేపు వేదవతి దగ్గలేదు. సభాంతమున నా గాయకుఁడు వచ్చి వరాహమిహిరునకు నమస్కరించెను. "అయ్యా! జగద్విదితమైన తమ కీర్తి విన్నాను. నేఁడు నా జన్మ చరితార్థమైనది. తమవంటి పండితుల యాశీర్వాదబలము నాకుఁ గావలయును." అని యతఁడు విన్నవించెను. వరాహమిహిరుఁడాతనితోఁ దన కూఁతును గూర్చి చెప్పెను. వారము దినములుగా నామె బాధపడు చున్నది. అకృతమున తమ భార్యాభర్తలకు నిద్రలేదు. కునుకు పట్టఁబోవుచుండఁగా బిడ్డకు దగ్గుతెర వచ్చును. అట్టి స్థితిలో నొక యామకాలము వాని సంగీతము వలన నామెకు దగ్గుతెర రాలేదని, యతనికిఁ దానే కృతజ్ఞుఁడనని వరాహమిహిరుఁడు చెప్పి తన యింటి కాహ్వానము చేసెను. ఆ గాయకున కంతకన్న కావలసిన దేమున్నది ? తన సంగీతమును వరాహమిహిరుఁడు మెచ్చికొన్నాఁడని తన యింటికిఁ బిలిచినాఁడని తాను వంద గ్రామములలోఁ జెప్పికొనవచ్చును. క్షత్రియుఁడైన యా గృహస్థు గాయకుని కెదో సన్మానము చేసెను. గాయకుఁడు తన వీణతో వరాహమిహిరుని యింటికిఁ బోయెను. ఆరాత్రి యచటనే శయనించెను. తెల్లవారుజామున వేదవతికి మఱల దగ్గు తెర వచ్చెను. రాత్రి వారు వచ్చు వేళకుఁ దాను మలహరి పాడు చుండెననియు, నామె దగ్గు తగ్గెననియు విన్న గాయకుఁడు నెమ్మదిగా లోగొంతుతో మలహరి రాగ మాలపించెను. ఆమె దగ్గు తగ్గిపోయెను. గాయకుఁ డాశ్చర్య

పోయెను. వరాహమిహిర దంపతు లాశ్చర్యపోయిరి. మఱు నాఁడేమియు జరుగలేదు. గాయకుఁడు వెడలిపోవుదుననెను. నాల్గుదినము లుండుమని వరాహమిహిరుఁడు బలవంతము చేసెను. ఆ పిల్లవిషయ మట్లుంచి యంతటి పండితుఁ డుండు మన్నచో నుండకుండుట యెట్లు? అతఁ డుండిపోయెను. ఆ గాయకుఁ డామఱునాఁడు పోవును. అతఁడున్న మూఁడవ దినమున వేదవతికి జ్వరము వచ్చెను. ఆ వచ్చుటలో ముంపుగా వచ్చెను. ఆమె కేది వచ్చినను ముంపుగానే వచ్చును. దాని కౌషధములేదు. కొన్నాళ్ళుండి పోవును. వరాహమిహిరుఁడు వేదవతి సంగతి యంతయు నాగాయకునితోఁ జెప్పెను. గాయకుని కొక యూహతట్టెను. ఒక రాగముతో దగ్గు తగ్గినపుడు మఱియొక రాగముతో నీ జ్వరము తగ్గునేమోయని. అతఁడు సమర్థుఁడైన గాయకుఁడు. అతని గురువొక సన్న్యాసి. హిమాలయ పర్వతములలో నివ సించును. ఒక్కొక్క ఋతువున నొక్కొక్క రాగము పాడ వలయును. ఒక్కొక్క వేళయందొక్కొక్క రాగము పాడ వలయును. ఈ స్వరము వివృద్ధమైయున్న యీ రాగము పాడుటచేత నీ దోషము నివారితమగును. గుణము వృద్ధి పొందును. మొదలైన జ్ఞానము న్నదని యాగురు వీశిష్యునకుఁ జెప్పెను. అతఁడు విన్నదే గాని దానినట్లభ్య సించినదిలేదు. జీవనయాత్రకుఁ గొంత నేర్చికొనెను. దేశము మీఁదఁదిరుగు చుండెను. వేదవతి యొద్దఁ గూర్చుండి యతఁడయిదాఱురాగము లాలపించెను. ఒకరాగ మాలపింపఁగా నామె జ్వరము తగ్గిపోయెను. ఆరాగ

మును గుర్తుపట్టికొనెను. ఆ యూరిలో నెవఁడో యొక చిన్న గాయకుఁడు కలఁడు. దగ్గు వచ్చినపుడు జ్వరమువచ్చినపుడు వానిచేత నీరెండు రాగములు పాడించుకొనవలయునని యతఁడు వరాహ మిహిరునితోఁజెప్పి యాగాయకుఁడు వెడలిపో నుద్యమింపఁగా వరాహమిహిరుఁ డిట్లనెను. 'ఓయయ్యా! నీవు వెడలిపోవుదువు. ఏడేండ్లుగా నీబాలికతో మే మీబాధ పడుచున్నాము. నేనామె జాతకమును చూచితిని. నాకంతుకట్టలేదు. ఈమె కెనుబది యేండ్లాయూయుర్దాయమున్నది. ఇదియొక చిత్రమైన జాతకము. నాకాశ్చర్యము కలిగించుచున్నది. ఈపిల్ల జాతకములోనున్న విషయము లెట్లు సంభవించునో నాకుఁదెలియదు. అవి యన్నియు నితరులతోఁ జెప్పెడివికావు. నేను గ్రహమండలోపాసకుఁడను. నా యుపాసనా స్వరూపము వేఱు. నేను చేయుచున్నది పాపమేమో నాఁకు దెలియదు. నాపాపము నన్నీపిల్లరూపమునఁ గొట్టినది. నాకన్నోదకములకు లోపములేదు. ఇచ్చటి పదిగ్రామములకు నరేంద్రసింహుఁడు రాజాధికారి. నే నేదడిగిన నది యాయనయిచ్చును. ఈవిద్యలో నీగురువు మహాఖండుఁడని చెప్పితివి. నీవుపోయి యాయన నిచ్చటికిఁ దీసికొనిరమ్ము. ఏదికావలసినది యిత్తును. నీకాఱు నెలలు పట్టినను నేయాఱునెలలలో నీవితరత్ర సంపాదించునది నీకిత్తును. ముందర కొంతయిత్తును. నాకీపని చేసిపెట్టుమని యభ్యర్థించెను. గాయకుఁడిట్లనెను. 'నాగురువు సన్యాసి. అతనికి లోకముపట్టదు. నేను సంగీతవిద్య యాయనయొద్ద నభ్యసింపలేదు. పట్టణములలోననే నేర్చికొంటిని. ఒకసారి హిమాలయ

పర్వతములకుఁబోఁగా నాయదృష్టవశమున నాయనను గలిసి కొంటిని. ఆయనకు సంగీతవిద్య తెలియునని నాకుఁదెలియదు. ఏదియయిన నుపదేశము చేయునేమోయని యాయన ననుస రించితిని. ఆయన తన తపశ్శక్తిచేత నేను సంగీతవిద్య నభ్య సించితినని తెలిసికొనెను. నన్నొకరాగముపాడు మీరాగము పాడుమని యడుగఁగా నేను నివ్వెఱపోయి పాడితిని. ఆఱు నెలలాయనయొద్ద శుశ్రూష చేసితిని. అనఁగా నాయన నాకు సంగీతమునందలి విశేషములు చెప్పిన దాఱురాత్రులు. మఱి యొక ఉపదేశము లేదు. ఆమహాయోగి కరుణాకటాక్షమువలన నాసంగీతమునం దీశక్తి కలిగెను. ఈసంగతి నాకిప్పుడు తెలిసి నది. ఆయన పూర్వమొకచోట నుండెడివాఁడు. మానససరో వరమునకు నుత్తరముగానున్న పరమకాంభోజ దేశములు శిబిదేశము కలసియున్నచోట నొక యడవిలో హిమవత్పర్వ తముమీఁద నేనాయన దర్శనము చేసితిని. అచటికి దశార్ణ దేశములలోనుండి పోవలయును. మీరింతటి మహాపండితులు: మీరడుగుటయు నేను కాదనుటయు జరుగదు. నేను మఱల నాయోగిని సందర్శింతును. ఆయన యచ్చటనే యున్నచో నీమెసంగతి చెప్పుదును. వచ్చినచోఁ దీసికొనివత్తును. బాలి కనే యచ్చటకుఁ దీసికొనిరమ్మనినచో, మీ రచ్చటికి వచ్చు టకు సిద్ధముగానుండిరో లేదో నాకుఁదెలియదు. అనఁగా వరాహమిహిరుఁడు వానికిఁ గొంతధనమిచ్చి పోయిరమ్మనెను. అతఁడు నాల్గునెలలలోఁ దిరిగివచ్చెను. యోగిరాలేదు. కాని యొకవార్త తెచ్చెను. ఆబాలికకుఁ ద్రిసంధ్యలయందు వేదము వినిపించుచుండవలయును. ప్రాతఃకాలముల యజుర్వేదము,

మధ్యాహ్నములయందు ఋగ్వేదము, రాత్రులయందు సామ వేదము, ప్రతిదినముఁ ప్రతివేళ రెండుగడియలపాటు వినిపించి నచోఁ బదియేండ్లు నిర్విఘ్నముగ వినిపించినచో నామెకు భయములేదు. ఏవ్యాధియునురాదు. తరువాత నామెనువ్యాధి తాఁకలేదు.

ఆయూరిలో వేదపాఠకులు లేరు. అందఱును జ్యోతి ష్కులు. అందఱును సిద్ధాంత స్కంధమునందే పండితులు. అనఁగా గణిత స్కంధవేత్తలు. మఱియునున్నచో సంహితా స్కంధవేత్తలు కలరుగాని జాతకస్కంధవేత్తల సంఖ్యగూడ తక్కువ. జాతకస్కంధముగూడఁ దెలిసినవాఁడు వరాహ మిహిరుఁడొక్కఁడే. ఆగ్రామమునందు సర్వగ్రహములు సర్వ కాలమును వరాహమిహిరాకారమున దిగినదని పండితుల నానుడి. ఆయన ప్రతిష్ఠ యంతయింత యనరాదు. నరేంద్ర సింహుని దయావిశేషమున నెలదినములలో మూఁడు వేద ములలో నారితేఱిన ముప్వురు వేదపాఠకుల కుటుంబములు వచ్చి యాయూరిలో నెలవేర్పరచుకొనెను. ఈపని జరిగి యప్పటికాఱు నెలలైనది.

తరువాత గుర్తుపెట్టుకొనఁబడిన యొక మహావిషయ మిందుగలదు. అదియొక యాశ్చర్యము. వేదవతికిఁ దత్పూర్వ మేడు సంవత్సరములు చిన్నచిన్న జబ్బులుచేయుచునే యుండెను. ఒకప్పుడు జబ్బుగా నుండును, ఒకప్పుడు తగ్గుగా నుండును. ఒకప్పుడది దగ్గు, ఒకప్పుడు జ్వరము, ఒకప్పుడు కన్నులు లోనికిఁ బోవును. మఱియొకప్పుడు కాళ్ళు పీలపడుట, వేఱొకప్పుడు చేతులాడకుండుట. మొదటి నాలుగేండ్లు

వరాహమిహిరుఁడు గుర్తుపట్ట లేదుగాని తక్కిన మూఁడేండ్లు వేదవతికి నే వ్యాధి యెప్పుడు వచ్చెను? ఎన్నాళ్ళుండెను? వీని వైనము వ్రాయఁ జొచ్చెను. ఆ వ్రాసిన దట్లుండెను. ఇట్లుండఁగా నుజ్జయినీ నగరమున విక్రమార్క చక్రవర్తి కిల్కిల యవనులతో యుద్ధముచేసిన వేళ, కిల్కిల యవనుల చక్రవర్తిని సంహరించుటకుఁ జాల ప్రయత్నములు చేసిరి. ఒకప్పుడు చక్రవర్తి ప్రాణములే సంశయగ్రస్తము లనిపించెను. మఱియొకప్పుడు కొన్నాళ్ళకుఁ జక్రవర్తి దశార్ణదేశము మీఁదికి దండెత్తెను. ఆ దేశములకు దక్షిణమున శతద్రూనది యెల్లగానుండెను. అచట శతద్రువు మహా శిలామయ భూములలోఁ బ్రవహించు చుండును. సైన్యము లానదిని తరించుట దుస్సాధ్యము. పది దినములు చక్రవర్తి సైన్యము తీరముననే యుండెను. కదలలేకపోయెను. వేదవతి పాదములు పీలవడి నడువలేకుండ నున్నదినము లాపది దినములు. ఇట్లు కొన్ని సరిపోయెను. మఱియు నొకప్పుడు వేదవతికిఁ దీవ్రమైన శిరోవేదన కలిగెను. వరాహమిహిరుఁ డావేదనాకాలమును వ్రాసిపెట్టెను. అదియొక చమత్కారముగా నుండెను. ఆ నాటికిఁ దూర్పుబాహ్లీకముల నుండి యవనులు సంపూర్ణముగా రుమ్యక దేశములకుఁ బోలేదు. కొందఱు యవనులు బ్రాహ్మణ వేషములు ధరించి, యవనులు కానట్లు మెలఁగఁ జొచ్చిరి. ఒక బ్రాహ్మణుఁడు వారి పేర్లతో సహా రాజాధికారులు వారలను బంధించుటకు గుర్తులు పెట్టెను. ఆ యవనులు పదిమందియు నా బ్రాహ్మణుని మడియించుటకుఁ దీవ్ర ప్రయత్నములు చేసిరి. చివర కా బ్రాహ్మణుని వధిం

చిరి. ఆ పది మందిని రాజాధికారులు బంధించిరి. ఈ విష యము విక్రమార్క చక్రవర్తి వఱకు వెళ్ళెను. ఆ పదిమంది నుజ్జయినీ నగరమునకుఁ గొని పోయిరి. అచట నొక చమత్కారము జరిగెను. చక్రవర్తికి వశులై "మేము మీ రాజ్యమునందే యుందుము. మీకు ద్రోహము చేయము. మా యాచారములు మేము పాటించుకొందుము. మేము రాజభక్తితో నుందుమని చక్రవర్తి యనుమతి పొంది సుఖముగా జీవించు గొందఱు యవనులు వారిని తమ కప్పగింపుడని విక్రమార్కు నభ్యర్థించిరి. విక్రమార్కుఁ డీపదిమందిని వారి కప్పగించెను. ఆ యవనులలో సిద్ధాంతరాద్ధాంతములు జరిగి కొందఱు రహస్యముగా వారిని వధించిరి. ఈ సమయమున వేదవతికి శిరోవేదన కలిగెను. ఆ బాధ తగ్గిన తరువాత కొన్నాళ్ళ వఱకామె కోలుకొనలేదు. అచటనచట నిట్లు జరుగుచున్న కాలమునకు నీమె యీ శరీరబాధలకు సంబంధమున్నదో లేదో వరాహమిహిరుఁడు గుర్తుపెట్టికొనెను. అప్పుడప్పు డితరులతోఁ జెప్పుచుండును. ఈ వేదవతి నిజముగా వేదవతి యని జనము చెప్పికొన నారంభించిరి. ఆఱు నెలలుగా నామె త్రిసంధ్యలయందు జరుగుచున్న వేదపాఠమును వినుచుండెను. ఆమెకు వ్యాధి లేదు. సుఖముగాఁ గాలము గడచుచుండెను. కాని యీ వేదపఠనము నిరంతరముగా జరుగుట కష్టముగా నుండెను. సామవేదవేత్త యొక్క తల్లి చనిపోఁగా పండ్రెండు దినములామెకు సామవేదము వినిపించుట జరుగలేదు. అప్పుడామెకుఁ గలిగిన యాపదయు లేదు. దానినిఁబట్టి తక్కిన యిద్దఱు వేదపాఠకులు

గూడఁ దమ కితర కార్యములున్నప్పు డపుడపుడప నీ వేద పాఠమును మాని వేయుచునే యుండిరి. ఈ యాఱు నెలలలోఁ జక్రవర్తి రాజ్యము సువ్యవస్థిత మయ్యెను. దరద కటక శక సింహపుర గాంధార దేశములు రాజునకు వశమైన నీ యాఱు నెలలలోననే. చక్రవర్తి సైన్యములు తిరిగి పోయెను. వీరందఱు సామంతులైరి. వేదవతి సుఖముగా నుండెను. విక్రమార్క చక్రవర్తి వెడలిపోయెనన్న సంతోషముచేత నే రాజున కా రాజు తన రాజధాని యందు సర్వ రాజోద్యోగులను, పండితులనుఁ బిలిచి పెద్ద పెద్ద సభలు చేసిరి. తిరిగి తిరిగి రాజులు పండితులను రాజోద్యోగులనుఁ బిలిపించి యేవో యేవో సభలు చేయుచుండిరి. ఈ యవన భిక్షుకుఁడు వచ్చినప్పుడు తద్గ్రామస్థ రాజోద్యోగులును, వరహామిహిరాదులైన పండితులును నట్టి సభకొఱకే సింహపురము పోయిరి. సింహపురాధీశుఁడు సర్వ పండితులును రావలయునని యాజ్ఞాపించెను. వరాహామిహిరుఁడు తన మువ్వురు వేద పండితులను గూడఁ దీసికొనిపోయెను.

యవన భిక్షుకుఁడు తానొక గడప ముందు నిలుచును. లో నుండి వచ్చిన స్త్రీల వంకఁ బిల్లలవంకఁ జూచును. మఱల సాగిపోవును. ఇతరుల వంకఁ జూడఁడు. కొన్ని యిండ్ల ముఁందు వానికి నీరాజనము లిచ్చిరి. క్షత్రియుల గృహముల ముందు, బ్రాహ్మణుల గృహములముందట్టిది జరుగలేదు. అతఁడు నాల్గువీధులు కలిసినచోట తప్ప పాడుటలేదు. ఎవరివాకిట ముందో నిలచినపుడు పాడును. నాల్గు వీధుల మొత్తము మీాద నాల్గు ముంగిళ్ళ ముందే నిలచెను. అచటనే

పాడెను. పాడినపుడు లోనుండి స్త్రీలును, బాలురును, బాలికలును వచ్చిరి. చూచి పోయిరి. అతఁడును సాగిపోయెను. వరాహమిహిరుని యింటి ముందు నిలచెను. పాడెను. లోనుండి యా పండితుని భార్యయు, వేదవతియు వెలికివచ్చిరి. అతఁడు వారి యిద్దఱి వంకఁ జూచెను. వాని పాట వినుచునే వేదవతి కన్నులు గిరగిర తిరిగెను. వాఁడు వెంటనే పాట నాపివేసెను. ఇది యెవ్వరికినిఁ దెలియదు. అతఁడు రెండు మూఁడులిప్తల పాటాగి మఱల నింకొక ఫణితిగల కీర్తన మొదలు పెట్టెను. వేదవతి కనులు నిశ్చలములయ్యెను. కూతురు ముందున్నది. తల్లి వెనుక నున్నది. ఈ సంగతి తల్లికిఁ దెలియదు. తల్లి కెందుచేతనో తన యొడలి యందు స్తంభముదయించినట్లు కనిపించెను. వీఁడెవఁడో బైరాగి. మాయలమాఱి వాఁడు. ఇంటిలో భర్తలేఁడు. ముప్వురు పండితులును లేరు. పాలివాఁడు రాత్రులందు వచ్చి పండుకొనును గాని పవలు రాఁడు. వీనితో నేమియని యామె పిల్లను వెనుకకు లాగి తలుపు వేసి లోనికిఁ బోయెను. వాఁడు పాడుచునే వెడలిపోయెను. తరువాత వాఁడేమయ్యెనో యెవరికినిఁ దెలియదు.

ఆ మఱునాటి రాత్రి వేదవతి తల్లికి గాటమైన నిద్ర పట్టెను. వాకిట పండుకొనిన పాలికాపునకు వాని యొడలు వానికిఁ దెలియదు. వీధి వీధి యంతయు నోడలు మఱచి నిద్రపోయి నట్లున్నది. మఱునాఁడు కొందఱు బాలికలును బాలురును రాత్రి నడిజాము దాటిన తరువాత నా యవన సిద్ధుఁడు వచ్చి వీధిలోఁ బాడినట్లు వినిపించినదని చెప్పిరి.

తెల్లగ తెల్లవాఱె వేదవతి తల్లి మేల్కని పిల్లకొఱకు వెదకెను. ఆమె మంచము మీఁద లేదు. దొడ్లు త్రోవలు వెదకెను. పిల్ల కనిపించలేదు. పాలివానిని మేల్కొల్పెను. నాకు బండనిద్దుర పట్టెను. నాకేమియుఁ దెలియదని వాఁడనెను. వీథితలుపు తెఱచియున్నది. గడియమాత్రము తీసియున్నది. తలుపుదగ్గఱకు లాగఁబడియే యున్నది. అది వర్షాకాలమగుటచేత వాకిట బురదగా నుండుట చేత నా వెనుకటి సాయంకాలముననే యామె పాలివానిచేత వాకిట మన్నుపోయించెను. ఆమంటిమీఁద గృహమునుండి వెడలిపోయిన వేదవతి పాదచిహ్నములు కనిపించుచుండెను. వీథిలోనికిఁ బోయినతరువాత బహుజనుల పాదచిహ్నములందివి యంతరించిపోయెను. అది ప్రధానముగ క్షత్రియగ్రామము. అన్నోదకములకు లోపములేని బ్రాహ్మణ కుటుంబములయందుఁ గూడ స్త్రీలు క్షత్రియ స్త్రీలవలె నసూర్యంపశ్యలుగానుందురు. ఆమె పూర్వీకులు కదలి యెఱుఁగరు. తాను వీథిలోనికివచ్చి యిల్లిల్లు వెదకినది. అందఱి నడిగినది. ప్రతిరాజగృహమునకుఁ బోయినది. వార్త యంతయుఁ జెప్పినది. మూన్నాళ్ళక్రిందవచ్చిన యాయవన మాయాయోగినిఁగూర్చి యందఱకునుఁ దెలిసినది. గ్రాము ములోనున్న పురుషులందఱు వెదకినచోటు వెదుకకుండఁ దిరిగిరి. బావులన్నియుఁ బరీక్షింపఁబడెను. ఊరిచివరనున్న తటాకమునందు జనులు మునిఁగి లోని బురదయంతయు గాలించిరి. నాల్గుదినములు గడచెను. వేదవతియొక్క సూచనయులేదు. తల్లి కృశించిపోవుచుండెను. ఆహారము

లేదు. గృహములో వంటలేదు. ఇరుగుపొరుగమ్మలువచ్చి బతిమాలిపెట్టిన యన్నమును మూఁడవదినమున స్పృశించి నట్లు స్పృశించి పరిత్యజించెను. పాలివాఁడు వాకిలి మాత్రి మూఁడ్చుచుండెను. వాఁడు రెండుపూటలు గోవును పాలు తీయుచుండెను. నాల్గు దినముల పాలు నట్లే యుండెను. ఇంటిలో నిప్పులేదు. ఇల్లూడ్చిన జాడలేదు. నాల్గవనాఁటి మధ్యాహ్నమున గ్రామములోని రాజోద్యోగు లందఱును వచ్చిరి. వరాహమిహిరుఁడు వచ్చెను. తక్కిన పండితులు వచ్చిరి. మువ్వురు వేదపాఠకులు వచ్చిరి. ఇల్లు బావురు మనుచుండెను. వరాహమిహిరునకు దారిలోననే యీ వార్త తెలిసెను. ఆయన భార్యనుఁ జూచెను. ఆమె కేడ్చుటకుఁగూడ నోపిక లేకుండెను. ఆయన యామెను నేద దీర్చి కొంతసేపటి కిట్లనెను. "పిల్లకు ప్రాణభయము లేదు. ఆమె కెనుబదియేం డ్లాయుర్దాయమున్నది. ఆమె భ్రష్టురాలు కాదు. ఆమె నితరులు స్పృశింపలేరు. తెలియునుగదా నీకు వేదవతి కిష్టములేకుండ నామెను స్పృశించినచో జనులు మరణింపవచ్చును. నీవు కోపముతో నొకసారి యామెను గొట్టినపుడు నీవు మూర్ఛపోయితివి. ఆమె నెవ్వరు నేమియుఁ జేయలేరు. ఆమె జాతకము నాకుఁ దెలియును. పదియేండ్లామె తలిదండ్రులను బాసియుండవలయును. ఇట్టి పని యెప్పుడో జరుగునని నాకుఁ దెలియును. ఇది జరుగుటకు మఱియొక సంవత్సరము పోవలయుననుకొంటిని. నాగణితముకంటె వాని గణితమే గొప్పది. వాఁడెవఁడో వట్టి సిద్ధాంతి కాదు. నేను వట్టి సిద్ధాంతిని. వాఁడు యోగశక్తి కలవాఁడు. కాలమునుగూడ

మళ్ళింపఁగలవాఁడు. అధికుఁడైనవాఁడు ప్రత్యర్థియయినప్పుడు మన మేమి చేయఁగలము? కాలమునకుఁ గట్టువడియుండవల యును. పైగా నిది చక్రవర్తియొక్క కార్యము. త్రయీ దేవతయొక్క కార్యము. ఆ వేదదేవత నన్ను ప్రతారించు చున్నది. ఇట్టి మాటలచేత క్రమక్రమముగా వేదవతి తల్లి యుపశమించినది. పది దినములగువఱకు నామె నిలువ త్రొక్కుకున్నది. పదియేండ్ల తరువాత తన కూఁతురు తనకు దక్కునన్నయాశ యామె కంకురించినది. ఓహో! ఏమి యాశ? పదియేండ్లకామె మఱల లభించునా? ఇపుడామెకు తొమ్మిదేండ్లు. అపుడామెకు నిరువది యేండ్లు వచ్చునా? ఆమె పెండ్లిమాట యేమి? ఆ తల్లి మఱల మఱల రోదిం చును. మఱల మఱల సర్వాంగములయందు శక్తి యుడిగినట్లు చదికిలబడును. భర్తతో నిట్లనును. మీరు మహాపండితులు. మీ లెక్క కందని [illegible] తాకాశములేదు. అయ్యో! ఆకాశ మునందు మూలమూలలు మీకుఁ దెలియునే? భూమిమీఁదఁ దెలియదా? వాఁడెవ్వఁడో పరమ దుర్జాతి. వానికి మన గ్రామము తెలిసెను. మన యిల్లు తెలిసెను. మీకు వాని నివాసము తెలియదా? ఆమె యిట్లు విలపింపఁగా భారత దేశమున సూర్యగ్రహమువలె నున్న వరాహమిహిరుఁడు తన యింటిలో మిణుగురు పురువయ్యెను. ఓహో! ఏమివిద్య! ఒక్క విద్య తనయంతట తాను సర్వజ్ఞానమూర్తి కాదు. అనంతవిద్యల సమ్మేళనముచేతఁగాని యొక యాథార్థ్యము తెలియదు. ఒక నిశ్చయము కలుగదు. వట్టి గణితమేమి చేయును? ఇది యిదియని తెలుపును. అది యెప్పుడెచట

నెట్లుగునో చెప్పలేదే! ఈ లౌకిక విద్యలచేత నేమి ప్రయోజనము? ఆత్మవిద్యయందు, యోగవిద్యయందు వీని పరమార్థమున్నది. వాఁడు వేదబాహిరుఁడు. కాని యోగశక్తి కలవాఁడు, యోగదృష్టి కలవాఁడు. వానికిఁ గనిపించినట్లు నాకుఁ గనిపించుటలేదు. నేను పట్టిపాండిత్యాహంకారముచేత దుష్టుఁడనై పోతిని. అశక్తుఁడనై పోతిని. నా గణితము తప్పిపోయెను. నా గణితము తప్పిపోవుట యేమి? వాఁడు తన యోగశక్తిచేత గణితముచేత ఋజునయిన కాలమును వక్రింపఁజేయ సమర్థుఁడై యుండెను. అట్టి సామర్థ్యముండునా? అవును కాలమును మహర్షులు మలచిరి. సుమతియన్న పతివ్రత సూర్యగమనము నాపెను. జాతకభాగము సిద్ధాంతభాగమంత నిశ్చిత గణితఫలముకాదు. జీవుల జాతకములు తత్తత్క్రియా సూచకములు. ఒకవేళ నొక ఫలితము జరిగినచో దాని ననుసరించి యితర ఫలములు జరుగును. అది జరుగక వేఱొకపని జరిగినచోఁ దరువాత దానిననుసరించి వేఱఫలములు జరుగును. గండము దాటినచో యోగముండును. దాటనిచో నా లిఖింపఁబడియున్న యోగ ప్రసక్తి లేదు. గండము దాటుటయు దాటకపోవుటయు నా జీవియొక్క పూర్వపుణ్యాతిశయముమీఁద నాధారపడియున్నది. వెనుకటి యాఱుజన్మల తెలివిలేకుండ నీ జన్మలో నీ జాతకము తెలియుట చాల కష్టసాధ్యమైన విషయము. గ్రహములు సూచించును. ఫలితమును నిశ్చయపఱచి చెప్పలేరు. కొన్ని చెప్పును. కొన్ని చెప్పవు. కొన్ని గ్రహముల సంయోగము నిశ్చిత ఫలమును వాదించును. ఒక గ్రహసంపుటి కొన్ని ఫలితము

లను సూచించును. అవి జరుగవచ్చును. జరుగక పోవచ్చును. లోకములో మానవుల జాతకములు వారి పూర్వకర్మలతో ముడివడియుండును. నాకూఁతు జాతకము వేదధర్మముతో ముడివడియున్నది. పుణ్యాపాపములతో ముడివడియున్నది. వేద ధ్వనితో ముడివడియున్నది. సంగీతముతో ముడివడి యున్నది. అనంతధ్వని వికారమైన కాలతత్త్వముతో ముడి వడి యున్నది. అవికారియైన బ్రహ్మపదార్థము ఓంకారరూప మైన శబ్దమయాత్మగా వికారమెట్లు పొందినదో పాంచభౌతిక మైన యీామె శరీరముగా నీ వికారము నందినది. ఈమె వేదము. ఈమె ధర్మము. ఈమె కాలము. ఈమె ఓంకారము. ఈమె వేదపురుషుని వికారమయాకృతి. ఆమె జాతకమును నేనా పట్టుకొనఁగలను? విక్రమార్కచక్రవర్తివంటి వేదమయ మూర్తి పట్టుకొనవలయును. పట్టుకొనఁగలఁడో లేఁడో! పాలింపఁ గలఁడు !.

## ఏడవ యధ్యాయము

బాహ్లిక యవనులలో వింధ్యశక్తియు నందియశుఁ డును ప్రసిద్ధులు. నందియశుఁడు దిమిత్రునిమనుమఁడు, దౌహి త్రుఁడు. ఈ నందియశుఁడు పురీకరాజ్యమును నిర్మించెను. అతని వంగడమున ప్రవీరుఁడను నొక మహావీరుఁ డుదయిం చెను. అతఁడు చుట్టుపట్టులనున్న రాజ్యములను గెలిచి పెద్ద రాజ్యమును స్థాపించెను. అతఁ డశ్వమేధమును చేసెను. ఈ బాహ్లిక దేశమునే పాశ్చాత్య దేశస్థులు బాక్ట్రియా అని

చెప్పుదురు.. వారు యవనులు. యవనులనఁగా భ్రష్టులైన క్షత్రియులు. వారిలోఁ గొంతమంది మఱల వేదధర్మము నవలంబించువారునుగలరు. అందుకనియే ప్రవీణుఁడు సుక్షత్రియునివలె నశ్వమేధయాగమును చేసెను. సర్వకాలముల యందు మ్లేచ్ఛులైనవారిలోఁగూడ నెవరో కొంతమంది వేద ధర్మాభిలాష కలవారుందురు. జీవులయందు సత్వపదార్థము యొక్క యాధిక్యమున్నచో ఆ జీవుఁడు పుట్టినచోటు రజస్తమోగుణదూషితమైనను వీఁడు మాత్రము సత్క్రియాచరణము చేయుచుండును. సింహములు తోడేళ్ళు వ్యాఘ్రములు కలవు. అవి యథేచ్ఛముగ జంతువులను వధించి తినును. సామాన్యముగా నీ క్రూరమృగములు తామొక వేఁటను వేసి నెత్తురుత్రావి వెడలిపోవును. మఱునాఁడా మాంసమును భుజించుటకు వచ్చును. రెండుమూనాళ్ళు వచ్చును. వేటకాండ్రు వాని యీ యలవాటు తెలిసికొని వధింపఁబడ్డ జంతువునకు సామీప్యమున మాటుపెట్టి కూర్చుందురు. సమీపమున వృక్షమున్నచో దానిపైన మంచెలు నిర్మించి కూర్చుందురు. నూటికి కోటికొక పులి మూఁడవ దినమున రానేరాదు. దానికి భయమెక్కువో, నిలువయున్న మాంసము తినదో, ఈ రెంటిలో నేదైనను తత్పుండరీకముయొక్క జీవలక్షణములో నొక విశేషమున్నదని చెప్పవలయునుఁగదా! మఱికొన్ని హింస్రమృగములు కొట్టినచోటనే కొట్టవు. స్థలములు మార్చిమార్చి వేటాడును. వాని జీవలక్షణమునందది యొక అధికమైన వివేకము. భయాధిక్య సూచకము. ఆలోచనా లక్షణము. వ్యాఘ్రాదులయందే యిట్టిది భాసిం

చుచుండఁగా మానవులం దేల భాసించదు! కిరాతులయందొక సాధువుదయించును. హరిజనులయందు మహాభక్తు లుదయింతురు. అది ఆ జీవుని ప్రత్యేక లక్షణము. కాని జాతి లక్షణము కాదు. మ్లేచ్ఛులయందుకూడ వేదధర్మాభిలాషకలవారు జన్మింతురు. వేదధర్మాభిమాను లుదయింతురు. మ్లేచ్ఛధరాధిపుఁడైన ప్రవీరుఁ డశ్వమేధ యాగముచేయుటేమి? అశ్వమేధయాగము చేయించినవారెవరు? బ్రాహ్మణులు. భ్రష్టుఁడైన ప్రవీరుని యాగమునందు బ్రాహ్మణులాధ్వర్యము నెట్లు వహించిరి? త్రిశంకుని కథయున్నది కదా! వశిష్ఠునిచేత నతఁడు పంచముఁడుగా శపించఁబడెను. విశ్వామిత్రుఁడతని చేపట్టెను. ఎందుకు చేపట్టెను? వశిష్ఠమహర్షి యందలి స్పర్థచేత చేపట్టెను. ఒక ధర్మకార్యాచరణమునందు కూడ స్పర్థయా! స్పర్థచేత నధర్మమును ధర్మముగా భాసింపఁజేయుదురా? స్పర్థ యెటువంటిదో ధనాశయు నటువంటిదే. స్పర్థయు మాత్సర్యమును ధనాశకంటె నధమ గుణములు. ధనము జీవనాధారమైనది. స్పర్థయు మాత్సర్యమునుమానిసి బ్రదుకుటకు జీవనాధారములు కావు. అవి జీవగతమైన దుర్లక్షణములు. తనకుఁ గాని తన శత్రువునకుఁ గాని లాభదాయులు కావు. ధనము తనకు లాభదాయి. ఆ బ్రాహ్మణులు భ్రష్టుఁడైన యవనరాజు చేత క్షత్రియోచితమైన యశ్వమేధ యాగమును ధనాశచేత చేయించిరి. మఱియు నిందులో నొక విశేషము కలదు. ఇతఁడు పూర్వము క్షత్రియుఁడు. వీని పూర్వులు చెడిపోయిరి. ఇతఁడు బాగుపడుటకు వాంఛించుచున్నాఁడు. భ్రష్టులైనవారికి ప్రాయశ్చిత్తములున్నవి

ఇవి తుమ్మ చెట్టును మామిడిచెట్టును చేయలేరు, గాని చెడి పోయిన మామిడిచెట్టునకు ఎరువులు వేసి దోహదములుచేసి బాగుపర్చ వచ్చును కదా. యవనులలో వేదధర్మాభిమానులు కలరనుటకు ప్రవీరుఁడు ప్రబలసాక్ష్యము.

వరాహమిహిరుఁడు విక్రమార్క చక్రవర్తితో మాటాడిననాఁడు చక్రవర్తి తపోమందిరమునకుఁ బోవుచు పదిమంది గూఢచారులను బిలిచి పంపించిన వారిలో మిత్ర గుప్తుఁడొకడు. అతడుత్తర జ్యోతిషములకుఁ పంపింపఁబడెను. గూఢచారి దళాధినేత. వాని నుత్తర జ్యోతిషములకు బోయి రహస్యాయుధాగారము లెచట నున్నవో కనుగొని రమ్మని పంపెను. మిత్రగుప్తుఁ డుత్తర జ్యోతిషమునకు వెళ్లెను. రెండు నెలలు తిరిగెను అతఁడట్టి నెలవుల సూచనయు కనిపెట్టలేక పోయెను. ఒకనాఁడతఁడు విసిగివేసారి దిక్కులేక యొక యవన దేవతానాగమందిర బహిర్వితర్దిక మీఁద నొడలు తెలియక నిదురించుచుండఁగా నతని కొక స్వప్నము వచ్చెను. అతఁడు స్వప్నాంతమున మేల్కొనలేదు. తెల్లకు తెల్లవారి మేల్కొనెను. మేల్కొనిన వెంటనే స్వప్నము గుర్తునకు రాలేదు. కొంతసేపటికి గుర్తువచ్చెను. ఆ స్వప్నము చిత్రముగా నుండెను. ఆ స్వప్నములో తనకు నెవరో కన్పించిరి. ఇద్దఱు మువ్వురు కన్పించిరి. అందులో నొకఁడు చక్రవర్తి యేమో అనిపించెను. అతఁడు మఱల మఱల జ్ఞాపకము చేసికొనెను. ఎంత జ్ఞాపకము చేసికొన్నను సూటిగా జ్ఞాపకము రాలేదు. లీలగా నొక్కమాట జ్ఞాపకముండెను. వాఁడు చెప్పిన మాటలలో రామఠదేశము యొక్క

పేరు వచ్చినది. అది యొక్కటియే జ్ఞాపకము. అంత బండ నిద్దుర పట్టినది. తనకు నియమింపఁబడిన కార్యము నందలి వైయర్థ్యముచేత పవలెల్ల తాను పడిన శ్రమచేత రెండు దినముల నుండి అన్నములేక ఆనాఁడే కడుపునిండ అన్నము తిన్న కారణముచేత వాని యొడలు వానికి తెలియలేదు. అట్టి గాఢ నిద్రలో వచ్చిన స్వప్నము రూపుకట్టలేదు. కాని రామకదేశమన్నది బాగుగా స్మృతిపథము నందున్నది. ఇతఁడు పూర్వము ఒకటి రెండు పర్యాయములు గూఢవృత్తి మీఁద రామకమునకుఁ బోయెను. మిత్రగుప్తుఁడు పాటలీపుర నివాసి. పాటలీపురము నందు పూర్వము గుప్తరాజులు పాలించినపుడు పాటలీపుత్రమునందు రాజ బంధువులయు రాజాశ్రితులయు బహు యవన కుటుంబము లున్నపుడేర్పడిన యవనులయు, క్షత్రియులయు కుటుంబములకు బంధుత్వమేర్పడినపుడు మిత్రగుప్తుని ముత్తాతల తరమునాఁడు రామకదేశముల లోని యవనులతో వీరి కుటుంబమునకు సంబంధము కలదు. ఆ ముత్తాతలలో నొకరు యవన స్త్రీని పెండ్లాడెను. అతని సంతానము రామకదేశములకుఁ బోయి యచట నివాసమేర్పఱచుకొనిరి. కాని యీ మూఁడు తరములుగా సంబంధబాంధవ్యములు లేకున్నను వేఁబది యేండ్లకో యఱువది యేండ్లకో కార్యాంతరములమీఁద వారిలో నెవరో ఇచ్చటికి వచ్చుటయు వీరిలో నెవరో అచ్చటికి పోవుటయు సంభవించుచుండెను. అట్లు కలిసినపుడెల్ల ప్రాత చుట్టరికములు తిరుగవేయుటయు, నా పినతండ్రి కెంత సంతానము, నీమేనత్త కెంత సంతానము, వారి నామధేయము

లేమి? వారి ఆస్తిపాస్తిలేమి మొదలైనవి కనుగొని వారిచ్చట చెప్పుట వీరచ్చట చెప్పుటయు కలదు. జ్ఞాపకముంచుకొనుటయు కలదు. ఇది బంధుత్వమని ఆదరించుటయు కలదు. మిత్రగుప్తుని ముత్తాతలిద్ద అన్నదమ్ములు. నాఁటినుండియు వారి కుటుంబము లొకే గ్రామమునం దుండుటచేత తరములు దాటిపోవుచున్నను జ్ఞాతిత్వమాత్రమైనను సన్నిహిత బాంధవ్యమువలె నుండెను. నాలుగైదు తరములు గడచును. కాని యొకే ప్రదేశమునందు నివసించుచుండినచో వారును వీరును పెదతండ్రి పినతండ్రి బిడ్డలవలెనుందురు. అన్నయు తమ్ముఁడుగా నుందురు. శుభాశుభములందు మిక్కిలి కలిసియే యుందురు. ఆ ముత్తాతయొక్క సంతానములో నేఁడు కుమారగుప్తుడని యొకఁడు కలఁడు. అతని యింటికి రామరములలోని బంధుగొకఁడు పదవేండ్లక్రింద వచ్చెను. అతనికి పడమటింటిలో ప్రవేశయోగ్యతలేదు. దేవతామందిరమునకు కొనిపోయి చూపించలేదు. దొడ్లుత్రోవలు చూపించిరి. సావడిలోననే భోజనము పెట్టిరి. అతని విస్తరి యతఁడే ఎత్తికొనెను. కాని బంధుత్వమునకు పరామర్శకు ప్రేమకు వెల్తిలేకుండెను. ఆనాఁటి రెండు కుటుంబములు నేఁటి కాఱు కుటుంబములయ్యెను. అందఱు నొకరితో నొకరు తల్లిశోడువలె నుందురు. ఈవచ్చిన యవనబంధువు తద్గ్రామములోని తన కుటుంబమునకు సంబంధించిన యిరువది యిండ్లకు పోయెను. అందఱితో పరిచయము చేసికొనెను. అతనిపేరు యశోవంతుఁడు. అప్పటికతని కేఁబదియేండ్లు. మిత్రగుప్తుఁ డప్పటికి విక్రమార్క చక్రవర్తికొల్వులో చేరలేదు. అతనికప్పు డుద్యోగము లేదు.

ఎన్ని యుద్యోగములకొఱకో ప్రయత్నించెను. సానుకూల పడలేదు. ఇతని తల్లి యశోవంతు నడిగెను. మా పిల్లవానిని మీ దేశములకు పంపింతును. ఇతని కేమైన యుద్యోగము చూచిపెట్టగలరాయని. అతఁడంగీకరించెను. ఈ ప్రసంగము మాట సామెతగా జరిగినదేకాని నిశ్చయముగా ననుకొన్నది కాదు. కాని మిత్రగుప్తుఁడు తన నిర్వ్యాపారత్వ బాధవలన వారి యూరును తన్మార్గమును గట్టిగా కనుగొని వ్రాసిపెట్టు కొనెను. మఱియొక అయిదాఱు నెలలుచూచి యుద్యోగము కుదురనిచో రామతములకుఁ బోవుటకు నిశ్చయించుకొనెను. ఇంతలో భాగ్యవశమున చక్రవర్తి కొలువులో నీ యుద్యోగము కుదిరెను. మిత్రగుప్తుని పూర్వులు ఆంధ్రరాజులనుండి గూఢచారులు. అది వానియందొక గుణ విశేషమైనది. పూర్వము రెండుసార్లితఁడు రామత దేశమునకు పోయెను. వెదకికొనుచు వారి యింటికిపోయి మొదటిసారి రెండుమూడు నాళ్ళుండెను. ఇతఁడు మొదటిసారి వెళ్ళినపుడు యశోవంతుఁడు జీవించియున్నాఁడు. రెండవసారి వెళ్ళినపుడు అతఁడు మరణించినాఁడని వార్త తెలిసినది. ఆయేండ్లక్రింద తాను యశోవంతుని ఇంటికి పోయినాడు. యశోవంతుని కుమారులను చూచెను. వారు మువ్వురు వారిలో చివరివాఁడప్పటికి పదునెన్మిదేండ్లవాఁడు. చూచుటకు పండ్రెండేండ్లవాఁడువలె నుండెను. ఈనకట్టుపుల్లవలె నుండెను. నిర్వ్యాపారుఁడు. ఏ పని చేయుటకు సమర్థుఁడు వాఁడు. వాని కన్నమే యక్కఱలేదు. తిన్నను గుప్పెడు మెతుకులు తినును. వాఁడు సంగీతము పాడును. ఒక కట్టెపుల్ల తెచ్చి-అది మూరెడు పుల్ల. దానికి

రెండు వైపులను మేకులనుకొట్టి ఒక గుఱ్ఱపు వెంట్రుక దానికి బిగించి ఇట్టిదే మఱియొక్క చిన్న పుల్ల చేసి దాని మీఁద దీనిని గీయుచు ఏదోపాడుకొను చుండును. వాని యన్న లిద్దఱును దానిని త్రెంచి విఱిచి పాఱవేయుచుందురు. వాఁడు మఱల మఱల నిర్మించుకొను చుండును. ఇటువంటి యొకఁడున్నాఁడు. మిత్రగుప్తునకు వీఁడు జ్ఞాపకము వచ్చి నంతనే తన స్వప్నములో వీఁడు కూడ కన్పించినట్లు జ్ఞాప కము వచ్చెను. చక్రవర్తికిని వీనికిని ఏమి సంబంధము? ఇద్దఱును కలిసి స్వప్నములో వచ్చుట యేమి? తానాచరించ వలసిన పనులకు రామక దేశములుకు సంబంధమేమి? ఇది యిట్లుండఁగా మిత్రగుప్తుఁ డొకసారి సవ్యసాచి యొక్క గ్రామమునకు పోయెను. ఆ యూరిలో నొక కుటుంబము వారు కటక రాష్ట్రాధిపతి సేనలో నొక గొప్ప యుద్యోగము నందుండెనని తెలిసికొనెను. ఈ రహస్యాయుధ నిర్మాణా గారములు సింహపుర కటకోత్తర జ్యోతిష రాజ్యముల పొలి మేరలో నున్నవని తెలియును. ఆ కటక సేనలోని దళవాయి యిచట ఆ రహస్యాగారముల మీఁద నధికారియై యుం డునా? వానికి వీనికి సంబంధ ముండునా? మిత్రగుప్తుఁడతని పేరు తెలిసికొనెను. వాని పేరు సుమంతుఁడు. వారిది సాంప్రదాయ సిద్ధమైన క్షత్రియ కుటుంబము. కటకమునకు పోయి సుమంతుని కనుగొనవలయునని మిత్రగుప్తుఁడను కొనెను. కాని ఆ దేశము నందు మురారిభట్టున్నాఁడు. అతఁడు తనకు వార్త పెట్టవచ్చును. గాంధార దేశమున వీణావతి యను నొక గ్రామము కలదు. ఈ పదిమందియు

నానాంటికి పది దినములు తర్వాత వీణావతిలో కలసి కొన వలసి యుండెను. ఇప్పు డీస్వప్నము వచ్చెను. రామరము లకుఁ బోయి ఈ బంధుయవనులనుఁ జూచి తాను పంద్రెండు దినములలో వీణావతి చేరఁగలఁడా? రామరములకుఁ బోయి ఏమి సేయవలయును? ఏమి కనుగొనవలయును? మఱల తన కేదైన స్వప్నము రావలయునా? అంతవఱకు వ్యర్థముగా నిచట తిరుగుట యెందులకు? అట్టి స్వప్నము రావలసి యున్నచో నిచటనే రావలయునా? రామరములలో రా రాదా? వట్టి స్వప్నమున కింత వెలకట్టుట యెందుకు? చక్రవర్తి యీ స్వప్నమునందు కనుపించెను గదా! ఉజ్జయినీ నగరము నందొక ప్రథ యుండెను. చక్రవర్తి మహా తపస్వి. ఆయన నిష్కారణముగా ఎవ్వరికిని స్వప్నములో కన్పింపఁడు. ఏదో ప్రయోజన ముండవలయును. ఇద్దఱు ముగ్గురికి చక్రవర్తి స్వప్నములో కన్పించిన తర్వాత గొప్ప లాభములు కల్గెను. ఒకనికి ధనాగమమయ్యెను. ఒకనికి మహావ్యాధి నెమ్మదించెను. తనకే లాభము కలుగఁ బోవుచున్నదో? మిత్ర గుప్తుని తండ్రి మిక్కిలి పండితుఁడు. కర్మవాది. ప్రస్థానత్రయ భాష్యము చదివి శాంతి చేసినవాఁడు. ఆయన యీతని పదియవ యేట మరణించెను. ఇతఁ డింగువకట్టిన గుడ్డ. ఆస్తి స్వల్పమగుటయు తా నేకపుత్రుఁడగుటకు తల్లి మిక్కిలి కష్టములను భరించుటయు నీతఁడు పండితుఁడగుటకు సహాకరింపలేదు. కాని అట్టి తండ్రి భార్యయైన తన తల్లి యైన తన తల్లియొక్క విశ్వాసములు సిద్ధాంతములు వేద వేదాంతములందలివి. ఆమె నోటి వెంట వచ్చు వాక్యములు

మిత్రగుప్తుని మనస్సునందు ముద్రితములై యుండి చెడలేదు. అతఁడు పండితుఁడుకాఁడు. కాని పండితుడు కాకపోలేదు. చదివినవానికి పాండిత్యము వచ్చును. విన్నవానికి పాండిత్య సారము కలుగును. దేవేంద్రునియొక్క పాండిత్యము వినికిడి వలన కల్గినది. అందుకనియే యాతనికి వృద్ధశ్రవసుఁడని పేరు. మిత్రగుప్తుఁడు కర్మవాది నిష్కామకర్మ చేయవలయు నన్న భగవంతుని వాక్యమునందు విశ్వాసము కలవాఁడు. కర్మశబ్దముయొక్క అర్థము విపరిణామము నొంది లోకము నందలి సర్వక్రియయు కర్మగా నూహింపఁబడుచు కర్మ యన్నది వైదికకర్మకాక ఏకర్మయైనను కర్మయేయయి నిష్కామకర్మయనఁగా నలిప్తముగా నేపనిచేసిన నదియే యన్నట్లు కోట్లాది సామాన్య జనులచేత భావింపఁబడు చున్నది. నిష్కామ కర్మయన్న శబ్దము ప్రధానార్థముల నుండి విగ్రహింపఁబడినను తాత్పర్య భూతమైన యర్థము దాని నుండి పోలేదు. అది తచ్ఛబ్దార్థ ప్రయోగ బాహుళ్య మొక కర్మగా భావింపఁబడినచో దాని యర్థమునందది భ్రంశము పొందియు పొందినట్లే. మిత్రగుప్తుఁడిట్టి విశ్వా సము కలవాఁడు. తనకు నియమింపఁబడిన కార్యమునందు ఒకప్పుడు ఫలిత ముదయించును. ఉదయించదు. ఉదయించి నపుడు తన యుద్యోగమున లాభకారి. ఉదయింపనపుడు కొంత సమముగా చూచును. అనఁగా వెనుక దైవము న్నాఁడు. దీనికంత కతఁడు కారణమన్న దృఢ విశ్వాసము. లోకమునందున్న సర్వ మానవులకును సుఖ దుఃఖములు కల్గును. లోకము నందలి జనము వాని యందు కూరుకొని

పోదురు. ఎవఁడో పదివేలలో నొకఁడో లక్షలలో నొకఁడో విశిష్ట జీవలక్షణవంతుండుండును. వాఁడు తత్కాలమున తత్సుఖదుఃఖానుభూతిపొందినను వెంటనే తెప్పిరి భగవంతుని యనుగ్రహమిట్లున్నదని భావించును. ఇట్టి వారును సంసారుల లోననే యుందురు. ఆ తండ్రి యొక్క రక్తము ఆ తల్లియొక్క పెంపకము జీవితము నందతఁడు పడిన కష్టములు స్వనియమిత కార్యములందు తనకు ప్రాప్తించిన ప్రతి పదవిఘటనలు వాని యీ మనోవృత్తికి హేతువులై యుండును. రామత దేశమునకుఁ బోవుటకే నిశ్చయించెను. ఏది జరిగినచో నది జరుగును. మఱల నొక స్వప్నము వచ్చి విస్పష్టతరమైనచో కానిమ్ము. కానిచో ప్రయత్నము చేయవలయునుకదా!

రామతమును చేరెను. తన యవన బంధువుల గ్రామమునకు పోయెను. అతఁడు తా నాగ్రామమును ప్రవేశించుచోట నొక వృద్ధుని కలసికొనెను. యశోవంతుని సంసారమునుఁ గూర్చి యడిగెను. ఆ వృద్ధుఁడు ముక్కుమీఁద వ్రేలిడికొని మాట్లాడవద్దనెను. ఇతని నొక రహస్యములు చోటికి తీసికొనిపోయి యిట్లు చెప్పెను. "అయ్యా! నీ వెవరవో నాకు తెలియదు. నీవు గ్రామము లోనికిఁబోయి వారి కుటుంబమునుఁ గూర్చి అడిగితివా గ్రామాధికారులకు తెలిసెనా నిన్ను చెఱసాలలో పెట్టుదురు. ఈ దేశము బాహ్లీకదేశమెంత యవనమో అంత యవనము. రెండు మూఁడు నెలల క్రింద విక్రమార్క చక్రవర్తి యందభిమానము కల్గిన కుటుంబముల నేరి యేరి సైన్యము వచ్చి వధించెను. అందులో వీరి కుటుంబ మొకటి. అట్టి కుటుంబ

ముల వారి యొక్క బంధువు లెవరైన తెలియక వచ్చి వారినిఁ గూర్చి యడిగినచో వారిని బంధించు చున్నారు. ఘోరముగా బాధించుచున్నారు. జాడలు తీయుటకు వారిని హింసలు పెట్టుచున్నారు. మనమిద్దఱ మీమాత్రపుసేపును మాటాడరాదు." అని వృద్ధుఁడు పోవుచుండఁగా మిత్రగుప్తుఁడీయొక్క మాటను కూడ చెప్పిపొమ్మని ఆయన మూఁడవ కుమారుఁడున్నాఁడు. వాఁడు గడ్డిపోచవంటి వాఁడు. సంగీతము పాడుచుండును. వానిని కూడ సంహరించిరా చెప్పుమనెను. ఆ వృద్ధుఁడు "వాఁడు దేశద్రిమ్మరి. వాఁడిపుడిచ్చటలేఁడు. వాఁడేమైనాఁడో తెలియదు. అదృష్టవంతుఁడు" అని చెప్పుచునే వెడలిపోయెను. మిత్రగుప్తునకు తన రామతములలోని యునికి ప్రతిక్షణాపద్హేతువని తెలిసెను. తాను యశోవంతుని బంధువనని చెప్పి యిచటికి ప్రవేశము' కల్పించుకొనలేదు. అది యొక యదృష్టము.

# ఎనిమిదవ యధ్యాయము

మిత్రగుప్తుఁడు తిరిగి పోవలయును. ఎక్కడికిఁ బోవలయును ? ఎట్లు పోవలయును ? తానొక వ్యూహమునందున్నట్లు తెలిసికొనెను. తాను త్తర జ్యోతిషములనుండి యిచటికెట్లు రాఁగలిగెను ? ఒకటి రెండుచోట్ల నెవరో నీవెవ్వరవని యడిగిరి. అతఁడు మాది యుత్తర జ్యోతిషమనెను. అతని వేషము యవనవేషమే. అతఁడు తత్ప్రాంతీయులు మాటాడి నట్లే మాటాడెను. ఉత్తర జ్యోతిషముగాని బర్బర దేశము

లుండెను, బర్బరదేశము దక్షిణమున, నుత్తరజ్యోతిషము లుత్తరమున. జ్యోతిషములకు నుత్తరమున శకదేశము, వానికి నుత్తరమునఁ గిరాతములు, వానికి బాహ్లీక ముత్తరము. ఈదేశములుపైనుండి క్రిందికొక లంకెగానుండెను. హూణ హారరామఠదేశములు శకోత్తర జ్యోతిష బర్బరములకుఁ బశ్చిమమున నానుకొని యుండెను. ఈదేశములు పొడుగునను గలసియుండెను. ఉత్తర జ్యోతిషపు బడమటియెల్ల హూణదేశము నానియున్నది తరువాత హారబర్బరములకు సరిహద్దుకలసియుండెను. మఱికొంత దవ్వురామఠ బర్బరములకుఁ గలసియుండెను. కొంతదూరమున రామఠదేశము యొక్క తూర్పుటెల్ల గాంధారదేశపు పడమటి యెల్లగా నుండెను. గాంధారదేశమునుండి బర్బరోత్తర జ్యోతిష కటక సింహపురోరగ దేశములకుఁ బోవచ్చును. ఆ దేశముల తూర్పులు గాంధారపుఁ బడమటియెల్లలు. ఆదేశముల లోనికిఁ బ్రవేశింపవలయునన్నచో మిక్కిలి కష్టము. రానీయరు. రాజభటులుందురు. కాని వృత్తాంతమంతయుఁ దెలియవలయును. బంధువులున్నారని నిరూపింపవలయును. అతఁడేదేశమునందును రాజకీయోద్యోగి కాఁగూడదు. కష్టముమీఁదఁ బ్రవేశము కలుగును. విక్రమార్క చక్రవర్తి గూఢచారులందఱకు నిట్టిప్రవేశమునకు మాఱుపేరులు, నాదేశములలోనున్న యెవరికో బంధుత్వములు మొదలైనవి కల్పింపఁబడి యుండెను. ఆయవన దేశములలోని కొన్ని యూండ్లలోని కొన్నికుటుంబముల బంధుత్వము నాబంధువుల వృత్త్యాదులు, వారి పరిచితులు నీసందర్భమైన సర్వజ్ఞానము

దీనికుండవలయును. ప్రవేశము కొంతయు జరుగును. గాంధార దేశములోనికి నిష్క్రమణము కొఱకు మఱియు నింత జరుగ వలయును. ఒక దేశమునుండి బైటపడుటయే కష్టము. రెండు మూఁడు దేశములనుండి బయటపడుటకు మిక్కిలి కష్టము. ఇతఁడు రామఠములకు సుఖముగా రాఁగలిగెను. ఏలయనఁగా హూణోత్తర దేశములనడిమియెల్లవెంట హారరామఠబర్బర దేశముల యెల్లవెంట నతఁడు నడచివచ్చెను. ఈయెల్లలు కలసిన గ్రామములు, నవియు నివియు యవనదేశములు. ఆదేశ గ్రామవాసులకు నీదేశ గ్రామవాసులకు రాకపోకలు సమృద్ధిగా నుండును అచట నీవెవ్వరవని యడిగెడి వాఁడుం డఁడు. ఏపేరుచెప్పినను సరిపోవును. ఇతఁడు మఱల రామఠ ములనుండి యుత్తర జ్యోతిషములకుఁ బోవుటయే సుఖము. గాంధారములకుఁ బోయినచోఁ వీలుండదు. తక్కిన దేశ ములనుండి కంటె నుత్తర జ్యోతిషములనుండి గాంధార దేశములోనికిఁ బోవుట సుకరము. ఈకష్టముపడలేక జనులు చుట్టయిన నొకపనిచేయుదురు. ఆభీర దేశములోనికిఁ బ్రవేశము సులభమైనది. ఆభీరమునుండి యురగ సింహపుర దేశములకు సులభముగా రావచ్చును. అచట నేయొరి పిడులు లేవు. వీణావతి యందుఁ గలసి కోవలసిన దినము సమీపించుచున్నది. వీణావతి గాంధారములో నుత్తర జ్యోతిషపు టెల్లకు సమీపము. అతఁడు తిరిగి యుత్తర జ్యోతిషములకుఁ బోవలయు ననియే సంకల్పించెను. కాని రామఠదేశము లోనికిఁ బోవుట యెంత సులభమో యచటి నుండి తిరిగ వచ్చుట యంత సులభము కాదు.

దాని కొక్కటియే మార్గము. అది యతనికిఁ దెలియును. ఆ నిశ్చయము చేసికొనియే వచ్చెను. ఆ దేశములలో సేనలు వేఱు, రాజభటులు వేఱు. వారి వేషములు వేఱు, వీరి వేషములు వేఱు. ఉత్తర జ్యోతిషపు రాజభట వేషము నకుఁ గావలసిన దుస్తు లితని యొద్ద నున్నవి. ఆ దుస్తులు ధరించి వెళ్ళినచో నెవ్వరును మాటాడరు. ఒకవేళ నెవరైన నడిగినచో నచటి రాజభటాధికారుల యుద్యోగములు, వారి వారి పరిస్థితులు, వారుండు గ్రామములు, నెవరెన్ని గ్రామముల మీఁద నధికారులో యా విషయము, తానే యధికారి క్రిందనున్నాఁడో యా యధికారినిఁ గూర్చిన విశే షాంశములనుఁ జెప్పినచో వారు సరిచూచి కొందురు. వదలి పెట్టుదురు. ఇతఁ డాఱు దినములు చేసిన ప్రయాణము మఱల నాల్గు దినములలోఁ జేసెను. ఉత్తర జ్యోతిషములు చేరెను. ఆ దేశములో మహా పర్వతములు కలవు. పర్వతము లెక్కువ. గ్రామములు తక్కువ. గ్రామములలో నుండి పోవలయు నన్నచోఁ జాల దూరము పోవలయును. పర్వతములలో నుండి పోయినచో నెక్కుటయు దిగుటయు నున్నది గాని దారి దగ్గఱ. ఇతఁడు తాను పూర్వము పరిశీలించిన గ్రామము లుత్తర జ్యోతిషమున నీశాన్యమున నున్నవి. హూణదేశము నుండి యుత్తర జ్యోతిషములకుఁ బోవుటకు వాయవ్యదిశ యందుఁ బర్వత బాహుళ్యము కలదు. పర్వతములలో నుండి పోయినచో నది రెండు దినముల ప్రయాణము. చుట్టు తిరిగి పోయినచో నయిదు దినముల ప్రయాణము. ఈ పర్వత మార్గము సుపరిచితులకే కాని తక్కిన వారికిఁ దెలియదు.

తత్ప్రాంతీయులకుఁ దప్ప మఱెవ్వరికిని దెలియదు. అది యితని కెల్లు తెలియుననఁగా నితఁడు మొదటి సారి రామఠములకుఁ బోయినప్పుడు తిరిగివచ్చునపుడు యశోవంతుని కొడుకును నితఁడును గలసి బయలుదేరిరి. యశోవంతుని పెద్ద కొడుకునకు నాఁడు హూణదేశములోఁ బనియుండి పోవుచు నీ వుత్తర జ్యోతిషములలో నుండి పోవచ్చును. రమ్మని యితనిని వెంటఁ దీసికొని వెళ్ళెను. యశోవంతుని కొడుకునకుఁ గూడ నా పర్వత మార్గము దెలియదు. కాని హూణ దేశములోని యొక పార్వతీయుఁడు వీరి నా మార్గము నుండి యుత్తర జ్యోతిషము నందలి యీశాన్య దిశా గ్రామములకుఁ దీసికొని పోయెను. ఆ మార్గములో నొక్కటియే దోషము. ఎక్కువ క్రూరమృగములు కూడ నుండవు. కాని రెండు పర్వతముల నడుమ నా వైపున నీ వైపున గురిసిన వాన యంతయు సెలయేళ్ళుగా ప్రవహించుచుండును. అవి పొంగి వచ్చినచో దారి కట్టువడిపోవును. ఎప్పుడు వచ్చునో యెప్పుడు రావో తెలియదు. ఏమబ్బు కురియునో, యేది కురిసినచో నీ వాగు వచ్చునో యచటి యాటవికులకే తెలియును. ఆ నాఁడు వీరా యాటవికుల వెంటఁ బోవుచుండఁగా నా మార్గదర్శియైన యాటవికుఁడా పర్వతములపేర్లు, భిన్న దిశాదిదిశలయందు పట్టెడిమబ్బులు, నెచటిమబ్బు కురిసినచో సెలయేఱు వచ్చునో మొదలైనవిషయములు ప్రస్తావించుచుఁ బోయెను. ప్రాగ్దిశ పర్వతముమీఁద నొక కొండంతమబ్బు పట్టెను. యశోవంతుని కొడుకు భయపడెను. ఆటవికుఁడు దానివలనఁ

దమ ప్రయాణమునకు భంగములేదని చెప్పెను. ఆమేఘము కురిసినచో నామహాపర్వతముపైననే కురియును. ఆ జల మంతయు ప్రాగ్దిశయందలి సెలయేళ్ళను నింపుకొనుచుఁ బోవును. ఈకొండసందు పయాణమునకు నామహోత్తాలము లయిన మేఘములవలని భయములేదు. కొన్ని మబ్బులు కొండకొమ్ములు దిగివచ్చి నైరృతిదిశయందలి ప్రత్యంత పర్వతములమీఁదఁ గురియును. ఉత్తరదిశయందలి చిన్ని గుట్టలమీఁదఁ గురియును. ఆజలమీ కొండలనడుమఁగలమార్గ మును మూసివేయును. ఇట్టివెన్నియో యతఁడు చెప్పెను. ఆరోజులలో మిత్రగుప్తుఁడు క్రొత్తగా సీగూఢచారి యుద్యోగమును సంపాదించెను. వీనినన్నిఁటిని మనసులో గుర్తుపెట్టుకొనెను. ఇంటికిఁబోయి వ్రాసికొనెను. రెండవసారి రామఠములకుఁ బోయినప్పుడు వానిని చదివి గుర్తుంచుకొని వచ్చెను. అపుడే పర్వతములలోనుండి వెళ్ళవలసిన యవసరము పట్ట లేదు. అప్పుడు రామఠదేశమునకుఁ బోవుటకుఁగాని, వచ్చుటకుఁగాని యిన్ని కట్టడులులేవు. ఈసారి యివి బలిసినవి. మిత్రగుప్తుఁడు వీనినన్నిటిని జ్ఞాపకముంచుకొనెను. అంతియే కాదు. ఆకొండలలోనుండి పోవుచుండఁగా నూటికిఁగోటి కెవఁడో మనుష్యుఁడు తగులును. వాఁడు కొండజాతివాఁడై యుండును. ఆకొండలలోఁ దిరుగువారందఱు నొకజాతి. వారి భాష వేఱు, వారిసంజ్ఞలు వేఱు. వారికెప్పుడును రాజభయము. ఏక్రొత్తవాఁడు కనిపించినను రాజపురుషుఁడేమోయని వారి యనుమానము. వారిభాషలో నీక్రొత్తవానిని పలుకరింతురు, ఈక్రొత్తవాఁడు వారికిఁగల యొక సంజ్ఞాపూర్వకమైన

మాటతో సమాధానము చెప్పినచో వానిదారిని వాఁడు పోవును మిత్రగుప్తుఁ డట్టినాలుగైదు మాటలనువ్రాసి పెట్టు కొనెను. వానిని వల్లించెను. ఆమార్గమాతేంక్షక్రిందఁ జూచిన మార్గము, ఇప్పుడు తానొక్కఁడును మఱల కనుగొనగలుగునా! ఆమార్గము నతఁడు పటమున గీసికొనెను. మార్గము మొదటనే యొక మెలికకలదు. మొదటికొండను జుట్టివెనుకకు రావల యును. అచటినుండి పడమరగాఁ బోవలయును. ఒకనాల్గు గడియలు నడచిన తరువాత నాత్రోవ యీశాన్యముఖముగా మఱలును. ఇట్టిమలక లామార్గమున దారి మొదటనొకటి, దారిచివరినొకటి దారిలో రెండును కలవు. ఈనాల్గింటిని సరిగా గుర్తుపెట్టుకొన్నచో నెవఁడైన నీమార్గమునఁ బోఁగలఁడు. ఇబ్బందియంతయు దారిలోనున్న రెండుమల కల దగ్గఱనున్నది. అచటనొకొక్కచోట దారి మూఁడునాల్గు పాయలుగా నుండును. ఒక పాయబదులు మఱియొక పాయను బట్టితివో నీవు తిరిగిరావు. మిత్రగుప్తుఁడీ శాఖలను దనపట ములో వేసెను. ఏదిసరియైన శాఖయో, యేదిపోఁదగిన శాఖయో గుర్తుపెట్టికొనెను. ఆపట మతని దుస్తులలో నున్నది. ఈ మలకలు లేనిచో దారిలో విశ్రాంతి తీసికొననిచో రాత్రులం దేవృక్షమో యధిరోహించి పండుకొన వలసిన యవసరము లేనిచో నది యొక్క పవలు నొక్క రాత్రి ప్రయాణము. రాత్రి లేదు. రెండు పవళ్ళ ప్రయాణము. ఈ మలకల మూలముగా మూఁడవ రోజున మధ్యాహ్నమునఁగాని యా దేశము యొక్క యీశాన్య భాగస్థగ్రామమటి కాదర్శనము కలుగదు. మఱియు నీ మార్గ

మున నొక యాపద కలదు. అచట సర్పభయము మెండు. కొన్ని సర్పములు విషసర్పములు. కొన్ని కావు. ఏవి యవునో యేవి కావో యచటి వారికిఁ గాని తెలియదు. సామాన్యముగా విష సర్పములు వాగు వెంట రావు. వాగులు ప్రవహించుట చేత నా దేశమంతయు శీతలమై యుండును. మహావిష సర్పములు శీతల దేశమందు సంచ రింపవు. ఒకటి రెండు పొరపాటున వచ్చినచో నవి యెండు ప్రదేశము చూచికొనియే పోవుచుండును. పథికుఁడు సర్వదా తడిసిన నేల వెంటఁ బోవుచున్నచో వానిలోని సంఘర్షణ కలుగదు. ఇతనికి గుండెలలో భయముగా నుండెను. ఇంక నాల్గు దినములలో వీణావతి చేరవలయును. ఈ మార్గ మొక్కటియే శరణ్యముగాఁ గనిపించెను. భగవంతుఁడు రక్షించినచోఁ దన తల్లి కడుపు చల్లగానున్నచోఁ జేరును. అతనిని పెండ్లియాడుమని వారి తల్లి యెప్పుడును బోరాడు చుండును. గూఢచారులు పెండ్లియాడరాదు. ఒకవేళ నాడినచో రాజ్యము సురక్షితమై రాజ్యమున కెద్దడిలేదని విస్పష్టమైనప్పుడు చక్రవర్తి యనుమతితోఁ బెండ్లాడ వల యును. ఇప్పుడది యొక లాభము తన కోసము దుఃఖించు నది తన తల్లి యొక్కర్తుకయే. నిజముగా నచ్చటి పార్వ తీయులు జనము నిద్ర లేవనపుడు ప్రాగ్దిశనుషఃకాంతి ప్రథమ రేఖావిధూతాంధకార ధూసరవర్ణ వేళయందు బయలుదేరు చుందురు. ఇతని కాధైర్యము చాలలేదు. బాగుగా తెల్ల వారిన తరువాత బయలుదేరెను. మలుపు తిరిగెను. పడ మరగాఁ బోయెను. ఈశాన్యపు త్రోవ గుర్తుపెట్టుకొనెను.

పోయెను, పోయెను. ఇంకఁ బ్రొద్దు గ్రుంకుననఁగా మొదటి కొండ మలుపు తిరిగెను. మలుపు తిరుగుట యనఁగా తాను నడచిన కొంత దూరములో మఱల వెనుకకు వచ్చుట యని యర్థము. అచటి మూఁడు త్రోవలలో నన్నిటికంటెఁ గుడిత్రోవ వెంట బయలుదేఱెను. అతని యదృష్టము వలన నది వెన్నెలరాత్రి. సాహసించి పోయెను. ఇకఁబోవుట మంచిది కాదని యొక వృక్షము మీఁద నెక్కెను. అచట నిద్ర లేదు, భద్రత లేదు. మఱల ప్రాతఃకాలము వఱకు నచటనే యుండెను. మఱునాఁటి ప్రొద్దున దిగెను. అచట నొక చిన్న గుట్టమీఁద నొక నీటి యూట కలదు. ఆఱేండ్ల క్రింద నతఁడది గుర్తుపెట్టుకొనెను. అప్పటి కది పవలు. ఇప్పటికది ప్రాఃతకాలము. తన యొద్దనున్న పాత్రనిండ జలమును సేకరించెను. హోరదేశములోఁ గొన్న రొట్టెలలో రెంటిని భుజించెను. మఱల దారిఁ బట్టెను. ఒకచోట పగలు రెండు జాములయ్యెను. మఱల నొక రొట్టెతిని మంచి తీర్థము త్రాగెను. ఇంక నొక యర్థయామము కడచినచో గ్రామటికా ప్రదేశము చేరును. కాని రెండవ కొండ మలక యిచ్చట నున్నది. ఆ యర్థయామము దీనిని చుట్టుటకే సరి పోవును. ఇంతలోఁ బ్రొద్దు క్రుంకును. మఱల నేచెట్టు మీఁదనో నిద్రింప వలయును. అతఁ డెంత తొందఱగా నడచినను మార్గము శిలామయమగుటచేత, ప్రతిచోట వెదకికొనవలసి వచ్చుటచేత, నవునాకాదాయన్న నిత్యసంశయగ్రస్తత్వముచేత, పరిహరింపరాని యాలస్య మగుచుండెను. ఏమిచేయవలయును? ఏమిచేయఁగలఁడు?

ఆకొండ మలుపు తిరిగెను. తొలుత నచట నాల్గుత్రోవ లున్నవని తనపటములో నుండెను. ఇప్పుడైదు త్రోవలున్నవి. ఏత్రోవ క్రొత్తదియో తెలియదు. ఏ మార్గమువెంటఁ బోవలయునన్నను నిజానికిఁ బ్రొద్దుకుంకెను. ఒకత్రోవవెంటఁ బోయి తనగుర్తులు సరిపోనిచో వెనుకకుఁ దిరిగివచ్చి మఱి యొకత్రోవ పట్టుదమన్నను దగినంతవేళ లేదు. అన్నిటికంటెఁ గుడిత్రోవయే క్రొత్తత్రోవ. కనుక నైదింటిలో నడిమిత్రోవ తాను పోవలయుననుకొనెను. అపుడు నాల్గుత్రోవలుండెను. కుడినుండి రెండవది తనమార్గము. పట మట్లు చెప్పుచున్నది. ఇప్పుడు కుడినుండి రెండవదానివెంటఁ బోవలయునా, మూఁడవదానివెంటఁ బోవలయునా ! ఎందుచేతనో కుడి నుండి మూఁడవదానివెంటనే బయలుదేఱెను. కొంతదూరము పోయెను. పటములో నాత్రోవవెంటబోఁగా నాల్గుగడియలు నడచిన తరువాత నెడమవైపున నొకకొండమీఁద మనుష్యా కృతిఁగల యొకశిలయుండెను. ఎవఁడో నిలుచున్నట్లుండును. అట్టిదితని కెంతసేపటికినిఁ గనిపించలేదు. ఇంకను దవ్వుపోవల యునా ? అప్పటికే మార్గము సులభముగాఁ దెలియుటలేదు. ఆశిలను తాను దాఁటివచ్చెనేమో ! ఒకచోట దక్షిణమున పెద్దవృక్షము కనిపించెను. ఆరాత్రి యావృక్షముమీఁద గడుపవచ్చును. మఱియుఁ దనకేమియు గుర్తులేనిప్రదేశముగా నది కనిపించెను. అచట కొండనంటికొని ప్రవహించు వాగు కలదు. అచట నీవాగున్నట్లతని గుర్తులేదు. దానినానుకొని యొక మహాపర్వతము గలదు. తాననుకొన్న మార్గమున నీపర్వతములేదు. ఇప్పుడు చేసెడిదేమియు లేదు. చెట్టుమీఁద

నెక్కి కూర్చుండవలయును. అతఁ డావృక్ష మధిరోహించెను. ఆ వృక్షముమీఁదఁ బైపంగలో రెండు కొమ్మలమీఁద నడ్డముగా రెండుకఱ్ఱలువేసి దానిపైన నొకమంచెవలె నిర్మింపఁబడియుండెను. దానిపైన నాకులుపఱచఁబడియుండెను. ఆపత్రములు శుష్కపత్రములు చాలవఱకు రాలిపోయెను, ఇది యెవరో మనుష్యులు నిర్మించినది. లేదా వివేకముగల యటవీమృగములు నిర్మించినది. పెద్ద కోతులుకావచ్చును, భల్లుకము కావచ్చును. ఆపత్రముల శుష్కత్వమువలన దానిని నిర్మించినవారు కొన్నాళ్ళుగా దానిని వాడుకొనుట లేదని తెలియుచున్నది. ఆమానవుఁడో యామృగములో తన్ను వచ్చి బాధింతురన్న భయమంతగా నుండనక్కఱ లేదు. ఆతనికొక యూహతోచెను. అట్లు నిర్మితమైన మంచెలోనుండి చాలభాగము కామ్రములు క్రిందికిఁ ద్రోసి నచో వారెవరైననేమి? వత్తురు, చూతురు. తమ నిర్మిత ప్రదేశముయొక్క సురక్షితత్వము చెడిపోయినదని వెడలి పోదురు. రాత్రిపూట మఱల నిర్మాణమునకుఁ బ్రయత్నింపఱు గదా. మిత్రగుప్తుఁడు తన కొకవేళ నిద్రపట్టినచో సుఖముగా నుండుటకుఁ దగిన కట్టెలుంచి తక్కినవి క్రిందికిఁ ద్రోసెను. మఱల క్రిందికి దిగి క్రిందఁబడిన కట్టెలను కొన్నింటిని దూరముగా విసరెను. ఇప్పుడు భద్ర మనుకొనెను. ఆ మంచె నప్పుడే యెవఁడో త్రోసినట్లు కనిపింపదు గదా! ఎట్లైనను మఱియొక వృక్షము వెదుకవలయు నన్నచో నంతటివృక్షము రెండవది యీ ప్రాంతముల లేదు. అతఁడు మేల్కొనియే యుండును. మృగమో మనుష్యుఁడో యెవరు వచ్చినను

దాను వెంటనే చూచి పైకొమ్మ నెగఁబ్రాకి దాని కొను టకు వీలుగా చూచుకొని కూర్చుండెను. అదృష్టము వలన వెన్నెల రాత్రి కదా! ఆ చంద్రుఁ డెప్పుడో తెల్లవారు వేళ నస్తమించును. అది ద్వాదశియో త్రయోదశియో? మిగిలిన రాత్రి వేళ యొక్క చీఁకటినెట్లో గడపవచ్చును.

రాత్రి రెండు జాములయ్యెను. ఒండు రెండు వానర ముల కిచకిచలు, నడుమ నడుమ తమగూళ్ళలో నెందుకో కదలిన పక్షులకూతలు తప్ప మఱియేమియు లేదు. ఏమృగము వచ్చినను దూరమునుండి తనకు వెన్నెలలోఁ గనిపించును. అది పెద్ద చెట్టగుట చేతఁ దానొకవైపునఁ జూచుచుండఁగా మఱియొక వైపునుండి చెట్టు నీడలోనికి వచ్చిన ప్రాణిని మాత్రము తాను గుర్తుపట్టలేఁడు. ఒకటి రెండు సార్లు వృక్షము క్రింద సలికిడి వినెను, అవి సామాన్యములైన జంతువులు. వానిదారి నవిపోయెను. రాత్రి రెండు జాములు దాఁటెను. మఱికొంత కాలము గడచెను. చంద్రుఁ డెఱ్ఱరంగు తిరిగెను. తిరిగె ననఁగా చీఁకట్లు వచ్చెనని యర్థము. రాత్రి పూట నస్తమింపఁ బోవుచున్న శుక్లపక్ష చంద్రుఁడు వెలా ర్చెడు నెఱ్ఱ వెలుతురులు చీఁకటికి సహాధ్యాయులు. అంత కంటెఁ జీఁకటియే మేలు. ఆ సమయములో నతని భయము ద్విగుణీకృతమైన సమయములో దూరమున నుండి యొక సంగీతము వినవచ్చెను. అది సన్నని గొంతా? ఒక జంత్ర ధ్వనిలో కలుపఁబడిన కంఠస్వరమా? పాడెడిదొకరేనా, యిద్దఱా? రెండును స్త్రీ కంఠములా? వాని కర్థము కాలేదు. సంగీతము లోకమోహనముగా నుండెను. తన్మయత్వమును

దెచ్చుచుండెను. గాలి వీచు చుండెను. ఆగాలి యేదెసనుండి వచ్చునో గుర్తులేదు. వృక్షము నవరోహించి సంగీతము వచ్చెడి దెసకుఁ బోవలయునా? ఈ మహా కాంతారములో నీ సంగీత మెచట నుండి వచ్చెను? ఇది శాస్త్రీయమైన సంగీతము కాదు. ఆటవికమైన సంగీతము. కాని యేమి మాధుర్యము? ఇంతటి మధువుద్భవింపఁ జేయుచున్న సంగీతమును పాడెడి యాటవికులు స్వభావము చేతఁ గ్రూరులై యుందురు. అది యెట్లు పొసఁగునో తెలియదు. వేటకాఁడు లేడి నాకర్షించుటకు సంగీతము పాడును. అయ్యో! సంగీతము వంటి పరమేశ్వరాంశ కల విద్య యున్నచోటఁ గ్రౌర్యముండుట యేమి? ఈ రెండును కలసి యొక చోట నుండుట యెట్లు? అతనికి నవ్వు వచ్చెను. తన స్థితి యేమి? ఈ తత్త్వ విచారణయేమి? చంద్రుఁడస్తమింపక యున్నప్పుడు గానము వినవచ్చినచో వెదకి కొనుచుఁ బోవచ్చును. ఈ చీఁకటిలో నెట్లుపోఁదగును. పోయి తీరవలయును. వారా పాడుట మానివేసినచోఁ దాను వారున్నచోటునకుఁ బోవుటకు సూచికలేదు. ఇప్పుడైనచో సంగీత నిస్స్వనమును గుర్తుపెట్టికొనుచుఁ దదభిముఖముగాఁ బోవచ్చును. తనకు భయమేమి? గూఢచారి భయపడ గూడదు. మృత్యు వొకసారియే వచ్చును. రెండు సార్లు రాదు. ఈ యడవిలో నీ సంగీత మెట్టిదో కనుగొని తీరవలయును. అతఁడు చెట్టు నుండి దిగెను. సంగీతము వచ్చు దిశ కభిముఖముగా నడచి పోవుచుండెను. మార్గము కంటకాకృతము. అది మార్గముకాదు. మార్గమున్నదేమో వెదకుటకును వీలులేదు. మెరకయో

పల్లమో, ముండ్లపొదయో వట్టి నేలయో? పోవుచుండెను. అతనికిఁ బాదరక్షలు కలవు. కాని కంటకములు నీలమండల వద్ద గ్రుచ్చుకొను చుండెను. జంఘల యందు గ్రుచ్చుకొను చుండెను. ఒక చోట పల్లములో తూలుచుండెను. ఒకచోట మెట్టమీఁదఁ బడుచుండెను. అది చాల దవ్వు. ఇంతలో నతని కొక భయము వేసెను. ఆ పాట యాగిపోయినచో నేమి చేయవలయును. వెను దిరిగి చూచెను. తాను దిగిన చెట్టు గూడఁ గనిపించుటలేదు. అతని కొక్కటియే ధైర్యము. కొంత సేపటిలోఁ దెల్లవారును. పాట యాగిపోయెను. అతఁడు మహాంధకారమున నిలచిపోయెను. అనుకొన్నంతయు జరిగినది. ఏమి చేయును? ఒకచోటఁ గూర్చుండెను. అచ్చటికి దూర్పెదో? ఈ పర్వతములలో నుషస్సు కనిపింపదు. ప్రాగ్దిశయందు నుషోరాగము తెల్లదనము నాల్గు బారలమెత్తు గల యాకాశమున లీలగా గుర్తుపెట్టుకొన వలయును. అట్లు గుర్తుపెట్టుకొనుటకుఁ గన్నభ్యస్తమై యుండవలయును. ఇతని కా యభ్యాసములేదు. గాని నిన్నటి యనుభవమున్నది. ఇంతలో మఱల పాట యారంభింపఁ బడెను. వానికిని బ్రాణములు లేచి వచ్చెను. శరీరమే లేచి నడచుచుండెను. వెలుతురు బాగుగానే వచ్చెను. ఆ సంగీత మచ్చటి నుండి వచ్చుచున్నదని విస్పష్టముగానే తెలిసెను. ఇంతలో పాట యాగిపోయెను. నష్టములేదు. అతఁ డా ప్రదేశమునకు సూటిగాఁ బోయెను. అచ్చట నొక పెద్ద వృక్షమున్నది. మఱియెవ్వరును లేరు. ఈ సంగీత మెచటినుండి వచ్చెను? అతనికి వెంటనే స్ఫురించెను. ఆ రాత్రి పూట వాఁడెవఁడో

తన వలెనే వృక్షాగ్ర మధిరోహించి యచటనివాస మేర్పఱచి కొని యచటఁ గూర్చుండి పాడుచుండవలయును. ఇతఁడు తల యెత్తిచూడఁగావాఁడెవఁడో కనిపింపలేదు. కాని మంచెకనిపించెను. చెట్టెక్కవలయునా వలదా? వాఁడెట్టివాఁడో తెలియకుండ దాను పోయి వానినిఁ గలియుట యెట్లు? తానా సమీపమున నెచ్చటనో రహస్యముగా దాగియున్నచో వాఁడే కాల్యకృత్యములు నిర్వర్తించుటకు వృక్షమునుండి దిగి వచ్చును. వానినిఁజూచి వానిస్వరూప లక్షణాదులు గ్రహించి యోగ్యుఁడైనచో సంభాషించుట, కానిచో వెడలిపోవుట. ఇది యిట్లుండఁగాఁ దనపని యేమైనది? తాను పట్టినది తప్పుత్రోవ. మఱల వెనుకకుఁ బోవలయునేమో! రెండవత్రోవ ననుసరించి పోవలయునేమో! ఇంతకును దాను నిద్రించిన వృక్షమెక్కడ? దానిని వెదకికొనవలయును వీఁడెవఁడో యూటవికుఁడు. వానితోడి తనకేమి ప్రసక్తి? తాను నిర్వహింపవలసిన రాజధర్మము చెడిపోవుచున్నది. ఇది మూఁడవ దినము. తానుత్తర జ్యోతిషగ్రామములు చేరవలయును. అచటినుండి వీణావతికిఁ బోవలయును. ఈయటవీ నిస్తరణము చేయవలయును. అతఁడెంత సేపు గూర్చుండవలయును? పైనుండి వాఁడు దిగివచ్చుటలేదు. మంచెమీఁద నెవరైన నున్నారా లేదా? కొంతసేపటికి తనికిఁ జెట్టెక్కి చూడవలె ననిపించెను. చెట్టెక్కెను. మంచెమీఁద నెవ్వరును లేరు. ఇది యేమి యాశ్చర్యము? భగవంతుఁడు తనకొఱకే దే మాయా వాగురను నిర్మించినట్లుండెను. చెట్టుదిగి రాత్రి తాను నివసించిన వృక్షముకొఱకు వెదకుద మనుకొనుచుండెను.

దిగినవెంటనే చెట్టుక్రింద నతనికిద్దఱు పురుషులు కనిపించిరి. అతనికిఁ దెలియదుగాని వారిలో నొకఁడు కిటకిట. రెండవ వాఁడు సవ్యసాచి. మిత్రగుప్తుఁడు కిటకిటను తీవ్రముగాఁ జూచెను. రెండుమూఁడు నిమేషములలో సమన్వయము కుదిరెను. మిత్రగుప్తుఁడిట్లనెను. 'నీపేరు కిటకిట. నీవు యశోవంతుని మూఁడవ కుమారుఁడవు. మాది పాటలీపుత్రము. ఆఱేండ్లక్రింద నేను మీయూరువచ్చితిని. మనముత్తాత లన్నదమ్ములు, మీముత్తాత యవనాంగనను బెండ్లియాడెను. పదేండ్లక్రింద మీనాయనగారు మాగ్రామమునకు వచ్చిరి. బంధుత్వమును దిరుగవేసికొంటిమి. నేను మీయూరికి వచ్చినప్పుడు నీవు పండ్రెండేండ్లవాఁడవు. చిన్నిచిన్ని పుల్లలతో నేకతారలు కట్టెడివాఁడవు. మీయన్నలు వానిని విఱిచి పాఱవేసెడివారు. నాపేరు మిత్రగుప్తుఁడు. నీవప్పటికిఁ జిన్నవాఁడవు. నీకు గుర్తున్నదోలేదో నాకుఁ దెలియదు. నేనునిన్ను కలిసికొనవలయునని రామఠదేశమునకుఁ బోయితిని. మీయూరు వెళ్ళితిని. అచటనిపుడు మీకుటుంబములేదు. రామఠరాజ్యాధిపతి రుమ్యకునకు దగ్గరిబంధువు. అతని బలవంతముచేత రామఠాధిపతి మీ కుటుంబము విక్రమార్కచక్రవర్తి పక్షమువారని యందఱను సంహరింపించెను. నీయదృష్టమువలన నీవప్పుడచ్చటలేవు. లేనిచో నిన్నుఁగూడ నరికిపాఱవేసెడివారే. నీయీ సంగీతమును, నీయీ దేశద్రిమ్మరితనమును నిన్నురక్షించినవి'' మిత్రగుప్తుఁడిట్లుచెప్పి సవ్యసాచివంకఁ జూచెను. ఆతఁడెవ్వడనెను. సవ్యసాచి 'నీవెవఁడవు? నీకు రామఠములలో నేమిపని? నీవెందుకు

కెళ్ళితివి? నీదేశమేది? చెప్పితివిగదా! పాటలీపుత్త్రిమని నీవెందుకిచటికి వచ్చితివి? నాది యీ దేశము, నేనిచ్చటనే పెరిగితిని. ఈ మహారణ్యము నెప్పుడును నాకుఁ దెలియవు. నీకెట్లు తెలిసెను? ఇతనిపేరు కిటకిటయని నాఁకుదెలియదు. ఇతనిసంగీతమునకు ముగ్ధుఁడనై మూన్నాళ్ళనుండి యితని వెంటఁ దిరుగుచుంటిని. నీవెవ్వఁడవో చెప్పితివేని నీవువచ్చిన పనినాకుఁదెలిపితివేని నేనెవ్వడనో నీకుఁ దెలియఁజేయుదును.” మిత్త్రగుప్తుఁ డాలోచించెను. ఇది మహారణ్యము. కిటకిట సమాధానము చెప్పకపోయినను దనవంక బంధుత్వపు దృష్టులు పరగించుచుండెను. తన కుటుంబము సంహరింపఁ బడినదన్నవార్త వానికన్నులలోఁ గొన్ని దుఃఖరేఖలను వ్యక్తముచేయుచుండెను, ఈ రెండవవాఁడెవఁడైన నేమి? వానినిఁ దాను సులభముగా నిర్జింపఁగలఁడు. ఇది మహారణ్యము. తాను వానినిజంపినచో దిక్కు దివాసు లేదు. ప్రస్తుతమున్న కష్టమేమనఁగా నీమహారణ్యమునుండి వెలికిఁ బోవుట. దానికి కిటకిట యున్నాఁడు. మిత్త్రగుప్తుఁడిట్లనెను. “నేను చక్రవర్తి గూఢచారులలో నొకఁడను. ఇచట యవన రాజ్యములు వరుసగానున్నవి. వాని పొలిమేరలలో యవనుల రహస్యాయుధ నిర్మాణాగారము లున్నవఁట. వానిని గనుగొను టకు వచ్చినవారిలో నేనొకఁడను. నాకు వానిజాడఁ దెలియ లేదు. ఒకనాఁడు నాకొక స్వప్నమువచ్చెను. అందులో నాకిద్దఱు కనిపించిరి. మాచక్రవర్తియు, నీకిటకిటయు. వీరి సంబంధము నాకుఁ దెలియలేదు. రామఠములకుఁ బొమ్మని నాయంతరాత్మ చెప్పినది. మాబంధుత్వము చెప్పితినిగదా!

వీనివలననేదో తెలియునన్న యాశతో నచటికిఁ బోయితిని. వీరికుటుంబ మట్లయినది. ఈదుర్గమారణ్య మార్గమునాకుఁ బూర్వము తెలియును. నిన్నసాయంతనమువఱకు దారితప్ప కుండ వచ్చితిని. నిన్నసాయంతనమున దారితప్పితిని. భగ వంతుఁడవియు మంచి కేచేయును. దారితప్పనిచో నేఁడు కిటకిటను గలిసికొని యుండను. ఇప్పుడు నీ వెవ్వరవో చెప్పుము, ఇప్పుడే చెప్పుచున్నాను. నీవు క్షత్రియుఁడవలెఁ గనిపించుచున్నావు. నారహస్యము నీతోఁ జెప్పితిని.నీవునాకు వ్యతిరేకివైనచో నీవుచెప్పిన నబద్ధములని నాకుఁ దోచినచో నిన్నిటనే సంహరింతును. కిటకిట నా తమ్ముఁడు. వారి కుటుంబము చక్రవర్తి యందభిమానము గల కుటుంబము. నీవు యథార్థము చెప్పుము. కిటకిట తన దుఃఖమును మఱచిపోయి నవ్వుచుండెను. సవ్యసాచి యిట్లనెను. 'నా పేరు సవ్యసాచి. మా పెద తండ్రి కుమారుఁడు సుమంతుడు. అతఁడు కటకరాష్ట్రసేనలో దళవాయి. అతనితో పాటు మఱియిద్దఱు దళవాయిలు కలరు. వారును క్షత్రియులే. మా యన్నపై యధికార చమూపతి క్షత్రియుడు. మా యన్న కీరహస్యములు చాలఁ దెలియును. మేము చక్రవర్తి పక్షపాతులము. నీవు దృఢ శరీరుఁడవు. నేను కొంచెము బక్క పలుచని వాఁడను, అందుచేత నీవు నన్ను చంపఁ గలుగుదు వనుకొనుచున్నావు. నీవు సాయుధుఁడవై యుం దువు నేనును సాయుధుఁడనే. నీ యాయుధమెట్లు గుప్త పఱుపఁబడియుండునో నా యాయుధము నట్లే గుప్తపఱుపఁ బడి యున్నది. మా యన్న నా కొక పని యప్పగించెను.

నీవు నీ రహస్యమును నా కెట్లు చెప్పితివో నేను నా రహస్యములు నీ కట్లు చెప్పుచుంటిని. మనమిద్దఱ మేకార్థసమవేతులము. నే నబద్ధము చెప్పుటలేదు. తెలిసికొనఁ గలిగినచోఁ దెలిసికొనుము. నన్ను మా యన్న యొక పనిమీఁద నియమించెను. వరాహమిహిరాచార్యుఁడని యొక మహాపండితుఁడున్నాఁడు. వారి పేరు నీకుఁ దెలిసి యుండవచ్చును. వారి కుమార్తెపేరు వేదవతి. తొమ్మిదేండ్ల క్రింద నామె దొంగిలింపఁ బడెను. ఆమెది యొక చిత్రమైన చరిత్రము. ఆమెది నాగమయ తనువు. ఆమె కోసము నేనుత్తర జ్యోతిష రాజ్యము నందలి పల్లె పల్లె వెదకితిని. గుర్తు లేకుండ వెదకితిని. గుర్తు నాకుఁ దెలియలేదు. దైవాద్యానీకీ కిటకిట కనిపించెను. వీని సంగీతము నన్ను మోహింపఁ జేసెను. ఇతనిని నేననుసరించుటలో నా వేదవతి యున్నచోటు తెలిసికొనవచ్చునని నాకాశాంకురము బయలుదేఱెను. ఇంచుమించుగాఁ దెలిసినట్లే యైనది. కాని తెలిసినట్లు లేదు. ఈ యడవిలో మాకొక యువతి కనిపించెను. ఆమె కంఠము గూడ కోకిల స్వరము. ఆమె యీ యడవిలో నెందుకున్నదో తెలియదు. ఆమె నాధారము చేసికొని వేదవతి యునికిపట్టును గ్రహింపవలయునని నేనుతలంచుచునున్నాను” అప్పుడు కిటకిట యిట్లనెను. “నీవు మిత్రగుప్తుఁడవు, మా బంధువు. నిన్ను నేను మఱచిపోలేదు. నేనిల్లు వదలి తిరుగుచుంటిని. దుఃఖవార్త చెప్పితివి. పోనిమ్ము నాకును బది దినముల క్రింద నొక స్వప్నము వచ్చెను. అందులో నొక మహారాజును నీవును

గనిపించితిరి. నీ వెవరో నాకుఁ దెలియలేదు. ఇప్పుడు తెలిసినది. నీవా! ఆ మీచక్రవర్తి యెంతటి యందగాఁడు!

## తొమ్మిదవయధ్యాయము

వీణావతియున్నగ్రామముపశ్చిమగాంధారముననున్నది. గ్రామము చిన్నది. కాని లక్షణమంతయు రాజధాని లక్షణము. సామాన్యముగా నేరాజ్యముననైనను పొరుగురాజ్యములకుఁ బరిసరములములనున్న గ్రామము లన్నియు దుర్గములవలె నుండును. మఱియు యవనరాజ్యపు పొలిమేరలలోని యూళ్ళు దుర్గనగరములవలెఁ గట్టుదిట్టములు చేయఁబడి యుండును. ఒకచిన్నవాగు వీణావతి నగరమువద్ద మలక తిరిగి ప్రవహించుచున్నది. అది మలకతిరుగుటలో గ్రామమునకు మువ్వైపుల ప్రవహించుచున్నది: ఆవాగు జీవనది. ఆయూరి నదితోపాటు గ్రామమునకుఁ జుట్టును ప్రాకారమును నిర్మించిరి. మూఁడవవైపున ప్రాకారమునకు ద్వారము పెట్టిరి. ఇంతచేసినను తద్గ్రామముమీఁదికి పరదేశపు యెల్లలయందలి జనులు దాడిచేసిన దెప్పుడునులేదు. ఆకోటగోడ చెక్కుచెదరక యున్నది. అది గ్రామమున కలంకార ప్రాయముగా నున్నది. ఆ యూరి యొక్క యీ దుర్గాకృతి వలన తత్రత్యులైన జనులకు లాభము కన్న నష్టమే కలదు. పరులు వచ్చి దాడి చేయుట లేదు. వారిని ద్రోచుకొనుట లేదు. అందుచేత నిది నిరుపయోగము. దాని లాభములేదు. నష్టమే మనఁగా గ్రామములోని జనులు యథేచ్ఛముగా పోయి

వాగులోని జలమునుఁ దెచ్చికొనుటకు వీలులేదు. వాగునకుఁ బోవలయుననఁగా ప్రవాహము లేనిచోట కట్టిన దుర్గ ద్వారములో నుండి పోయి పెడతిరిగి నీరు తెచ్చి కొనవలయును. మరియు నా యూరిలోని జనులకు జలాధార మాయొక్క వాఁగే. నూతులు త్రవ్వినచో నీళ్లు పడవు. ప్రాకారము లేనిచో గ్రామమున కంతకు నీరు సులభముగా లభించును. కొన్ని తరముల నుండి యీ గ్రామ ప్రజ లీబాధ ననుభవించుచునే యుండిరి. ఆ కోటగోడ తేలికగా నిర్మూలము చేయ వచ్చును. లేదా నాల్గుచోట్ల వారు లోనికిఁ ద్రోవ యేర్పరుప వచ్చును. దైనందినముగా ననుభవించు నీ కష్టము కష్టమన్న భావము రెండు మూఁడేండ్ల కొకసారి గ్రామములో గలుగుచుండును. ఆ యూరిలోని యిండ్ల సంఖ్య మూఁడు వందల కన్న నెక్కువ యుండదు. ఈ కష్టమును గూర్చి ప్రతి దిన మెవరి యింటిలోననో యొకరి యింటిలోన ననుకొంచు నే యుందురు. ఒక యింటికి నలుగురు చుట్టములు వత్తురు. అనాఁ డెక్కువ యనుకొందురు. ఒకరి యింట నేదియో యక్కఱ జరుగును. ఆ యక్కఱ నాల్గు దినములు నీ కష్టమును వారు భావింతురు. ఆ యక్కఱ తీరిన తరువాత నలువురిలోఁ జెప్పి యీ గోడలో దారి కొట్టించవలెనని యనుకొందురు. అక్కఱ తీఱి నంతనే మఱచి పోదురు. అశ్రద్ధ చేయుదురు. ఏ యాఱేండ్లకో యేడేండ్లకో యూరిలోని నలుగురు పెద్దలునుఁ గలిసి దీనినిగూర్చి తీవ్రముగా యోచింతురు. ఆయూరిలోఁ బెద్దలెవరు ? అందఱును పేదసంసారులే ! ఆచుట్టుపట్ల పొలాలు కలవు. అవి పేరునకుఁబొలాలు. అవి

పండవు, పెట్టవు. అన్నోదకములకు లోపములేనివారిసంఖ్య యాయూరిలోఁ బదియున్నది. ఆపదిమందియు వీణలనుచేయు దురు. ఆసేతుశీతాచల మాయూరిలో నిర్మింపఁబడిన వీణ యన్నచో గౌరవము. గొప్పగాయకులు తమ వీణలనుగూర్చి "యిది వీణావతి వీణ"యని గొప్పగాఁజెప్పికొందురు. ఆయూరి లోని వీణకున్నంతవెల మఱియొక యూరిలోని వీణకుండదు. యావద్భారతమునందలి ఎల్ల రాచనగరులకు వీణలచోటి నుండియే పోవలయును. అనఁగా నాపదిసంసారములవారుమహా ధనవంతులు కావలయును. వారుకాలేదు. ఎందుచేతననఁగా దేశములోఁ బలుచోట్ల చాలమంది వీణలను చేయుదురు. వానిని వీణావతినుండి తెచ్చితిమందురు. జగత్తులో సంగీతము పాడెడివారిసంఖ్య తక్కువ. అందులో వీణావాదన కుశలుల సంఖ్య తక్కువ. వారిలో శ్రుతిసంలీనతయు, పేయత్వమును మాధుర్యమును తెలిసినవారిసంఖ్య తక్కువ. పరమోత్తమ మైన వీణయొక్క స్వరూపము తెలిసినవారు మిక్కిలి యుండరు. కనుక నెన్నియో వీణలు వీణావతి వీణలక్రింద జమకట్టఁబడి చెలామణి యగుచుండును. వీణావతిలోని వీణ వేయిదీనారములిచ్చినఁగాని లభింపదు. వేయిదీనారములిచ్చి వీణనెవఁడు కొనును? ఒక గాయకుడుఁకూడఁ గొనలేఁడు. ఎవఁడో మహాగాయకుఁడు మహారాజు దయసంపాదించి యిట్టి వీణకుఁ దాను వీణావతికివచ్చి చేయించికొని పోవుట యనఁగా నదిసులభమైన పనిగాదు. ఇచట పది సంసారము లున్నవి. అదివారికి వంశపారపర్యముగా వచ్చినవిద్య. ఆ పది కుటుంబములలో మూఁడు నాల్గు కుటుంబములలో పెద్దలు

చనిపోదురు. చిన్నపిల్లల కావిద్య సరిగారాదు. తక్కినవారు సంవత్సరమునకు పదిసెల లాగ్రామములో నుండరు. వారు దేశదేశములకుఁబోయి యచట నీవృత్తిచేయువారి దగ్గఱ నేకొంచెమో పుచ్చుకొని వారికి వీణలు చేసిపెట్టితిమనిపించు కొని వచ్చుచుందురు. ఆవీణ లక్లేయుండును. వీరిసంసారము లిక్లేయుండును. అచ్చముగా వీణావతిలోనుండి సుపరిశుద్ధమైన వీణ చేయించికొనవలననఁగా నాయూరిలో నేడాదిమైన నుండవలయును. ఎవనినో యొకరిని పట్టుకొని వానితోపాటు కూర్చుండవలయును. వానికి నీవీణ సంపూర్ణముగా సిద్ధమైన తరువాత వచ్చెడి వేయిదీనారములకంటె నడప దడప నాగ్రామము నీగ్రామముపోయి తెచ్చికొనెడి నాల్గు దీనారము లయిదుదీనారములు ప్రియతమములు. ఈ పది యిండ్లు కానియిండ్లు సంసారములేకావు. ఆ యూరిలో మూఁడువందలమంది పురుషులుండవలయును. పట్టుమని యొక సారి యేఁబదిమందికన్న నెప్పుడు నుండరు. రాత్రిపూట ప్రాకారపు తలుపు బిగించినచో నాయూరికి భయములేదు. వారందఱు నిర్ధనులని సర్వదేశము తెలియును. ఎవ్వరు నాయూరిమీఁదికి దాడిపోరు. ఏరాజు సైనికులు వీణావతి వంకఁ జూడరు. ఆయూరి చుట్టుననున్నగోడ సైనికులకు పరిహాసభాజనము. అప్పుడప్పుడు కొందఱు రాజుల గూఢ చారులు వీణావతియందు కలిసికొందురని ప్రథకలదు. ఏరాజు గూఢచారులలో? ఏసమయములందుఁ గలిసికొందురో? ఎట్లు తెలియగలదు! ఆప్రసక్తి కెవ్వరును బోరు. అప్ప టికిఁ బూర్వము కొన్ని వందల యేండ్లక్రింద నప్పటి కాశ్మీర

రాజు గొప్ప వైణికుఁడఁట! ఆయనవచ్చి యీయూరిలో నాల్గు నెలలు నివసించి యొకవీణ చేయించికొని పోయె నఁట! ఆయన యీ యూరిలో నొక దేవాలయమును గట్టించెను. అది దేవాలయము కాదు. ఒక పెద్ద సావడి. దాని ముందు మూఁడు గదులు. ముందఱ నిష్కుడ్యమై యాచ్ఛాదితమై నేల శిలానిర్మితమైన పెద్ద స్థలము. ఒక గదిలో శివలింగము, నొక గదిలో విష్ణుమూర్తి విగ్రహము, నొక్కగదిలో బుద్ధుని విగ్రహము. అచటి కేమతస్థులైన రా వచ్చును. ఊరిలో భిక్ష పెట్టెడివారు లేనపుడు వట్టి దేవతా విగ్రహములకొఱ కెవరు వత్తురు? ఆ రాకయు సమసి పోయినది. ఆ దేవాలయము చాల చోట్ల శిథిలమైపోయెను. సావడి ప్రదేశము నిరుపయోగముగా నున్నది. మూఁడు గదులలో శివలింగమున్న గది మాత్రము పడిపోలేదు. అచ్చటి కెవ్వరు వత్తురో, యెందుకు వత్తురో, యెప్పుడు వత్తురో, యెవ్వరికిఁ దెలియలేదు. పవళ్ళ యంగా యూరిలోని కెవరైనను రావచ్చును. ఆ యూరిలో నేయింటిలోనను నాతిథ్యము దొరకదు. పరులెవరో వచ్చి రాత్రులం దాయూరిలో నుందు రనుకొనుటకు వీలులేదు. ఎవరైన నున్నచో నీ శిథిల శివలింగమున్నచోట నుండ వలయును. అచట నెంత మంది యుండఁగలరు. ఒకరిద్దఱు తప్ప నెక్కువ యుండు టకు వీలులేదు. ఆ యుండెడివాఁడు బైరాగుల కంటె బైరాగి యై యుండును. రాత్రి పూట తలుపు వేసినచో నీ యొక రిద్దఱు బైరాగులు పోయి తలుపు దీయుటయు సైన్యములను లోనికి రానిచ్చుటయు వారు వచ్చి లోని జనములను సంహ

రించ ధనములను దోచుకొని పోవునదియు నేమియు లేదు. మఱి తలుపులెందుకు వేయుదురనఁగా నది తరతరములుగా వచ్చుచున్న నొక యాచారము. ఆ తలుపులు వేయుటకుఁ దీయుటకు నొక యుద్యోగి కలఁడు. వానికిఁ బ్రతి దినము గ్రామములో నున్న యొక పాతిక యిండ్లలో దినమునకుఁ గొంత వరుమాన మీయ వలయును. వారు తిట్టుచునే యిచ్చుచుందురు. ఇది నిష్ప్రయోజన మనుచునే యిచ్చుచుందురు. వాని కుటుంబమున కదియే జీవనాధారము. వాని కుటుంబము తరతరములుగా నా వృత్తిని వదలిపెట్టదు. అందుచేత నా యూరికి రాత్రులందు భద్రత కలదు.

కోటతలుపులు మూయువారి కుటుంబములో నెవఁడో యొకఁడు ప్రతిదినము గ్రామములో నుండవలయును. తలుపులు వేసితీరవలయును. ఒకనాఁటిరాత్రి తలుపులు వేయనిచో నీపాతిక కుటుంబములలో నెవరోయొకరు చూచినచో మఱునాఁడు వానికాయూరిలో గింజదొరకదు. దేవాలయములో నున్న పూజారికినైన నొకనాఁడు స్వామికి నైవేద్యము పెట్టనిచో నష్టములేదుగాని వీరికి నష్టము కలదు. అందుచేత నిది యత్యావసరమైన విషయము. ఈ ద్వారపాలకునకు మఱియొక ధర్మము కలదు. ఆ యూరిలో నే యింటిలోనైనను చోరుఁడెవఁడైనవచ్చిదాగియున్నచో వాని బాధ్యత లేదు కాని శిథిల దేవాలయములో వాఁడు దాగియున్నాఁడని మఱునాఁడు ఋజువైనచో బాధ్యతవానిది. ఆయూరిలోనికి దొంగలెందుకువత్తురని సందేహింపరాదు. దొంగలు ధనవంతులనుండియే దొంగిలింతురని కాని, ధనధాన్యములే

దొంగిలింతురనికాని యనుకొనరాదు. పిడకలు దొంగిలింతురు. పనికిరాని చెప్పులనుకూడ దొంగిలింతురు. అందుచేత నీద్వార పాలకుఁడు వారానికొకసారియో నెలకొకసారియో తలుపులు వేయకముందు శిథిలదేవాలయమును చూచివచ్చును. అచట పట్టుమని పదిమంది యుండుటకే వీలులేదు. అయినను పోయి చూచివచ్చును. ఎప్పుడును ద్వారపాలకుని కుటుంబములో నిద్దఱు ముగ్గురు పురుషులుందురు. ఈతరములో మఱియు నాఱునెలలనుండి వాఁడొక్కఁడే పురుషుఁడయ్యెను. తండ్రి చనిపోయెను. వీఁడొక్కఁడే కొడుకు. వాఁడు పదునాఱేండ్ల వాఁడు. తరతరములుగా నీకొలువు వారికి దుర్భరముగా నున్నది. వీఁడీ కొలువువదలి యెచ్చటికో పోవుదమనుకొను చున్నాఁడు. ఆగ్రామవాసులు వానిని పోనిచ్చుటలేదు. ఒక రోజున వాఁడు వచ్చినచో దరదరాజ్యములో నొక గొప్ప సంసారి వానిని తనకొలువులోఁ జేర్చికొందుననియు, జీవ యాత్ర సుఖముగా సాగింతుననియు మాసవేతన మింత యని నిర్ణయింతుననియు, నానాఁడు రమ్మనియుఁ జెప్పెను. వానికాయూరు వదలిపోవలయునని యున్నది. వానితల్లికిఁ దరతరములవృత్తి వదలరాదని యున్నది. నాఁడు స్వతంత్రించి వెళ్ళినచో నారాత్రి దుర్గద్వారము మూసెడి వారులేరు. తల్లి ముసలిది కొండనాలుకకు మందువేసినచో నున్ననాలుకయు పోవునేమో! అట్టి సమయములో వారి యింటికొక బంధువువచ్చెను. వాఁడు బంధువని యెవ్వరికిని దెలియదు. ఏదో బీరకాయపీచు చెప్పెను. వానికిఁ దెలియదు. వానితల్లికిఁ దెలియదు. తల్లి నీవు మాకుచుట్టానివికావు

పోవుననెను. కొడుకు వానిని చుట్టము నేయు నెను. కారణము వానినచట రెండుమూఁడు నాళ్ళుంచి తాను దరద దేశము నకుఁబోయి రావచ్చునని. తల్లికేవో భయము. ఇదిఎదో నెత్తి మీఁదికి వచ్చుచున్నది. కుటుంబమునకున్న యీకొంచెము గోడుగూడ వెనుక పట్టునన్నట్లున్నది. ఇఁకముందు వారి సంసారమేమగునో తెలియదు. నాల్గు వేళ్ళు కష్టముగా లోనికిఁబోవుచున్నవి. దీనినిగూడ చివరకు నోచికొనలేదేమో! కొడుకుపేరు శర్యాతి. తల్లివలదన్న కొలఁది వాఁడీ చుట్టము గానిచుట్టమునకు ద్వారము నప్పగించి వెడలిపోయెను. తల్లి యొక తెలివిగల పని చేసినది. ఈసంగతి నూరిలో పొక్క-నీయ లేదు.

ఆరాత్రి నడిజాముదాటిన తరువాత నొకరితరువాత నొకరుగా పన్నిద్దఱు మహాదుర్గద్వారము ప్రవేశించిరి. తల్లి కనిపెట్టుచునేయున్నది. ఆమె పై ప్రాణములు పైన పోవుచున్నవి. ఏమనుటకును వీలు లేదు. వారెవరో? దొంగలేమో? గ్రామమును రాత్రిపూట తగుల బెట్టుదు రేమో! తాను పోయి నాలుఁగిండ్లలోఁ జెప్పివద్ద మన్నను దెలిసి యింతవఱకేల దాచితివని నల్గురును దన మీఁదఁ బడుదురేమో! ఆ నాటి రాత్రి మఱియు గ్రామములో పురుషుల సంఖ్య తక్కు-వగా నుండెను. ఆమె కేమియు పాలుపోలేదు. వారి యిల్లు చిన్నయిల్లు. పదిమంది కూర్చుండి మాటాడుటకు గూడఁ దగినంత స్థలములేదు. వంట చేసికొను చిన్న గది యున్నది. దాని నానుకొని దానికి మూఁడు రెట్లు వైశాల్యముకల యొక గది యున్నది.

ఇంతే! ఆ పన్నిద్దఱు వచ్చి దేవాలయములోనికిఁ బోదురను కొని యామె తలంచెను. వారు వెళ్ళినచో మంచియో చెడ్డయో తానుపోయి యూరిలో నలుగురితోఁ జెప్పవలయు ననుకొన్నది. వారుపోలేదు సరిగదా తన్నెచ్చటికిఁ బోనిచ్చుట లేదు. ఆ పన్నిద్దఱు నొకని తరువాత నొకరు వచ్చిరి. ఎంతమంది వత్తురో తెలియదు. పన్నిద్దఱైన తరువాత తలుపులు వేసిరి. ఇంకి రారని తెలిసినది. ఆమెను వంట యింటిలో నుండు మనిరి. బయటకు రావలదనిరి. వచ్చుటకు వీలులేకుండ నామెను లోనఁబెట్టి గడియబిగించిరి. ఆమె యేమి చేయఁగలదు? వారేవో రహస్యములాడుకొనుచుండిరి. ఆమెకు సరిగా వినిపించుట లేదు. వినిపించినదియు నిదమిత్థమని తెలియుటలేదు. ఇట్లుండఁగా వారి ప్రసంగము సాగుచుండెను. మృగేంద్రసింహుఁడిట్లు చెప్పెను. 'నేను కలాపినికిఁ జుట్టము వలె నురగ రాజధానిలోనికిఁ బోయితిని. ఆమె పినతండ్రి పోయిన వార్త నామెకుఁ జెప్పితిని. ఆమె యేమియు దుఃఖ పడలేదు. ఆమెభర్తయైన ప్రస్తరఖని యచ్చటనే యుండెను. అతఁడు నవ్వెను. నాకేమియుఁ దోఁచలేదు. ఈ జాతి జనములో ప్రేమలు తక్కువ. మృత్యువన్నచో వారికి లెక్క లేదు. ఓహో మృత్యువు! మృత్యువును లెక్కసేయని వారు మువ్విధములైన జనములు. ఒకఁడు యోగి. రెండవవాఁడు రాజకీయవేత్త. మూఁడవవాఁడు పశుప్రాయుఁడు. మువ్వురును మృత్యువును లెక్కచేయరు. యోగి కది యయథార్థమైన విషయము. రాజకీయవేత్తకు వట్టి యధికార విషయము. మిగిలిన వారిని తా నధికారము చేయవలయునని యే కాని

వానికి మరియొక యూహ లేదు. యోగి దేహము అశాశ్వతములనును. జీవుఁడు ప్రాఁతశరీరమును వదలి, ప్రాఁత యుడుపులు వదలి క్రొత్త యుడుపులు ధరించినట్లు క్రొత్త శరీరముఁను ధరించుననును. సర్వ శరీరముల యందు వానికి నిరాదరణమే. ఇది యంతయు నొక నాటకము. వాని కితరుల శరీరముల యందెంత నిరాదరమో తన శరీరమునందంత నిరాదరము. రాజకీయవేత్త కట్లు కాదు. తన శరీరము, తన బంధువుల శరీరములు నిస్సందేహముగా నుండవలయును. తన యధికార మంగీకరించని, తనసిద్ధాంతములకు వ్యతిరేకించిన జనుల యొక్క ప్రాణములు తీయుటలో వాని కభ్యంతరములేదు. వాఁడొక యర్థపశువు. ఒక మొండి ఘటము. వివేకము నజ్ఞానము రెండును గలిసియున్న యొక విచిత్రజీవి. మూఁడవవాని కాలోచన లేదు. ఈ సృష్టియందు జీవు లుదయించుచున్నారు, మరణించుచున్నారు. కర్మసిద్ధాంతమంగీకరించనిచో నీసర్వసృష్టికి హేతుహేతు మద్భావము పట్టదు. పూర్వజన్మలున్నవి. పరజన్మలున్నవి. ఈజన్మపరంపరలో మానవజన్మ జీవునకుఁ గ్రమప్రాప్తమగును. జీవునికర్మ కదియొక మెట్టు. తత్పూర్వమునందలి పశుజన్మలలో బుద్ధిపూర్వకముగాఁ జేసెడికర్మ లేదు. అదియొక యనూహితకర్మసాంతత్యము. మానవజన్మలోఁ బ్రారంభించి జీవుఁడు తానొక కర్మచేయుటయు, దాని ఫలాఫలముల ననుభవించుటయుఁ బ్రారంభమగును. తత్పూర్వ జన్మపరంపరము నిట్టిదే యయినను నదియొక సమాహారదశ. ఇచటినుండి యొక వైలక్షణ్యముకలదు. మనుష్యజన్మకుఁ బూర్వము సంచిత

ప్రారబ్ధముల ననుభవించుటమాత్రమే. ఇచటనుండి నూత్న మైన సంచితమును ప్రోవుచేయుటయు నారంభించుచున్నాఁడు. కాని జీవుఁడు తొలుతగా మనుష్యజన్మయెత్తెను. తత్పూర్వ బహుపశు జన్మల సంస్కారమును వదలిపెట్టలేఁడు. ఆలక్ష ణము వాని ననుసరించుచుండును. ప్రస్తరఖనియుఁ గపాలినియు నట్టివారు. వారి పరిచయము. నవలంబించి నేను వీరదత్తుని యింటికిఁబోయి వాని వృత్తాంతము కనుగొనవలయునని నిర్మించికొన్న యాశలన్నియు నొక్కసారి పటాపంచలయినవి. వారు నన్ను భోజనమునకుఁగూడ నుండుమనలేదు. తరువాత నావంకఁ జూడలేదు. ఇంక నేను వారిపరిచయమును బురస్క రించుకొని వీరదత్తునియొద్ద కెట్లుపోదును! అపుడు హఠాత్తుగా నావాంఛించినది జరిగెను. నేను పలుసార్లు నావెంట నేదో యొక మహాదివ్యశక్తి తోడుగా వచ్చుచున్నదని భావించితిని. చక్రవర్తి యాజ్ఞానువర్తులైన మీాయంగలకుఁగూడ నిట్టి యనుభూతి యున్నదని నేననుకొనుచున్నాను. కపాలినీ ప్రస్త రఖనులు నన్ను మన్నించలేదు. నాయచటి యునికినిఁగూడ మన్నించలేదు. నేనచటనే యున్నాను. వారిలోవారు మాటాడుకొనఁదొడఁగిరి. దానివలన నాకుఁ దెలియవలసిన విషయములు తెలిసినవి. అది చాల పెద్దకథ. సులభముగాఁ జెప్పెదను. రాజుసౌమ్యుఁడు. వాని కొడుకవధ్యుడు. కుంటి, నంగి. కటకటయోగియని యొకఁడెప్పుడో వచ్చి వానికి వైద్యముచేసి బాగుపఱచెను. రాజుకొడుకు పేరు కామలహారి. అప్పటికి వానికైదేండ్లు. ఇప్పటికి వానికిఁ బదునెనిమిదేండ్లు. వాఁడు తీవ్రవ్యసనాచార పరాయణుఁడు. కటకటయోగి

శిష్యుఁడు. సౌమ్యుఁడతనికి యౌవరాజ్య మీయలేదు. సౌమ్యుఁడు సగము యవనుఁడు సగము వేదధర్మావలంబి. అతని యాశ్వికసేనయంతయు దారదము. వారు యవన విరోధులు. అందుచేత రాజునకటునిటు బెసగుటకు వీలు లేకుండెను. మంత్రియైన వీరదత్తుని కుమార్తె పేరు మధుగుంజ. పదమూఁడేండ్లక్రింద నామె పదుమూఁడేండ్ల పిల్ల. ఆమెనుకటకటయోగి తీసికొనిపోయెను. ఆమెకిప్పు డిరువదియా ఱేండ్లు. ఆమెకంఠమునందు పికాంగనకూయునఁట. గంధర్వులు వీణలు వాయింతురఁట! అప్పుడప్పుడు మధుగుంజ హాత్తు వచ్చుటయే తప్ప 'నామె తలిదండ్రులనుఁ జూడలేదు. వీరామెను జూడలేదు. ఆమెకు వివాహము చేయవలయు నని వీరదత్తుని యూహ. ఆమెను కటకటయోగి తీసికొని పోదు ననెను. అపుడు వీరదత్తుఁడు పంపించెను. ఎందుకు పంపించె ననఁగా రాజయిన సౌమ్యుఁడు మధుగుంజను పెండ్లి యాడవలెనని తలంచెనఁట! ఆ యెద్దడి తప్పించి కొనుటకు మధుగుంజను కటకటయోగి వెంటఁ బంపెను. కటకటయోగి తీసికొని పోదునన్న బాలికనుఁ దానుబెండ్లియాడుదు ననుటకు సౌమ్యునకు గుండెలు లేవు. ఇది యిట్లుండఁగా నేఁటికి నీ ముడిలో మఱియొక ముడి మొదలుపెట్టెను. కామలహారికి మధుగుంజ మీఁదఁ బ్రేమ యేర్పడెను. ఈ కామలహారి కడచిన రెండేండ్లుగా కటకటయోగి వద్దకు పోవుటయు వచ్చుటయు నున్నదఁట. ఇతనికిఁ బదునెనిమిదేండ్లు. మధు గుంజ కిరువది యాఱేండ్లు. ఈ యసమవయస్కత యెట్లు పొసఁగును? కాని యా మధుగుంజ నేఁటికిని పదునాల్గు పదు

నేనేండ్ల బాలికవలెఁగన్పించునఁట. ఈ కటకటయోగి సిద్ధుఁడు. వాని మహిమలను గూర్చి చెప్పుటకు వీలులేదఁట. మధుగుంజ కొండగొట్టులపాలు త్రావును. సెలయేళ్ళ నీరమానును. అటవీ వృక్షముల ఫలముల నారగించును. ఆమెకు వయసు. ముదురుటలేదు కాఁబోలు! వీరదత్తుఁ డిప్పుడింకొకటి యూహించెను. తండ్రి కొడుకులకు భేదము కల్పించి యీ పిల్ల నెవరికో యిచ్చి పెండ్లి చేయవలయునని యతని యూహ. చక్రవర్తి యుద్ధమునకు వచ్చినచో దరదోరగాభీర దేశములు చక్రవర్తి కెదురునడువవు. దారదుల బలమెక్కువ. ఇది నా యచ్చటివార్త. వీరదత్తుఁడు నేఁడు నిష్క్రియుఁడగును. తండ్రి కొడుకుల కిద్దఱకు నే డతఁడు విరోధి. వీరదత్తుని సాయములేని సౌమ్యుఁడు యవన సేనాదళము మీఁదఁ గూడ నధికారములేని వాఁడు. ఆ మధుగుంజను తెలిసికొన వలయు ననుకొంటిని. ఆ కటకటయోగి యెవ్వఁడో యెచ్చట నుండునో తెలిసికొన నెంచితిని. నా కది సాధ్యము కాలేదు"

అంతట మిత్రగుప్తుఁ డిట్లనెను. "ఆ మధుగుంజ సంగతి నాకుఁ దెలియును. ఆ కటకటయోగి సంగతి నాకుఁ దెలియదు. మధుగుంజ సంగతి నా కంటెఁ దెలసిన వాఁ డీసవ్యసాచి. ఇతనికంటెఁ దెలిసినవాఁడు టికటిక. సవ్యసాచీ! తొలుత నీవు చెప్పుమయ్యా!"

సవ్యసాచి:- "నా పేరు సవ్యసాచి. కటకరాజ్య సేనలో ముువ్వురు దళవాయులు కలరు. వారు ముువ్వురే క్షత్రియులు. అందులో నొకని పేరు సుమంతుఁడు. అతఁడు

నా పెద తండ్రి కుమారుఁడు. నేను వ్యర్థుఁడను. నిష్క్రియుఁడను. మా గ్రామములో నన్నెవ్వరును మన్నించరు. నాకీ ప్రపంచమున నొక్కఁడే స్నేహితుఁడున్నాఁడు. అతని పేరే సుమంతుఁడు. నన్నతఁడు వరాహమిహరాచార్యుని దుహితయైన వేదవతి యన్న యొక దివ్యకన్యను యవనులు దొంగిలించి యామెను త్తర జ్యోతిషములయం దెచటనో దాచిరనియు నీవామె పొలకువ తెలిసికొనవలయునని నియమించెను. నేను త్తర జ్యోతిషమున నీశాన్య భాగమునందున్న పల్లీపట్టణముల నన్నింటిని వెదకితిని. నాకాళ్ళు బలపములు కట్టెను. నాకన్నులు కాయలుకాచెను నాకేమియుఁ దెలియలేదు. ఈ టికటిక యన్నవాఁడు గాయకుఁడు. అడవియంచుల యూళ్ళలో నొకనాఁడితనిని చూచితిని. అతనిపాట నన్నాకర్షించినది. నేనతని వెంటఁబడి తిరుగనారంభించితిని. ఇతఁడడవులలోఁ బాడుచు తిరుగుచుండును. ఒకనాఁడితనిపాటకు నడవిలోని యొకకన్య బదులుపాడెను. నేనామె పేరడిగితిని. ఆమె తనపేరు మధుగుంజయని చెప్పెను. అదియడవి, ఒక వాగు, ఒకపర్వతము. ఏవో గుహలు. ఆమెయిట్లు కనిపించినది యిట్లుపోయినది. ఆమెయెవరో తెలిసికొనవలయునని నేనెంత ప్రయత్నించినను టికటిక నాప్రయత్నములు విఘటనపఱచెను. అది యితనిని గుఱించిన నాయభిప్రాయము. తక్కిన దేమైన చెప్పఁగలిగినచో టికటిక చెప్పవలయును.

మిత్రగుప్తుఁడు :– "టికటిక చెప్పఁడు. అతని నిచ్చటికిఁ దీసికొనివచ్చుటయే గగనమయ్యెను. టికటిక నాకుబంధువు. వీనిది రామఠదేశము. నేను వీనికోసము పోయితిని. వీరివంశము

నాశనము చేయఁబడెను. ఇతఁడు దేశద్రిమ్మరి యగుటవలన బ్రతికెను. నాకువచ్చినకల యితనితోఁజెప్పితిని. అతఁడు తనకువచ్చినకల నాతోఁజెప్పెను. ఓయి తమ్ముఁడా! వీరందఱు మనవారు. మేమందఱము చక్రవర్తి బంటులము. వినుచున్నావుకదా! చక్రవర్తి నీకు స్వప్నములో నెట్లు కనిపించెనో నాకునట్లే కనిపించెను. నాస్వప్నములోఁజక్రవర్తియు నీవును నాకుఁగనిపించితిరి. అంతియేకదా! అనఁగా టికటిక యాగ్రుడ్డిదీపపు వెలుతురులోఁ గిచగిచనవ్వి పాడుట కేకతార తీసికొనెను. అతనిని పాడకుండఁ జేయుటకు మిత్రగుప్తుని ప్రాణములు కడంబట్టెను. వాఁడు మిత్రగుప్తుని మొగమున నంబూకృతి చేసెను. లేచి తాండవించెను. కొంతసేపటికి మూర్ఛపోయెను. మిత్రగుప్తుఁడిట్లనెను. ఇదియితని స్థితి. ఇతఁడు వట్టి యనాగరకుఁడు. ఆటవికుఁడు. ఆటవికమైన యావనమైన సంగీతముయొక్క పురుషాకృతి. వానిని నేనిచ్చటికిఁ దీసికొనివచ్చుటయే తప్పు. కాని నేను నేఁడిచ్చటికి రాకతప్పదు. ఇతనిని వదలుటకు వీలులేదు. వదలినచో మఱల అతనిని పట్టుకొనుట యెట్లో నాకుఁ దెలియదు. తెగించి యన్నిటికిని సిద్ధపడి తీసికొని వచ్చితిని. నేను భయపడుచునే యుంటిని. వీనికి సంగీతము పాడవలయునన్న కోర్కె యెప్పు డుదయించునో యేమగునో యని. ఇట్లు జరిగినది. ఇతనిని మూర్ఛలో నుండి లేపుట యెట్లో నాకుఁ దెలియదు. ఒక మధురమైన సంగీతమును వినిపించినఁగాని యితఁడు మూర్ఛలో నుండి లేవలేఁడు. నే నితనికి నీళ్ళు వదలుకొన వలసి వచ్చునేమోయని భయపడుచుంటిని.

ఏమి చేయఁగలను? ఇత నితోఁ జాల పని యున్నది. ఆ కటకటయోగి రహస్యము వీని వలనఁ దెలిసికొన నెంచు చున్నాను. వేదవతి యెచ్చట నున్నదో యా కటకటయోగి వలనఁ దెలియవలయును. ఆ నడిమిసూత్రము మధుగుంజ. మధుగుంజ టికటికను నమ్మును. టికటిక చేత నేను రహస్యములు చెప్పించఁ గలను. టికటికతండ్రి ప్రసంగము నేను తెచ్చినచో నితఁడు మెత్తఁబడును. నాకుఁ దన రహస్యములు చెప్పును. నా స్థితి యిది. సవ్యసాచిని నేను దీసికొని రా నెంచలేదు. కాని యితఁడు మన కుపయోగించునని తీసికొని వచ్చితిని". అంతట మురారిభట్టిట్లనెను. "మంచి పని చేసితివి. సవ్యసాచి చెప్పిన క్షత్రియులైన ముప్వురు దళవాయులు నా శిష్యులు. సుమంతు నీ కార్యము మీఁద నియమించినది నేనే. ఉత్తర జ్యోతిష కటక సింహపురోరగ దేశముల తూర్పు ఎల్లలయందు నిర్మింపఁబడిన సర్వ రహస్యాయుధాగారములు నాకుఁ దెలియును. అన్నియు నెవ్వరికిని దెలియవు. ఇతని యన్న సుమంతుఁడు. తక్కిన వారిద్దఱు సహదేవుఁడును, భరతుఁడును. వాని స్థితి కొంత క్లిష్టముగా నున్నది. సుమంతుని పైనిగల చమూపతి క్షత్రియుఁడగుట చేత సుమంతుని పనియే బాగుగా నున్నది. నే నచటఁ గొన్ని యగ్ని విదళనాయుధములను నిర్మించితిని. అవి చాల వఱకు నిష్క్రియములుగాఁ జేసితిని. ఆ యాయుధములను జేయఁ గల వారు వీరు ముప్వురే. చక్రవర్తి దండయాత్ర త్వరలో రావలయును. వీరు చేసిన యగ్ని విదళన గోళములను మఱల సేనాపతి పరీక్షించినచో నవి నిరసర్థకములని తెలిసినచో

వీరి ముప్పూరి ప్రాణముల మీఁదికి వచ్చును. చక్రవర్తి సేన వచ్చుచునే యీ రహస్యాయుధాగారములను నిర్మూలము చేయవలయును. నే నెవఁడనో వారి ముప్పూరకునుఁ దెలియదు. నేనొక బైరాగిని. సుమంతునకు వార్తలు సవ్యసాచి ద్వారా పంప వచ్చును. ఇతఁడు మన కుపయోగించును?

గూఢచారులు పదిమందిలో నొకఁడు రాలేదు. వీణావతిలోనికి వచ్చిన పన్నిద్దరిలో ద్వారము తెరచినవాఁడు చెప్పెడి దేమియు లేదు, తక్కిన యయిదుగురిని మీరేమి చేసితిరని తక్కిన నల్వురడుగుటకు వీలులేదు. వారి యుద్యోగ క్రమములో నా యయిదుగు రథికులు. వీ రవరులు. ఆ యయిదుగురు తమలోఁ దామేమి పలుకుకొనిరో తెలియదు. ఇట్లుండఁగా టికటికను మూర్ఛ నుండి లేపుట పెద్ద పని యయ్యెను. ఎవ్వరికి నేమియుఁ దోఁచలేదు. తెలవార వచ్చుచుండెను. వీరెవరి దారిని వారు పోవలయును. టికటిక నచట వదలి పోవలయునా? మిత్రగుప్తుఁడు పరమ దుఃఖ మూర్తిగా కనిపించెను. ద్వారపాలక స్థానీయుఁడు వెళ్ళి ద్వారపాలకుని తల్లి యున్న గది తలుపు తీసెను. ఆమెకు మెలుకువ వచ్చెను. మెలుకువ వచ్చుచునే యామె శ్లోకములు పాడనారంభించెను. శ్రీ శంకరాచార్య కృత భజగోవింద శ్లోకములు, లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబ మన్న శ్లోకములు, రావణాసురుఁడు చేసిన శివస్తోత్రము, శ్రీ శంకరాచార్య కృత దేవీస్తుతియు నొకదానివెంట నొకటి యామె మంచము మీఁదఁ గూర్చుండి పాడు చుండెను. ఆమె కంఠ మేకతార మీటినట్లుండెను. నెమ్మది నెమ్మదిగా

టికటికకు మెలుకువ వచ్చెను. అతఁడు లేచి కూర్చుండెను. అతని కొక సందేహము కలిగెను. తాను మీటకుండ తన యేకతార యెట్లు పలుకు చున్నది? అది తా నెఱుఁగని పాటలు పాడు చున్నది. అతనికిఁ గొంత సేపటికి దన యేక తార తన పజ్జ నున్నదని తెలిసెను. దానిని చేతిలోఁ దీసి కొనెను. వాయించ వలయునా? ఆ పాడఁబడెడు దానికిఁ దాను పలికించెడి దానికి సంబంధముండదే? తాను పాడెడి పాటలే యీ యేకతార పలుకును. ఆ శ్లోకములను పలు కునా? ఇది యభ్యస్తమైన సంగీత విద్యయా? ఎవని సంగీతము సర్వజ్ఞానము మీఁద శిక్షితమగునో స్వరాభిజ్ఞ వలన వాఁడు దేనినైన పలికింపఁగలడు. తనది గాలి పాట. ఆ వినఁబడు చున్న సంగీతములోని సంగీతము తన సంగీతము కంటె భిన్న మైనది. దాని లక్షణమే వేఱు. దానిని దాను పలికింపలేఁడు. టికటిక యింకొక్కఁడనుకొనెను. ఇది యొక విద్య యని తానెఱుఁగఁడు. ఆ విద్యను గూర్చి యిట్లు భావింపవచ్చునని తనకుఁ దెలియదు. అతనికి జ్ఞాపకము వచ్చెను. తన నిద్రలో దనకు మఱలఁ జక్రవర్తి కనిపించెను. మఱియెవఁడో సన్యాసి కనిపించెను. వారిద్దఱు తన్నేదో మార్చివేసిరి. అతనికి జ్ఞాప కము వచ్చెను. తాను మిత్రగుప్తుని మొగమున నుమిసెను. అది తప్పు. అట్లు సేయరాదు. ఈ జ్ఞాన ముదయించెను. మిత్రగుప్తుని జూచెను. క్షమింపుమనెను. మిత్రగుప్తుఁ డతనిని జూచి నివ్వెఱపోయెను.

# పదియవ యధ్యాయము

ఆగూఢచారులలోని మైదుగురైన యధికోద్యోగులు వెడలిపోవుచుఁ దక్కినవారితో మీరందఱు వేదవతియొక్క యునికిని విచారించుచుఁ దత్పూర్వము చేసినకార్యములలో జరిగినంత సాఫల్యము చెడిపోకుండఁ జూచుచు నధికసాఫల్యము కొఱకుఁ బ్రయత్నించుచు నున్నపోడిమి చెడకుండ సంరక్షించుచు నాయా దేశములయందలి పరిస్థితులను గమనించుచు నుండవలయుననియు నొక రెండుమాసములు కడవకమునుపే వారెవ్వరెచ్చటనున్ననుసరే వారికి మఱల చక్రవర్తి యాజ్ఞలందింపఁబడుననియుఁ జెప్పి తా మన్య కార్యములమీఁదఁ బోవుచుంటిమని వెడలిపోయిరి. మురారిభట్టు తనదారిఁ దానేగెను. మృగేంద్రసింహుఁడు మఱల నురగదేశమునకుఁ బోయెను. ఒక్క మిత్రగుప్తుని స్థితియే విషమముగా నుండెను. అధికారులందఱును వేదవతి యునికిని కనుగొనవలసినదిగాఁ జెప్పఁగా మురారిభట్ట మృగేంద్రసింహులు తమకాసంగతి పట్టనట్లు వెడలిపోయిరి. మిత్రగుప్తుఁ డొక్కఁడైనాఁడు. తానొక్కరుఁడైనచోఁ బెద్దనష్టములేదు. తనవెంట నిద్దఱున్నారు. సవ్యసాచియు, టికటికయు. సవ్యసాచియైనను పెద్ద యిబ్బందిలేదు. ఈటికటిక యున్నాఁడు. బయలుదేరి పోదమనఁగా టికటిక తాను రాననెను. తెల్లవాఱినచో నీముగ్వురు క్రొత్తవారు వీణావతిలోఁ గనిపింతురు. మీరెవ్వరనఁగా నేమనిచెప్పవలయును? శర్యాతి మఱునాఁడు వత్తుననెను. అతఁడు రానిచో నీద్వారపాలన విషయమేమి కావలయును? శర్యాతి తల్లి వారిముగ్వురిని వెళ్ళనీయలేదు.

"నాయనా! నేను పెద్దదానను. పిట్టకొంచెము కూతఘనమని యిదికోటయుగాదు, కోటగోడయుగాదు గాని యీగడియలు మాత్రము పెద్దవి. అవి నాకందవు. ఇనుముతోఁ జేయఁబడి నవి. ఇంత భద్రముగానున్న కోటలోనికే మీరింతమంది వచ్చితిరి. మీరు వెళ్ళినచో మఱిమెవరువత్తురో! మా శర్యాతి వచ్చువఱకు మీరేయుండి యీవ్యవహారము చూచుకొనవలయును. మఱియు మాశర్యాతి ప్రతిదినము గ్రామము లోనికిఁబోయి మాయిద్దఱకుఁ గావలసిన యాహార పదార్థములు తీసికొని వచ్చును. అవి పాతికయిండ్లున్నవి. పాతిక యిండ్లకుఁ దిరుగఁగా రెండుమూఁడు స్వయంపాకములగును. అందఱును లేచిపోయిరి. మీరుముగ్గురును నిలచితిరి. నేఁడు నాల్గు స్వయంపాకములు తెచ్చికొనినగాని గడువదు. ఆగృహములు మీకుఁదెలియవు. మీవెంట నేను వత్తును. మీరు నాబంధువులని చెప్పుదును. మాపిల్లవాఁడు వచ్చిన తరువాత మీరు వెళ్ళుదురుగాని" ఇట్లు నిరోధించఁగా మిత్రగుప్తుఁడేమనును? టికటిక కదలునట్లులేదు. తానచటనుండి రానసును. అచటనే తాను కొన్నాళ్ళుండవలయుననును. కారణము చెప్పఁడు. ఇతని సాయము తీసికొని మఱల నడవులలోనికిఁ బోయి యామధుగుంజా వృత్తాంతము తెలిసికొని యామె వలన వేదవతిజాడ తీయవచ్చునని మిత్రగుప్తుని యూహ. ఆమధుగుంజ యెవ్వరో యిప్పుడు తెలిసినది. ఉరగదేశపు మంత్రి వీరదత్తుని కుమార్తె. ఆమెను వెంటనే యురగదేశము నకుఁ బంపవలయును. మృగేంద్రసింహుఁడు తనకుఁ బట్టనట్లు వెడలిపోయెను. ఈమె యురగదేశమునకుఁ జేరినఁగాని

యచటఁ గల్లోలములు ప్రారంభింపవు. అవి చాల యవసరము. సవ్యసాచికి కార్యశూరత్వము తెలియదు. అతఁడు నిష్క్రియుఁడనని తానే చెప్పెను. సుమంతుఁడతనియందు విశ్వాసముకల వాఁడగుటతప్ప వానియందు వేఱొకగుణము భాసించుటలేదు. అతఁడు తన పనిని పరిత్యజించి సంగీతము కొఱకు టికటిక వెంటఁబడిన వాఁడు వానిని నమ్ముట యెట్లు? ఏది యెట్లయినను టికటికను సవ్యసాచి కప్పగించుటకు వీలులేదు. సవ్యసాచి తమతో నుండుట యనవసరము. టికటిక యెప్పుడు బయలు దేరునో తెలియదు. టికటికతో నిదివఱకు లేని యొక నాగరకతారేఖయు నొక యాలోచనా లక్షణమును నేఁడు లీలగా కనిపించినవి. జాము జామున్నర వఱకతఁడు మూర్ఛాగ్రస్తుఁడై యుండెను. ఆ మూర్ఛా సమయమున నితని కెవ్వరైన కనిపించిరా? పూర్వ మితనికిఁ దనకు వలెనే స్వప్నము వచ్చెను. స్వప్నములోఁ జక్రవర్తియుఁ దానును గనిపించిరి. ఈ మూర్ఛలో నితనికి మఱల నట్టి స్వప్నమైన వచ్చెనేమో! ఏమి మార్పు వచ్చెనా? అతఁడెన్ని దినము లిచ్చట నుండునో యన్ని దినములు తానిట నుండి సర్వమును దెలిసికొన వలయును. సవ్యసాచిని బంపఁ వలయును. అందుచేత నతఁడు సవ్యసాచితో నిట్లనెను. "టికటిక వచ్చుటలేదు. అతఁడు రాకుండ నేను వెళ్ళను. మనము ముప్వురమిచ్చటె నుండుట యనవసరము. విడ్డూరముగాఁ గనిపించును. శర్యాతి మనల నెఱుఁగఁడు. శర్యాతితో బంధుత్వము కలిపికొన్న వాఁడు వెళ్ళిపోయినాఁడు. ఈ ముసలిది నన్ను పోనీయదు. కనుక నీవు మీ యూరు

పొమ్ము. నేను తరువాత వచ్చి నిన్నుఁ గలసికొందును?

సవ్యసాచి:- "నేను పోయి మురారిభట్టును గలసికొందును".

మిత్ర:- నీ వతనిని గలసికొన నక్కఱలేదు. అతఁడే సుమంతుని కలసికొనును. నీ వతనిని గలసికొనలేవు.

సవ్య:- అయినచో నేను బోయి మృగేంద్రసింహునిఁ గలిసి కొందును.

మిత్ర:- అతఁ డురగదేశములోఁ దిరుగు చుండును. మధుగుంజ తన పుట్టింటికిఁ బోవలయును. దాని కతఁడు ప్రయత్నము చేయుచుండును.

సవ్య:- మధుగుంజ మధుగుంజ యని తెలిసికొన్నది నేను. చక్రవర్తికి మీ రెంత భక్తులో నే నంతభక్తుఁడను. నన్నీ పదకములో నుండి వెలివెట్టవద్దు.

మిత్ర:- నిన్ను వెలివెట్టము. చక్రవర్తి యనుగ్రహము నీ మీఁదఁ గూడఁ బ్రసరింపఁగలదు.

సవ్యసాచి నిరుత్తరుఁడయ్యెను. అతఁడు వెడలిపోఁ బోవు చుండఁగా మిత్రగుప్తుఁడతనికి నాలుగైదు దీనారము లిచ్చి యచటికి రెండామడల దూరాన నున్న యొక పట్టణము లోనికిఁ బోయి పది దినాలకుఁ గావలసిన భోజన సామగ్రిని దీసికొని రమ్మని చెప్పెను. సవ్యసాచి యిట్లనెను. "ఓయి మిత్రగుప్తుఁడా! నీవు గూఢచారివి. నేను కాను. మీ దేయూరన మాది ఫలానాయూరని నేను చెప్పఁగలుగుదును.

మా యూరి పేరు మీా కందఱకుఁ దెలియును. తెలియ వచ్చును. ఈ ముసలామె వెంట నే నూరిలోనికిఁ బోయె దను. ఈ భోజన సామాగ్రి నీవు కొని తెమ్ము. అపుడు టికటిక యు నీవు నిచ్చట నున్నారన్న విషయమే యెవ్వరికిని దెలియదు." నాఁగా మిత్రగుప్తుఁడు "నేను టికటికను వదలి యుండ రాదు. నేను లేనప్పుడతఁడెచ్చటికైనఁబోయినచో నేమి చేయఁగలము? నే నతనికి నీడవలెఁగాచికొని యుండవలయును. నీయూరిపేరు నాకుఁదెలియునుగదా! ఆపేరు నేనే చెప్పు దును.

సవ్య: నీయయిదు దీనారములు తీసికొని నాదారిని నేనుబోయినచో నీవేమిచేయఁగలవు?

మిత్ర: సవ్యసాచీ! కోపింపకుము. దయచేసి వెళ్ళి రమ్ము.

సవ్యసాచి వెడలిపోయి యారాత్రికి భోజనసామగ్రి తెచ్చియిచ్చెను. మిత్రగుప్తుఁ డాపవలెల్ల నెట్లోగడపెను. ఊరిలోనాముసలిదాని చుట్టమువలెనటించెను. రాత్రికిముసలిది నలుగురకును వంటచేసెను. భోజనసమయమునకు సవ్యసాచి లేఁడు. అతనికోసము చాలసేపు ప్రతీక్షించి ప్రతీక్షించి వారు భోజనముచేసిరి. మఱునాఁడు తెల్లవాఱెను. తెల్లవాఱుచు నే శర్యాతితల్లిలేచి తన శ్లోకములను పాటలను పాడనారం భించెను. టికటిక తన యేకతారను జేఁబూని యామెవెంట నాపాటలను శ్లోకములను వాయించ నారంభించెను. కుదురఁ బోవుచున్నట్లుండెను. కుదురుటలేదు.

మూఁడవ దినమున శర్యాతి వచ్చెను. కటకదేశమున నతనికుద్యోగము కుదరలేదు. ఇల్లంతయు సుభిక్షముగా నుండెను. ఇద్దఱు స్త్రీపురుషులున్నారు. ఒకఁడాటవికుఁడు. తనతల్లి వారియందుఁ బ్రేమగానుండెను. టికటిక మాటాడఁడు. మిత్రగుప్తుఁడు చెప్పునేమాటయు శర్యాతికి విశ్వాసము కలిగించుటలేదు. ఊరిలోనెట్లు తెలిసెనో మిత్రగుప్తునితోపాటు మఱియొకఁడు వీరియింట నుండెనని తెలిసెను. అతఁడెవఁడో పెద్దయోగియని ప్రథకలిగెను. జనము వచ్చుచుండిరి, పోవుచుండిరి. మిత్రగుప్తునకు ముండ్లమీద నిలుచున్నట్లుండెను. టికటిక యచ్చటనుండి యెందుకు కదలఁడో మిత్రగుప్తున కాఱుదినములతరువాత తెలిసెను. శర్యాతితల్లి పాడెడుపాటలు శ్లోకములు టికటిక తాను తన యేకతార మీఁద వాయించుచు పాడవలయును. అప్పుడుగాని కదలఁడు. ప్రతిదినము సుమఃకాలములందుఁగాని యీపనిసాగదు. పదిదినములు గడచెను. అతని కాపాటలు శ్లోకములు వచ్చెను. వానినిఁ దానేకతారమీఁద వాయించుచు గొంతుకలిపి పాడఁగలడు. అతనికి సంపూర్ణముగా నవి వచ్చెను. కాని యొక్కటియే భేదము. శర్యాతితల్లి పాడుచుండఁగా స్వరములయొక్కయేస్వచ్ఛత, యుచ్చారణయందలి యేసుష్ఠుత భాసించుచుండునో యాస్వచ్ఛతాసుష్ఠుతలు టికటిక కంఠస్వరమునందు సంపూర్ణముగా రాలేదు. ఈసంస్కృత శ్లోకములు యావన సంగీత మభ్యసించిన నోటినుండి స్వరములు వ్రాలి ప్రక్కవాటుగా వచ్చుచున్నట్లు వినిపించును. అకారములకారేకారముల మధ్యనున్న మఱొక యచ్చుమాదిరి వినిపించును.

కంఠధ్వనిలోనసే మార్పుండెను. సంగీతస్వరములే వికారము పొందినట్లుండెను. అంతవఱకు టికటిక మిత్రగుప్తునితో మాటాడలేదు. ఇతఁడుపలుకరించును. అతఁడుమౌనమవలంబించును. ఇతఁడుమాటాడకుండనూరకుండును. అచటినుండిపోవుటకతఁ డెప్పుడున్ముఖుఁడగునా యని ప్రతీక్షించు చుండును. మిత్రగుప్తున కుండగా నుండగా నొక సంశయముకూడఁ గలిగెను. ఆ పాటలు శ్లోకములు నేర్చిన తరువాత నతఁడు మఱల నడవిలోనికి బయలుదేరనిచోఁ దానేమి చేయఁ గలఁడు? కాని యడవి లోనికి బయలుదేరునన్న నమ్మకము కలదు. అతని గృహము లడవిలో నున్నవి. అందందు చెట్లమీఁద నున్నవి. ఎవరైనను తమ యింటికే పోదురు గదా! పదునొకండవ దినమున భోజనా నంతరము టికటిక తన యేకతారనుబూనివీణావతిలోఁ దిరుగుటకు బయలుదేరెను. ఇంటింటికిఁ బోయెను. అతని సంగీతమునకు స్త్రీ పురుషులు ముగ్ధులగు చుండిరి. వానికి బిచ్చమును దెత్తురు. బిచ్చమును స్వీకరించుటకు వాని వద్ద నేమియులేదు. కాని యొక్క చమత్కార మున్నది. అతఁడు ప్రాఁతపాటలే పాడుచుండెను. గాని శర్యాతి తల్లి యొద్ద నేర్చినవి పాడుటలేదు. మిత్రగుప్తుఁడు వాని ననుసరింప నారంభించెను. టికటిక . పోయి పోయి యా శిథిల దేవాలయమును జేరెను. అచట శివలింగము నెదుట నిలుచుండెను. అప్పటికి వాని ననుసరించు జనమందఱు నోసరిల్లిరి. కొలఁది మంది బాలురును బాలికలు మాత్రము మిగిలిరి. ప్రొద్దు వాటారుచుండెను. టికటిక పాట నాపి యచటఁ గూర్చుండెను. మిత్రగుప్తుఁడేమి చేయఁ

గలఁడు? తాను నచటఁ గూర్చుండెను. ప్రొద్దు క్రుంకెను. చీఁకటి పడెను. వెన్నెలలు వచ్చెను. ప్రొద్దు పోయెను. టికటిక యచటి నుండి కదలుటలేదు. భోజనములేదు. వానిని వదలి మిత్రగుప్తుఁడు పోవుటకు వీలులేదు. ఇంటికిఁ బోయి నచో శర్యాతి తల్లి వారి యిద్దఱకు నన్నము పెట్టును. నాఁటి రాత్రికి మిత్రగుప్తుఁ డన్నమునకు నోచుకొనలేను. ఇద్దఱు నచ్చటనే పరుండిరి. తెల్లవాఱ వచ్చుచుండెను. టికటిక మేల్కాని యేకతార తీసికొని పాడనారంభించెను. శర్యాతి తల్లియొద్ద నేర్చిన పాటలును శ్లోకములును శివలింగమున కెదురుగా నిలుచుండి చిత్రచిత్రముగా వాయించుచు పాడ నారంభించెను. మిత్రగుప్తుఁ డిట్లనుకొనెను. "ఓహో! ఇది యొక్క నూత్నమాధుర్యము. ఆపాటలితని నోటియందు వికారముగా నున్నదనుకొన్నాను. ఇతని వాక్కునందా పాటలు పాటలుగా క్రొత్త యొయ్యారమును గడించుకొన్నవి. క్రొత్త శోభ నలవరించుకొన్నవి."

తెల్లవాఱినది. ఇద్దఱును శర్యాతి యింటికిఁబోయిరి. భోజనము చేసిరి. టికటిక మిత్రగుప్తునితో మాటాడి పండ్రెండు దినములయినది. అప్పుడు మాటాడెను. "మనము మఱల నడవిలోనికిఁ బోదము! అనుటయేమి, బయలుదేరుట యేమి!

మిత్రగుప్తుఁడు శర్యాతి తల్లి చేతిలో నాల్గుదీనారము లుంచి తాను బయలుదేరెను. ఆమె నాలుగు కాదుగదా యొక్కదీనారము మొగముకూడ మున్ను చూచి యెఱుఁగదు, వాని పేరును మాత్రము విన్నది. అవి యిట్లుండునని యామెకుఁ

దెలియును. ఆమె కొండ యెక్కినది. టికటికయు మిత్రగుప్తుండును వెడలిపోయిరి. వారివెంటఁ గొందఱు పిల్లలు బయలుదేరిరిగాని దుర్గద్వారమునకు సుంత దూరమైన పోకముందే తల్లులు వారిని మరలింపించుకొనిపోయిరి. పోఁగాపోఁగా మార్గముననుండు రెండు గ్రామములు వెనుక పడఁగా పడఁగా వారుత్తర జ్యోతిషములలోఁ బ్రవేశించిరి. ఆపొలిమేరలలోని యొక గ్రామాంతసీమయందు నిర్జనప్రదేశమునందు తుమ్మలు దుబ్బులు పెరిగినచోట, శిలామయమైనచోట, నక్కలయుఁ గుందేళ్ళయు బొరియలు సమృద్ధిగా నున్నచోట, పాదరక్షలు లేకుండ నడుగిడుటకు వీలులేనన్ని కంటకములు గలచోట నొక శింశుపావృక్షముమాత్రమే పెద్దవృక్షమైనచోట ప్రొద్దు గ్రుంకెను. టికటిక యచట నాగెను. ప్రొద్దుపోయినఁగాని చంద్రోదయముకాదు. చంద్రోదయమగువేళకు నిన్నటికంటె ప్రొద్దుపోవలయును. అచట నీళ్ళులేవు. పండుకొనుట కది స్థలముకాదు. పైన నేదియు నాచ్ఛాదనములేదు. ఆ ప్రదేశమంతయుఁ జిట్టడవి యని చెప్పవచ్చును. టికటిక యచటఁ గూర్చుండెను. అతఁడా ముండ్లలోననే కూర్చుండెను. మిత్రగుప్తునకు నాలుకతడియాఱుచున్నది. ఆమె కడుపు చల్లఁగా శర్యాతి తల్లి మూన్నాళ్ళకుఁ దగినన్నిరొట్టెలును వ్యంజనములను చేసి మూటకట్టి యిచ్చెను. జలము లేకుండ నవి యారగించుట యెట్లు? ఎవరితోఁ జెప్పవలయును! టికటికతో నీ మాటలు చెప్పుట యరణ్యరోదనము. తినుట కాహారమున్నది. తినుటకు వీలులేదు. గొంతు తడుపుకొనకుండ రొట్టె గొంతు దిగునా? బాగుగా ప్రొద్దుపోయి చంద్రోదయ మైనది. మిత్ర

గుప్తుఁ డట్లే నిలుచుండెను. ఆ వెన్నెల మెఱుఁగు విఱుగుటకు మఱికొంతసేపు పట్టెను. అప్పుడు టికటిక లేచెను. నడచు చుండెను. మిత్రగుప్తుఁడును వాని ననుసరించెను. సుంత దవ్వులో నొక పడియకలదు. మిత్రగుప్తునకుఁ బ్రాణములు లేచివచ్చెను. ఇద్దఱును కాలుచేతులు గడిగికొనిరి. రొట్టెలు భుజించిరి. ఇన్నినీళ్ళు త్రావిరి. ఎచటనో యొకచోట పండు కొనవలయును. నాల్గుదెసలయందు నూళలు సమృద్ధిగా విని పించుచుండెను. టికటిక మఱి యింకొక దెసగా దారితీసెను. అచట పూర్వమేదో ప్రాకారముండి శిథిలమైనట్లు రాళ్ళు కనిపించెను. ఆలోనికిఁ బోఁగా కుడిపోయిన యొక కట్టడము. అది యేమియో తెలియదు. రాళ్ళన్నియు పగిలిపోయినవి. కాని పండుకొనుటకు వీలైనంత మేర మూఁడుచోట్ల పగులని రాతిప్రదేశములు కలవు. ఒకచోట మాటయుఁబలుకు లేకుండ టికటిక పండుకొనెను. వేఱచోటుచూచి మిత్రగుప్తుఁడు పండు కొనెను. మిత్రగుప్తున కొడలు తెలియకుండ నిదుర పట్టెను. మెలఁకువ వచ్చుసరికి నొకదెస సంగీతము, మఱియొకదెస నుషశ్శకలకాంతి !

బాగుగా తెల్లవాఱెను. టికటిక కూర్చుండి సంగీతము పాడుచున్న స్థలమునకు మిత్రగుప్తుఁడు పోయెను. పెల్లగింపఁ బడి దిమ్మలేక నేలలో నేటవాలుగా కూరుకొనిపోయి నేల మట్టముగానుండి పైకిమాత్రము పరీక్షగా చూచినచోఁ దెలిసి కోఁగలిగిన యొక శివలింగమచట నున్నది. మఱల వడియ కడకుఁబోయిరి. స్నానాదులు కావించిరి. మిత్రగుప్తుఁ డిట్లను కొనెను. 'ఇతఁడు వట్టి యాటవికుఁడు. ఇతనిపాట గాలిపాట.

కంఠములోని మాధుర్యము పూర్వజన్మ సముపార్జితము. ఇతఁడేకతారను వాయించుట గాలిపాటు. వీనికి దయ్యములేదు, దేవుఁడు లేఁడు. పండ్రెండు దినముల క్రింద నితనిని నేను పాడ నీయలేదు. వీఁడు మూర్ఛపోయెను. వీనికి మెలఁకువ వచ్చెను. తదారభ్య వీనిలో నీ మార్పు కలిగెను. వీణావతిలో శివసేవ, ఇచట మరల శివసేవ. ఇచట నీమహారణ్యములోఁ బాడువడిన శివాలయమున్నదని వీనికెట్లు తెలియును? అడవిలోనికిఁ బోవుదుము. అచట వీనికి శివలింగ మెచట దొరకును?' టికటికతో నిట్లనెను. 'టికటికా! మనము బంధువులము. మీ నాయనగారిని నేను పినతండ్రిగా భావించితిని. చుట్టరికము దూరమైనను మనమన్నదమ్ములము. నిజము చెప్పినచో నీ తండ్రి పోయినందులకు నేనెంత దుఃఖపడితినో నీవంత దుఃఖ పడలేదు! టికటికః- నేనును దుఃఖపడితిని. దుఃఖపడి యేమి చేయఁగలము! అనిత్యాని శరీరాణి.

మిత్ర:- ఏమి? అనిత్యానిశరీరాణియా? ఈ వాక్యము నీకెట్లువచ్చును? నీ వెచ్చటవింటివి? ఇది సంస్కృతభాష. నేను పూర్వమువచ్చి మీయూరిలో మీయింట వారము దినములుంటిని. అచట సంస్కృత వాసనలేదు. నిన్నెఱిఁగి యున్న యీనాళ్ళలో నీనోటివెంట సంస్కృత శబ్దమే రాలేదు. ఇది నీకెట్లువచ్చినది? శర్యాతి తల్లి పాడిన శ్లోకములు నీవు కంఠతః పట్టితివి. నిజమే! కాని యీమాట యెట్లు వచ్చినది?

టికటిక :- వచ్చినది. అంతే! ఎట్లువచ్చినదో నాకుఁ దెలియదు.

మిత్ర :- నేనునిన్నొకటి యడిగెదను. నేనన్నగారినన్న బహుమానముతోఁ జెప్పెదవా!

టికటిక :- ఆ బహుమానముతోఁ జెప్పను. ఇంకొక హేతువువలన జెప్పెదను.

మిత్ర :- ఆ హేతువేమి ?

టికటిక :- ఆ హేతువు నీకెందుకు ? నీవడుగుము, చెప్పెదను.

మిత్ర :- అది యట్లుంచుము. నీకుఁ గోపము రానిచో మనము వీణావతికిఁ బోకముందు నీ లక్షణము వేఱు. తరువాత నీ లక్షణము వేఱు. తత్పూర్వము నీ కిష్టములేని మాట యన్నచో, నీ కిష్టములేని పనిచేసినచో మొగమున నుమియు చుంటివి. అది తప్పని నీకుఁ దెలియదు. నీవు మూర్ఛనుండి లేచినంతనే యది దోషమని నీకుఁ దెలిసెను. తరువాత నీ ప్రవర్తన పరమనాగరకముగానున్నది. అడవఱకు నీకు దేవుఁ డున్నాఁడని నాకుఁ దెలియదు. ఇప్పుడు నీవు శివలింగములను వెదకుచున్నావు. వెదకుటకాదు. శివలింగము లెచ్చటనున్నవో నీకుఁ దెలియును. అదియునుగాదు. నీవు పాడినచోట శివ లింగము ప్రత్యక్షమగుచున్నది. ఈ మార్పు నీకెట్లువచ్చినదో నాకుఁ దెలిసికొనవలయునని యున్నది. నీ వా మూర్ఛపడిన వేళ నీకు మఱలఁ జక్రవర్తి కనిపించెనా ? ఆయన మహా తపస్వి. నాకంటెనీవే యదృష్టవంతుఁడవు. ఓయి టికటికా ! ఈ ప్రపంచములో నెవ్వఁడో యొకఁడు రాజగుచుండును. ఖడ్గబలముచేతనో, మందిబలము చేతనో, ధనబలముచేతనో

జనులోక ప్రాంతమునందలి ప్రజలమీఁద నధికారమువహించి రాజు లగుచున్నారు. అట్లు ప్రతివాఁడును రాజు కారాదయ్యా! సాధూత్తముఁడు, ప్రజాహితైక తత్పరుఁడు, తపస్వి, జీవలోకముయొక్క పరమరహస్యము తెలిసినవాఁడు రాజు కావలయును. రాజులు రాజ్యములు ననఁగా నవి దేనికోయి? కొందఱి సుఖముకొఱకా? కొందఱి యభిప్రాయములు చెల్లుబడి యగుటకొఱకా? తానిట్లు చేసినచోఁ బ్రజలు సుఖింతురని యెవ్వఁడో యనుకొనును. అట్లు చేయును. దానియందు ప్రజాసుఖము లోపించును. తన భావమును నెగ్గించుకొనుటకు వాఁడే కొందఱు ప్రజలను సంహరించును. ఏ ప్రజలను సుఖపెట్టుటకు వాఁడీ ప్రజలను హింసించుచున్నాఁడు? ఆ సుఖముయొక్క స్వరూపమేమి? ఎవఁడు సర్వజీవములయం దనుస్యూతముగానుండునో యందఱు జీవులయందు దాను ప్రత్యక్షము కాఁగలఁడో వాఁడు రాజు కావలయును. శ్రీ విక్రమార్కచక్రవర్తి యటువంటివాఁడు. స్వప్నమన్న పేరుతో నాయన నా జీవునిలోనున్నాఁడు. నీ జీవునిలోనున్నాఁడు. ఇది యొక యాశ్చర్యము. చక్రవర్తియనఁగా చక్రమునందు వర్తించువాఁడు. ఆయన జీవచక్రమునందు వర్తించుచున్నాఁడు. ఆయన నీకుఁ గనిపించియుండనోపు. ఆయన నీ జీవునియందు వినూత్న సంస్కారాధనము చేసియుండనోపు. నేను రాజకార్యముమీఁద తిరుగుచున్నాను. నీ సాహాయ్యమున వేదవతి యున్న స్థలము తెలిసికొనఁగోరుచున్నాను. నీ వెచటికి దారి తీయుదువో నాకుఁ దెలియదు. నాకేదో లీలగా స్ఫురించుచున్నది. వేదవతియున్న స్థలము మధుగుంజవలనఁ దెలిసికొన

వచ్చునని. ఆ మధుగుంజ నీకు స్వాధీనురాలగునని. నేను మధుగుంజను జూచితిననియు నామె యెవ్వరో తెలిసికొనుట వలన నేను ఘనకార్యము సాధించినట్లగుననియు నేను భావించు చుండఁగా నామె యెవ్వరో మృగేంద్రసింహుఁడు నిముసములో తేల్చివేసెను. ఇపుడు నేను చేసెడిదేమియులేదు. నేను రాజసేవకుఁడను. నీవు కావు. ఒక రాజకార్య నిర్వహణము నాచేతిమీఁదుగా జరిగినచో నాకు లౌకికమైన లాభము కలదు. నీ కీ లాభము నక్కఱలేదు. నాకు నీవు సాయపడెద వన్నచో నిన్ననుసరింతును. నాదారి నన్నుఁ జూచికొమ్మన్నచో నేను వెడలిపోయెదను.

టికటిక :- నీవు నన్నేదో యడిగెదనంటివి. ఏమియు నడుగలేదు. ఒక యుపన్యాస మిచ్చితివి.

మిత్ర:- ఇదిగో! ఇదియొక విశేషము. పూర్వము నీకీ తర్కము తెలియదు. ఈ వాఙ్నైపుణ్యములేదు. ఓయీ! ఆ మూర్ఛలో నీజీవునేదో పరుసవేది శోఁకినది. టికటిక:- మిత్రగుప్తా! అడవిలోనికిఁ బోదము. నాకేమియుఁ దెలియదు. ఎవరో నన్ను నియమించుచున్నారు. వారే త్రోవను చూపుచున్నారు. రాత్రి యడవిలో నచట పడియయున్నదని నాకుఁ దెలియదు. అచట శిథిలాలయమున్నదని నాకుఁ దెలియదు. నేను పాడినచోట శివలింగమున్నదని నాకుఁదెలియదు. నీ కోపికయున్నచో నా వెంటరమ్ము. ఏమగునో చూతము. ఎట్లు పర్యవసించునో తెలియదు.

తరువాత వారము దినములు వారిద్దఱునుగలసి తిరుగు చుండిరి. అతనితోడి మనికి, వానితోడి సంచారము మిత్ర

గుప్తునకు మిక్కిలి సుఖముగా నుండెను. తొల్లింటివలెనతఁడు యవనధూర్తుఁడుకాఁడు. ఆటవికుఁడు కాఁడు. వారు తెచ్చిన యాహారము మూన్నాళ్ళలో నైపోయినది. టికటిక మిత్రగుప్తుని గ్రామములలోనికిఁ బంపించును. ఆహారము విరిచికొని రమ్మనును. నీవు వచ్చువఱకు నే నిచ్చటనే యుందుననును. మిత్రగుప్తుఁ డిట్లనును. 'నీవుందువు. నేను లేనపుడు నిన్నావేశించిన శక్తియేదో నిన్ను దూరముగాఁ దీసికొనిపోయినచో నేనేమి కావలయును? నిన్నెచ్చట వెదకుదును! నా శ్రమయంతయు వ్యర్థమగును గదా! టికటిక యిట్లనును! ఓయి పామరుఁడా! నీ యీ ప్రయత్నము నీయందు ఫలవంతము కాదని నీనొసట వ్రాసియున్నచో నది యట్లే జరుగును. నన్నంటిపెట్టికొనియున్నచో దాని ప్రకాశము నాకును గలుగదు. ఇచట కర్తయెవఁడు? పోయిరమ్ము!— మిత్రగుప్తుఁడు పోవును. పోవుచు నాలోచించుకొనును. ఈ టికటికయెవ్వఁడు? వీఁడు కిరాతుఁడా, యవనుఁడా, మ్లేచ్ఛుఁడా, మహాతపస్వియా? సర్వవేదాంతసారభూతమైన మనస్సు వీనికెట్లు వచ్చినది? వానిముందుఁ దానెంతవాఁడు?. తన తండ్రి వేద వేదాంగ పారంగతుఁడు. తానింగువకట్టిన గుడ్డ. తావన్మాత్రమే. ఇతనియొక్క మనస్సుపంట తెల్లవాఱు వఱకు వికసించిన కమలవనమువలె నున్నది. తాను తన తల్లి కొక్కఁడే కొడుకు. తమ యాస్తియంతయుఁ బోయినది. తనకు దొరికిన యుద్యోగము తాను పెండ్లాడి తల్లిని సుఖపెట్టెడిది కాదు. తా నే యడవులలోననో నశించిపోయినచో నా తల్లిగతి యేమగునో తెలియదు. ఈ టికటిక హేతువున తాను విరాగి

యగునో, సన్యసించునో, రాజకార్యము పరిత్యజించి యడవుల వెంటఁ దిరుగునో !

తరువాత నెలదినములు గడచెను. ఏమియు జరుగ లేదు. మధుగుంజాదర్శనముగూడఁ గలుగలేదు. వెనుక మధు గుంజ కనిపించిన రెండు మూఁడు స్థలముల కిద్దఱును గలసి పోయిరి. మిత్రగుప్తుని యొత్తిడివలననే టికటిక బయలుదేరెను. సవ్యసాచి మధుగుంజను జూచిన స్థలమునకు టికటికయే యొక సారి దారితీసెను. ఆ నాఁడు పాడిన స్థలమునందు నిలుచుండి పాడెను. సమాధానము లేదు. ఆ సంగతి మిత్రగుప్తునితోఁ జెప్పెను. ఆమె యచటనే కనిపించి యచటనే యంతర్హిత యయ్యెనని చెప్పెను. సవ్యసాచి యా ప్రదేశమంతయు వెదకెనని చెప్పెను. ఆమె యాకాశములో లీనమయ్యెనో భూవివరమునఁ బ్రవేశించెనో తెలియలేదు. మిత్రగుప్తుఁడు నేర్చిన గూఢచారి విద్యలోఁ బర్వతప్రదేశముల యందలి గుహలు, మలుపులు, రాళ్ళక్రింది బొరియలు, వృక్షకోటర ములు, కప్పబడిన తీగలు తొలఁగించుటచేత నేర్పడెడు మార్గ ములు సర్వమునుగూర్చిన విద్యయుఁగలదు. అతఁడన్నియుఁ బరిశీలించెను. ఎచ్చటను పురుషుఁడు వెలికివచ్చి మఱలపోయి దాగికొనుటకు వీలైన పొడకనిపించలేదు. మిత్రగుప్తుఁ డిట్లనెను. "ఓయీ! ఇది మానవశక్తి కతీతమైన విషయము. ఇచట యోగము పనిచేయును. లేనిచో దైవము పనిచేయును. ఆ కటకట యోగినిగూర్చి మృగేంద్రసింహుఁడు చిత్రచిత్ర ములుగా చెప్పినాఁడు. వాఁడు జలముమీఁద నడచిపోఁగలఁ డఁట! ఈ రెండు కొండలనడుమ తటాకమున్నది. ఈ తటాక

మును దాటిపోయినచో మధుగుంజ నివసించుస్థల మాతలి గట్టుననున్న కొండలో నున్న దేమో ?"

టికటిక :- ఆశక్తి కటకటయోగి కున్నదిగాని మధు గుంజకు లేదుగదా !

మిత్ర:- ఆవిద్యను వాఁడు మధుగుంజకు నేర్పెనేమో!

టికటిక :- నాకుఁ దెలియదు. నీకుఁ దెలియదు. నేనా మూర్ఛలో పడియున్నప్పుడు నాఁకు జఁకవర్తి కనిపించెను. ఆయనవెంట నొక సన్న్యాసి యుండెను. మెడలో రుద్రాక్షలు. దబ్బపండుచాయ. ఆయనచేతిలో వీణకలదు. ఆవీణలో నున్న యొక తంత్రిలోనుండి యొక సన్నని వెలుఁగువచ్చి నాలో బ్రవేశించినది. నీవు మొన్న చమత్కారముగా నన్నావు. నాజీవు నేదోపరుసవేది తాకినదని. ఇదియే యాపరుసవేది. అట్లునాకెందుకు జరిగినది ? ఆ సన్న్యాసి యెవ్వరు ?

మిత్ర :- చక్రవర్తి తనబాల్యమునఁ దనయెదవయేట నుండి తనకుఁ బదునెన్మిదవ యేడువచ్చువఱకు హిమవత్పర్వతములలోఁ దపస్సుచేసెను. ఆయనకొక గురువున్నాఁడట. ఆయన సన్న్యాసియఁట. ఆయన సంగీతవిద్యా పయోనిధి. యఁట.

టికటిక :- కావచ్చును. ఆవీణానిస్స్వనము వెలుఁగు రేకవలె నాలోనెందుకు ప్రవేశించినది ? ఆయన నాచేత నేమి పని చేయింపనెంచినాఁడు : ఈసంగతి యాయనకే తెలియును గదా ! దానినిగూర్చిన వగ మనకెందులకు ?

ఇద్దఱును మఱల తిరిగిపోయిరి. నట్టడవిలో నొకచెట్టు మీఁదనున్న మంచెమీఁద నివసించుచుండిరి. ఆహారము కొఱకు మిత్రగుప్తుఁడు గ్రామములలోనికిఁ బోవుటలేదు. ఏవో దుంపలు, కాయలు తినుచుండిరి. వాగులలోని నీళ్ళు త్రావుచుండిరి. ఒకనాఁడు వారిద్దఱునుగలిసి యరణ్యా మరణ్యమంతయుఁ దిరిగిరి. మిత్రగుప్తుఁడు డస్సిపోయెను. ఇన్నాళ్ళాహారము లేకపోవుటచేత మిక్కిలి బడలిపోయెను. ఆమంచె మీఁదఁ బండుకొనెను. అతఁడు మూర్ఛపోయెనో నిదుర పోయెనో తెలియదు. టికటికకు నిదురపట్టలేదు. చెట్టుదిగెను. అడవిలోఁ దిరుగుచుండెను. చాల దవ్వుపోయెను. అచటఁ బాడవలయుననిపించెను. ఏకతార తీసికొని పాడుచుండెను. దూరముగా మధుగుంజా ప్రతిస్వనము వినిపించెను. ఇతఁడు పాడుచునే సుంతసేపు దగ్గఱగా వినిపించు నాసంగీతము వెంటఁ బాడుచుఁ బోవుచుండెను. ఆనాఁడు కృష్ణపక్ష త్రయోదశి. తెలవాఱుకడ మిక్కిలి గ్రుడ్డివెన్నెలలు వచ్చెను. మధుగుంజ పాడుచుఁ బోవుచుండెను. ఇతనికి దారి తెలియదు. కొంతసేపు కాలిక్రింద మెత్తగా నుండును. ఇసుకస్థలమనుకొనును. కొంత సేపు కాలిక్రింద చల్లగానుండును. నీటిమీఁద నడచిపోవు చున్నాననుకొనును. మధుగుంజా సంగీతము వినిపించుచునే యుండెను. ఇతఁడును పాడుచునే యుండెను. చిట్టచివర కామె సంగీతము సమీపమున నొకగుహలోనుండి వినిర్గమించు చుండెననిపించెను. ఇతఁడా గుహలోఁ బ్రవేశించెను. అచట మధుగుంజలేదు. ఆగుహ విచిత్రముగా నుండెను. ఆగుహకు వంద మొగములున్నట్లుండెను. తనపాటయంతయు వందముఖ

ములుగా ప్రతిధ్వనిత మగుచుండెను. అతఁడు పాటనాపెను. పరిశీలించెను. ఆగుహాలో నొకచోట నొక పదునెనిమిది పందొమ్మిదేండ్ల వయస్సుగల దేవతాస్త్రీ, కాంతారదారు ఖండనిర్మితమంచోపరి పరిస్తీర్ణ కుందమల్లీ పారిజాత సుకుమార పుష్పశయ్యాతలమున పరుండియుండెను. ఆమె నిద్రించుచున్నదేమో! ఆమె తనపాటకు మేల్కొనలేదు. వందప్రతిధ్వనుల కామెకు మెలఁకువరాలేదు. ఆమె కృశించి నేడోఁ రేపో చనిపోవునట్లుండెను. ఇంతలో నామె శరీరము మరల పుష్పమయ్యెను. ఇతఁడు పాడుచున్నవి శర్యాతితల్లి నేర్పినపాటలు.

## పదకొండవ యధ్యాయము

తెల్లవారినది. ఆగుహాలోనికి వెలుతురు రాలేదు. గుహాముందుకూడ వెలుతురులేదు. ఆగుహా పశ్చిమ ముఖముగా నున్నది. కాని గుహాలో బోలెడంత వెలుతురున్నది. టికటికకు తనయొడలు తనకు చక్కగా తెలిసినది. గుహ వెలికివచ్చి చూచెను. చీకటిగానున్నది. మింటివంకఁజూచెను. సూర్యోదయము కాఁబోవుచున్న సమయములో నడిమింట నెట్టితెలుపుండునో అట్టి తెలుపుండెను. కొండకటునిటుబోయి ప్రాగ్దిశ నవలోకింపవలయు ననుకొనెను. అటునిటు పోవుటకు వీలులేదు. ఆగుహాముందలి భాగమంతయు తటాకము. గుహ యొక్క ముందరిభాగమున మాత్రము పదిమంది నిలుచుండుటకు దగిన మట్టినేలకలదు. కొండ రెండువైపుల నభివ్యాప్తమైయున్నది. తానిచ్చట కెట్లువచ్చెను? తటాకముమీఁద

నడచివచ్చెనా? అతఁడచ్చట చాలసేపు నిలుచుండెను. సూర్యోదయమైనది కాఁబోలు. ఈగుహాపశ్చిమ భాగము నందంతయుఁ చీఁకట్లు తొలఁగిపోయెను. మఱల గుహాలోనికిఁ బోయెను. గుహాలో నిందాక నెట్టివెలుతురున్నదో ఇపుడు నట్టివెలుతురేకలదు. అచట నావెలుతు రెట్లుండెనో యితనికి తెలియలేదు. ఇప్పటికి రెండు ప్రశ్న లుదయించినవి. అన్నిటి కంటె ప్రధానమైన ప్రశ్న మిగిలినది. మధుగుంజ యేమైనది? ఆమెయు నీగుహాలోనికే వచ్చెను. గుహాలోనుండి యితర గుహాలలోనికి మార్గముందా? అతఁడు గుహయంతయు వెదకెను. ఒకచోట మాత్రము మనిసి వంగిపోవుటకు మాత్రము వీలైన త్రోవకలదు. పోవచ్చునా? పోరాదా, లోపల నాపదయున్నదా? ఉన్నచో నది కొంతసేపటికి నిచ్చ టికి రాదా? అతఁడా మార్గమున ప్రవేశించెను. కొంత దూరము వంగిపోఁగా, మరల గుహయున్నది. ఇట్లు ప్రతి గుహానుండి మార్గము. గుహానుండి గుహ. అతఁడు వెళ్ళు చుండెను. ఎంతదూరము వెళ్ళెనో తెలియదు. ఎన్నిగుహలు చూచెనో తెలియదు. చివరిగుహాలోనుండి వెలికివచ్చు వేళకు నది పర్వతముకాదు. మహారణ్యము. అప్పటికి ప్రొద్దుక్రుంకు చున్నది. ఇన్నిగుహాలా? ఇంత ప్రయాణమా? పవలెల్ల నడువఁదగినంత పొడుగా? యీపర్వతము. ఇందులో గుహాలా? మఱల బయలుదేరి తొలుఁతటి గుహవద్దకు పోవలయునా? ఆమెయెవరు? తాను మూర్ఖుఁడు కానిచో నామె యెవరో తెలిసికొనకుండ నీగుహాలను వెదకుటయేమి? మధుగుంజ కూడ తనవలెనే యీ గుహాలలోనుండి యీ వెలుపలికి

వచ్చెను. వచ్చియేమైనది ? ఎచటికిపోయినది. తానీగుహా ముఖద్వారమున గాపుండినచో మఱల మధుగుంజ వచ్చును. ఆమెను పట్టుకొనవచ్చును. ఆమెవలన నీమెవార్త తెలిసికొన వచ్చును. మధుగుంజ తన్నీగుహాలలోనుండి తీసికొనిరాలేదు. తీసికొనివచ్చిన తెన్ను తనకు తెలియదు. ఒకటిమాత్రము నిశ్చయము. ఆమె యీచెఱువుమీఁద నడచివచ్చెను. తాను గూడ చెఱువుమీఁదినుండియే నడచివచ్చెను. ఆదారి యీమెకు తెలియదు. తనకు తెలియదు. తానుకూడ నడచి వచ్చెనుగదా! తాను మఱల జలముమీఁద నడువఁగలఁడా? ఆవిద్య తనకురాదే. ఆమెకువచ్చునా ? ఆమెకును రాదేమో ఆమెకు వచ్చును. ఆమెమఱల గుహాలోని కామార్గము వెంట వచ్చును. ఆమెకొఱకు తానిచట ప్రతీక్ష సేయుచు కూర్చుండుట వ్యర్థము. తనకు జలముమీఁద నడువఁగలిగిన శక్తి వచ్చినదేమో, పోయి చూడవలయును. రెండడుగులు వేసినంతలోననే తెలియునుకదా ! ఆవిద్య రానిచో నేను తిరుగ వచ్చును. కాదు ఆవిద్య వచ్చినది. తాను తటాకమును దాటును. ఆచెఱువున కావలిరేవెచ్చట ? అడవిలో నెచటికిఁ బోవలయును ? మిత్రగుప్తుఁడేమైనాఁడు ? ఇచటికి తనమంచె యున్న యడవి యెంతదూరము ! అతనికి మఱియు నొక ఊహవచ్చెను. మధుగుంజతో తనకేమి యవసరము ? ఈరాచకార్యముతో తనకేమి సంబంధము? ఆమధుగుంజయో మఱెవ్వరో తన్నాగుహాలోని కెందుకు తెచ్చిరి ? ఆచచ్చుటకు సిద్ధముగానున్న స్త్రీని బ్రతికించుటకు తెచ్చిరి. తనపాటవలన నామెయొక్క కృశించిన యంగములు పరిపుష్టములైనవి.

ఇది యాశ్చర్యము. తానప్పుడు శర్యాతితల్లి నేర్పినపాటలు పాడుచుండెను. తానా శ్లోకములును కీర్తనలును దీనికోసమా నేర్చికొన్నాఁడు. ఇట్టిపాటలచేత నామె శరీరమునకు పుష్టి వచ్చినచో ఇంకొకవిధమైన పాటలచేత నామె శరీరము కృశించునుకోబోలు! ఇదియంతయు నాకెందుకు, నాదారిని నేను పోయెదను. ఆమె శరీరమునకు నాయీ సంగీతముచేత పుష్టికలుగవలయునన్నచో కడచినరాత్రి దైవము నన్నిచటికి నెట్లు తెచ్చెనో మఱల నట్లే తీసికొనివచ్చును. తానుకర్తయా!

టికటికకు నామహారణ్యములో పరిచితముకాని ప్రదేశములేదు. కాని యీయడవి నతఁడెఱుగడు. ఇదియెచ్చట నున్నది! అతఁడూహింప నారంభించెను. ఊహించినఁగాని యిది తేలునట్లులేదు. హారదేశమునుండి యుత్తర జ్యోతిషమునకు ఈశాన్య భాగమునందుకల పల్లెటూళ్ళకు పర్వతములలోనుండి యొకత్రోవకలదు. ఆత్రోవకు ప్రాగ్భాగమున నున్న పర్వతములు బహువృక్ష సమాకీర్ణములుకావు. ఆపర్వతములనడుమ యింతటి కాంతారములేదు. ఈమహారణ్యము మార్గమునకు వాయవ్యదిశయం దుండవలయును. తానాగ్నేయాభిముఖముగా నడచినచో మఱల పర్వతములు వచ్చును. ఆపర్వతముల నడుమ నెచ్చటనో యీమార్గముండును. బయలుదేరవలయునా, వలదా? మఱల తొలుతటి గుహలోనికిపోయి యామెనుజూచి ఆమె యెవ్వరో తెలిసికొని పోయినచో నెట్లుండును? మధుగుంజ కొఱకు ప్రతీక్షించుట కంటె తొలుతటి గుహలకు వెళ్ళుటయే మంచిది! మధుగుంజ అచ్చటికే రావచ్చును. మఱియు జలోప

రిగమన విద్య తనకు వచ్చెనో రాలేదో తెలిసికొన వచ్చును. ఆమె యెవ్వరు? అచట నెందుకున్నది? ఎవరైన నామెను తెచ్చి యచ్చటనుంచిరా ఏమహర్షిచేతనో సృజింపఁబడిన యప్సరఃస్త్రీయా? అప్పుడు టికటికకు హఠాత్తుగా మనస్సులో నొక మెఱపు మెఱసెను. ఆమెయే వేదవతి. వారు చెప్పికొనిన వరాహమిహిరాచార్యుని కుమార్తె. ఆమెను కటకట యోగి యెత్తికొనిపోలేదే, ఎవరు దొంగిలించిరి? మురారిభట్టు వార్తనుగూర్చి చెప్పలేదే? మురారిభట్టు కటకదేశవాసి. మధుగుంజ ఉరగదేశనివాసిని. కాని వేదవతిని తెలిసికొనవలయునని వారందరు కృతనిశ్చయులై యుండిరి. ఈసంగతి మిత్రగుప్తునకు తెలియవలయును. సవ్యసాచికిగూడ తెలియవలయును. పాపమతఁడు మాత్రము చక్రవర్తి దయనేల సంపాదించరాదు.

టికటికకు పర్వతములలోని త్రోవ కనుగొనుటకు పదిదినములు పట్టినది. తాను నడచిన మార్గమంతయు నతఁడు జాగ్రత్తగా గుర్తుపెట్టుకొనెను. నాల్గయిదు పర్వతములడ్డముగా నుండెను. అవి యతార్యములు. అలంఘ్యములు; ప్రతికొండ చుట్టును తిరిగి రావలయును. ఎంతదూరము పశ్చిమముగా నడచిపోయెనో కొండమలుపు తిరిగినతర్వాత నంతదూరము ప్రాగ్దిశగా నడచి రావలయును. చివరికామార్గము కనిపించెను. అతఁడు గనుక సరిపోయినది. ఇంకొకనికి సాధ్యము కాదు. అతనికి నిద్రాహారము లక్ష్యములేదు. ఆతఁడు శ్రమ యెఱుగఁడు. నీటిపడియ కన్పించినచో జలమానును. లేనిచో జలమక్కఱలేదు. ఏపండో ఏదుంపయో తినును. లేనిచో

నవసరములేదు. ఒకవేళ నతఁడు తానింక నడువలేనను కొన్నచో నచటనే యెచటనో కూర్చుండి ఏకతార చేఁబూని సంగీతము పాడుకొనును. వానికలసట తీరును. దప్పిక యుండదు. క్షుత్తుపశమించును. మార్గముచేరిన తర్వాత తానును మిత్రగుప్తుఁడునుకలిసి ఆరాత్రి నిదురించిన వృక్షము కలయడవి చేరుటకు తా నీశాన్యముగా రెండుజాములు ప్రయాణము చేయవలెనని తెలిసెను. తానాచెట్టువద్దకుఁ బోయినచో మిత్రగుప్తుఁడచ్చట నుండునా? అతఁ డాయడవిలో తిరిగి తిరిగి మఱల గ్రామములోనికి పోయి యుండును. తానడవిలోనికి పోవుటకంటె గ్రామములలోనికి పోవుటయే మంచిది. ఎట్లును పోవలయునుకదా! సవ్యసాచినికూడ కలిపికొనిరావలయును. అతఁడుత్తర జ్యోతిషములకే పోయెనుకాని దశదిశాపర్యాలోచనముచేసి తాను నివసించిన వృక్షమునుండి ఆతోలుతటి గుహకు మార్గము కనుగొనవచ్చునని యూహించెను. కాని మఱల అది కొన్నాళ్ళుపట్టును. అది దగ్గఱత్రోవయేమో! అవును దగ్గఱత్రోవయే. పదిదినముల పర్వతములలోని నడక. ఒక దినముయొక్క గుహలలోని నడక. తాను మధుగుంజా సంగీతలహరీ సమాకృష్టుఁడై నడచిన దొక్క నిశార్థమాత్రమున. కాని యచట తటాకమున్నది. తనకు సవ్యసాచి యెట్లుకన్పించును? మిత్రగుప్తుఁడెట్లు కన్పించును? కన్పించినచో కన్పింతురు. కన్పించనిచో కన్పించరు. తాను తొల్లిఁటివలె నూళ్ళలో పాడుకొంచు తిరుగుచుండును. సవ్యసాచి గ్రామమేదో తనకు తెలియదు. తన్ను తొలుత సవ్యసాచిచూచిన యూరునకుపోయి వీధులవెంట పాడుచు

పోవుచుండెను. ఊరిలోని బాలకులందఱు. "మళ్ళీ వచ్చాడోయి! మళ్ళీ వచ్చాడోయి" అనుకొంచు వానివెంట బడిరి. టికటికకు తాను పూర్వము పాడెడి యవనభాషా కీర్తనలుగాక సంస్కృతకీర్తనలు, శ్లోకములు పాడవలెనని యనిపించెను.

దృశా ద్రాఘీయస్యా దరదళిత నీలోత్పలరుచా
దవీయాంసం దీనం స్నపయ కృపయా మామపి శివే!
అనేనాయం ధన్యో భవతి నచ తే హాని రియతా
వనేవా హర్మ్యేవా సమకరనిపాతో హిమకరః॥

ఆ పాటయే పవలెల్ల పాడుచు తిరుగ నారంభించెను. పిల్లలకు మొదట క్రొత్తగా నుండెను. తర్వాత నలవాటుపడిరి. ఆనాఁటి రాత్రి పరమేశ్వరీ కటాక్షములు దీర్ఘదీర్ఘములై సంగీత రూపమున నా గ్రామమున నింటింట వ్యాపించెను. టికటిక మఱునాఁడింకొక గ్రామము పోయెను. అది యవన సంసారము లెక్కువగల గ్రామము. ఆయూరిలో బాలురేకాదు, పెద్దలుకూడ నితని సంగీతము వినిరి. అది ఏ భాషయో వారికి తెలియలేదు. ఊరిలోని బాలుర కందఱకు మాత్రము నా శ్లోకములోని పలుచోట్లు కంఠతఃవచ్చెను. ఒకఁడు గోలికాయను దృశా ద్రాఘీయస్యా యని కొట్టును. మఱియొకఁడు గోడీబిళ్ళను సమకరపాతోహిమకరః అని కొట్టును. మఱియొకఁడు చెడుగుడిలో నచతేహానిరియతా యని కూత పెట్టును. మఱియొకఁడు గాలిపటము నెగురవేయుచు స్నపయకృపయామామపిశివే! యనును. ఊరిలోని యవనులలో కొందరికిఁ సంగీ

తాత్మ కలదు. ప్రపంచమున నెచ్చటనైనను జనులలో నిట్టి వారుందురు. వారి నోళ్ళకు పద్యభాగములు కీర్తనభాగములు సులభముగా వచ్చును. వారు ప్రసంగించుచు తమకు వచ్చిన యా భాగమును పేర్కొందురు. ఒంటరిగా నున్నప్పుడు వానిని కూనరాగములతో నాలకింతురు. టికటిక తానా శ్లోకముల పాడుచు, 'దరదళిత నీలోత్పలరుచా, నచ తేహానిరియతా', అన్న ఈ రెండు ప్రదేశముల యందు చిత్ర చిత్రములైన సంగతులు వేసి గొంతుకమలచి మంద్రమధ్యమ షడ్జముముల యొక్క సమాహారమును విలక్షణముగా పచరించుచుండెను. ఈ సంగీతాత్మ కలవారందఱకు తమలో తాము కూనరాగములు తీసికొనుచున్నపు డీరెండు భాగములు పిలువకుండ పల్కెడివి. వారికి వాని యర్థము తెలియదనుకొను చుండిరి. కొందఱు సంగీతాత్మతోపాటు విచిత్రమైన పూర్వజన్మ సంస్కార సమాత్తమైన వివేకమును కల్గియుందురు. వివేకము యొక్క పరమస్వరూప మేమనఁగా కొన్ని విషయములు వాని యంతటనవి బుద్ధికి భాసించును. అశిక్షితమైన విషయము శిక్షితమైనట్లు భాసించును. ఇది వివేకమను గుణము యొక్క పరాకాష్ఠ. ఈ సంగీతాత్మ కలవారిలో నిద్దఱు ముగ్గురు తమ వ్యవహారములు చేసికొనునపుడు ప్రతిస్పర్థితో మాటాడుచు, దీని వలన నీకేమి నష్టము అనవలసిన సందర్భములో 'నచ తేహానిరియతా' అనఁజొచ్చిరి. అర్థమిద్దఱికిని తెలియదు. తాత్పర్య మిద్దఱికిని తెలియదు. వాడుక లోనికి వచ్చెను.

టికటిక మొదట పది దినాలు పది గ్రామములు తిరిగెను. కాని తరువాత నొక్కనాఁటికి రెండు గ్రామములు. మఱికొన్ని దినములైన తర్వాత దినమునకు మూఁడు గ్రామములు ప్రొద్దుగ్రుంకి ఏ యూరో పోవును. రాత్రి ప్రొద్దుపోవు వఱకు నా గ్రామమంతయు పాడుచు తిరుగుచుండును. మొత్తము మీఁద ఉత్తర జ్యోతిషములందు అతఁడు పోని, పాడని గ్రామము లేనట్లయ్యెను. వెళ్ళిన ప్రతి గ్రామమందు తల్లియొక్క దరదళిత నీలోత్పల రుచములు ద్రాఘీయసులైన దృక్కులు ప్రసరించుచునే యున్నవి.

టికటిక సవ్యసాచి కొఱకు మిత్రగుప్తుని కొఱకు గ్రామములన్నింటిని గాలించెను. వారిద్దఱు టికటిక కొఱకు పర్వతములు కాంతారము లన్నింటిని గాలించిరి. రెండు నెలలు గడచెను. ఒకనాఁడు మిత్రగుప్తుఁడు తోట్లతోలుత టికటికను కలసికొన్న చెట్టులోని మంచెమీఁద సవ్యసాచి మిత్రగుప్తుఁడు నిద్రపోవుచుండఁగా రాత్రిపూట టికటిక చెట్టెక్కెను. వారిని చూచెను. గుర్తుపట్టెను. దృశా ద్రాఘీయస్యాతి మధుర నినాదమును వృక్షపత్రములు గదుముకొనెను.

## పంద్రెండవ యధ్యాయము

"ఇంత ప్రయాణము పది దినములు మనము ముప్పూరము కలసి చేయఁజాలము. నేను కనుక సరిపోయినది. మీరిరువురు వచ్చినచో మీయిద్దఱకును నెలగ్రాసము కట్టుకొని పోవలయును. ఎప్పుడేమి జరుగునో తెలియదు."

సవ్య :- ఆగుహాలెన్నికలవో లెక్కచూచితివా?

టిక :- లెక్కచూచుటకు వీలున్నదా? నేనుబయలు దేరినపుడు నాకాసంగతి తెలియదు. నామన స్సాప్రయత్నములో లేదు.

మిత్ర :- ఆగుహాలన్నియు గాంధాంధకార మయములుగదా! నీకెట్లు తెలిసినది?

టిక :- అన్ని గుహాలయందును గుహాంతర్భాగము విస్పష్టముగఁ దెలియనంత వెలుతురు కలదు. ఆవెలుతు రెచ్చటనుండి వచ్చుచున్నదో నాకుఁదెలియలేదు.

సవ్య :- కొన్ని యోషధులుండునఁట, అవి దివారాత్రములు వెన్నెలలు కాయునఁట! అట్టి యోషధులుండుటవలననే యీ దేశముల కుత్తర జ్యోతిషములని పేరువచ్చెను.

మిత్ర :- ఆయొక్క కొండలోననే యాగుహాలలో మాత్రమే యున్నవా!

సవ్య :- ఆపర్వత మట్టిది. ఆ పర్వతము వలననే యీపేరు వచ్చెనేమో!

టిక :- అది మనకెందుకు? ఈకుడివైపుగాఁ బోయినచో మనమెంత చుట్టుతిరిగినను దినము రెండు దినములలో నాతటాకముయొక్క స్థితిని దెలిసికొనఁ గలుగుదుము. ఆతలి యొడ్డున గుహాముఖము కనిపించుచుండును. మనము మువ్వుర మీఁదికొని పోవచ్చును.

సవ్య :- నీకు మధుగుంజ కనిపించనేలేదా!

టిక :- కనిపించనేలేదు. మఱియు నాకొక యను మానమున్నది. ఆపాడినది మధుగుంజ కాదేమో? గాలిలో నేదో గీతముదయించి నన్నట్లాకర్షించినదేమో! వేదవతిని వాగు శుష్కింపఁజేసి తమదారినిఁదాము పోయిరి. ఆమెక్రమముగా నామెయంతటి నామెయే చచ్చునని పరిత్యజించి పోయి యుందురు. ఆమెను బ్రదికించుటకు నన్నెవరో తీసికొని పోయియుందురు.

మిత్ర :- ఆ యెవరో యెవరు?

టిక :- నాకుఁ గలలోఁ గనిపించిన సన్న్యాసి కావల యును. ఆయన చక్రవర్తి గురువని చెప్పితివిగదా!

మిత్ర :- ఆసన్న్యాసికంత మహత్తున్నదా?

టిక :- కటకట యోగికున్నప్పు డాయనకెందు కుండరాదు?

సవ్య :- మనమిప్పు డేమి చేయుదము?

మిత్ర :- ముప్పురము గలసిపోవుదమా? విడివిడిగా పోవుదమా? పోయినచో నెక్కడ గలసికొందము? ఇక్కడ కలసికొందమనుటకు మనమెఱుఁగని స్థలమున నిచ్చటయని నిర్దేశము చేయుటయెట్లు? ఎన్నాళ్ళుపట్టిన నన్నాళ్ళుపట్టును. మనము ముప్పురము మూఁడు త్రోవలుగా పోవుదము. నీలెక్కప్రకారము చెఱువు కనపడి తీరవలయునుగదా! చెఱువు కనిపించినంతనే దూరాన గుహాముఖము కనిపించు వఱకుఁ జెఱువునొడ్డునఁ బడిపోయి యాస్థలము గుర్తించుకొని వెనుకకుఁ దిరిగి రావలయును. ఎన్ని దినములైననుసరే!

మువ్వుర మట్లేచేసి మఱల నిచటనే కలిసికొందము.

సరేయనఁగా సరేయని మువ్వురు బయలుదేరిరి. అడవిలో చాలదవ్వు ప్రయాణించిరి. విడిపోవుటకు మూఁడు త్రోవలుండవలయునుగదా! అచట త్రోవయేలేదు. కలిసియే పోవుచుండిరి. టికటిక మనసా నిర్మించిన దిశాముఖముగా పోవుచుండిరి. రెన్నాళ్ళు గడచెను. మువ్వురు విడివడిపోలేదు. ఒక మహాతటాకము కనిపించెను. మువ్వురు నావలియొడ్డున గుహకోసము పరిశీలించి చూచిరి. ఆతలియొడ్డున మహారణ్యమున్నదిగాని పర్వతమేలేదు. ఇంక గుహ కనిపించుటయెట్లు? ఆతటాకముయొక్క దైర్ఘ్యము విచారించినచో నేవైపునకు బయలుదేరి పోయినను కొన్నియామడలు నడువవలయునన్నట్లున్నది. టికటిక యిట్లనెను. "ఒడలు తెలియని శివముండదు. నేనంతటి తన్మయత్వములో నడచుచున్నను నాకిట్టి తటాకము దాటిన గుర్తులేదు. ఈతటాకమున కట్లోయిట్లో పోవలయును గాని తటాకము దాటనక్కఱలేదు" అని మువ్వురును కుడివైపుగానే ప్రయాణము చేసిరి. మఱల రెన్నాళ్ళునడచిరి. ఘోరముగా పెద్దపర్వతములు కనిపించెను. ఆమఱునాఁటి సాయంకాలము చీఁకటి పడినతరువాత మఱల నొక పెద్ద తటాకము కనిపించెను. చీఁకటిలో నాతలియొడ్డున గుహ యున్నదో లేదో తెలియదు. ఆరాత్రి వారు గడపిరి. మఱునాఁడు తెల్లవారినది. పర్వతము కనిపించినది. గుహ కనిపించినది. తటాకముదాఁటి పోవలయును. వారి మువ్వురకును ప్రాణములు లేచివచ్చినవి.

టికటిక : మనము నాల్గుదినములు ప్రయాణము చేసితిమి. ఆనాఁటిరాత్రి రెండు జాములలో నేనిచ్చటికి వచ్చితిని. ఏదియో దగ్గఱత్రోవ యుండవలయును.

మిత్ర : మనము మఱల తిరిగి పోవుటయనుచు నున్నదా !

సవ్య : ఎందుచేత ?

మిత్ర : మనము పొరపాటు చేసితిమి. మనము వెదకికొనుచు రారాదు. ఏ మహాయోగి నిన్నిచ్చటికిఁ దీసికొని వచ్చెనో యాయనయే మఱల నిన్నిచ్చటికిఁదెచ్చి సర్వమును సువ్యక్తము చేసెడివాఁడు.

టికటిక : ఇప్పుడాయనయే మనల నిచటికిఁ దెచ్చె నేమో !

మిత్ర : ఆయనయే తెచ్చినచో నింతకష్టపడుట యెందులకు ?

టికటిక : ఈనాల్గు దినములలో మనమిచటికి రారాదేమో ! మనమిచటికి రావలసిన సమయమిదియేనేమో !

మిత్ర : మనకేదైన నాపద సంభవింపవలయునని వ్రాసియున్నదేమో ! మనపడిన కష్టములు దానికి సూచనయేమో !

సవ్యసాచి యీాదలేఁడు. టికటిక యీాదఁగలఁడు. మిత్రగుప్తుఁ డంతదవ్వీదలేఁడేమో ! సవ్యసాచి నేమిచేయవలయును ? అతని నొక్కని నచట దించిపోవలయునా ? అతఁడేమగును! మిత్రగుప్తుఁ డిట్లనెను. “మువ్వురమును దిరిగి పోదము.

వేదవతి యాగుహాలో నున్నదని తెలిసెను. ఇప్పుడుపోయి మనమామెనుఁజూచి చేయునది లేదు. ఆమెను మనము తీసి కొని రాలేము. నేను వెంటనేపోయి మా యధికారులలో నొకనిని కనుగొని వానికి విన్నవింతును. తరువాత కర్తవ్య మతనిది.

సవ్య : మనమట్లుపోరాదు. ఆమెను టికటికచూచియే రెండు నెలలు దాటినది, ఇపుడామె యచట నున్నదో లేదో! తొలుత నాసంగతి నిర్ధారణ చేసికొనవలయును. ఆమె నిచటి కెవరు తెచ్చియుందురో ? వారామె నిచటినుండి తొలఁగించి నచోఁ దొలఁగించ లేదన్నసంగతి మనము తెలిసికొనినచో నామె నిచటనున్నదని నీవుపోయి నీయధికారులతోఁ జెప్పి ప్రయోజనమేమి ?

మిత్ర :- నీవిచట నొక్కఁడవు నుందువా? మేమిద్దఱము పోయి చూచివత్తుము.

సవ్య :- మీయధికారులు నన్నుఁగూడ నెఱుఁగుదురు గదా! నేనుపోయి వారితోఁజెప్పెదను. మీరిద్దఱుపోయి యామెయొద్ద నుండుడు. అచటి కెవ్వరైన వచ్చినచో నీరెండే కదా మార్గములు. ఈచెఱువునుదాటి రావలయును. ఆగుహా లలోనుండి రావలయును. మిమ్ముమీరు రక్షించుకొనుచు నామెచేయి దాటిపోకుండఁ జూచికొనుఁడు. ఈప్రదేశమును వదలిపోకుడు. ఎవ్వరైన వచ్చినచో వారికిఁ గనిపించకుండ మీరు గుప్తముగా నెచటనుండఁగలరో విచారించికొనుఁడు. మీరక్షణ మీరు చేసికొనవలయును. ఆమెరక్షణము చేయు

చుండవలయును. ఒక పదేను దినములలో మీయధికారి కన్పింపక పోయినచో మాసుమంతునితోఁ జెప్పి సేను తగినంత మంది నిచ్చుటకిఁ దీసికొనివత్తును. ఈమె చెఱ విడిపింతము. వారిద్దరును సవ్యసాచిని ప్రశంసించిరి. సవ్యసాచి తన వచ్చినత్రోవ గుర్తుపెట్టుకొనుచుఁ దిరిగిపోయెను. వారిరువురు తటాకము నీదనారంభింపఁబోయిరి. తటాకము మొసళ్ళతో నిండియుండెను. పరిశీలింపఁగా నొడ్డుననే మొసళ్ళుండెను. అందులో నీదుటయెట్లు? ఆదెసకుఁ బోవుటయెట్లు? మిత్ర గుప్తుఁడు కట్టెలనుగొట్టి తెప్ప నిర్మింతుననెను. తెప్ప నిర్మింప వలయుననఁగా పెద్దకట్టెలు కావలయును. త్రాళ్ళు కావల యును. రెండుమూనాళ్ళు శ్రమపడినగాని యాపని సాధ్యము కాదు. సవ్యసాచి వెడలిపోయెను. వారిద్దఱు తటాకతీర మున నిరీహులై కూర్చుండిరి. కట్టెలు కొట్టుటకు గొడ్డలి కావలయును. ఎండిపోయిన కొమ్మ లెచటనైన పడియుండె నేమో యడవిలోఁబోయి వెదకవలయును. ఇద్దరును నిర్వ్యాప సాయులై కూర్చుండిరి. పవలెల్ల కడచిపోయెను. ఆకలములు తినిరి. మొసళ్ళభీతివలన నవిలేనిచోటుచూచి గబగబ నాలుగు గ్రుక్కలు నీళ్ళుత్రాగి మఱల నొడ్డునకుఁ బరువెత్తుకొని వచ్చిరి. ఆరాత్రిపూట విశ్రమింపవలయును. పగటిపూటనే మహాసర్పములు సంచరించుచున్నవి. ఒకపెద్ద వృక్షమును చూచి దానిపైకెక్కిరి. ఆకులు దట్టముగా నలుముకొన్న యొకకొమ్మమీఁద పంగలో గూర్చుండిరి. నిదురపోవుటకు వీలులేదు. అడవిలోని పిట్టలయీలలు, వన్యమృగముల ఘోషలు, చిక్కని పచ్చికలోనున్న పురుగులు నిస్స్వాన

ములు, తీవ్రమైనగాలి, చెట్లకొమ్మలను గదిపి వెలార్చునాగో వములు గగనవీధియంతయు నిండిపోయెను. కాంతార మంతయు నంత ధ్వనిమయముగానుండి నిశ్శబ్దముగానున్నట్లని పించెను. ఇదియంతయుశబ్దము కాదా! అడవినిశ్శబ్దముగానున్న దనిపించుటయేమి? మానవునకు మానవజీవిత సంబంధమైన శబ్దమేశబ్దము. తక్కినది నిశ్శబ్దము. ప్రొద్దుపోయినది. రాత్రి రెండుజాములు దాటినదేమో తెలియదు. చెరువులోనినీళ్ళు చిత్రముగానున్నవి. ఏపెద్దచేపయో నీటిపై కెగురును. ఆ శీక రముల సమూహము నక్షత్రముల వెలుఁగు నందుకొని వెండి కరగించిపోయెను. ఒక మహాసర్పము నీటిలో జర్రున ప్రాకి పోవును. ఆనీటిసవ్వడి యీలవేసినట్లుండును. ఆకులసందునుండి కనిపించిన చెఱువేతప్ప చెఱువంతయు గనిపించుటలేదు. టికటిక మిత్రగుప్తుఁడున్నచోట నుండలేదు. గుహకెదురుగా నీతలియొడ్డునకు సూటిగా నీటిమీఁద నొక మార్గమును నిర్మించుకొని యాప్రదేశము తనకుఁ గనిపించునట్లుగా నాచెట్టు మీఁద నొకచోట గూర్చుండెను. అతనికిఁ గొంతసేపటికి నెవఁడో పురుషుఁడు తటాకముమీఁద నడచిపోవుచున్న ట్లనిపించెను. వాఁడెవఁడు? వానికి జలస్తంభనవిద్య తెలి యునా? ఆనాఁటిరాత్రి తానా త్రోవవెంటనే పోయెనా! అట్లుపోవుటకు జలస్తంభనవిద్య యక్కఱలేదా? ఒక నిగూఢ మైన మార్గమున్నదా? ఈచెరువు రెండుగా చీలియుండి యీనడుమ నదియొక శిలాకుడ్యమువలె నున్నదా? కొంచెము లోతుగల మార్గమచ్చటకలదా? వాఁడు తటాకముయొక్క నడుమననుండఁగాఁ జూచెనుగాని తటాకములోనికిఁ బ్రవే

శించునప్పుడు చూడలేదు. వాఁడు కనుమీఁటిపోయెను. కొంత సేపటికి గుహలోనుండి సంగీతము వినవచ్చెను. ఇది యేమి సంగీతము ? తాను మున్నెప్పుడో యుత్తర బాహ్లీక దేశము నకుఁ బోయెను. ఒకరాత్రివేళ నొక విశాలమైన కొండ గుహలో నృత్యము జరుగుచుండెను. అచటి యువతులు నృత్యముచేయుచుఁ బాడుచుండిరి. ఆపాటలోని సాహిత్యము పరమాసభ్యముగా నుండెను. ఆ ధ్వనులు వికారముగా నుండెను. ఒక వాద్యము తంగున నాగిపోవును. ఆచివరిమాట మీఁద సంగీతమురాదు. అట్లాగిపోవుటవలన ప్రాణము తంగున నాపివేసినట్లుండెను. రెండు చరణములచివర నంత్యప్రాస ముండును. ఆయంత్యప్రాసము భావపుష్టి కలిగింపక యుద్రే కమును గలిగించును. అది హాస్యరసమువలె నచటి ధూర్త యువనులు సంతోషింప నారంభించిరి. ఆయంత్యప్రాసము వలన నేవగింపు కలుగుచుండెను. ఆపాటలో సౌకుమార్యము లేదు. సంగీతములేదు. ఆపాటయంతయు మోటుమాటల కూటమి. వేదవతియున్న గుహలోనుండి యిట్టిపాట వినవచ్చు చుండెను. ఆనాఁడాపాట విన్నప్పుడు తనయొడలఁ దేళ్ళుప్రాకి నట్లయ్యెను. ఓహో ! యిదియా రహస్యము ! ఈవేదవతి నాదమయమూర్తి కావలయును. ఈపాప సంగీతము వినుట వలన నామె మెలికలు తిరిగిపోవునేమో ! ఆమె కార్శ్యమున కిది హేతువు కావలయును. వీఁడెవఁడో కిరాతయోగి యీమె నిట్లు బాధించుచుండెను. శర్యాతి తల్లినేర్పిన స్వచ్ఛమైన శ్లోకములచేత నామె కార్శ్యముపోయి యామెకుఁ బుష్టి వచ్చెను. తానచ్చటికి వెళ్ళినపుడు వీఁడచట లేఁడు. వీఁడు లేని

వేళచూచి రాజగురువుయొక్క స్వచ్ఛమైన యంతరాత్మ తన్నచటికిఁ దీసికొనిపోయెను. వీఁడీమధ్య నిచ్చటి కెన్నిసార్లు వచ్చెనో? ఇప్పుడు వేదవతి యేస్థితిలోనున్నదో? వీఁడచట నుండఁగా తాను లోనికిఁబోరాదు. ఆపాట నెవరు పాడు చుండిరి? వాఁడే పాడుచుండెనా? వాఁడు గాయకుఁడా? టికటిక యిట్లాలోచించుకొనుచుండఁగా మిత్రగుప్తుఁడు టికటిక యొద్దకు వచ్చెను. "ఆపాట నన్నాకర్షించుచున్నది. నేను లోనికిఁ బోదు"ననెను. టికటిక చెఱువులోఁబడి చత్తువనెను. మిత్రగుప్తుఁడు చెట్టుమీఁదినుండి దిగఁబోయెను. టికటిక వానినిఁ బట్టుకొని యాపెను. మిత్రగుప్తుఁ డిట్లనుకొనెను! "నాది వ్యాయామ కఠినదేహము. ఇతఁ డీనకట్టుపుల్లవంటి వాఁడు. వీనిపిడికిలియందు నామనికట్టు బాధపొందుచున్నది."

అట్టిపాటలు రెండుమూఁడు సాగెను. టికటిక పట్టు మొసలిపట్టువలె నుండెను. లేనిచో మిత్రగుప్తుఁడు చెట్టు నుండి దూఁకి చెరువులోఁబడి చచ్చెడివాఁడే! ఆపాట లాగి పోయెను. పక్షుల కలకలము హెచ్చెను. సన్నసన్నని తెలి త్రాచులు గ్రుడ్డులలోనుండి వెలికి వచ్చుచున్నట్లు సూర్య కిరణముల పిల్లలైన చిన్నివెలుఁగులు పచ్చియాకుల సందుల నుండి పారాడెను. టికటిక కూపిరాడెను. తెలవారఁబోవు చున్నది. ఆయోగి యేమయ్యెను? వాఁడు తిరిగివచ్చునట్లు లేదు. వాఁడులోననుండఁగా వీరిద్దఱు చెట్టుదిగి రారాదు. వాఁడాగుహామార్గమునుండి పోవునా? వాఁడూరకే యంత శ్రమయేలపడును? వాఁడు గుహలోనుండి వెడలిపోయెనని విస్పష్టముగాఁ దెలియకుండ తాము వృక్షావరోహణము చేయ

రాదు. చెఱువులోని త్రోవమాటవేరు. టికటిక యీసంగతి యంతయు మిత్రగుప్తునితోఁ జెప్పెను. మిత్రగుప్తుఁడు గ్రహించెను. ఆపవలెల్ల వారిద్దఱు నాహారము లేకుండ జలపానములేకుండఁ జెట్టుమీఁదనే దాఁగికొని యుండిరి. మఱల రాత్రియయ్యెను. చీఁకట్లువచ్చెను. కాలము మాత్రము గడచుటలేదు. మఱల రాత్రి రెండుజాములు దాటినతరువాత గుహాలో సంగీతము లారంభింపఁబడెను. ఏమి విపరీతములైన కీర్తనలు? ఏమి యసభ్యములైన భావములు? అదియంతయు సరస్వతీస్తనద్వయమైన సంగీత సాహిత్యములను పరమ కిరాతుఁడెవఁడో కత్తులుపెట్టి కోయుచున్నట్లుండెను. అందులో మిత్రగుప్తునకొక యాకర్షణ కలిగెను. అది యంత తుచ్ఛముఁగా నున్నదని తెలియును. ఆకర్షణమాత్రము చావలేదు. టికటికను తన మనికట్టును గట్టిగా పట్టుకొని తాను చెట్టుదిగకుండ నాపుమని ప్రార్థించెను. ఈసంగీతములో నొక విశేషమున్నది. తత్పూర్వమున లిప్తలోనున్న సహస్రాంశముకూడ ప్రాణముమీఁద బరువుగా కూర్చుండఁగా నీసంగీతము సాగినంతసేపు కాలము రెక్కలుకట్టుకొని పరువెత్తెను. సంగీత మాగిపోయెను. టికటిక చూచుచుండఁగనే యోగి మఱల గుహాలోనుండి బయలుదేరి వచ్చుచుండెను. నీటిమీఁద నతఁడు నడచివచ్చుచున్న దారిని టికటిక గుర్తుపెట్టుకొనెను. ఈతలియొడ్డున చేరిన ప్రదేశము గుర్తుపెట్టుకొనెను. ఈయొడ్డు చేరినయోగి తనదారినఁదాను పోలేదు. వానికేదో యనుమానముతగిలినట్లున్నది. ఒడ్డున నటునిటుసంచరించుచుండెను. వీరున్న చెట్టు వానికెంతో దూరమునలేదు. వాఁడు తమనిల

చిన చెట్టు క్రిందికి వచ్చునేమో. తాము నిస్సంశయముగాఁ గనిపింతురు. వాఁడేమిచేయునో? మిత్రగుప్తునకు నెడదలోఁ గలిగిన భయమున కవధిలేదు. మిత్రగుప్తునకెప్పుడు నడుమున పట్టాకత్తి యుండును. వాఁడు తమ చెట్టుక్రిందికి వచ్చినచో హఠాత్తుగా దూఁకి వానిని రెండుగా నరుకవలయునని సంకల్పించెను. ఇంతలో మఱల గుహాలోనుండి సంగీతము వినవచ్చెను. చక్కఁగా తెలవారెను. యోగి పొందిన ముఖాంగ వికారములు విస్పష్టముగాఁ గనిపించెను. ఆసంగీతము టికటికకుఁ దెలియును. అది మధుగుంజా కంఠస్వరము. ఆమెకు మోటుపాటలురావు. ఒక సుకుమారమైన భావనా శీలమైన భిన్ననాయికా లక్షణములు భాసించు మధుర భావనలు కలిగిన కీర్తన లామె పాడును. యోగి మఱల తిరిగి గుహాలోనికిఁ బోఁజొచ్చెను. టికటికకు దారి యిప్పుడు విస్పష్టముగాఁ దెలిసెను. చెఱువు వానికి చీలమండలలోఁతు వచ్చుచుండెను. ఇది జలముమీఁదనడచు విద్యయయినచోఁ జీలమండలలోఁతు నీరెందుకు రావలయును! ఆక్రింద నేదో గట్టున్నది. యోగి లోనికిఁబోయెను. అతఁడు బెత్తముతో నెవ్వరినో కొట్టినట్లు వినిపించెను. ఆమె యేడ్చుచుండెను. కొంతసేపటికి మఱల యోగి యొక్కఁడును వచ్చెను. అతడు కోపముతో వెడలిపోయెను.

చాల ప్రొద్దెక్కెను. ఇద్దఱును చెట్టుదిగి వచ్చిరి. టికటిక మార్గముకోసము వెదకెను. మార్గము నీటిలోఁ గొంత దవ్వునఁ గనిపించెను. ఒడ్డున గొంతమేర నెక్కువ లోఁతు కలదుకాబోలు. మిత్రగుప్తుని నాల్గు పెద్దకట్టెలు తీసికొని

రమ్మని టికటిక చెప్పెను. అతఁడు తెచ్చెను. కఱ్ఱలతోఁ బొడిచి దారి కనిపెట్టెను. టికటిక మిత్రగుప్తునితో నిట్లనెను. "రెండుచేతులతో రెండుకఱ్ఱలను పట్టుకొనుము. జాగ్రత్తగా నటునిటుపరిశీలించుచు నావెనుకరమ్ము. ఏ మొసలియైన నేవైపున నుండి వచ్చిన నేవైపుదాని నావైపుననే కఱ్ఱలతో నాసాగ్రమునఁ బొడువుము." ఇద్దఱును జాగ్రత్తగా తటాకతరణము చేసిరి. ఎట్టకేలకు గుహాముఖమునకుఁ బోయిరి. లోనికిఁబోవలయును. మిత్రగుప్తున కాకలి యింతయని చెప్పుటకు వీలు లేదు. అతఁడాఱుదినములు పడినశ్రమ వాని నొక్కసారి క్రమ్మెను. టికటిక వానిని సేదతీర్చెను. నీరు త్రావించెను.

ఇద్దఱును లోనికిఁబోయిరి. అచట మధుగుంజలేదు. ఏమైనది ? ఆగుహాలలోనుండి యామెను పంపెనుకాఁబోలు! వేదవతియున్నది. ఆనాఁడు తెలవారుకడ తాను చూచినప్పు డెట్లున్నదో యట్లున్నది. టికటిక వెంటనే యేకతార తీసికొనెను. అతఁడిపు డేకతార నందికొన్నచో నోటివెంట వచ్చెడి ప్రథమశ్లోకము 'దృశా ద్రాఘీయస్యా' ఆ శ్లోకము అర్థము అతనికి తెలియదు. ద్రాఘీయస్యా యన్న మాటలో మూఁడు దీర్ఘములున్నవి. ఆదీర్ఘముల నితఁడు మిక్కిలియు దీర్ఘీకరించును. చివరి దీర్ఘముమీఁద వట్టి మంద్రస్వరమును పొడిగించును. వేదవతి యిప్పుడానాఁటి కంటెఁగూడ మెలికలు తిరిగిపోవుచున్నట్లుండెను. టికటిక ద్రాఘీయస్యాయని యాలపించిన కొలఁది నామెశరీరము యొక్క మెలికలుపోయి యామె సాఫీగా పండుకొనెను. శ్లోకమంతయు పాడెను. తనకు శర్యాతి తల్లి నేర్పినశ్లోకములు,

పాటలన్నియుఁ బాడెను. చూచుచు చూచుచుండగనే బక్క-చిక్కియున్న వేదవతి యొడలు పుష్టమయ్యెను. కండ లుబికెను. పాలిపోయిన శరీరము నిండిన రక్తకాంతులను వెదజల్లెను. ఒక్కటే భేదము. ఇప్పుడామె మేల్కొనియున్నది.

## పదుమూడవ యధ్యాయము

ఆ యిద్దఱిని వేదవతి చూచెను. ఆమె కనులలో నొక యాశ్చర్యము కనుపించెను. ఆమె మిత్రగుప్తుని వంక చూచి "నీ వెవ్వరవు? ఇతనితో నెందుకు కలసి వచ్చితి" వనెను. టికటిక యామెను జూచి "నీవు నన్నెఱుగుదువా" యనఁగా ఆమె యిట్లనెను "నీ వేసమే చెప్పుచున్నది. ఆ దుష్టయోగి నిన్నొకనిని క్రొత్త వానిని దెచ్చెనా! మధుగుంజ తన సుకుమార భావములు గల పాటలతో నన్ను సేదదేర్చుచున్నదని తెల్లవారుజామున వాఁడామెను ప్రేప బెత్తముతో మోదెను. ఆమె గిలగిల లాడిపోయెను. ఆ రెండవ దుర్జనుఁడు రానిచో నామె చనిపోయి యుండును. అతఁడు వచ్చి దీనిని వారించెను. "ఓరి దుష్టుఁడా! మధుగుంజ ఎవరను కొంటివి? ఈ యురగదేశాధీశ్వరుని మంత్రి కూతురు. అతనితో నాకు చాల పని యున్నది. నిన్ను వేదవతిని తీసికొని రమ్మంటిని. తీసికొని వచ్చితివి. ఆమెను పూర్తిగాఁ జంపరాదు. ఆమె మరణించునో మరణించదో నాకు తెలియదు. ఆమెను చావు బ్రతుకుల మధ్య నుంచవలయును. అందుచేత నేను మధుగుంజను తెచ్చితిని. ఈ వేదవతితో నీ చావు నీవు

చావుము. ఇంక వేదవతి బ్రతికినను చచ్చినను నాకు నొక్క-టియే. నా పదకమంతయు పూర్తియైనది. నేను మధుగుంజను తీసికొని పోవుచున్నాను. ఆమె తండ్రి యీమెకు వివాహము చేయ నెంచుచున్నాఁడు. నేనింక నిచ్చటికి రాను. నాకు నీతో పని తీరిపోయినది. నిన్ని పదుమూఁడేండ్లు నేను రక్షించితిని. వేదవతీ రక్షణ కొఱకు నీవు నాకుఁ గావలసివచ్చితివి. ఓరి పిశాచభూతుఁడా! నీకొక నిర్దిష్ట కార్యములేదు. క్రూరత్వము నిష్ప్రయోజనమైనది. నాకు వేదమతముతో విరోధము. నేను బహుజన్మ లెత్తితిని. అన్ని జన్మలయందు వేదమతముతోడి విరోధము సాగించితిని. కాని యుగాంతము సాధింతును. నీకు దీనితో విరోధము. నీ జన్మలో నీకు లక్ష్యమేది? పిశాచముల యొక్క- సంగీతమును సంపాదించి ఫలితమన్నది లేకుండ జీవులను హింస పెట్టుట, బాధపెట్టుటయు ఈ మాత్రమే నీ జీవిత పర్యవసానము. నే నిదివర కెఱుఁగను. నీవు మధుగుంజ నీ రీతిగా పూర్వమెన్నిసార్లు కొట్టితివో తెలియదు. నేను నిన్ను నాశనము చేయఁగలను! కాని నాకునీతో నప్పుడప్పుడు పని తగులును"అని కటకటయోగి మధుగుంజను తీసికొనిపోయెను. కటకటయోగి యెప్పుడును తటాకముమీఁద నడచిరాఁడు. ఈ గుహాలలో నుండి యొక మార్గమున్నదని వారు చెప్పుదురు. నే నెఱుఁగను. తొలుత పదుమూఁడేండ్ల క్రింద వచ్చినపుడు నన్ను కటకటయోగి ఏ మార్గమున తెచ్చెనో నాకు తెలియదు. తర్వాత నీ రెండవ వాఁడు వచ్చెను.

మిత్ర:- ఈ రెండవ వాని పేరేమి?

వేద:-వీని పేరు నిమిషధారి. లిప్తవేషుండు. పరరూపి. విపాకలుండు. వీని కెన్ని పేర్లు కలవు. వాడు ఖండకాలము నందలి పరమ కనిష్ఠ ఖండస్వరూపుండు. వానిజీవితము చిత్రమైనది. అయ్యో! ఈ దుర్జనుం డిచటనుండఁగా నేను చెప్పదగినవి చెప్పుటకు వీలులేదు. ఇతఁ డెవఁడు?

మిత్ర:- అమ్మా! నీశరీరమును నీవు చూచికొమ్మా, మిక్కిలి పరిపుష్టమై యున్నదికదా?

వేద:- అవును.

మిత్ర:- అదివఱకెప్పుడైన నింతపరిపుష్టమైయున్నదా?

వేద:- లేదు.

మిత్ర:- ఇప్పుడు నీశరీరమింత పరిపుష్టమై యుండు టకు హేతు వితఁడే. నీవు చక్కని జాగ్రదవస్థలో నుండుటకు హేతువితఁడే.

వేద:- నాకర్థముకాలేదు.

అంతట టికటిక యాకడచినరాత్రి నిమేషధారి పాడిన పరమాసభ్యపుపాట పాడనారంభించెను. వేదవతి కృశింప నారంభించెను. పోనుపోను గిలగిల తన్నుకొనఁజొచ్చెను. ఆమె టికటికవంక కోపముతో చూడనారంభించెను. టికటిక ఆపాటనాపివేసి ఏకతారమీఁద కోవెలకూసినట్లు సన్నని సవ్వడి పుట్టించెను. వేదవతి గిలగిలలాడుట మానివేసెను. టికటిక కొన్ని ఘోరములైన ధ్వనులను, నక్కకూసినట్లు

భల్లూకము గురగురలాడినట్లు, వరాహము ఘుర్ఘురించినట్లు, వ్యాఘ్రము గర్జించినట్లు జంబుకము ఊళవేసినట్లు ఏకతార మీఁద ధ్వనిపుట్టించెను. వేదవతి శరీరము ఒక్కొక్క ధ్వని కొక్కొక్క మార్పు చెందుచుండెను. ఊళకు ఆమెశరీరము కుంచుకొని పోయెను. గురగురకు ఆమెశరీరము కళకళపడెను. ఘుర్ఘురమునకు ఆమె తనువు కటకటపడెను. గర్జకామె యుప ఘనము మంచముమీఁద జేనెడెత్తులేచి మఱల పడెను. టికటిక పకపకనవ్వెను. మిత్రగుప్తుఁడు టికటికవంక నాశ్చ ర్యముపొంది చూచుచుండెను. వేదవతి ఇతఁడు దుర్జనుఁడని నది నిజమేకాఁబోలును, వీఁడీ ఘోరము చేయుచుండనేమి? మిత్రగుప్తునకు టికటికను సంహరింపవలయు ననిపించెను. అంతట టికటిక తొలినాఁడు సవ్యసాచియు దాను కలసి తిరిగి నపుడు తానేపాటపాడఁగా మధుగుంజ బదులుపాడెనో ఆపాట నెత్తికొని పాడనారంభించెను. నడుముననున్న పట్టాకత్తి పిడి మీఁదను మిత్రగుప్తునిచేయి అట్లే నిలచిపోయెను. గుహాంత ర్భాగమున మాహేయీ స్వచ్ఛపయః కుల్యలు ప్రవహింప నారంభించెను. శుకపికమయూరాది నిస్వనములతో వసంతా రామములవలె నుండెను. కుందమల్లీ పారిజాత నాగమల్లీ కేతకీరసాలపుష్ప పరిమళము సమ్మిశ్రితమై గుహాయంతయు నిండెను. శుక్లపక్షదశమీ సితసిత జ్యోత్స్నా తరంగితక్షీర శిలాకాంతులు గుహాంతర్భాగమున నిండెను. పతిలాలస యైన నూత్న వధువుయొక్క మధురత్రపా మధురితాపాంగ మధువులతో నిండిన సన్నసన్నబోదెలు గుహాంతర్భాగమున వ్యాపించినట్లుండెను. వేదవతియొక్క శరీరము నిగనిగలాడ

నారంభించెను. ఆమె కార్శ్యముపశమిల్లెను. ఆమెముఖ సరోజాతమున శరద్వేళా ప్రాతఃకాల మృదుసంచర త్తరుణా తపములు విరజిమ్మినట్లుండెను. వెండిపళ్ళెమునిండ పాలుపోసి యారగించుటకు పిలచిన దివ్యసర్పము విస్తారిత ఫణావంతమై వచ్చుచున్న యొయ్యారమంతయు వేదవతీ తనూలతారా మణీయకమున భాసించెను. కాని వేదవతి కృశించియేయున్నది. ఆమె శరీరమునందు నైగనిగ్యము మాత్రము వచ్చెను. ఆమె నిస్సారత యుడిగెను. పదియవనాఁడు బారసాలనాఁడు తొలిబాలింతరాలు స్నానమాడి తెల్లని జరీచీరకట్టికొని పాలిపోయిన మొకమునందు క్రొత్తనెత్తురు పట్టుచుండఁగా బక్క-పలుచనిపిల్ల యెట్లుండునో వేదవతి యట్లుండెను. టికటిక పాట మానివేసెను. పగులఁబడి నవ్వనారంభించెను. మిత్రగుప్తుని చేయి పట్టాకత్తి పిడిమీఁదనుండి ఈవలకువచ్చెను. టికటిక పాట మానివేసెను. వేదవతి టికటిక వంక నివ్వెఱపోయి చూచుచుండెను. ఆమె యిట్లనెను "ఓయీ! నీ వెవ్వఁడవో నాకు తెలియదు. నీ స్ఫూర్తి నాకు తెలియుటలేదు. లిప్తస్వరూపుఁడును మధుగుంజయును కలిసిన స్వరూపము నీది. తత్పూర్వ మెప్పుడో యిచటికి లిప్తస్వరూపుఁడు తాను లేనపుడు నల్గురు దుష్టయవన స్త్రీలను తెచ్చెడువాఁడు. వారు నా ప్రాణములను తీసివేసెడివారు. ఆ మహాపదకు ప్రతిక్రియ లేక యుండెడిది. తొలుత కటకట యోగి వీని చేత నన్ను తెప్పించి వీని వలన నేను చనిపోదునని తలఁచి తర్వాత మధుగుంజను తీసికొని వచ్చెను. మరణావసానముననున్న మధుగుంజా సంగీతౌషధమును సేవింప చేయుచుండెను.

మధుగుంజా సంగీత శ్రవణానంతరమున సర్వదా నేనిప్పుడున్న స్థితిలో నుండును. నీవు దుష్టకీర్తనలు పాడినప్పటి స్థితి నాకు నిచ్చట నుండును. ఇంక నేను చనిపోదుననఁగా మధుగుంజ వచ్చెను. పదుమూఁడేండ్లు నా బ్రదుకిదే. ఆ లిప్తస్వరూపుఁడు నన్నిట్లు చేసెను. వాని యాయువు వాఁడు లిప్తల మీఁద నిర్మించుకొనును. నా బ్రతుకుకూడ నట్లుమార్చెను. వాఁడెప్పటి కప్పుడే మరణించుటకు సిద్ధముగా నున్నాడు. వాఁడు లిప్తలను ప్రోగుచేసికొని బ్రతుకుచున్నాఁడు. నా స్థితిని కూడ నట్లు చేసెను. నాకీ గుహలో కాలము తెలియదు. లిప్తలు, నిమేషములు, గడియలు జాములు పవళ్ళు రేలు పూర్వాపూర్వ కాల సమాహార భావనా జనిత పరాపర కాలఖండ నిర్మాణ భావనావశమై నాకు దినములును, పక్షములును, మాసములును, అయనములును వత్సరములును భాసించుచున్నవి. ఈ సర్వ పరిజ్ఞానము నా యందు భాసించుచున్నది. సూర్యకిరణము లీగుహాయందు ప్రవేశించవు. కాని నాకు వాని సర్వప్రసారము మనసునకు కట్టినట్లున్నది. ఓయీ! యీ కథ చాల యున్నది. దాని నట్లుంచుము. సుమారు మూఁడు నెలల క్రింద నేనొక నాఁడు మేల్కొంటిని. తత్పూర్వము ప్రాణావసానదశయందుంటిని. గుహలోని దానను గుహలోననే నశించిపోదునని వాఁడు నన్నిచ్చట వదలిపోయినాడు. ఆ నాఁడు మధుగుంజ వచ్చినది. ఆమె పాటను నన్ను విననీయలేదు. వాఁడు మధుగుంజను తరిమివేసెను. నాయొడలు నాకు తెలియలేదు. అట్లు జరిగెనని నాకు స్ఫురణగానున్నది. తర్వాత నాకు మెలకువవచ్చినది. తర్వాత

చూచితినింగదా మీారిద్దఱు గుహాలోనికి వచ్చినపుడు నెంత పుష్టిగానుంటినో అంతపుష్టిగా నుంటిని. కారణము నాకు తెలియదు. ఒకదినమెల్ల నట్లుంటిని. ఆనాఁడు నేను గుహ వెలికి వెళ్ళితిని. తటాకమును చూచితిని. ఈగుహాలోనుండి మఱియొక గుహాలోనికి త్రోవయున్నది ఆత్రోవ చూచితిని. ఇట్లుగుహాలు వరుసగానున్నవి. ఎన్నియున్నవో తెలియదు. ఆనాఁడు నేను నాల్గవ గుహాలోనుండఁగా అనిమేషధారివచ్చి నన్నుపట్టుకొనెను. అచటనే తన దుష్టపుపాటలతో నన్ను నిశ్చైతన్యను చేసెను. బుజానవేసికొని ఆగుహాద్వారముల యందుత్రాకి నన్నిచటికి తెచ్చెనుకాబోలు. నన్నట్లు వాఁడు చావుబ్రతుకులమధ్య నుంచుచున్నాఁడు. ఎందుకో నాకు తెలియదు.

మిత్ర :- అమ్మా! నీ వామూఁడు నెలలక్రిందకాని మేము రాకముందుగాని తాదృశమైన పుష్టిగల శరీరమును ధరించుట కితఁడే హేతువు ఆనాఁడతఁడిచ్చటికి వచ్చెను. ఇచట కొన్ని శ్లోకములు పాడెను. అది సంస్కృతభాష. కొన్నికీర్త నలు పాడెను. ఆ భాషయు సంస్కృతమే నీకాపుష్టివచ్చెను. నీవు కనులుతెరచి మమ్ముచూడకముందు ముంగిటలో పాడెను. నీకాపుష్టివచ్చెను. నీశరీరము నాదమయము. నీభావన కాలమయము. మఱల టికటిక ఏకతారనుబూని శర్యాతి తల్లి నేర్పిన శ్లోకములు పాడనారంభించెను. ఆకీర్త నలు పాడనారంభించెను. పూర్వము రెండుసార్లు వేదవతి స్వాప దశలోనున్నపు డివిపాడెను,ఇప్పుడామె జాగ్రద్దశలోనుండఁగా పాడుచుండెను. ఓహో! వేదవతీ శరీరము విచిత్రముగా మారు

చుండెను. గ్రీష్మర్తువున శుష్కించిపోయిన మహానది కొండ లలో మహా వర్షములు కురిసి ఉపనదులు శాఖా నదులలో నుండి జలము పోసికొని కెరళ్ళు కెరళ్ళుగా తరగలు తర గలుగా బుడగలు బుడగలుగా గోధుమపసి త్రాచులు ప్రాకి నట్లు కుటుంబములు నడచినట్లు గరుడి పిల్లలెగిరినట్లు మహా భుజంగములు ఫూత్కారములు చేసినట్లు రసాలమహావృక్ష మును రెమ్మ రెమ్మను చిక్కగా వెదికి వచ్చినట్లు స్నిగ్ధమగు నుగడెను. పొంగుచుండెను. ఆ పొంగులో నేదో పరమ సుకు మారమైనధ్వని ఆవిర్భవించు చున్నట్లుండెను. టికటిక దృశా ద్రాఘీయస్యా తన సంగీతము నాపివేసెను. అప్పుడా గుహాలో నున్న ముగ్గురి ముఖములందు ముగ్గురు రాకా చంద్రు లుదయించిరి. అందులో శరచ్చంద్రులు. అంతలో టికటిక వేదవతీ పాదద్వయమునందు ఏకతారనుంచి 'అమ్మా! నీకు విరోధిని కాను. నీకు సేవకుడను. నా యీ సేవకత్వము నా బుద్ధి పూర్వకమైనది కాదు. ఎవడో సన్న్యాసి నన్నిట్లు మలచినాడు. ఆయనను నేనెఱుగను. కాని నా జన్మ నీతో సాఫల్యమైనది. మాది రామఠదేశము. మా ముత్తాతలు సుక్షత్రియులు. మేము యవనులమైనాము. నా తండ్రులును అన్నలు యవనులే కాని క్షత్రియాభిమానము నశింపనివారు నేనాయవనుడను కూడ కానేమో! నేనుపుట్టుచునేగాయకుడను. నా సంగీతము విలక్షణమైనది. సర్వ జగత్తు నాదమయము. నా కెన్నో విషయములు లీలగా తెలియును. స్వప్నములలో కన్పించుచు నన్ను శిష్యునిగా స్వీకరించిన యా మహాగాయ కుడైన సన్న్యాసి దయా విశేషమున నాకు లీలగా భాసిం

చిన వన్నియు విస్పష్టముగా భాసించుచున్నవి. ప్రథమమున ఓంకారా విర్భావము జరిగినది. ఆ యోంకారమే పరమేశ్వర స్వరూపము. సృష్టి కొంత జడము కొంతసచైతన్యము. సచైతన్యము శబ్దము యొక్క వికారము. నే నడవిలో తిరుగుచుండగా నొక నాఁడు మహావ్యాఘ్ర మొకఁడు ప్రళయ గర్జన చేసెను. ఆ ప్రక్కన కొండమీఁద నున్న ఊలు జాతి క్రిందపడెను. ఒకనాఁడు మా యూరిలో నొక సంగతి జరిగెను. ఒక యెలుఁగుబంటి ప్రళయమైన గురగుర గొంతులో చేయఁగా నొక పసిపిల్ల చనిపోయెను. పాటలు పాడఁగా పిల్లలేడ్పులు మానుచుండిరి. ఇట్టి శతములైన యనుభవముచేత నాకు సృష్టి నాదమయమని తెలిసినది. ఒకనాఁడు మా యూరిపెడనున్న పర్వతము పటీలుమని పగిలెను. ఆనాఁడు మాయూరిలో నలుగురు బధిరులైరి. ఇంద్రియములను నాదము సృజించుచున్నది. ప్రమాణానురూపమై పోషించుచున్నది. అతిప్రమాణమై నశింపఁజేయుచున్నది. మానవులు పరమానందదాయి నాదదూరులై నశించుచున్నారు. భ్రష్టమైన లోకమున నాదముయొక్క సర్వసంపూర్ణ స్వరూపము భాసించుటలేదు. అట్టి ఏకైకమూర్తి నాకు కన్పించునాయని బహు పట్టణ పల్లీ గ్రామటికాపర్యటనముచేసితిని. స్వప్నాగత గురుదయా విశేషమున నీవు కన్పించితివి. నాపితరులు తరించిరి. నాజన్మ సార్థకమయ్యెను. తల్లీ! నీస్వరూప మింతటితో పర్యవసితముకాలేదు. పైనేదోయున్నది. అది నాకవగతముకాలేదు. మద్గురు కృపావిశేష మింతటితో పర్యవసించుచున్నట్లున్నది.

(30)

# పదునాల్గవ యధ్యాయము

వేదవతి యిట్లనెను. "ఇంక మధుగుంజ రాదు. కటకటయోగి రాకపోవచ్చును. ఈ లిప్తాకృతి వచ్చును. వాని బాధ యున్నది. వాని బాధ నాకే కాదు. మీకుఁగూడఁ గలదు. కటకటయోగి రాకపోవుటలోఁ జాల లాభమున్నది. వాఁడును వీఁడును గలసినచో మన కార్యము దుర్ఘటమై యుండెడిది. మన విరోధు లిద్దఱు చీలిపోవుట వలన సులభసాధ్యు లగుచున్నారు. కటకటయోగి చండప్రచండుఁడు. వానిని నిత్యజీవి యనవచ్చును. వానినిఁ గూర్చి మీరు విన్నారో లేదో తెలియదు. వాని వయస్సు మూఁడువేల యేండ్లందురు. ఈ మూఁడువేల యేండ్లలో వాఁడు చాల జన్మలెత్తెను. వాఁడింకను మూఁడువేల యేండ్లు జీవించును. జీవించు ననఁగా నీ శరీరము తోడనే జీవింపఁడు. జీవలక్షణము చమత్కారముగా నుండును. ఒక జీవుఁడు మాయాసహితుఁడై లౌకికసుఖభ్రాంతిచేత జన్మించును. సుఖదుఃఖము లనుభవించును. కొన్ని కర్మలు చేయును. మరణించును. ఒక ప్రారబ్ధముచేత నాఱు జన్మలు మడియును. ఈ యాఱు జన్మలు తత్ప్రారబ్ధము యొక్క యేకనిస్సరణము. ఈ యాఱు జన్మలలోని కర్మయు సంపుటీకృతమై సంచితమునఁ జేరును. మఱల నింకొక ప్రారబ్ధము ననుసరించి మఱియాఱు జన్మలెత్తును. ఇది జీవుని యొక్క ప్రవాహ లక్షణము. ఇట్లుండఁగా కటకటయోగి వంటి జీవులు విశిష్టముగా నుదయింతురు. వా రధికశక్తిమంతులు. అతఁడు మూఁడు వేల యేండ్ల నుండి ప్రారబ్ధమైన జీవలక్షణము చెడకుండ కర్మ

సంతానము చేరుచున్నను తొలిపోడిమిని పరిత్యజించకుండ మూడు వేల యేండ్ల క్రిందటి తన జన్మహేతువును మఱచి పోకుండ రక్షించుకొనుచు నతఁడు జన్మలెత్తు చున్నాఁడు. వాని యందలి విశేషమేమనఁగా వాఁడీ మూఁడు వేల యేండ్లలో పదిపదేను విలక్షణమైన జన్మలెత్తి యా యా జన్మల యందలి సర్వ సంస్కారములు, విద్యలు తన వెంటఁ దెచ్చి కొను చున్నాఁడు. వానికి నాతో విరోధములేదు. ఎవరి తోడనో యున్నది. నాకుఁ దెలిసినంతవఱకు వాఁడొకటి చేసి యుండును. మధుగుంజ మఱల నిచటికి రాదు. ఈ గుహామార్గము వాఁడు బంధించి యుండును. ఈ గుహా మార్గము మూఁతవడియుండి యుండవలయును. అనఁగా టికటిక తానా మార్గము మున్నెఱుఁగును. కనుక యా గుహా ద్వారమును పోయి పరిశీలించెను. అచట గుహాద్వారములేదు. మిత్రగుప్తునితోఁ జెప్పెను. ఇద్దఱును బరిశీలించిరి. టికటిక యిట్లనెను. 'అమ్మా! ఈ పని యతని కెట్లు సాధ్యమైనది?'

వేదవతి:- ఆ గుహాల నేర్పాటు చేసిన దతఁడే. తత్తత్పూర్వజన్మల యందతఁ డీగుహాలను నిర్మించెను. ఎందుకు నిర్మించెనో తెలియదు. ఈ గుహాలో దివారాత్రము లీ వెలుఁగుండును. ఈ వెలుఁగెట్లు వచ్చినదో తెలియదు. ఇట్టి వెలుఁగే యీ సర్వగుహాల యందుండును. ఇప్పుడు గుహాలే లేవు. అందుచేత వెలుఁగునులేదు. ఈ గుహాలోని యీ వెలుఁగు లోషధీసమృద్ధి చేతసమాత్తములై యుండవచ్చును. ఆ యోషధులెచ్చట నిక్షేపించెనో తెలియదు. అతనికి నిమేషధారి మీఁదఁ గోపము వచ్చినచో నీ వెలుఁగు

కూడ లేకుండఁ జేసెడివాఁడు. అతనికి సమేమధారిలో నింకనేదియో పనియుండవలయును. వానికెవరిమీఁదనో విరోధమని చెప్పితినిగదా! నన్నిచట బంధించుటచేత నావిరోధము వాఁడు సాధింపనెంచుచున్నాఁడు. నాతండ్రి వరాహమిహిరాచార్యుఁడు. మీకుఁ దెలియునుగదా! ఈసర్వసృష్టియు జరిగిననాఁటినుండి కాలము గడచుచున్నది. కాలముయొక్క స్వరూపము చిత్రమైనది. పౌలిశుఁడు, రోమకుఁడు, వశిష్ఠుఁడు, సూర్యుఁడు, బ్రహ్మ-వీరైదుగురు కాలస్వరూపమును భిన్నభిన్న కాలములయందు వివరించి చెప్పినారు. ఆకాలము సూర్యమండలాధీనమై యున్నది. సూర్యగమనముచేత, తదితర గ్రహసంచారముచేత ఖండకాల మేర్పడుచున్నది. ఈకాలమునకు బ్రహ్మయు, ప్రజాపతియు, పితృదేవతలును, దేవతలును నాల్గువిధములుగా కొలిచిరి. ఇవి నాల్గుమానములు. తరువాత తరువాత గణితశాస్త్రజ్ఞులైదు మానములు కనుగొనిరి. వానికి సౌరము, సావరము, చాంద్రము, బార్హస్పత్యము, నాక్షత్రికమని పేరులు. వీనియన్నింటిని నాతండ్రి యెఱుఁగును. అతఁడు గ్రహోపాసకుఁడు, సూర్యోపాసకుఁడు. ఆయన తపశ్శక్తివలన నేనుదయించినాను. ఈ తొమ్మిదిమానములును, తొలుత చెప్పిన యయిదు సిద్ధాంతములును క్రొత్తవేవియుకావు. అన్నియును వేదమునందే కలవు. నేను నాతండ్రియొక్క యీసర్వ విజ్ఞానమునకుఁ బ్రతీకగా జన్మించితిని గావున, నివియన్నియు వేదమునుండి పుట్టినవికావున, వేదమునకు నీసిద్ధాంతములకు మానములకు నభేదప్రతిపత్తి కావున నాకు

నాతండ్రి వేదవతియని పేరుపెట్టెను. ఈ సర్వజ్ఞానమునకు కటకటయోగి విరోధి ఈజ్ఞానమును నశింపఁ జేయవలయునని వానిదీక్ష. లోకమునందు దీనికిఁ బ్రచారము రారాదని వాని సంకల్పము. అందుచేత వాఁడు నన్ను దెచ్చి యిచట బంధించెను. నాతండ్రి నాయీ చెఱవలన విశ్లథమనస్కుఁడై తాను చేయఁదలఁచిన మహాకార్యమును జేయలేకుండెను. ఇది చిత్రముకదా! ఒకక్రియయున్నది. అదియొక జ్ఞాన ప్రస్ఫూర్తమై జరుగును. అజ్ఞానములేకుండ నీక్రియ జరుగదు. జ్ఞానము జ్ఞానముగానే యుండును. అజ్ఞానమువలన నీక్రియ జరుగును. ఈక్రియజరుగక పోయినను నాజ్ఞానమున్నది. అజ్ఞానమీక్రియగా పర్యవసించుటకు నడుమ నొకశక్తి కావలయును. ఆశక్తి దేనిమీఁదనో యాధార పడియుండును. ఏదీ 'దృశా ద్రాఘీయస్యా' యన్న శ్లోకమును పాడుము. టికటిక తన యేకతారనుబూని యాశ్లోకమును బాడెను. మఱల వేదవతి యిట్లనెను.. 'ఆమె యున్నదే, అపరమేశ్వరి, అలలిత అదుర్గ ఆమెయొక్క కటాక్షముచేతకాని జ్ఞానము క్రియాపర్యవసాయికాదు. కటకట యోగి కీరహస్యము తెలియును. వాఁడు మహిషాసురుఁడు. వాఁడు దేవీ విరోధి. మనముపోవుటకు మిగిలినది యీతటాకములోని స్రోవయే. నాకుఁదెలిసినంతవఱకు కటకటయోగి యీగుహామార్గము నెట్లుమూసెనో తటాకమార్గము నట్లు మూసియుండును. తటాకములో నీటి యడుగునుండి యొక కొండలేచి శిలామార్గముగా నేర్పడియుండెను. కటకటయోగి యాపర్వత శిలామార్గమును ధ్వంసము చేసియుండును.''. వేదవతి యిట్లనినంతనే మిత్ర

గుప్తుఁడు గుహాముఖమునకు పగువెత్తి పోయెను. టికటిక వాని ననుసరించెను. గుహాముఖము నందలి యా శిలా మార్గము యొక్క చివరిరాళ్ళు వారికిఁ బరిచితములే. అవి కనిపించలేదు. జాగ్రత్తగా పరిశీలించి నప్పుడు శిలామార్గము కనిపించును. సుంతదవ్వున చీలమండలలోఁతు నీళ్ళలోఁ దాము వచ్చునప్పుడు శిలామార్గమును జూచిరిగదా! ఇప్పుడు దాని పొడలేదు. తటాకమునందలి జలము యొక్క మట్టము కొంచెము తగ్గినట్లనిపించెను. ఎదో పర్వతము నీటి యడుగున నుండి పైకి పొడుచుకొని వచ్చెను. జల మువికెను. ఇప్పుడా పర్వతములేదు. నీటిమట్టము తగ్గినది. తగ్గిన నీటిమట్టము గుహాముఖధాత్రి యందు విస్పష్టముగా కనిపించుచుండెను. బెత్తెడు మేర నీరు వెనుకకు లాగెను. ఒడ్డున నా బెత్తెడు మేరయు బురదగానుండెను. ఆ బెత్తపైన చారగట్టెను. ఏఱుపొడిచి మఱల వెనుకకు లాగినపుడు కట్టిన చార యిచట కనిపించు చున్నది. మిత్రగుప్తుఁడు నిస్సారపడిపోయి కూలఁబడెను. టికటిక వాని చేతిఁబూని లోనికిఁ దీసికొనిపోయెను. వేదవతి యిట్లనెను. "మనము ముచ్వర మిచట బంధింపఁబడితిమి. త్రావుటకుఁ బానీయములు కలవు. కాని తినుటకన్నము లేదు. నాకు నీ గాయకునకు నిద్రాహారము లక్కఱలేదు. అతఁడు పాడుచుండును. నేను వినుచుందును. మేమిద్దఱము జీవించియే యుందుము. అన్నము లేక బ్రదుకలేని వాఁడవు నీ వొక్కఁడవే! అది యట్లుంచి మనమిచటి నుండి కదల లేము. చెఱువున కాతలి యొడ్డున కాంతార మున్నది. శుష్క కాష్ఠములు తెచ్చి తెప్పయైన కట్టవచ్చును. ఇచట నా యవ

కాశమే లేదు. కాష్ఠము దొరకదు. తిండిదొరకదు. జలములో నీదుటకు వీలు లేదు. ఈ గుహాముఖము ప్రక్కగా కొండ యెక్కుటకును వీలులేదు. మనస్థితి యిట్లున్నది .ఇందులో నీ నష్టముండగా నొక లాభము కూడ నున్నదేమో! నిమేష ధారి యిచటికి రాలేఁడేమో! కాని వాని వద్ద కొన్ని శక్తులు కలవు. వాఁడీడకొని రావచ్చును. వానిని మకరములు తాక లేవు. ఇందాక చెప్పితిని వాని యాయు ర్లక్షణము. వాఁడు తత్పరలు, విపరలు, పరలు, విలిప్తలు, లిప్తలు, భాగలు, ఘటికలు ప్రోగుచేసికొనును. తన యాయుర్దాయమును పెంచి కొనును. ఏ దినమున కా దినము వాఁడు తన యాయువును పెంచి కొనును. ఆ దినమైన తరువాత మఱల పెంచికొన వలయును. వాని వద్ద నొక యోగము కలదు. వాఁడు ప్రతి దినము తన గుహ యొద్దకుఁ బోవలయును. ఆ గుహ యొక కొండలో నున్నది. ప్రాతఃకాలమున పర్వతోపరిభాగము నకుఁ బోవును. తత్పరాది యామాంతము దినమును సంగ్ర హించుకొనును. రాత్రికూడ నా దినములో నిమిడియుండును. ఎప్పుడో నూటికిఁ గోటి కొకసారి రెండు దినములను సంగ్ర హింపఁగలఁడు. నాకీ సంగతి యంతయు వాఁడును కటకట యోగియును పోరాడు కొన్నప్పుడు తెలిసినది. నా యెదుట వారిద్దఱు పలుసార్లు వాగ్వాదము చేసికొనిరి. దాని వలన నా కనేక విషయములు తెలిసినవి. కొన్ని యేండ్ల క్రింద నాకు యౌవనము వచ్చినది. నిమేషధారి నా యౌవన మప హరింప నెంచెను. కటకటయోగి చెప్పెను. ఆమెను తాకి తివా నశించిపోయెదవని. నేనొక నాఁడు నాల్గు గుహలుదాటి

పోయితినని చెప్పితిని గదా! అప్పుడు వాఁడు నన్ను బుజానవేసికొని వచ్చెను. నేనప్పుడామెనుతాకితిని, నేనునశించి పోలేదని వీఁడు వాదించెను. ఓరీ! ఆతాకుటవేఱు, ఈతాకుట వేఱని కటకటయోగి మందలించెను. కటకటయోగి వాని జీవితరహస్యమును నాకుపదేశించెను. ఈనిమేషధారి పట్టు మని యిచ్చట రెండుదినములుండఁడు. ఇచటనే కాదెచ్చటను ఉండలేఁడు. రెండు దినములకుమించి వాని యాయుర్దాయ ముండదు. వాఁడుపోయి మఱల దినమును ప్రోగుచేసికొనవల యును. ఒకవేళ వాఁడు మరల నిచ్చటికి వచ్చినచో వానిని కొన్నాళ్ళు నిలిపితిమేని వాఁడు నిస్సంశయముగా మరణిం చును. ఇచట సూర్యకిరణములు లేవు. వాఁడు ప్రోవుచేసి కొనలేఁడు. కాని వాఁడు మిమ్ముద్దఱను సంహరింపఁగలఁడు. నన్నును సంహరింపఁగలఁడు. వానిని మన మెలయించి కొన్నాళ్ళు దాటించినచో వాఁడు చావవచ్చును. అదియెట్లు జరుగునో నాకుఁదెలియదు. నేను భోజనముచేసి పదు మూఁడేండ్లయినది. ఈమిత్రగుప్తుని యాయుర్దాయమును గూర్చియే నాకు భయముగానున్నది. ఇతని నేమిచేయవల యును? ఓయి గాయకుఁడా! వీనినెందుకు తెచ్చితివి?

టికటిక :- అమ్మా! ఇతఁడు లేనిచో నాకు నీప్రస క్తియేలేదోమో! ఇతఁడు చక్రవర్తియొక్క గూఢచారి నీయునికి తెలియక నీతండ్రియుఁ జక్రవర్తియు నాందోళన మందుచున్నారు. నీయునికిని దెలిసికొనుటకుఁ బదిహేంది గూఢచారులు నియమింపఁబడిరి. వారిలో నితఁడొకఁడు.

తల్లీ! నీపాండిత్యము, నీవివేకము, నీవుచెప్పిన నీస్వరూపము, నీవాక దేవతవు. ఈమిత్రగుప్తునిఁగూడ నెట్లో బ్రతికింపుము.

వేదవతి నవ్వెను. తానందుకు సమర్థురాలను గాననెను. ఆనాఁటికి నిమేషధారిరాఁడు. వచ్చినచో మఱునాఁడు రావచ్చును. ఈలోపుగా గుహవెలికిఁబోయి యేమార్గమైన దొరకునేమో విచారింపవచ్చుననుకొని- వెదుకనారంభించిరి. తటాకమును తరించుట సులభముకాదు. దానివెడల్పు యోజనములో సగమున్నది. గుహాముఖమునం దిరుపైపులనున్న రాళ్ళు గోడపెట్టినట్లు చెఱువులోనికిఁ జొచ్చుకొనిపోయినవి. చెఱువులో దిగకుండ నాశిలలకు వెనుకప్రక్క చేరుట సాధ్యముకాదు. చెఱువులో దిగుట సురక్షితముకాదు. ఒక్కటియే మార్గము సాహసించి దిగవలయును. ఆతలివైపున కొండ యెక్కవలయును. ఆయుర్దాయమున్నచో నదిసాధ్యము కావచ్చును. మిత్రగుప్తుఁ డొక్కఁడే యీపని చేయవలయును. అతఁడు చెఱువులోదిగి తటము వెంట నీదికొనుచుఁబోయి గుహాముఖముఖ శిలాఫలకమునకు వెనుకకు మఱలినంతనే వానిజాడ వీరికిఁ దెలియదు. వాఁడేమయ్యెనో వీరెఱుఁగలేరు. మఱల వచ్చినచో బ్రదికినట్లు; లేనిచోఁజచ్చినట్లు. మిత్రగుప్తుఁ డిట్లనెను. 'మేము వచ్చినప్పుడు గుహాముఖమును దృష్టిలోఁబెట్టికొని వచ్చితిమికాని పరిసరపర్వత ప్రదేశము, పర్వతోపరిభాగము విచారింపలేదు. నాగూఢచారిత్వ మిట్లున్నది. చుట్టుపట్లనున్న ప్రదేశాభిజ్ఞ లేకుండ నొకప్రదేశమును.జొచ్చినగూఢచారి, వాఁడాపనికి ననర్హుఁడు. నేను నశించిపోయినచో నశించిపోదును. మీరిద్దఱెందుం

డుఁడు. ఆ నిమేషధారి వచ్చినచో వానిని రెండు దినములు మోసము చేయుడు. వాఁడు మరణించును. సవ్యసాచి సాయము తీసికొని రాఁగలఁడు. అతనివెంట సేనవచ్చును. పదిమంది సైనికులు వత్తురు. వారు తెప్పను నిర్మింతురు. మొసళ్ళను సంహరింతురు. మిమ్ము తీసికొనిపోదురు. నేను మరల తిరిగివచ్చినచో నిమేషధారివలన మీకే యపాయము లేకుండఁ జేయఁగలుగుదును. వాఁడు తటాకము నందీదుచు వచ్చి నేలనంటుకొన్న నిముసమునందే నేను పట్టాకత్తితో వానిని రెండుగా ఖండింపఁగలను. అనఁగా వేదవతి యిట్లనెను, 'వాని మరణమట్లు సంభవింపదు. వాఁడుసంగ్రహించినదినమో దినార్ధమో రెండుదినములోఁ బూర్తియయిన తరువాత మరల తత్పరాది లిప్తలు, ఘటికలు సంగ్రహింపకుండ వానిని నివారించుటయే వాని మరణమునకు హేతువగునుగాని కత్తి వానిని ఖండింపలేదు. మిత్రగుప్తుఁడు చెఱువులోనికి నెమ్మదిగా దిగెను. అచట మొసళ్ళ పొలకువలేదు. గుహాముఖపార్శ్వ ఫలకముయొక్క చుట్టుతిరిగి వెడలిపోయెను. వీరికిఁ గనిపించ లేదు. వారిద్దఱు నచటనేయుండిరి. కొంతసేపటికి గుహాలోనికిఁ బోయిరి. వేదవతి యొకసమాధిలో నుండెను. టికటిక యొక చోటఁ గూర్చుండెను. కాలము గడచుచున్నదా ? కాలము నిలిచిపోయినదా ? కాలమనునది యొకటియున్నదా ? అచట సూర్యకిరణములులేవు. సూర్యకిరణ ప్రసార వశమున కలుగు కాంతిభేదములులేవు. ఒక కృత్రిమమైన వెలుఁగులో నిద్దఱు నున్నారు. వేదవతి కది యలవాటే. ఆమెకనులు మూసికొని తత్పరలు, విపరలు, లిలిప్తలు, లిప్తలు, భాగలు, విఘటికలు,

ఘటికలు, యామములుగా లెక్క చూచుకొనుచుండెను. ప్రొద్దుగ్రుంకెను, తెల్లవారెను. పగలు జాముప్రొద్దెక్కెను. టికటిక యెదురుగాఁ గూర్చుండియుండెను. ఆమె యతనితో నిట్లనెను. 'నిమేషధారి వచ్చుచున్నాఁడు. అతఁడొకదినమును ప్రోగుచేసికొన్నాఁడు. అనఁగా నీపగలు, నేతదనుసంధిరాత్రి వాఁడు బ్రదికియుండును. రేపీపాటివఱకు వాని నిచట నుంచఁ గలిగితినా వాఁడీగుహలోననే మరణించును. వాని యాయువు నిచటఁ జెల్లించుటయెట్లు?' టికటిక మాటాడలేదు. మఱల వేదవతి యిట్లనెను. 'వాని జీవితము రెండు పదార్థముల సమ్మిశ్రణము. పాపపు సంగీతములో వాఁడు నిష్ణాతుఁడు. దుర్భావనా ప్రపంచమున వాఁడు నదీష్ణువు. కృత్రిమ స్వర సృష్టియందు వాఁడు ప్రవీణుఁడు. తత్పర విపరాధీనమైన దినాంతకాలము వాని వశమునందున్నది. దినము దాటినచో వాని కధికారము లేదు. వాఁడు సంగ్రహించెడి దినము తత్పరాదుల వివిచ్యమానమైన రూపము. లోకము నందలి జనులు సంగ్రహించెడి దినము తత్పరాది నిర్మితమైనను స్ఫూర్తి చేత దినాకారకము. అందుచేత లోకమున మానవులు దినములుగా పక్షములుగా మాసములుగా నయనములుగా బ్రదుకుదురు. వీఁడు తత్పరలుగా విపరలుగా బ్రదుకును. ఇది వాని దోషముకాదు. వాని స్వభావగత దోషము. కాలముయొక్క యనంతత్వమును భావించెడి వాఁడొకఁడు. కాలముయొక్క యేకదేశత్వము భావించెడి వాఁడొకఁడు. ఏకదేశత్వ భావనాజీవుల లక్షణమే యిది.

వాఁడు ఘటికాజీవులు. విపరజీవులు. తత్పరజీవులు. మానవుని కాలభావనా విశేషము చేత వారి స్థితి కాలములో నుందురు. ఆ కాలము నందలి తత్పరాదు లను స్వ్యాతములై యుండును. ఏకదేశ భావనాజీవుల బ్రదుకును వారి స్థితియు తత్పరల కధీనమై యుండును. వాఁడు క్రూరుఁడైన కాలాది యనంతకాల భావనా సంస్కార లేశవిరహితుఁడైన కొలఁది పరమేశ్వరుఁడు వాని బ్రదుకును తత్పరాధీనము చేయును. విపరాధీనము చేయును, లిప్తల చేతలెక్క పెట్టు చుండును. అనంతకాల భావనచేసినవారి కివీఁడు వశుఁడై యుండును. వాని ప్రాణములు నా చేతిలో నున్నవి. నేను నిన్నటి నుండి సూర్యమండలోపాసన చేయుచున్నాను. అనంతకాలమును భావించుచున్నాను. ఇతరులు చేయ వచ్చును. వారికి విపరలు, తత్పరలు స్వాధీనములో నుండవు. నేను విపరలను, తత్పరలను, లిప్తలను, విలిప్తలను, పదుమూఁడేండ్లు భావించితిని. అవి నా వశమునందున్నవి. ఇపుడు సూర్యమండలము యొక్క సంపూర్ణ భావన చేత సూక్ష్మ సూక్ష్మాంశములలోఁ గూడిన మహాకాలము నాకధీనమైనది. రేపీవేళదాక వాఁడు బ్రదుకఁడు,.కాని యీ పరిశిష్ట దివాభాగము, యామినీ భాగము వాని వశము నందున్నది. ఇచట నీవు వానిని ప్రతారించవలయును. వాని జీవితము రెండుపదార్థముల మిశ్రణమని చెప్పితినిగదా! ఈతత్పరాది కాలమొక భాగము. రెండవభాగము సృష్టిలోనున్న దుర్భావనా జనిత దుర్ధ్వనుల సమ్మేళనము. వాఁడు వానినిఁ గూడ నుపాసించినాఁడు. అందుకనియే వానియేవగింపు కలి

గించెడి సంగీతమునందొక యాకర్షణ శక్తికలదు. ఆయాకర్షణ శక్తి నామీఁదఁ బనిచేయుటమానివేసి యే వాఁడిచ్చటికి నన్ను తేఁగలిగినాడు. వాని యా సంగీతము నందలి యాయాకర్షణ నా మీఁద బనిచేయుటమానివేసి యేండ్లయినది. అది నిన్నాకర్షించునా?

టికటిక :- నన్నాకర్షింపదు. నేను కడచిన రెండు రాత్రులు చెట్టుమీఁదనుండి వానిసంగీతము వింటిని. మిత్రగుప్తుఁ డాకర్షింపఁబడినాఁడు. నేనాకర్షింపఁబడలేదు.

వేదవతి :- అయినచో మార్గము సులభమైన దన్నమాట. వాఁడు వచ్చును. నిన్నుఁజూచును. నివ్వెఱపోవును. నిన్ను పరిగణింపఁడు. తన దుష్టసంగీతము నా మీఁదఁ బ్రయోగించును. వాని సంగీతమునకు మధుగుంజా సంగీతము విఱుగుడు. వాఁడాపాటలు పాడినంతసేపు నీవీ పాటలు పాడుచుండుము. వాఁడు శక్తి విరహితుఁడగును. వాఁడు నిన్ను వధింపవచ్చును. నీవు లక్ష్మీనృసింహ మమ దేహికరావలంబాది స్తోత్రమును పాడుచుండుము. వాఁడు నిన్నేమియుఁ జేయలేఁడు. పరిశిష్టములైన యీ దివాయామ త్రయమును శర్వరీయామచతుష్టయమునిట్లే గడుపవలయును. రేపు తెల్లవారుకడ వాఁడు తప్పించుకొని పోఁబోవును. అప్పుడు సౌందర్యలహరీ స్తోత్రమును పాడుము. పరమేశ్వరి నీయందే నివాసమేర్పఱచుకొనును. పరమేశ్వరి స్వరూపము నుపసంహరించునట్లు నీవు సంగీతమును పాడుము. ఆలాపన ములోఁ జివళ్ళు వెనుకకు లాగుము. స్వరములను వివృద్ధపఱచి

యాలపింపకుము. గానము నెచటికచట త్రుంచివేయుము. పరమేశ్వరీశక్తి వానియందెప్పటికప్పటికి విఘటిత మగును. వాఁడు కదలలేఁడు. తటాకమున దూకలేఁడు. ఈదలేఁడు. కాని యిదియంతయు నీచేతిలోనున్నది. వానిని తటాకమున దూకనిమ్మ. ఈదనీయకుము. వాఁడు మొసళ్ళకు భోజన మగుఁగాక!

## పదునైదవ యధ్యాయము

ఉత్తర బాహ్లీకములకు రూమ్యకములనియు పేరు. రాజు పేరు రూమ్యకుఁడు. అందుచేత నా దేశమునకు రూమ్యక దేశమని పేరు వచ్చెను. రాజునుబట్టి ఆ పేరు వచ్చెననఁగా నా రాజంత ప్రసిద్ధుఁడు కావలయును. అతఁడు మహా పరాక్రమవంతుఁడు. ఎంత పరాక్రమవంతుడో అంత కుటిలనీతి. అతఁడు తన దేశమును వదలిపెట్టఁడు. అతని గూఢచారు లీదేశమున నున్నారు, ఈ దేశమున లేరనిలేదు. సర్వదేశములయందు కొన్ని వందల యేండ్లుగా యవనులు నివాస మున్నారు. వారు తత్తద్దేశాచారము లవలంబించి తద్దేశీయులుగానే పరిగణింపఁ బడుచుందురు. కాని యవన జాతి యందొక లక్షణమున్నది. వారు వందల యేండ్లొక పరదేశమందు నివాసముండినను మేము యవనుల మను కొంచునే యుందురు. సర్వప్రపంచము యావనము చేయవలె నని వారి యూహ. సృష్టిలో నొక భారతీయులను వదలిపెట్టి నచో నిట్టి భావము లేనిజాతి యుండదు. వేదమతమును

వదలిపెట్టినచో నిట్టి భావములేని మతముండదు. వేదమతము నకు జీవుఁడు జీవుని ప్రయాణము, జీవునియొక్క యనంత త్వము బహుజన్మలు పుట్టుకల చావులయొక్క తాత్కాలి కత్వము జీవుని ప్రయాణములో బహుజన్మలుండుట, కర్మాను సారముగా జీవులు జన్మించి చచ్చి, మఱల పుట్టుచు చచ్చుచు నుండుట ఈ జన్మ రాహిత్యమును సంపాదించుటకు జీవుని యొక్క నిత్య ప్రయత్నము. ఇట్టి సిద్ధాంతములున్నవి. అనంత జీవులు లోకమునందుండనే యుందురు. మానవుడు బ్రతికియున్నప్పుడు బ్రతుకు సాధించుకొన వలయును. దానిపే రైహికము. ఇట్టి బహుజన్మల యందు జీవునియొక్క జీవత్వ మును వదలించుకొనవలయును. దానిపే రాముష్మికము. ఈ రెంటిని జతపఱచిన మతము వైదిక మతము. ఈ రెంటికిని సమానత్వము కలదు. ఆముష్మికమున కాధిక్యము కలదు. అందుచేత నందఱు నాముష్మికము యొక్క ఆధిక్యమును పురస్కరించుకొని బ్రతుకవలయునని కాదు. బ్రతుకుదురని కాదు. అది సిద్ధాంతముకాదు. ఇతర మతములలో నైహిక మెక్కువ, నాముష్మిము తక్కువ. కర్మలేదు. బహు జన్మలు లేవు. సిద్ధాంతములు చమత్కారములు. సిద్ధాంత మనఁగా నొక నిశ్చయమైన భావము. ఒక విశ్వాసము. మానవుని ప్రవర్తన వాని విశ్వాసము మీఁద ఆధారపడి యుండును. ఒక విశ్వాసమో ఒక ఊహయో లేనిచో మానవుఁడు ప్రవర్తించఁడు. వానిప్రవర్తన విశ్వాసాధీనము, పవిత్రము విశ్వాసానుగుణముగా నుండును. క్రియా చరణము విశ్వాసము ననుసరించి యుండును. మానవుఁడాది

నుండి సంఘజీవి. వీని క్రియాచరణము యొక్క ఫలితములు సంఘమునందు ప్రతిఫలించును. ఇతర జీవుల మీఁద దాని ముద్ర యుండదు. ఒకఁడొకనిని చంపును. వాఁడు కోపము చేత స్వార్థముకొఱకో ఒక సిద్ధాంతము కొఱకో ఈ పనిని చేయును. ఈ చంపుట యన్నది ముప్విధమైన పరిణామము కలది. ఒకటి సంఘము. దీని వలన నష్టపడును. రెండవది చంపినవాని ఆత్మద్రవ్యము కలుషితమగును. మూఁడవది చనిపోయినవాని జీవుఁడు క్లేశము పొందును. దుఃఖపడును. ఈ చంపుటవలన సంఘము నష్టపడదందము. వాఁడు మిక్కిలి దుర్జనుఁడగుటవలన సంఘమున కది లాభమందము. వాఁడు దుర్జనుఁడైనను వాని క్లేశము తప్పదుగదా! చంపిన వాని ప్రాణము క్లేశపడదందము. ఒక సంతోషము పొందు నందము. ఈ క్లేశమును సంతోషమును మనస్సుపొందెడి వికారములు. వికారమును పొందుటకు పూర్వమొక వస్తువున్నది. వికారమారంభించినది. వికారమనఁగా నొకకదలిక. కదలిక వలన మఱల కదలిక కలుగును. కదలికనుండి కదలికలు పుట్టును. ఇది కార్యకారణ సంబంధముచేత సాగుచునే యుండును. ఒక కదలికనుండిపుట్టిన యింకొక కదలికకు సామ్యము కదలుటయేకాని తక్కిన లక్షణములలో నుండదు. ఒకగడ్డపెట్టి నిలచియున్న వాసమును కొట్టితిమి. గడ్డకదలినది. వాసము కదలినది. రెండును కదలినవి. ఇది సూటిగా పోయి నది. అదివ్రాలినది. అట్లు హృదయమున కల్గిన సంతోషపు కదలికవలన మఱల సంతోషమే కల్గవలెనని లేదు. అచట ప్రధానమైనది చలనముమాత్రమే. కనుక నొకఁడు పరుని

హింసించి మనోవికారమైన సంతోషమును పొందుటచేత తత్సంతోషము సర్వదా సంతోషపరంపరాహేతువని చెప్పఁ టకులేదు. అవి తర్వాత వీనికి దుఃఖహేతువే యగును. ఈ చలనము ఈ వికారము లౌకిక భావజన్యము. లౌకిక భావ పరంపరానిత్యత్వ హేతువగుచున్నది. ఇదియేసృష్టి. ఇదియే లోకము. ఇదియే జన్మపరంపర. ఈరహస్యము తెలియని మతములో నుదయించిన జంతువులు నిరంతర లోకకార్య హేతువులగుచున్నారు. ఈమూలసిద్ధాంతము వారి క్రియా చరణమును తత్సంగత భావసంతానమును వికారించుచున్నది. అనఁగా స్వార్థదురభిమాన క్రౌర్యాది సంఘవిద్రోహక భావ ములును పెంపొందించుచున్నది. ఈభావములయం దభిమాన మును పెంచుచున్నది. యవను లిట్టివారు. వారును మృత్యు వును విశ్వసింతురు. విశ్వసించకపోయినను మృత్యువు తప్పదు. మృత్యువు వచ్చినతర్వాత నేమగును? ఈక్రియా సాంత త్యమును అనఁగా కర్మసాంతత్యమును విశ్వసించెడువాని క్రియా లక్షణము వేఱు. విశ్వసించని క్రియా లక్ష ణములు వేఱు. ఈ కర్మసాంతత్యమును విశ్వసించెడి మతములోకూడఁ గొందఱు విశ్వసించని మతములో జన్మిం చెడి క్రూరులకంటె నధికక్రూరులుండవచ్చును. జనసమూ హామువీఁద నిచట సాధువులసంఖ్య యెక్కువ. అచట అసా ధువులసంఖ్య ఎక్కువ. కర్మహేతుకమైన జన్మపరంపరా విస్వాసములేని మతములలోకూడ మహాసత్పురుషు లుద యింతురు. గంజాయితోఁటలో తులసిమొక్క పుట్టవచ్చును. తులసితోఁటలో వెంపలిమొక్కలుండును, సృష్టిస్వరూపమిట్టి

దగుటచేత యవనులు కర్మపరంపరా విశ్వాసరహితు లగుటచేత తద్ధేతుక దుర్భావసాంతత్య సాధనులగుటచేత వారెచ్చటనున్నను కర్మసిద్ధాంత ప్రతిపాదకమైన వేద మతమునకు విరోధులుగానే యుందురు. రూమ్యకునకు సర్వదేశములయందు గూఢచారులు కలరు. వారు యవనులు ఆ దేశములులోని పంట తిందురు. ఆ బావు లలోని నీరు త్రాగుదురు. అచట ఉద్యోగములు చేయుదురు. వారి కుటుంబము లచటనే వృద్ధి పొందును. కాని వారి యభి మానము యవన దేశములందుండును. రూమ్యకుని యందుం డును. రూమ్యకుఁడు వారి చేత ఎన్నియో దుష్కార్యములు చేయించును. ఆ దేశములో నున్న సమర్థుఁడైన సేనాని చంపించును. చెఱువుకట్టలు త్రెంపించును. రహస్యముగా వారి కాయుధములు పంపించును. రెండుజాతులవారును ఉత్స వములు పండుగలు చేసికొందురు. ఆ సమయముల యందు కలహములు పోట్లాటలు కల్పించును. అపుడు వీరి యాయు ధములు బయటికి వచ్చును. వేదమతము వారిని సంహరిం చును. ఇట్టి దుండగములు చేయించును. రూమ్యకుఁ డెప్పుడో తద్దేశములు మీఁదికి దండెత్తి పోవును. ఈ యంతర్నిగూఢ యవన జనముచేత నా దేశపు జనుల శక్తి క్షీణింపఁజేయు టకు ప్రయత్నింపఁ జేయును. ఈ మహాకార్యమున కంతయు కటకటయోగి మహామంత్రి. అతని సిబ్బందియైన యవనులు మంత్రగాండ్రు. అల్పాల్పసిద్ధులు కలవారు. ఇతర దేశముల లోని జనుల యొక్క రోగములను నిర్మూలింతురు. చిన్న చిన్న లాభములను కల్గించునట్లు నటింతురు. మూఢులు

విశ్వసింతురు. కటకటయోగి యొక్క ఈ ప్రయత్నములు చక్రవర్తి యొక్క ప్రత్యక్షపాలనమున్న దేశములలో కట్టఁబడినవి. హారరామఠ శకకిరాతోత్తర జ్యోతిషదేశములు రూమ్యకుని యొక్కయు కటకటయోగి యొక్కయు యథేచ్ఛావిహార భూములని చెప్పవచ్చును. వారి ప్రయత్నమంతయు నాభీరోరగ దరదసింహపుర కటకరాష్ట్రముల యందే. ఆభీరమునంటి కాంభోజ త్రిగర్తములున్నవి. ఆ రెండు దేశములు కాశ్మీరము ననుసరించును. కాశ్మీరము సుక్షత్రియుల చేత పరిపాలింపఁబడుచుండెను. ఆ మూఁడు దేశములలో రూమ్యకుని యొక్కయు కటకటయోగి యొక్కయు పలుకుబడి లేదు. కటకసేనాపతి యొక్క యదుపులోననే సింహపురోత్తర జ్యోతిషసైన్యములు కలవు. ఆ మూఁడు రాజ్యములగ్నిగోళములుగా నున్నవి. ముట్టించినచో భగ్గుమనును. ఒక్క ఉరగదేశమే కటకటయోగికి స్వాధీనముకాలేదు. ఉరగదేశ మనఁగా దరదాభీరములు కలిసియున్న దేశము దారదులు కోరుకరాని కొయ్యలు. ఆభీరులు కృష్ణభక్తులు. ఇచట నొక్కటియే మార్గమున్నది. చక్రవర్తి దండెత్తి వచ్చినప్పుడాశ్వికులైన దారదులను కదలించరాదు. ఆశ్వికదళాధిపతి స్వతంత్రుఁడైనను మహాసేనాపతి యాజ్ఞలోనివాఁడు. మహాసేనాపతి యవనుఁడు. అతఁడు రాజుయొక్కయు మంత్రి యొక్కయు నాజ్ఞల కధీనుఁడు. సౌమ్యుఁడు తన వాఁడు. వీరదత్తుఁడు తన వాఁడు. ఆ భయము లేదు. కటకసేనాధిపతి వలన రహస్యాయుధ నిర్మాణ కర్మాగారములు మహాగ్నిగోళ సంపన్నములుగా నున్నవని తెలిసినది. ఆభీరోరగ

దేశములసేనలు బయలుదేరును. కాశ్మీరదేశపు రాజు తానిప్పుడు చక్రవర్తికి బాసటగా రాలేడు. కాశ్మీర దేశాధీశునకును వాని తమ్మునకును విరోధము వచ్చెను. తమ్ముని నతఁడు చెఱసాలలో నుంచెను. ఆతమ్ముని పక్షమువారు రాజున కననుకూలురుగాను. ఈస్థితిలో దరద సేనలను తక్కిన మూఁడుదేశపు సేనలకు తోడుగా పంపినచో నది ప్రథమయుద్ధమగును. ఉత్తరబాహ్లీకములను చక్రవర్తి ప్రవేశించుట దుర్ఘటమగును. ఆదేశముయొక్క ప్రాకారము పర్వతమువరుస. అందుచేత నతఁడు శకకిరాతదేశములనుండి రూమ్యకదేశములకుఁ బోవలయును. అచట చక్రవర్తి సేనలు సర్వనాశనమగును. బర్బర రామఠహూర దేశసైన్యములు వెనుకయుండును. శకకిరాత దేశసైన్యములు ముందుం డును. హూణ దేశ సైన్యములు వామపార్శ్వమం దుండును. కటకటయోగి ఈ మహాసైన్య వ్యూహ మంతయు నేర్పరచి చక్రవర్తియొక్క దండయాత్రను ప్రతీక్షించుచుండెను. గాంధార సౌవీరసింధు దశార్ణ మద్ర రాష్ట్రములయందు నివసించు యవనులచేత నొక్కసారి మండింపించును. చక్రవర్తి దండెత్తి వచ్చును. ఉత్తర జ్యోతి షమున వాని సర్వనాశనము కలుగును. కటకటయోగి ప్రయ త్నములో నొక్కటియె మిగిలినది. సౌమ్య వీరదత్తులను యుద్ధాభిముఖులనుజేసి యుద్ధసన్నద్ధులను చేయవలయును. వీరదత్తుని తన కభిముఖుని చేసికొనుటకు కటకటయోగి మధుగుంజను తీసికొనివచ్చెను. మధుగుంజను తండ్రి కప్పఁ జెప్పెను. కటకటయోగి తానీ మహాప్రయత్నమును పదు

మూఁడేండ్లు చేసెను. తన ప్రయత్నము నిర్విఘ్నముగా కొన సాగుటకు తన యోగశక్తిని తన బహుపూర్వజన్మ పరిజ్ఞాన మును వినియోగపఱచెను. తన యోగశక్తిచేత వేదాత్మ వరాహమిహిరునింట వేదవతిగా జన్మించెనని తెలిసికొనెను. ఆవేదవతిని దొంగిలింపించెను. ఆమెను ఆమెయొక్క మర ణమును తొలుతనే సంఘటించెడివాఁడు. తన ప్రయత్నము దీర్ఘకాలము పట్టును. ఈ పదుమూఁడేండ్లు చక్రవర్తి తమదేశ ములమీఁదికి దండెత్తి రారాదు. అతఁడు దండెత్తి వచ్చు టకు చేసినప్రయత్నములు విఘటితములు కావలయును. అందు చేత వేదవతిని కృశింపఁజేయుచుండవలయును. ఆమెను చంప రాదు. కృశింపఁజేయుటకు నిమిషధారి సంగీతము చాలును. ఆమె సంపూర్ణముగా నశింపకుండుటకు మధుగుంజ సంగీతము కావలయును. కటకటయోగి ప్రయత్నమంతయు ఫలించినది. ఆగుహాలో వేదవతి మరణించును. ఆమె మరణించినంతనే చక్రవర్తి సైన్యము సర్వనాశనమగును. వేదధర్మము నశిం చును. తన యోగదృష్టికి విక్రమార్కుఁడు శకకర్త యగునని పించును. అట్లు జరగకుండ తాను చేయును. మనుజుఁడొకవిధ ముగా తలంచును. దైవమన్యథా తలంచును.

కటకటయోగి మధుగుంజను తీసికొనివచ్చి వీరదత్తుని కప్పగించెను. వీరదత్తుఁడు సంతోషించు ననుకొనెను. వీర దత్తుని మొగమున వికాసము లేదు. యోగికర్థముకాలేదు. వీరదత్తునడుగుటకు వీలులేదు. కటకటుఁడు రాజసౌధమునకుఁ బోయెను. మధుగుంజను తెచ్చితినని రాజుతో చెప్పెను. రాజు మొగము చేటంతయైనది. కటకటుఁడు రాజుకొడుకైన

కామలహారివద్దకుపోయి మధుగుంజ వచ్చినదని చెప్పెను. వాఁడు యోగి పాదములమీఁదపడి యిట్లనెను. 'స్వామీ! నాతండ్రి సంపూర్ణముగా యవనుఁడుగాఁడు. నేను యవనుఁడను. నేను మధుగుంజను ప్రేమించుచున్నాను. నాతండ్రిని రాజ్యమునుండి తొలఁగించి రాజ్యమును నాకిప్పింపుము. నేను మధుగుంజను పెండ్లియాడెదను. నేను నీశిష్యుఁడను, నీదాసుఁడను. నన్ను బ్రతికించినదినీవు. నాకు మాటరప్పించినదినీవు. నాకాలుచేతు లాడునట్లుచేసినది నీవు. నాకు రాజ్యమును మధుగుంజను రెంటిని సంపాదించిపెట్టుము. నీవు చక్రవర్తిని పిలువనెంచుచున్నావు. సింహపుర కటకబర్బరోత్తర జ్యోతిష శకకిరాతహూణహార రామఠములతోఁబా టురగాధిసారములు నీవెనుకనుండును. నీకువలసినచో త్రిగర్త కాంభోజములు గెలిచి నీకు కైవసము చేయుదును. మధుగుంజ నాప్రాణము. నీచరణముల సన్నిధినుంతును. ఇదివఱకే నాప్రాణములు నీచరణసన్నిధినున్నవి. నాశరీరము నీచరణ సన్నిధినున్నది. ఉరగాభీరములు నీచరణసన్నిధి నుంచితిని, కటకటయోఁగికి తెలిసెను. తండ్రికొడుకులిద్దఱకు మధుగుంజా హృదయులు.

## పదునాఱవ యధ్యాయము

అంతకు ముప్పది యేండ్లక్రిందఁ కాశ్మీరమును ప్రవరసేనుఁడను రాజు రాజ్యము చేయుచుండెను. అతఁడు త్రిగర్త మునకుఁ గూడ రాజుగా నుండెను. ఆ రాజు చనిపోయెను.

అతని కిద్దఱు కుమారులు. పెద్దవాఁడు హిరణ్యుఁడు. రెండవ వాఁడు తోరమానుఁడు. హిరణ్యుఁడు రాజయ్యెను. తోరమానుఁడు యువరాజయ్యెను. కాని హిరణ్యుఁడు తోరమానుని యువరాజుగా కాకుండ నతఁడు కూడ రాజే యన్నట్లు సౌహార్ద్రమును వెలార్చుచుండెను. తోరమానుఁడు దీనారములను ముద్రించెను. వానినిఁ దన పేరుతో ముద్రించెను. హిరణ్యునకుఁ గోపము వచ్చెను. "వీఁడు నాతోఁ జెప్పకుండఁ దానే రాజన్నట్లు నాణెములను దన పేరుతో ముద్రించెను. వీఁడు ప్రక్కలో బల్లెమై మెలఁగు నట్లుండె"నని కోపించి వానిని చెఱసాల యందుంచెను. తోరమానునిభార్య యంజనాదేవి. ఆ సమయమున నామె గర్భవతియై యుండెను. అంజనాదేవి యిక్ష్వాకు వంశపు టాడబడుచు. ఆమె తండ్రి పేరు వజ్రేంద్రుఁడు. ఆమె భయపడి రాజ్యము నుండి పాఱిపోయెను. ఆమెకుఁ బ్రసవదినములు రాఁగాఁ గలిగెడు సంతానమేమగునో యన్న భయముతో రాజ్యమునందు దూరముగా నున్న యొక పల్లెటూరునకుఁ బోయి యెవ్వనికిఁ దెలియకుండ నొక కుంభకార గృహమునఁ బ్రవేశించి యచట నీళ్ళాడెను. ఆ శిశువు రాజశిశువు కాదన్నట్లు పెంపఁబడుచుండెను. ఇది యిట్లుండఁగా హిరణ్యుఁడు కొన్నాళ్ళు రాజ్యము చేసి నిరపత్యుఁడై మరణించెను. ఆ సమయమునఁ దోరమానుని విడుదల చేసిరి. కాని తోరమానుఁడు గూడ మరణించెను. అంజనాదేవియుఁ దోరమానుని కుమారుఁడైన పసివాఁడును రాజభీతి చేత నెచటికో పాఱిపోయిరి. కాని యంజనాదేవి యన్నగారు జయేంద్రుఁడని యున్నాఁడు.

తన చెల్లెలు, తన మేనల్లుఁడు నున్నారని యతనికిఁ దెలి యును. అతఁడు వెదకించెను. వారు కనిపించలేదు. రాజ్యము రాజవిరహితముగా నుండెను. మంత్రులందఱు కేమియుఁ బాలుపోలేదు. వారందఱు చక్రవర్తికి వార్త పంపిరి. "ఇపుడు కాశ్మీరము రాజరహితముగా నున్నది ధర్మప్రభువు లైన చక్రవర్తులు రాజు నొకనిని నిర్ణయింపవలయు"నని మనవినిఁ బంపిరి. ఆ సమయములో నుజ్జయినీ నగరమునఁ జక్రవర్తి సన్నిధిలో మాతృగుప్తుఁడను గొప్పకవి సేవకుఁ డుగా రాజునకుఁ బరిచర్య చేయుచుండెను. మాతృగుప్తుఁడు వట్టి కవియేకాదు, రాజకార్యదక్షుఁడు. పలుమంది రాజులను సేవించి వారు తన దక్షత తెలిసికొని వ్యవహరింపక పోవుట చేతను, వారి యందు సౌశీల్యాది సద్గుణములు భాసింపక పోవుట చేతను విరక్తుఁడై చక్రవర్తి యొద్దకు వెళ్ళెను. అతఁడు చక్రవర్తి యొద్ద నొక యేఁడాది యుండెను. రాజు గుణగ్రాహియని మహా శీలవంతుఁడని యతనిని సేవించుచుం డెను. కాని చక్రవర్తి యతని వంకనే చూచుటలేదు. చక్ర వర్తి సులభుఁడు కాఁడనియు, తన మనోభావములు సులభ ముగా నితరులకుఁ దెలియనీయఁడనియు, నితఁడు భావించుచు సేవించుచుండెను. చక్రవర్తి యొక్క రాజసౌధము నందలి మర్యాద వాని కెంతయో యాకర్షించెను. రాజు విశ్వసించిన వాఁడు నిశ్చయముగా విశ్వాసపాత్రుఁడుగా నుండెను. రాజు యొక్క మంత్రులు దుర్నీతిపరులు కారు. దుర్వ్యవసాయులు కాదు. రాజసేవకులు దుర్భాషలు పలుకరు. పరులనుఁజూచి యసూయ పడరు. ఒకరి నొకరు తూలనాడరు. కింకరులు

దుర్జాతులు రాజసభలోఁ బ్రవేశమందుటలేదు. ఈ రాజు మహాగాధ హృదయుఁడు, మహావివేకి. అతని సేవలో నాపద లేదు. అతఁడు రాజసేవ చేయుచుండెను. రాజతనినిఁ జూచి "యితఁడు విద్యావంతుఁడు, నితఁడు మేధావి. ఇతనిని మర్యాదగాఁ జూడవలయు"నని యనుకొనెను. చక్రవర్తి మాతృగుప్తునిఁ బరీక్షించుటకు వాని వంకఁ జూడఁడు. కాని నాదరింపఁడు. వాని యందు బహుమానము నెఱపడు. కాని మాతృగుప్తుఁడు రాజునందు బద్ధానురాగుఁడై యుం డెను. ఒక యేఁడాది గడచెను. మాతృగుప్తుఁడు రాజాదరము లేక, నిజముగాఁ దినుటకుఁ దిండిలేక పేదదుస్తులు ధరించి తిరుగుచుండెను. ఇట్లొక్క సంవత్సరము గడచెను. ఒకసారి చక్రవర్తి యీపేదవానినిఁజూచి యిట్లనుకొనెను, 'ఈ విదేశీయునకుఁ దలదాచుకొను నెలవులేదు. బందుగులులేరు. నేనితనిని పరీక్షించుచున్నాను. ఇతఁడెచట నిదురపోవు చున్నాఁడు? ఏమి తినుచున్నాఁడు? కట్టుగుడ్డ లెట్లు సంత రించుకొనుచున్నాఁడు? ఇవి నేను విచారించుటలేదు.' ఇట్లను కొనుచుఁ జక్రవర్తి వీనికి యోగ్యమైన యుపకారము చేయ వలయునని భావించెను. ఇంతలో హేమంత శిశిరములు ముసురుకొని వచ్చెను. మింటినుండి మంచుగడ్డలు రాలు చుండెను. హిమబిందు భరితములైన దుర్వాయువులు శరీర మును మండించుచుండెను. దిశలు సంతతాంధకార పూరి తములైన నీలికుప్పట్లు కప్పికొన్నట్లుండెను. సూర్యుఁడే చలికి చెదరి బాడబాగ్ని దర్శనముకొఱకువలె దినదిన మస్త మించుచుండెను. సూర్యుఁడు శిశిరభీతుఁడై దినములను

వామనీకృతములను చేయుచుండెను. ఒకనాఁడు చక్రవర్తి తైలదీపికా ధగద్ధగాయమానమైన తన గదిలో రాత్రి రెండు జాములకు మేల్కాంచెను. ఓరగా తెఱచియున్న తలుపులో నుండి యీలలు వెట్టుచు లోనికి వచ్చుచున్న గాలిచేత దీపములు కదలిపోవుచుండెను. ఒండు రెండుదీపము లారి పోయెను. ఆదీపములను వెలిఁగించుటకు రాజు సేవకులనుఁ బిలిచెను. 'ఎవరక్కడ' యని. మాతృగుప్తుఁడు లోనికిఁబోయి నమస్కరించెను. రాజాజ్ఞానుసారముగా నతఁడు దీపములను వెలిఁగించెను. మరల మునిఁవ్రేళ్ళమీఁద సవ్వడికాకుండ వెడలి పోవుచుండఁగా రాజతని నాగుమనెను. రాజేమనునోయని యతనికి భయమువేసెను. రాజు 'ఇంకేమాత్రము రాత్రి యున్నది ?"

మాతృ :- మహారాజా ! ఇంకొక యామికుని కాలము మిగిలినది. నిశార్ధభాగము పరిశిష్టముగానున్నది.

రాజు :- నీవు నిశాకాలమునెట్లు కొలిచితివి ! నీవు నిదురపో లేదా ? మాతృగుప్తుఁడిట్లనెను. 'నామేను చలికి మొద్దుబాఱినది. చల్లారిపోవు కాష్ఠములను జ్వాలింపఁజేయు టకు నోటితో నూదుచున్నాను. నాకు నిద్ర వచ్చుటలేదు. కోపించిన ప్రియురాలివలె నామె నన్ను వదలిపోయినది. యోగ్యుఁడైన ధరాపతియందు లక్ష్మివలె నాయందు రాత్రి విసుగుపొందుటలేదు ! మాతృగుప్తుఁడు వెడలిపోయెను. రాజిట్లు భావించెను, 'ఇంతటి యోగ్యుడు, ఇంతటి వివేకిఁ, ఇట్టికవి నన్ను కృతఘ్నునిగా భావించుచున్నాఁడు. నాయందు

గుణగ్రహణశక్తి లేదనుకొనుచున్నాఁడు. నేనితని కేమిచేయ వలయును? కాశ్మీరదేశము పరమసుందరమైన దేశము. ఇప్పుడచట రాజులేఁడు' అనుకొనుచు రాజునిద్రించెను. మఱు నాఁడు ప్రొద్దున రాజు కాశ్మీరదేశపు మంత్రులకు రహస్య ముగా రాయబారము పెట్టెను. 'నేను మాతృగుప్తుఁడను వానిని బంపుచున్నాను. వానిని మీరు వెంటకముందాడక వెంటనే రాజు చేయవలయును'. ఆరాత్రి మాతృగుప్తుఁడు చాల దుఃఖపడెను. దీనులపాలిటి కల్పవృక్షమైన రాజు నన్నేల యాదరింపలేదు? నాపూర్వజన్మలయందు చేయఁ బడిన పాపము పరమసత్పురుషుఁడైన చక్రవర్తి మధు సమార్ద్రమైన చిత్తవృత్తినిగూడ ఘనీభవింపఁజేసెను. రాజు దుష్టుఁడందమా? అతనిసభలోని నవరత్నములు వానిమనస్సు లోని దివ్యకాంతిని వెదజల్లుచున్నవి. చక్రవర్తి సాక్షా చ్ఛివుఁడు. కాని కుటిలోపాసకులకు భూతి మాత్రమేదక్కును. నందీశ్వరుని దయా విశేషములేని వానికి లలితాదేవి మొలనూలిమణుల గలగలలు వినిపించవు. ఇట్లు మాతృగుప్తుఁ డూహించుచుఁ "చక్రవర్తియందగౌరవము కలిగియుండెను. తత్త్వవేత్త మనస్సును గూడ దారిద్ర్యము వికారపఱచును గదా!"

తెల్లవాఱిన తరువాత రాజు మాతృగుప్తునకు వార్త పెట్టెను. ఆశాజ్యోతీ విరహితమైన మొగముతో మాతృగు ప్తుఁడు రాజసన్నిధానమును జేరెను. ప్రక్క నున్న యధి కారి చేత రాజు మాతృగుప్తుని చేతికొక యాజ్ఞా పత్రమిప్పిం చెను. రాజు స్వయముగా నిట్లనెను. 'నీవు కాశ్మీరదేశము

నెఱుఁగుదువా! అచటికిఁ బోయి యీ యాజ్ఞా పత్రమునచటి మంత్రుల చేతులలో నుంచుము. మార్గమున నీ యాజ్ఞా పత్రమును నీవు చూడరాదు. నీ వీ వాక్యమును విస్మరింప రాదు. నా మీఁద నొట్టు వేసికొనుము.' అవిదితవృత్తాంతుఁ డైన మాతృగుప్తుఁడు రాజ పత్రమును రత్నపు వెలుఁగుల వలెఁగాక యగ్ని జ్వాలనువలె స్వీకరించెను.

అతఁడు కాశ్మీరములు చేరెను. తనకున్న తెల్లగా నుదికిన భద్రముఁగాఁ దెచ్చికొన్న తెల్లని యుడుపులు ధరించి యా యాజ్ఞాపత్రమును మంత్రులకు సమర్పించెను. ఇతఁడు విక్రమార్క చక్రవర్తి దూత యని తెలిసినంతనే వారితని దెస నెక్కుడలేని గౌరవమునుఁ జూపిరి. అగ్రపీఠమునందుఁ గూర్చుండబెట్టిరి. ఇతఁడు పత్రమును వానికి సమర్పించెను. కాశ్మీర దేశపు మంత్రులు చక్రవర్తి యాజ్ఞా పత్రమునకు నమస్కరించిరి. అంతః ప్రదేశమునకుఁ బోయిరి. ఆజ్ఞా పత్రమును పఠించుకొనిరి. మఱల వచ్చిరి. "అయ్యా! తమరిపవిత్ర నామధేయము మాతృగుప్తులనియా?" మాతృగుప్తుఁడు చిఱు నవ్వుతో నౌననెను. అంతలో సభాభవనము క్రిక్కిరిసెను. మాతృగుప్తుని వింధ్యపర్వతసానువువలె నున్న హృదయము మీఁద నర్మదానదీజలమువలె పట్టాభిషేక జలము ప్రవ హించెను. రాజుగాఁ జేయఁబడి సర్వసేనాధిపతియై సర్వ ప్రకృతివర్గ మహానేతయై మాతృగుప్తుఁడు శ్రీనగరమునుఁ బ్రవేశించిన తరువాత చక్రవర్తి కిట్లు వ్రాసెను, "శివా కారా! నీలో మార్పు కనిపించదు. నీ యందు వికత్థనత లేదు. నీ దయాప్రవాహము మొదలు తెలియదు. పండిన చెట్టు

నుండి ఫలములు రాలినట్లు నీ నుండి యుపకారములు వర్షించును. మేఘమునుండి వాన కురియునట్లు నీ వెప్పుడు కురియుదువో తెలియదు."

మాతృగుప్తుఁడు దారిద్ర్యము నెఱుఁగును. ఔదార్యము నెఱుఁగును. అతని పాలనము రెండు నెఱిఁగిన వాని పాలనమువలె నుండును.

మాతృగుపుఁడు పండితుఁడు, కవి. కాశ్మీరదేశమున కవులకును పండితులకును పంటకాలము వచ్చెను.

మాతృగుప్తుఁడు రాజనీతివేత్త. రాజ్యము శత్రుదుర్లభముగాఁ జేసెను. మాతృగుప్తుఁడు వేదవేదాంగవేత్త. స్మృతివేత్త. శత్రువులను నియమించెను. మాతృగుప్తుఁడు విక్రమార్కుని యందుఁ గృతజ్ఞుఁడు. యవనవాహిని కడ్డుకట్టగా నిలచెను.

విక్రమార్క చక్రవర్తి ప్రమర వంశీయుఁడు. కలిలో రెండువేల యేడువందల పదియేండ్లు దాటినతరువాత నుజ్జయినిలో నగ్నివంశీయుఁడైన ప్రమరుఁడు తన రాజ్యమును స్థాపించెను. తరువాత రెండువందలపదియేండ్లు ప్రమరవంశముసాగెను. కలిలో రెండువేల తొమ్మిదివందల యిరువదిఏండ్లకుఁ బ్రమరవంశీయుఁడైన గంధర్వసేనుఁ డన్నరాజు సామ్రాజ్యమును నిర్మించెను. ఆగంధర్వసేనునకు విక్రమాదిత్యుఁడన్న కుమారుఁడు పుట్టెను. అతఁడు కలిలో మూఁడువేల యొకటవ సంవత్సరమున జన్మించెను. ఈవిక్రమార్క చక్రవర్తి కలిలో మూఁడువేల యిరువదియవయేట పట్టాభిషిక్తు

డయ్యెను. విక్రమార్క చక్రవర్తి నలువదియేండ్లు పాలించిన తరువాత నీకాశ్మీర రాజ్యమునకు మాతృగుప్తుఁడు రాజయ్యెను.

మాతృగుప్తుఁడు రాజైనంతనే కాంభోజత్రిగర్తముల నదుపులోనికిఁ దెచ్చెను. రూమ్యకునకుఁ జక్రవర్తికిఁగల విరోధము మాతృగుప్తునకుఁ దెలియును. తత్పూర్వము పదునాలుగేండ్లక్రింద తూర్పు బాహ్లీకములనుండి విక్రమార్కుఁడు యవనులను తఱిమివేయుట మాతృగుప్తునకుఁ దెలియును. వారుత్తర బాహ్లీకములయందు కూడుకట్టుకొని యుండుట మాతృగుప్తునకుఁ దెలియును. వరాహమిహిరాచార్యుఁ డుజ్జయినికి వచ్చుటయుఁ వేదవతీకథయు, చక్రవర్తి గూఢచారులు సింహపురోరగ కటకాది దేశములకుఁ బోవుటయు మాతృగుప్తునకుఁ దెలియును. ఆభీరోరగ దరదదేశములు తన త్రిగర్త కాంభోజముల నంటియున్నవి. మాతృగుప్తుఁ డచటి కథలనన్నింటినిఁ దెలిసికొనెను. ఉరగదేశపురాజు సౌమ్యుఁడు. రాజుకొడుకు కామలహారి. మంత్రి వీరదత్తుఁడు. వాని కుమార్తెపేరు మధుగుంజ. కటకటయోగి వేదవతినిఁ దీసికొనిపోయి యెచ్చటనో దాచెను. మధుగుంజ నామెకుఁ బరిచారికగాఁ గొనిపోయెను. మధుగుంజను రాజును, రాజుకొడుకు నిద్దఱును ప్రేమించుచుండిరి. కామలహారి పరమ యవనాభిమాని. చక్రవర్తి గూఢచారులు సర్వయవన దేశములయందు సంచరించుచుండిరి. చక్రవర్తి సేవకుఁడైన తాను కాశ్మీర కాంభోజ త్రిగర్తములకు రాజయ్యెనని తెలిసినంతనే వారు తనయొద్దకు వత్తురు. రాకపోయినను వారికి ధైర్యమెక్క

వగుడు. వారు తమ కార్యముల నధిక సాహసముతోఁ జేయు దురు. కామలహారి యురగదేశాధిపతి కారాదు అయినచో యవనాభిమాని కాగాదు. మాతృగుప్తుఁడు చక్రవర్తి గూఢ చారులలో నొకఁడు తనయొద్దకు వచ్చుటకుఁ బ్రతీక్షించు చుండెను. ఇట్లుండఁగాఁ కాశ్మీరములో నధికారులయొక్కయు, మంత్రులయొక్కయు, ప్రజలయొక్కయు మనోభావములు మొన్నటివరకు ద్విధాభూతములై యుండెను. ఎక్కువమంది హిరణ్యుని యందభిమానము కలవారు. తక్కువమంది తోర మానుని యందభిమానము కలవారు. తోరమానుని కుమా రుఁ డేమయ్యెనో తెలియదు. అతనికిఁ దాత పేరు పెట్టిరఁట! అతని పేరు ప్రవరసేనుఁడు. తా నెన్నాళ్లు రాజుగానుండును? ప్రవర సేనుఁడు కనిపించినచోఁ గాశ్మీరీయులు తన్ను రాజుగా నుండ నీయరు. ఈలోపుగానే తాను చక్రవర్తికి సాయము చేయవల యును. మాతృగుప్తుఁడు కొందఱు విశ్వాసపాత్రులను సమకూ ర్చెను. వారిని యవన దేశములలోనికిఁ బంపెను. వారిలో నొకని పేరు జలౌకసుఁడు. మఱియొకని పేరు తుంజినుడు. మూఁడవవాఁడు సంధిమతి. ఈ ముప్పురను మూఁడు రాజ్యములలోనికిఁ బం పెను. తుంజినుఁడు దరద దేశమునకుఁ బోయెను. తుంజినుఁడు యవనవేషధారియై పోయెను. అతని కా దేశములన్నియుఁ గొట్టినపిండి. వానికురగ దేశమున బంధువులున్నారు. అతఁడు పోవుచునే రాజధానికిఁ బోయెను. అతఁడచట నున్న గొప్ప యుద్యోగుల నెఱుఁగును. రాజసౌధ ప్రవేశము వానికి సులభమయ్యెను. కొలఁది దినములలో వానికినిఁ గామలహారి కిని మైత్రి కలిగెను. తుంజినుఁడు వీణావాదన కుశలుఁడు.

కామలహారితోఁ జెప్పెను. నీవు మధుగుంజా హృదయము నాహరింపఁ దలఁతునేని సంగీతము నేర్చికొనవలయుననెను. తాను వీణ నేర్పుదుననెను. వీణ కావలయును. తుంజినుఁడు నాభాగుఁడన్న యొకనితోఁ గలిసికొనెను. ఆ నాభాగుఁడు వేయి దీనారములు రాజకుమారుఁడిచ్చినచో వీణావతి నుండి సంశయింప నక్కఱలేని వీణను దెత్తుననెను. అంత వీణ కామలహారి కెందుకు? నా భాగుఁడిట్లనెను. అభ్యాసముకూడ మంచి వీణ మీఁదనే చేసినచో విద్య సుఖముగా వచ్చును. నాభాగుఁడును తుంజినుఁడును వీణయొక్క ప్రస్తావము నుండి రాజకీయ వ్యవహారములు మాటాడుచు పరస్పరము మోసగించుకొన వలయునని ప్రసంగించుచుండఁగా నొకరి మోసమొకరు తెలిసికొని నీ వెవరవు నీవెవరనుకొని యిద్దఱు నేకార్థ సమవేతులని తెలిసికొని నాభాగుఁడు చక్రవర్తి గూఢచారి. తుంజినుఁడు మాతృగుప్తుని గూఢచారిగా నెఱిఁగిన తరువాత నాభాగుఁడు వీణావతిలో నాఁడుసమావేశమైన గూఢచార్యధికారులలో నొకఁడై తక్కినవారు కిరాతదేశము నందుండిరని తుంజినునితోఁ జెప్పెను. నాభాగుఁ డిట్లనెను. "ఇది యంతయు కటకటయోగి వ్యూహము. చక్రవర్తిసేన కటకట దేశము నుండి శకదేశమునకుఁబోయి యచట నుండి కిరాతదేశమునకుఁ బోవలయును. అట్లుకాక సింహపురము నుండి కిరాత దేశమునకుఁ బోయినచో సులభమగును. అందుకే కిరాత దేశమున చక్రవర్తి గూఢచారులు పనిచేయు చున్నారు. సేనల నెట్లును మార్చుటకు వీలులేదు. ప్రజలలో చక్రవర్తి యందభిమానము పెంచవలయును. చక్రవర్తి సేనలు కిరాత

దేశము ప్రవేశించి నంతనే ప్రజలు వానికి స్వాగతము నెఱపి నచో నాహార పానీయములకు లోపము కలుగదు. ఉత్తర జ్యోతిషములు చమత్కారముగా మాఱినవి. టికటిక యని యొక విచిత్ర గాయకుఁ డున్నాఁడు. ఉత్తరజ్యోతిషములు వాని సంగీతమునకు వశమైనవి. వానిని ముందిడుకొని చక్ర వర్తి సేన లుత్తర జ్యోతిషమున సౌకర్యములు పొందును. ఇచట నురగదేశ మొక్కటియే కొఱకరాని కొయ్యగా నున్నది. తుంజినుఁడు 'ఇచట దారదులు చక్రవర్తి పక్షము వారు. వారాశ్వికులు. ఉరగదేశ మొక్కటియే కొఱకరాని కొయ్యగా నున్నది. తుంజినుఁడు "ఇచట దారదులు చక్ర వర్తి పక్షమువారు. వారాశ్వికులు. ఉరగదేశపు సైన్య బలము వారి మీఁద నాధారపడి యున్నది. కాల్బలమంతయు నాభీరోరగులు. వారి సేనానియు చమూపతులును, దళవాయులును యవనులు. వారు రాజు నకు మంత్రికి భక్తులు. రాజు మధుగుంజను పెండ్లాడినచో వీరదత్తుఁడును సౌమ్యుఁడునుకలిసి దారదులను యుద్ధమునకే పిలువక యవనసేనచేత చక్రవర్తి సైన్యమును దక్షిణము నుండి తాకుదురు. రాజు కామలహారి కావలయును! నాభా గుఁడు-అదియెట్లు? తండ్రి కొంతకాకపోయిన కొంత వేద ధర్మావలంబి. కొడుకు సంపూర్ణముగా యవనుఁడు!

తుంజిన :- అట్లుకాదు. కామలహారికి ప్రధానము మధుగుంజ. వానికి మధుగుంజ ప్రాప్తించినచో వాఁడేపని యైన చేయును. కటకటయోగి సౌమ్యునివధించి మధుగుంజను

కామలహారికిచ్చి పెండ్లిచేసినచో వాఁడు యవనులవైపుండును. ఆపని నీవుచేసినచో నీవైపుండును.

నాభాగు :- మధుగుంజ కామలహారిని పెండ్లాడదు. ఆమె టికటికను ప్రేమించుచున్నది. ఆమె మనస్సెవరికిని దెలియదు. తండ్రి చెప్పినను వినదు.

తుంజిన :- అట్లేకావచ్చును. కామలహారితో నిట్లు చెప్పవలయును. నీతండ్రిని వధించి రాజ్యము నీకిప్పింతుము. నీవు చక్రవర్తి పక్షమున నుండుము. చక్రవర్తికి నీయందు దయగలుగును. అతఁడు మధుగుంజను నీకిప్పించును. అని వానికాశపెట్టినచో వాఁడు మన వైపునకు మఱలును.

నాభాగు :- వాఁడు తండ్రిని వధించునా!

తుంజిన :- ఆవధ మనమే చేయవలయును.

నాభాగు :- అదియెట్లు సాధ్యము?

తుంజిన :- దానికి వేఱే పదకమెత్తవలయును.

నాభాగు:- దానినట్లుంచి మధుగుంజ తండ్రియింట నున్నది. ఆమె చక్రవర్తి యధీనములో నున్నప్పుడుగదా కామలహారి మనమాట విశ్వసించును.

తుంజిన :- ఆ టికటిక యిప్పుడెచ్చట నున్నాఁడు? వానిని మనము తీసికొనివచ్చి మధుగుంజను వానిద్వారా లేవనెత్తికొని పోయినచో మధుగుంజా టికటికల యన్యోన్యానురాగమెఱుఁగని కామలహారి యామె చక్రవర్తి యధీ

నములో నున్నదని విశ్వసించును. అప్పుడు మన మతని చేత నేపనియైనఁ జేయింపవచ్చును.

నాభాగు :- ఇవి రెండును గడ్డుపనులే. సౌమ్యుని వధించుటయు సాధ్యము కాదు. మహామంత్రి యింటనున్న మధుగుంజను దొంగిలించుటయు సాధ్యము కాదు.

తుంజిన :- కార్యము లసాధ్యములు గనుకనే రాజులు వానియందు కర్మకుశలులను నియోగింతురు.

నాభా :- నీవు కామలహారిని చూచికొనుము. నేను మధుగుంజను చూచికొందును.

తుంజిన:- టికటిక యిప్పుడెచ్చటనున్నాఁడు!

నాభా :- నీవు సౌమ్యవధ ఎట్లు చేయుదువు?

తుంజిన :- నీవునన్ను నమ్ముటలేదు.

నాభా :- నిజముగా నాకు టికటిక ఎచ్చటనున్నాఁడో తెలియదు. ఉత్తర జ్యోతిషములయందు సవ్యసాచి యను నొక క్షత్రియ యువకుఁడున్నాఁడు. వానికిఁ దెలియును. వానినిఁ బోయి కలిసికొనవలయును.

తుంజిన :- నీవు వచ్చులోపుగా మధుగుంజను దొంగిలించులోపుగా నేను మృత్యుముఖమును తెఱచియుంచెదను. నీవు మధుగుంజను చక్రవర్తి యధీనములో నున్నట్లుగా నెఱపుము. తెఱువఁబడియున్న యామృత్యుముఖమున రాజును సులభముగా నేను ప్రవేశపెట్టెదను. అది జరుగకముం దిది జరుగరాదు. వీణమాట యేమి?

నాభా :- అది యిచట నాయింకొక మిత్రునియొద్ద నున్నది.

తుంజిన :- అతనిపేరేమి ?

నాభా :- మృగేంద్రసింహుఁడు. అతనిని నీవే కనుగొనవలయును.

## పదునేడవ యధ్యాయము

సవ్యసాచి సుమంతుఁని కలసికొనెను. సుమంతునికీ కథయంతయు చెప్పెను. సుమంతుని కేమి చేయవలయునో తోచలేదు. తాను తన గురువును కలసికొనవలయును. అతఁడెవరో బైరాగి కాని మురారిభట్టని యితనికి తెలియదు. తాను పది దినములైన సెలవు తీసికొనవలయును. తీసికొని యేమి చేయవలయును? నలుగురు మనుష్యులనైన వెంట తీసికొని గొడ్డళ్ళతో తాళ్ళతో నచటికిఁ బోవలయును. బైరాగు లిద్దఱడవులలోనికిఁ బోవుట వేఱు. కట్టెలమ్ముకొను వారు చిన్న గొడ్డళ్ళతో అడవికి పోవుట వేఱు. ఈ ప్రయత్నము వేఱు. ఎవఁడో యధికారి చూచినచో నీ వ్యవహారము బట్టబయలగును. తన కతమున చక్రవర్తి కార్యము భిన్నమగును. తనతో పోటీ రహస్యాయుధ కర్మాగారము లెటేఁగినవారు భరతుఁడును సహదేవుఁడును కలరు. వారితో చెప్పవలయును. గురువు యొక్క సంగతి వారికేమైన నెక్కువ. తెలియునేమో? తన చమూపతి క్షత్రియుఁడు. తానేదో సాకు చెప్పి పది దినములు సెలవు తీసికొనవచ్చును.

ఇది యేదో యుద్ధకాలమని ఎవ్వరికిని సెలవు లిచ్చుటలేదు. వారి చమూపతులు యవనులు. వారి దుద్యోగముకాదు. అది యొక బందీ. తరువాత నాల్గు దినములకు సేనాపతి యును, చమూపతులును, దళవాయులును కలసి విచారింపఁ దగిన యొక సమావేశము కలదు. అపుడు భరత సహదేవులను కలసికొని వారికి రహస్యముగా నీ వార్త చెప్పవలయును. ఆ సమావేశమునందు సేనాధికారులందఱును కలసికొనిరి. సేనాపతి యిట్లు చెప్పెను. "హైందవుల సైన్యములు మన మీఁదకు వచ్చుటకు సిద్ధముముగా నున్నవి. మన మందఱ మును సిద్ధముగా నుండవలెను" మొదలైన అకున కందని పోకకు పొందని మాటలు చెప్పెను. కాని చమూగమనము గాని వ్యూహనిర్మాణముగాని మాటాడలేదు. తరువాత సేనాపతి భరత సహదేవ సవ్యసాచులను ముువ్వురను ప్రత్యే కముగాఁ బిలిచి సర్వ రహస్యాగారములలో నున్న యగ్ని గోళములను చక్రవర్తి వచ్చు మార్గమందు నిక్షేపింపవలయు నని యాజ్ఞాపించెను. సామాన్య సైనికుల కీ నిక్షేప స్థానములు తెలియరాదు. వారు మువ్వురును తమకు విశ్వాసపాత్రులైన వారి నెన్నుకొన వలయును. అవి నిక్షేపింప వలసిన స్థానము లను నిర్దేశించి చెప్పెను. సుదామా సింధు నదుల నడుమ గాంధార దేశములో వీటిని కొన్నినిక్షేపింపవలయును. తక్కిన వానిని బర్బరోత్తర జ్యోతిష కటక సింహపురోరగ ఆభీర దేశముల యెల్లలలో నున్నచిట్టడవులలో నిక్షేపింపవలయును. తాను వచ్చి వానిని పరిశీలించును. ఈ రీతిగా వారు మువ్వురు సమావేశ మగుటకు వీలేర్పడెను. వారిలో భరతునకు మురా

రిభట్టు పొలకువ తెలియును. ఆ మఱునాఁడే మురారిభట్టు నాభాగుని కలసికొని విషయమును విశదపఱచెను. నాభాగుఁడు మురారిభట్టు మృగసింహుఁడు ముఫ్ఫురును ముత్తో) వల నుత్తర జ్యోతిషము నందలి ఆ కాంతారమునకుపోయిరి. సవ్యసాచిని కలసికొనవలయును. కిరాతదేశములో భూమి మిత్రుఁడన్న గూఢచారి యధికారి. కొందఱు యవన సైనికులను తనవైపునకు త్రిప్పికొనెను. రామఠహార దేశములలో నచట జరిగిన దుండగముల వలన యవన రాజ్యమునకు వ్యతిరేకులున్నారు. ఈ సైనికుల బంధువులు కొందఱచ్చట గలరు. వారు రామఠహ్వార దేశములలో తమ బంధు కుటుంబముల సర్వ నాశనములకు దుఃఖించును. రూమ్యక రాజ్యము యొక్క నాశనమును సూచనగా దూరమునందు కనిపించుచు దాని కనుకూలముగా నున్నారు. అట్టి వారిలో పదిమంది ధైర్యవంతులను దృఢకాయుల నేరి హారదేశపు నైరృతి దిశయందు ప్రారంభించు నాయటవీమార్గమున గొడ్డళ్ళతో త్రాళ్ళతో చిన్ని బాడిదలతో నచటికి వచ్చు నేర్పాటు చేయఁబడెను. అంతయు కాలవేగమున తీర్పఁబడెను. మిత్రగుప్తుఁడు తొలినాఁడు టికటికను కలసికొన్న వృక్షసమీపమున అందఱు చేరిరి. సవ్యసాచి మార్గదర్శిగా రెండు దినములలో తటాకము వద్దకు పోయిరి. ఒక్క యామ మాత్రమున దృఢమైన రెండు తెప్పలు నిర్మింపఁబడెను. వానిపైన నాకులు వేయఁబడెను. గుహాముఖము చేరిరి. పదిమంది వాకిట నిలుచుండిరి. నాభాగుఁడును సవ్యసాచియు లోనికి పోయిరి. వారిద్ద ఱేకాకులై గుహలో నున్న నాఁటికి

నేఁటి కిరువది దినములు గడచెను. టికటిక సవ్యసాచిని గుర్తుపట్టెను. సవ్యసాచి మిత్రగుప్తుఁడేడి యని యనెను. టికటిక వాని సంగతి చెప్పెను. తెప్పలు గుహాముఖ దక్షిణ పార్శ్వ మహాశిలా ఫలకము చుట్టు తిరిగిపోయెను. వారిలో నల్గురు కొండయెక్కిరి. మిత్రగుప్తునికొఱకు వెదుకనారంభించిరి. ఈవెదకుట ఎన్నాళ్లు పట్టునో ! ఒక తెప్ప వెనుకకు వచ్చెను. నాభాగుఁడు టికటిక తనవాఁడని సంపూర్ణముగా తెలిసినవాఁడు గనుక తనపదకము నతనికి తెలియజేయఁవలయునని యిట్లనెను. "మధుగుంజ నిన్ను ప్రేమించుచున్నది. నిన్నుతప్ప మఱియొకనినిఁ బెండ్లాడదు." టికటిక పకపక నవ్వెను. "నేను సన్న్యాసిని. షండుఁడను. నేను వృద్ధుఁడను. నేనొక మహాకార్యము చేయుటకు జన్మించితిని. ఆకార్యము నిర్వర్తింపఁబడినది." నాభాగుఁడు గ్రహించెను, ఇట్లనెను. "మఱికొంత మిగిలినది. మధుగుంజను తండ్రియింటినుండి రహస్యముగా తీసికొని రావలయును. ఈపనికిఁగూడ నీవు సాయపడవలయును.

టికటిక :- అది యామెను మోసముచేసినట్లగును.

నాభా :- ఆమెకుపకారము చేసినట్లుగును. ఉరగ దేశపురాజైన సౌమ్యుఁడు మధుగుంజను పెండ్లియాడనెంచుచున్నాఁడు. వాని కుమారుఁడైన కామలహారి మధుగుంజయనఁగా పడిచచ్చిపోవుచున్నాఁడు. వాఁడు వృద్ధుఁడు, వీఁడు పరమ కిరాతుఁడు. మధుగుంజను నీవు రక్షింపవలయును.

టికటిక :- స్వామ్యుఁడు మధుగుంజను పెండ్లియాడ నెంచుచున్నాఁడో! వానికఱువది రెండేండ్లు. ఈమెకిరువది యాఱేండ్లు. వాఁడు చచ్చిపోయినచో నీమె సహగమనము చేసినచో వారిశవములు నెగుడుదిగుడుగాఁ గట్టవలయును. నాభాగుఁడు నవ్వి యిట్లనెను. "అఱువది రెండేండ్లనఁగా నడివయస్సానము. కలికాలమిప్పటికి జరిగి సుమారు మూడు వేల ఏఁబదియేండ్లు దాటినది. ఇంక రెండు వేలయేండ్లు దాటినప్పటి మాట మాటాడుచున్నావు. నీకు మధుగుంజమీఁద కోరిక యున్నది. మీయిద్దఱికిని చక్రవర్తి వివాహము చేయును.

టికటిక :- నేనామె గొంతుకోయను. చక్రవర్తికి సాయము చేయుదును. ఆమెను మంత్రి యింటినుండి బయటకు తేఁగలను గాని నేనామెను సురక్షిత ప్రదేశమునకు చేర్చలేను.

నాభా: - నేను నీవెంటనే యుందును.

టికటిక :- నేను నీవెంటనేరాను. నాదారిని నేను పోవుదును. నన్ను నీ వురగదేశపురాజధానిలో కలసికొనుము.

నాభా :- తెప్పమీఁద పోదువుగాని.

టికటిక :- నాకు తెప్పయెందుకు? నే నీదికొనిపోదును.

నాభా :- చెఱువునిండ మొసళ్ళు కలవు.

టికటిక :- మధుగుంజ కాపద తప్పును.

నాభా :- చక్రవర్తి కార్యము చెడును.

టికటిక :- నన్ను మొసళ్ళంటరావు. నీతోవచ్చిన యందఱు మిత్రగుప్తునితోఁ బోయిరి. నాయునికి వారికి తెలియదు. నేను రహస్యముగా పోవుదును. ఇది రహస్య రక్షణమగును. వేదవతిని వెంటనే వరాహమిహిరుని యింటికి పట్టుకొని పోవలయును. ఆమెసంగతి నీకు తెలియదు నీవు క్షత్రియుఁడవా? బ్రాహ్మణుడవా?

నాభా :- నేను రెండును కాను.

టికటిక:- ఈ వచ్చినవారిలో నే కొంచెమో వేదము చదివిన బ్రాహ్మణుఁడున్నాఁడా?

నాభా :- మురారిభట్టని యున్నాఁడు.

టికటిక :- అతఁడు త్రిసంధ్యలయందు వేదవతికి కొంత వేదము వినిపించుచుండవలయును. లేనిచో నామెవ్యాధిగ్రస్తురాలగును. తండ్రి యింటికి చేరులోపల నామె కృశించి పోవును. తర్వాత కష్టమగును. అనుచునే తర్వాత టికటిక చెర్వులోనికి దిగెను. మానవుఁడు దిగినట్లులేదు. ఒక మొసలి ప్రాకినట్లున్నది. జలజంతువులతనిని ఇంకొక జలజంతువను కొనెను. నాభాగుఁడు నివ్వెఱపోయెను. అతఁ డీదునంత మేరఁ జూచుచుండెను. అతఁడాతలియొడ్డునకు జేరెను. అతఁడు తన యుత్తరీయమును తలగుడ్డగా చుట్టుకొని తలగుడ్డలో తన ఏకతారనుపెట్టి శిరసు కనిపించునట్లీదుచుండెను. జలజంతువు ఇదియేదో క్రొత్తమృగము దీనిజోలికి పోరాదనుకొనెనేమో! టికటిక కనుచూపుమేర దాటిపోయెను. ఒక్క మురారిభట్టే గుహాముఖమునందు నిలచియుండెను. నాభాగుఁడు వేదవతి

వంక చూచెను. ఈమె నిచటనుండి తీసికొని పోవుటయెట్లు? ఒక పల్యంకిక లేదు. బోయీలు లేరు. వెంటవచ్చు పరివారము లేదు.

నాభా :- మురారిభట్టుగారూ? మిత్రగుప్తుని జాడ తెలిసినదా?

మురారి :- తెలియలేదు.

నాభా :- మీరు వచ్చివేసితిరేమి?

మురా :- తక్కినయందఱు తదన్వేషణా వ్యగ్రులై యున్నారు. నేను మీకు చెప్పుటకై వచ్చితిని.

నాభా :- మీకు వేదవతి కనపించవలయునుకదా!

మురా :- ఆమె ఈగుహలో లేదా?

నాభా :- ఆమె యీగుహలోనున్నది. ముప్పురికి మాత్రమే యీగుహలోనున్నదని తెలియును. సవ్యసాచి, మీరు, వచ్చినచో మిత్రగుప్తుఁడు నాతో నలువురము, తక్కిన యందఱికీగుహలో నామెలేదని చెప్పవలయును. వారందఱు వచ్చిన తర్వాత మన మందఱము బయలుదేరి పోవుదుము. మీరు ముప్పురు మా నుండి విడివడి మఱల నిచ్చటికి రావలయును. మీరును మిత్రగుప్తుఁడును యోద్ధలు, ఈమెను రక్షించుచుండవలెను. తెప్పలు చెఱువున కీతలి వైపున నుండవలెను. ఇప్పుడు మనమీమెను తీసికొనిపోలేము. చక్రవర్తియు వరాహమిహిరాచార్యుఁడును కలసి రావలయును. వారే ఈమెను తీసికొనిపోదురు. అది ఎంతో కాలము పట్టదు. నేను వెంటనే ఉరగదేశము పోవలయును. వేదవతిని

మనము చక్రవర్తి కప్పఁజెప్పవలయును. అనఁగా నామెకు త్రిసంధ్యల యందు వేద చికిత్స చేయుచుండవలెను. నేను శూద్రుఁడను. వేధాధికారములేదు. నీవు బ్రాహ్మణుఁడవు. వేదము చెప్పికొంటివని నాతో చెప్పితివి. ముప్పేళల నామె వద్ద వేదపఠనము చేసిన గాని ఆమె ఆరోగ్యము నిలువదు.

మురారి:- ఇన్నాళ్ళెట్లు నిలచినది?

నాభా:- జనము లామెచుట్టు లేనపుడొక మహాయోగి తనశక్తిచేత నామెకు త్రయీపాఠము వినిపించు చుండెను. మనము వచ్చితిమి. ఆ యోగి తనశక్తి నుపసంహరించు కొనెను. మురారిభట్టు లోనికిపోయెను. అతఁడునుసవ్యసాచియు వేదవతీ పరిచర్యానిమగ్నులై యుండిరి. కొండమీఁద జనము ప్రొద్దుగ్రుంకినను రాలేదు. నాభాగుఁ డిట్లనియెను. "వారె ప్పుడు వత్తురో తెలియదు. సవ్యసాచియు నేను తెప్పమీఁద నాతలి తీరమునకు పోదుము. సవ్యసాచి మఱల తెప్పను తెచ్చును. వారెప్పుడువత్తురో వచ్చినపుడు నేనా కొండమీఁదికే పోయితిననియు మఱియొక దెసగాపోయి యుందుననియు నాకోసము మీరుండనక్కఱలేదనియుఁ జెప్పి నాయాజ్ఞ మిత్రగుప్తునకు రహస్యముగా తెలియచేసి వారితో బాటు మీరుకూడ వెళ్ళినట్లు నటించి వారిలో నెవ్వరు గుహలో ప్రవేశించకుండఁ జూచి మీరు తిరిగివచ్చినపుడు తెప్పలీయొడ్డుననే బంధించికొనుడు - నాభాగుఁడు వెడలి పోయెను. ఉత్తర జ్యోతిషములనుండి గుఱ్ఱములమీఁద నురగ దేశము చేరెను. ఇతఁడు చేయనప్పటికి టికటిక యచట

నుండెను. ఇతడింత తొందరగా నెటులవచ్చెను. ఆ యర్ధరాత్రమున మంత్రియొక్క సౌధోపరిభాగమునకు టికటికయొక్క సంగీతము వినిపించెను. మధుగుంజకు పోయిన ప్రాణములు మరల వచ్చినట్లుండెను. ఆమె మునికాళ్ళమీఁద నడచుచు సవ్వడిలేకుండ గడియలమీఁద నీళ్ళుచల్లుచు తెఱచుచు సింహద్వారమున నిదురపోవు వృద్ధదౌవారికుని గికురించి సంగీతము వినవచ్చు సౌధపశ్చాద్భాగ పుష్పోద్యానమునఁ బ్రవేశించెను. ఆమెకు టికటిక కనిపించలేదు. అతడు నేలమీఁద పామువలె ప్రాకుచుండెను. అతఁడు తలలో ధరించిన ఏకతార పడగవలె కనిపించుచుండెను. మధుగుంజ భయపడి పారిపోఁబోఁగా నతఁడు లేచి నిలుచుండి నవ్వెను. ఈమె యతనిని కౌఁగిలించుకొనెను. నటనదశా సంక్రాంత సర్వప్రకృతి వాని నావహించెను. కాఁబట్టి వాఁడామెను పెనవేసికొనెను. పరిత్యక్త పరిష్వంగులైన వేళకు టికటిక మనస్సులోని బ్రహ్మచర్య భావన యంతరించెను.

మధుగుంజ :- ప్రాకారము దాటి లోనికెట్లువచ్చితివి?

టికటిక:- నీవు పాఁపపడుచువు. నేను పాపఁడను.

మధు:- నేను తొందరగా పోవలయును. ఎవరైనను మేల్కొన్నచో మన మిద్దఱము దీర్ఘనిద్ర పోదుము. నన్ను వదలుము. నేను మఱలపోయి నిద్రాధీనయము చేయఁవలయును.

టికటిక :- నీవింక లోనికిఁబోవు. ప్రాకారము వెనుక నీకొఱకు చిన్న పల్యంకిక యున్నది. నిన్ను దానియందుంచి ఎచ్చటికో తీసికొని పోవుచున్నాను.

మధు :- నేను ప్రాకారమును దూకలేను.

టికటిక :- నేను నిన్ను బుజానవేసికొని దూకెదను.

మధు:- ఓయీ! నీవు నాలో సగము మనిసివి. నన్ను బుజానవేసికొని ఎట్లు ప్రాకారము దూకెదవు?

టికటిక :- మగపులి పెద్ద యావును వేయును. ఆ యావు పులికి రెండురెట్లంత బరువుండును. పులి యావు మెడ నరములను పట్టుకొని గోశరీరమునంతయు తన వీఫు మీఁదికి మరలించుకొని ఎంత ఎత్తైన గోడనైనను దూకి తన ఎడలోనికి తీసికొని పోవును.

మధు:- నీవు నన్ను మఱల నడవిలోనికి తీసికొని పోయెదవా? నేఁ డొక్క చీరతో వచ్చితిని. లోనికిఁబోయి మరొక్క చీరయు రైకయు తెచ్చికొందును.

టికటిక:- ఒక భర్తని కొఱకు వైకుంఠమునుండి విమానము వచ్చినదఁట. అతఁడు తన భార్యను తీసికొని పోనెంచెనఁట. ఆమె యంతకు ముందే యంట్లుతోలిచినదట. అంట్లు ఇంటిలో పెట్టివత్తునన్నదఁట. విమానము వెళ్ళి పోయినది.

మధు:- ఓయీ! నేను నీసంగీతమునే యెఱుఁగుదును. కాని నీ యీ మాటకారి తనము నెఱుఁగను. నీ పరాక్రమము నెఱుఁగను.

టిక:- నేను నిన్నెఱుఁగక ముందు నేను పురుషుఁడనని యెఱుఁగను. నీ సంగీతము వినకముందు నేనొక పశువను.

తర్వాత నాలోనొకదీప్తి కలిగినది. దానినినిజానికి నీకౌఁగిలింత నన్ను పురుషుని చేసినది. నన్ను పెద్దపులినిఁ చేసినది. లౌకిక విజ్ఞానిని చేసినది—టికటిక యన్నంత పనియుఁజేసెను. ఆమెను వీపుమీఁద వేసికొని ప్రాకారమును దూకెను. నాభాగుఁడతని బలమున కచ్చెరునందెను. వీఁడొక వానపాము ఈన కట్టుపుల్ల. ఇదియేమని ఆశ్చర్యపోయెను. సృష్టియొక్క రహస్యమంతయు స్త్రీ పురుష సంగమంమదంతర్భాగమై యున్నది. ప్రేమగలచోట పురుషుఁడు పులి. వాఁడు మహా శూరుఁడు. అహో! టికటిక ఖడ్గమును చేఁబూని పల్యంకి కానుసరణము చేయుచున్నాఁడు.

పల్యంకిక ప్రస్తరఖనియొక్క యింటి దొడ్డి గుమ్మము వద్ద నిలచెను. కలాపిని వీనికొఱ కెదురుచూచుచుండెను. ఆమె మధుగుంజను లోనికి తీసికొనిపోయెను. పల్యంకికను మోసినది యిద్దఱు నాభాగుడుఁను, మఱియొక నిరుపేదయైన వ్యక్తియు నాభాగుఁడు టికటికతో ననెను. "నీభార్య యిచట సురక్షితముగా నుండును. నేను నీకు మాట యిచ్చుచున్నాను. ఈమాట నీకు శ్రీవిక్రమార్క చక్రవర్తి యిచ్చినట్లు. నీవు వెంటనే యుత్తర జ్యోతిషములకు పొమ్ము. వలసినచో వేద వతిగుహకు పొమ్ము. వలసినచో చక్రవర్తియు వరాహ మిహిరాచార్యుఁడును వచ్చి వేదవతితోపాటు నిన్నును తీసికొనిపోదురు. నీవు సింహపురీ కటక దేశములకు పోవద్దు. ఆభీర దేశమునకు పొమ్ము. అచటినుండి కాంభోజములు కాశ్మీరములు పోయినచో నీకు సేగిలేదు.

టికటిక వెడలిపోయెను. టికటికకు నాభాగుని మాటలలోని తీవ్రతయు యాథార్థ్యమును ఆపదయు తెలిసెను. టికటిక వెడలిపోయి నంతనే నాభాగుఁడు పల్యంకికను మోసిన వానితో నిట్లనెను. "నీభార్య కిది వఱకు వందదీనారములు ముట్టినవి. మఱినాల్గు దినములలో వంద దీనారములు పంపింతును. నీకొడుకై దేండ్లవాఁడు, నీకూతురు రెండేడ్లది. వారి విద్యాబుద్ధులకు, వారి వివాహములకు నీవు భయపడనక్కఱలేదు. సుఖముగా వెనుతిరిగి నడువుము. "ఆపేదవాఁడు మహోత్సాహముతో వెనుతిరిగి రెండడుగులు వేయులోపల వాని శిరస్సు నాభాగుని కత్తితో తెగిపోయెను. అది యిరుకైనసందు వాని శవము పల్యంకికా సామగ్రియు నొకమూటగా నిర్మింపఁబడి నాభాగుఁడొక వృద్ధస్త్రీయై దానిని మోసికొంచు పోవుచుండెను. నాభాగు నెవ్వరు పలుకరింతురు? అది మిక్కిలి ముసలిది. అందులో కుంటిది. దానిది జిత్తుబొచ్చు. పరమ భిక్షుకురాలు.

మధుగుంజ కలాపిని చిన్నప్పుడెపుడో చూచినది. కలాపిని తన్నుగుర్తు చేసికొన్నది. మధుగుంజకు ప్రత్యయము కల్గినది. మధుగుంజ యిట్లన్నది. "నాతండ్రి నాకొఱకు వెదకుచుండును."

కలా :- నీతండ్రికి నిన్ను వెదకుటకుఁగాని వెదకించుటకుఁగాని యీ నిశాభాగమున తీరికయుండదు. రాజు యువరాజుయొక్క వీణావాద్యమును వినుటకు మహానగరములోని యొకసందులోనికి వెళ్ళినాఁడు. ఒంటరిగా వెళ్ళవలయునన్న

నియమముతోఁ తీసికొనిపోఁబడినాఁడు. రాజువెంట నిద్దఱు ఖడ్గధారులు మాత్రమే కలరు. ఆముప్పురు నాసందులో వధింపఁబడిరి. ఆవార్త రాజసౌధమున కీపాటికే చేరియుండును.

మంత్రియైన తండ్రికీవార్త వెళ్ళును. ఆయన సైన్యములు తీసికొని యాసందులోనికిపోయి యటునిటు సైనికులను నిలువ పెట్టి తెల్లవారువఱకచటనే యుండును. ఈ గగ్గోలులో నిన్నెవరో యెత్తుకొనిపోయెననుకొందురు. మధుగుంజ స్తంభీభూతయై నిలచిపోయెను. ఇట్లనెను. "నాతండ్రికి నీయందు ప్రేమ. మఱల నన్ను నాతండ్రి కప్పజెప్పెనివా?"

కలా :- "అయినచో నిన్నిచటికెందుకు తెప్పింతును. నీవిచటనుంటివని ప్రస్తరఖనికూడ యెఱుఁగడు."

రాజశవమున్న సందులో భటులశవములేకాక మూఁట కట్టియున్న మరియొక శవమునుకూడ సైనికులు చూచిరి.

## పదునేనివిదవ యధ్యాయము

రామఠదేశమున నెట్లో కిరాతదేశమున నట్లు పెద్ద యెత్తున వధలు సాగినవి. పదిపదేనేండ్లక్రింద తూర్పుబాహ్లీకమునుండి కిల్కిలాది యవనులు పాఱిపోయివచ్చినప్పుడు వారితో సంబంధములుకల యనేక క్షత్రియకుటుంబములు గూడ పాఱిపోయివచ్చినవి. వారందఱు శకకిరాత దేశముల యందు నివాసము లేర్పఱచుకొనిరి. అపుడు చక్రవర్తియే వారి యనేకకుటుంబములను ధనమిచ్చియు, లాలసపెట్టియు

వారిని పాఱఁద్రోలెను. వారు శకకిరాత దేశములయందు స్థావరము లేర్పఱచుకొనిరి. చక్రవర్తి యానాఁడు యవనులకు నది గడ్డుసమస్య యగుటకే యట్లుచేసెను. అది నేఁడు గడ్డుసమస్య యయ్యెను. యవనులు సహజముగా యవనేతరులను సహింపలేరు. వైదిక ధర్మావలంబులన్నచో వారికిఁ బచ్చిగడ్డి వేసినచో భగ్గుమనును. వైదికులు వారి యాచారములు వేఱు. వారందరితోఁ గలిసి భుజింపరు. అవివక్షితముగా నివాసములు చేసికొనరు. వారికి స్పర్శదోషముకలదు. దృష్టిదోషముకలదు. ఇవి యన్నియు మానవత్వమునకు భంజకములని యవనుల తాత్పర్యము. యవనులలో నింతకంటె దురాచారములు కలవు. వానిని వైదికులు చూపింపరు. మతముపేరిటనున్న యస్పృశ్యత వైదిక మతావలంబుల యందుండఁగా నధికారధనాదులవలనఁ గలిగిన మానవుల తరగతులనుబట్టి యస్పృశ్యత సర్వమానవులయందును గలదు. ఈయస్పృశ్యత యహంకార పూరితమైనది. ఆ యస్పృశ్యత తపోధ్యానాదికములకు సంబంధించినది. యవనులకు తపోధ్యానాదులు లేవందురా? కటకటయోగి మొదలైనవారి విశేషమేమి? ఎట్లయిననేమి? శక దేశమునఁ బహురాజ కుటుంబములు హింసింపఁబడెను. యవనులు ప్రథమలక్షణము యవనేతరుల స్త్రీల నపహరించుట, మానభంగముచేయుట, పురుషులను చంపుట, గృహముల నాక్రమించుట, మిగిలిన వారిని పాఱఁద్రోలుట. ఇట్లు పేదవారైన బహురాజ కుటుంబీకులు శక దేశమున హింసింపఁబడఁగా ధనవంతులై యధికారముకలిగి సమర్థులైన క్షత్రియులు మనసులలో గుడుసుళ్ళు

పడుచు రాజ్యమునకుఁ జెడ్డరోజు లెప్పుడువచ్చునని యెదురు చూచుచుండిరి. గూఢచారి యధికారులైన మేఘస్వాతియుఁ, బులోముఁడును, పూర్ణోత్సంగుడు, సరిష్ముఁడు నన్న నలువురు శకదేశములోఁ జేరి యీ రాజకుటుంబములయందు వారిమనసులలోఁగల కోపాగ్నిని విద్రోహాగ్నిగా మార్చిరి. వారు నాల్గువేలమంది క్షత్రియులు. అదియొక సైన్యముగా సమకూడుటకు వేళాది నిర్ణయము చేయఁబడినది. చక్రవర్తి గాంధారాధిపతినిఁ బిలిపించెను. కేకయాధిపతినిఁ బిలిపించెను. సౌవీర సింధు దేశాధిపతులను బిలిపించెను. గాంధార కేకయాధిపతులు నాభాగాది గూఢచార్యధిపతుల సాయముతో కటక సింహపురోత్తర జ్యోతిష దేశముల యెల్లలలోనున్న రహస్యాయుధ నిర్మాణాగారములను ధ్వంసము చేయవలయునని యాజ్ఞాపించెను. సౌవీరసింధుపతులు బర్బరదేశమును వశము చేసికొనవలయును. మాతృగుప్తుఁడు కామలహరి వంగివచ్చినచో దారదుల యశ్వసేనతో నుత్తర బాహ్లికముయొక్క ప్రాగుత్తర భాగములనుండి యాదేశముమీఁద దండెత్తవలయును. ప్రస్తుత మురగదేశ సైన్యమంతయుఁ దుంజి నాధీనమై యున్నది. మృగేంద్రసింహుఁడు తుంజినునకు బాసటగా నుండెను. వీరదత్తుని బంధింపవలయును. అవసరమైనచోఁ గొంతయాశ్వికదళము నుపయోగింపవలయును. ఈ సర్వములైన దండయాత్రలు నొక్కసారి జరుగవలయునుగా నిర్ణయింపఁబడెను. గాంధార కేకయదేశముల సైన్యములు నాభాగ మురారిభట్టుల సాహాయ్యముతో రహస్యాయుధ నిర్మాణ కర్మాగారములను సులభముగా వశము చేసికొనెను.

ఉరగదేశసేనలు వ్యవహారము తమ తలకుమించి యున్నదని తెలిసినతోడనే మెత్తఁబడిపోయెను. వారి సేనాపతియు, వీరదత్తుఁడును బంధితులైరి. ఒక్కసారి కిరాతదేశము భగ్గుమని మండెను. కటకదేశ సేనాపతి శకకిరాత దేశముల సైన్యములు తనకుఁ దోడువచ్చుననుకొనెను. అదియేమియు జరుగలేదు. సౌవీరసింధు సేనలు బర్బరోత్తర జ్యోతిషముల యందుఁ బ్రవేశించెను. రేపీసేనలు వచ్చును. ఈనాఁడా పల్లెలనిండ టికటికసంగీతము నిండిపోవుచుండెను. ఆసంగీతములో నేమి మహిమ యున్నదో! జనులందఱు సింధుసౌవీర దేశసేనలకు నివాళి యెత్తుచుండిరి. యుద్ధమొకచోటనైనచో సైన్యమును సమీకరింపవచ్చును. ఏ సేనాసముదాయమును మూఁడునాల్గు వందలకు మించిలేదు. యవనసైన్యమొకచోట వ్యూహమును నిర్మించికొనియుండును. సింధు సౌవీర సైన్యపు ముక్కలు పల్లెలలోఁ బ్రవేశించును. దేశము వారియధీనము నందున్నట్లుండెను. ఈవార్తలు యవనసేనాపతులకుఁ జేరుచున్నవి. వారు చక్రవర్తి సైన్యము వచ్చునని యెదురు చూచుచుండిరి. ప్రధానముగాఁ జక్రవర్తిసైన్యము నోడించినచోఁ గించిత్కరులు వీరేమిచేయుదురని వారు తలంచుచుఁ జిన్నిచిన్ని సైన్యములను వీరిమీఁదికి బంపుచుండిరి. కటక సేనాపతి యుబ్బడగెను. తన యగ్నిగోళ నిర్మాతయైన బైరాగి మురారిభట్టని తెలిసెను. అతఁడిప్పుడొక సేనానాయకుఁడు. అతఁడు నిర్మించిన నగ్నిగోళములు కావు. బూదిగోళములు వెనుకనుండి సాహాయ్యములేదు, దరదోరగ దేశములను మాతృగుప్తుఁడు ప్రమింగి కూర్చుండెను బర్బరోత్తర

జ్యోతిషభాగములయందు సింధుసౌవీర సైన్యములు తాండవించుచుండెను. కిరాతదేశ మంతర్యుద్ధములలో మండిపోవుచున్నది. రూమ్యకుఁడు దారదుల దాడిని తట్టుకొను బాధలో మునిగియుండెను. బరువంతయుఁ గటకటయోగిమీఁదఁబడెను. అతఁడు కిరాతదేశమును సంబాళించుకో లేకుండెను. రామఠహారహూణ దేశసైన్యములను తరలించుకొనివచ్చి బర్బరోత్తర జ్యోతిషములందలి సింధుసౌవీరసేనల యొద్దడినిఁ బాపవలయును. కిరాతదేశమతనిని కదలనిచ్చుటలేదు. ఈయూరిలో క్షత్రియులు చెలరేఁగి యచటనున్న రాజాధికారులను రాజప్రతినిధి గేహములను రాజభటులను నశింపఁజేయుచున్నారు. అక్కడికిఁ బోవునంతలో మఱియొకచోట నిట్లు జరుగుచున్నది. రామఠములలో నితని ప్రతినిధులు కలరు. వారు దేశములోని నిరాయుధులైన చక్రవర్తి యభిమానముగల కుటుంబములను నశింపఁజేయుటయందుఁ జూపిన నేర్పు శత్రువులు దండెత్తివచ్చినప్పుడు ప్రకటింపలేకున్నారు. వారు తేలికగా బర్బరదేశముమీఁదికిఁ బోవచ్చును. ఉత్తర జ్యోతిషముల మీఁదికిఁ బోవచ్చును. కిరాత దేశమునకు నుత్తర జ్యోతిషమునకు నడుమ శకదేశమున్నది. అది చిన్న దేశము. వారు కిరాతదేశమున జరుగుచున్న విప్లవమునుఁ జూచి భీతిపొందుచుండిరి. సింధుసౌవీర సేనలుత్తర జ్యోతిషమును దాటి తమమీఁదికి వచ్చునేమోయని భయపడుచుండిరి. వారు కటకటయోగికొఱకు నిత్యప్రతీక్ష చేయుచుండిరి. ఇట్లుండఁగా నుత్తర జ్యోతిష దేశములయొక్క భూగోళస్థితి చిత్రమైనది. ఆదేశములో నైరుతిభాగమంతయుఁ

బర్వతములు. ఈశాన్య భాగమంతయు గ్రామములు. ఈపర్వతములు వట్టిపర్వతములు. నూటికిఁగోటికొకసారియైన మనుష్య సంచారము మాలిన పర్వతములు. ఆపర్వతములలో మానవున కాహారమన్నది దొరకదు. వేటాడుటకు మృగములు లేవు. ప్రధానముగా తోడేళ్ళును, భల్లుకములు నుండును. లేళ్లు లేవు. అడవిగొఱ్ఱెలుగాని, యడవిమేకలుగాని లేవు. స్వల్పముగా కుందేళ్ళుండును. అవియేమి పెద్ద యాహారము ? అందుచేత నాయడవులు నిర్జనములై యుండును. ఇప్పుడు సింధుసౌవీర సైన్యము ఉత్తర జ్యోతిషముల నావరించి యీశాన్యదిశ నుండి శక దేశములోనికి రావచ్చును. హూణ దేశవాసులు ఉత్తర జ్యోతిషముల మీఁదికిఁ బోలేరు. వారికి వీరికి నడుమ మహాపర్వతములు గాంధార కేకయ సైన్యములకును కటక సింహపురీ సమ్మిళిత సేనలకును యుద్ధము జరిగెను. యుద్ధములో నొక పెద్ద చమువు, మూఁడు దళములు చూచు చుండఁగా శత్రుపక్షమునఁ జేరెను. కటకసింహపుర సేనాపతులు వికలిగిపోయిరి. యవన సేనలు పలాయన సూత్రము పఠించెను. ఇక్కడ నిట్లుండఁగా దరదసేనల మొద్దడి రూమ్యమునకుఁ బ్రాణాంతక మయ్యెను. ఆ రెండు దేశముల యెల్లలు పర్వత మయములు. పర్వతసాను దేశములు దరదసేనావాహినీ పరిపూర్ణములై యుండెను. పర్వతము లన్నియు దారదులైన యాశ్వికులచేత సమాకీర్ణమై యర్ధరాత్రముల యందు దారులు, గ్రామములను దోచుకొనుటలు, తెలవారువఱకు మఱల పర్వత శిఖరముల వెనుక దాఁగుకొనుటయు నిట్లుండెను. రూమ్యకుఁడు

ప్రత్యంత పర్వతసమీప సర్వగ్రామములను నిర్జనము చేయిం చెను. సేనలు దాడి రావలయునే కాని దోచికొనుటలు కట్టువడునట్లు చేసెను. ఉత్తర బాహ్లీకములందలి ప్రధాన సేనకాల్బలము. రూమ్యకుని బలమంతయు నొక్క తన సేన మీఁదనే లేదు. రామఠహార హూణబర్బరోత్తర జ్యోతిష కటకసింహపురోరగాభీర దేశముల సర్వసేనల సమాహారము మీఁద నతని బలమున్నది. రెండు మూఁడు నెలలలో నన్నిటి నొకచోటికి సమకూర్పఁగా కటకటయోగి నిర్ణయించెను. ఈ చక్రవర్తి యంతకు ముందే తన యెత్తు గడను సాగించెను. వ్యక్తులనడుమనేమి, దేశములనడుమనేమి, రాజుల నడుమనేమి ముందుగా సన్నద్ధుఁడైన వానిదిపైచేయి. కటకటయోగి యిట్లనుకొనెను. "అయ్యో! నిమేషధారిని నేను దిగఁద్రొక్కితిని. వాఁడిప్పుడున్నచోఁ గిరాతదేశములు వాని కప్పఁజెప్పి నేను రామఠహార దేశములు పోయియుండును. నే ననుకొన్న పదకమంతయు పాడైపోయెను. నే నొక యవి వేకముఁ జేసితిని. సౌమ్యుని వధింపించి మధుగుంజను కామ లహరికిచ్చి పెండ్లిచేసినచో నా రెండు దేశముల కాల్బలము నాకు సాయపడి యుండెడిది. చక్రవర్తి గూఢచారులు నా కంటెఁ దెలివిగలవారు. వారాపని చేసిరి. కామలహరికి నా మీఁద ద్వేషము పుట్టించిరి. నా శిష్యుఁడైన వాఁడు నా కెదురు తిరిగెను. వాఁడొక మూర్ఖుఁడు. మధుగుంజను తన కిచ్చి పెండ్లి చేయుదురని యాశ పడుచున్నాఁడు. అది జరుగదు. నీవు మా పక్షమున యుద్ధము చేసినచో నీకు మధుగుంజ నిచ్చి పెండ్లి చేయింతుమని వారు మోహపెట్టి

యుందురు. వాఁడావలలోఁబడెను. అయ్యో! చక్రవర్తి రాజనీతికిని మానీతికినెంత భేదమున్నది? మేమూళ్ళుదోఁచుదుము. స్త్రీలకు మానభంగములు చేయింతుము. వారి యూళ్ళు తగులఁ బెట్టుదుము. మాయధీనమున నున్న దేశములలో వారిని నిర్మూలింతుము. వారట్లు కాదే! వారి దేశములలో నున్న యవనులను సైరింతురు. మా స్త్రీలను రక్షింతురు. యుద్ధవేళలయందు మా పథకములను నిర్మూలింతురు. భారతదేశమున నెవ్వఁడో యెప్పుడో చక్రవర్తి వచ్చును. వాని నీతి ముందు భూమ్యాకాశములు పట్టవు. తక్కినప్పుడు వారి దేశము ముక్కలు ముక్కలై బహుజన సమూహము తోడి మా దాడులకుఁ దట్టుకొనలేక మాకు వశమగును. ఇది నేను ప్రత్యక్షముగా నెఱిఁగిన మూఁడువేల యేండ్ల కథ.–అతఁడు కిరాతముల నట్లే యుంచి యచటి సేనాపతులకు జాగ్రత్త చెప్పి తాను హూణహార రామఠములకుఁబోయెను. వారిసైన్యములనను బ్రోవుచేసెను. ఆ సైన్యములన్నింటిని కిరాతదేశాభిముఖముగా నడిపించెను. అతనికిఁ దెలియును. ఇది మొదటి యెద్దడి. ఇంతవఱకు చక్రవర్తిసేనలు రాలేదు. తాను మేల్కొన్నానని యనుకొనెను. చక్రవర్తి గూఢచారులు వాని మేల్కొనుటను నిద్రపోవుటగాఁ జేసిరి. నాయకుఁడు శూరుడైనచో బంట్లు శూరులు. నాయకుఁడు వివేకి యయినచో సేవకులు వివేకులు. నాయకుఁడు సత్పురుషుఁడైనచోఁ బరిచారకులు సత్పురుషులు. ఇది గూఢచారులలో లేదు. చక్రవర్తిలో నున్నది. అతఁడు మహాపురుషుఁడు. నాకుఁ దెలియును. కైలాసముమీఁదనున్న శివుఁడు భారత

దేశమున మఱల వేదధర్మము స్థాపించుటకు గుహ్యకేశ్వరులలో నొకనిని ధాత్రియందు జన్మింపుమని పంపించెను: ఈవందయేండ్లు నేనుచేయునదేమియులేదు. కాని నాయత్నము నేను చేయవలయునుగదా! రూమ్యకున కేమి తెలియును? వీఁడు నితర యవనరాజులవంటివాఁడే! అజ్ఞాని, మూర్ఖుఁడు, స్వార్థపరుఁడు. మందిబలముతో గెలిచి తాను పరాక్రమవంతుఁడనుకొనువాఁడు. ఇంతకును రూమ్యకుఁడు నాబలము చూచికొనికదా యింతవిరోధమును బెంచికొన్నాఁడు. నేను చివరిదాక వానిని రక్షింపవలయును. కటకటయోగి హూణహారరామఠములకుఁ బోయెను. చక్రవర్తి సేన లుజ్జయినీ నగరమునుండి బయలుదేరెను. సర్వభారతదేశము చక్రవర్తికి మున్నెప్పుడో వశమైయున్నది. ఈ పదుమూఁడుదేశములే యతనికి విరోధముగా నుండెను. ఉరగసింహపురీ కటకదేశాధిపతులు పూర్వము తమ తలలువంచి కప్పములిచ్చినవారే. ఇపుడు రూమ్యకుని బలముచూచుకొని యెదురుతిరిగిరి. చక్రవర్తికూడ తన సైన్యముతో బయలుదేరెను. అవంతీంద్రప్రస్థములను దాటెను. దృషద్వతీ సరస్వతులను దాటెను. శతద్రూవిపాశా సుదామాసింధు నదులను దాటెను. చక్రవర్తి సైన్యము పెండ్లికిఁ బోవుచున్నట్లుండెను. దండయాత్రకుఁ బోవుచున్నట్లులేదు. అన్నిదేశములు చక్రవర్తి కధీనములైనవే! ఆయా దేశాధీశుల సైన్యభాగములుగూడ చక్రవర్తి సైన్యములోఁ జేరి నడచుచున్నవి. సింధునదిదాటు వేళకుఁ జక్రవర్తిసేన నాల్గులక్షలు, అశ్వికబలము పదివేలు. ఏనుఁగు లాఱువేలు. చక్రవర్తి కటకసింహపురీ దేశప్రాంత

ములు చేరినంతట గాంధార కేకయ సైన్యములు స్వాగతము నొసఁగెను. కటకసేనాపతి యేమయ్యెనో తెలియదు. కటకాధి పతియు సింహపురాధిపతియు వచ్చి తలలు చక్రవర్తి పాద ములయందుంచి కానుకలిచ్చి తప్పులు మన్నింపుమని కోరిరి. చక్రవర్తి సేనలు మూఁడువిధములుగా విభజింపబడెను. ఒకభాగము బర్బరోత్తర జ్యోతిషములకుఁ బంపఁబడెను. ఆసేన బర్బరములనుండి హార దేశములోనికిఁబోయి హార రామఠ సైన్యము లుత్తర బాహ్లీకములను బాసటగా రాకుండ నాపవలయును. ఒకభాగము శక దేశములోనికిఁబోయి యచటి సైన్యములను సర్జించి కిరాత దేశములోనికి రావలయును. మూఁడవ భాగము చక్రవర్తియొక్క ప్రధాన దండయాత్రాభాగము. సింహపురరాజువచ్చి చక్రవర్తి పాదములపైఁ బడెను. రాజు వానితో నిట్లనెను. “ఓయీ! నీవు మున్ను మాకు సామంతుఁ డవు. ఈనడుమ నీవార్తలన్నియు విపరీతముగా నున్నవి. నీరాజధాని యుత్తరబాహ్లీకములకు నొకమూల సుంత దూరము మాత్రమే యెల్లయైనచోట నున్నది. మే ముత్తర బాహ్లీకములకుఁ బోవలసినచో నీరాజధానిలోనుండి పోవల యును. లేదా చుట్టుతిరిగి శకకిరాత దేశములలోనుండి పోవల యును. మాసేనకు నీరాజధానిమార్గము. మాసేనలు నీ రాజ ధాని నిండ నుండును. నీ రాజధాని నాశనమగును. ప్రధాన యుద్ధ మచ్చట జరుగును. ఏ మందువు? సింహపురపు రాజిట్లనెను. “మహాప్రభూ! ఉత్తర బాహ్లీకముల యెద్దడి మా దేశమునకు లేకుండఁ జేయుటకే మా పూర్వులు మా రాజధాని నచ్చట నిర్మించిరి. మా రాజధాని యచ్చట

నిర్మింపఁ బడినది. కనుకనే మా దేశమును మేము పాలింపఁ గలుగు చున్నాము. రూమ్యకుని యాపద మాకు లేకుండఁ జేసికొనఁ గలుగు చున్నాము. నేను మహాప్రభువు నెడల చేసిన దోసములేదు. నా దేశమునందు వైదికులు హింసింపఁ బడలేదు. వరాహమిహిరాచార్యులు వంటి పండితులు మా దేశములో నుద్భవించినారు; గాని పెఱదేశములలోఁ గాదు. నా దేశమునందలి తూర్పు భాగమంతయు సుక్షత్రియ మయము. వేదమతావలంబించి యవనులు మా కిరుగు పొరుగు వారగుట చేత మేము వారితోఁ బొత్తు నభినయిం తుము గాని యిది మాకు సహజ సిద్ధమయిన దోషముగాదు. మహాప్రభూ! నా దుర్గము నీ యధీనము నందున్నది. నీ సేనలు నా రాజధాని యందు ప్రవేశింపవచ్చును. దుర్గపు బురుజుల మీఁద, కోట గవను మీఁద నీ సేనలనే యుం చుము. నా సేన లొత్తిగిల్లును. నా సేనలో నెవరు విశ్వా స్యులుకారో వారిని దొలఁగించుము. నేను నీకు దాసుఁడను". అంత సింహపురదేశ రాజధాని యయిన సింహపురము రక్షణమంతయుఁ జక్రవర్తి సైన్యము క్రిందికివచ్చెను. ఉత్తర బాహ్లీకముల వైపున పెద్ద యగడిత యున్నది. దుర్గ ద్వారము మూసియుండును. నేఁడది తెఱువఁబడెను. చక్ర వర్తి సైన్యములు. సింహపురీ రాజధాని నిర్మింపఁబడిన యర్ధయోజనము మేర యాక్రమించి చక్రవర్తి యాజ్ఞ కొఱ కెదురు చూచుచున్నారు. చక్రవర్తి యాజ్ఞ యింకను రాలేదు. బర్బరముల నుండి వార్త రావలయును, హారరా మత సైన్యము లచట నిరోధింపఁ బడిన వన్నవార్త కొఱ

కును శకదేశ సైన్యముల పరాక్రమము క్షీణింపఁజేయఁబడిన దన్న వార్త కొఱకును చక్రవర్తి ప్రతీక్షించుచు సింహపురదుర్గద్వారపురః ప్రదేశము నంతయు నావరించి యుత్తర బాహ్లీకముల లోనికిఁ బ్రవేశించుట నెదురు చూచుచుండెను. శకదేశములోనికిఁ బంపఁబడిన సైన్యభాగము కిరాతదేశస్థిత క్షత్రియులతో దక్షిణము నుండియు నుత్తరము నుండి దారదుల యశ్వదళమును, తూర్పు నుండి తన సైన్యము నొక్కసారిగా నుత్తర బాహ్లీకములను ముట్టడించి వశము చేసికొనవలయును. రూమ్యకుని రాజధాని దేశమునకు సరిగా నడిమి భాగమున నున్నది. అదియొక పర్వతము మీఁద నున్నది. అది గిరిదుర్గము. దుర్గము మిక్కిలి బలిష్ఠమైనది. లోన పెద్ద సౌధములు లేవు. అన్నియు సామాన్య శిలా గృహములే. రామఠముల నుండియు, శకదేశము నుండియు వార్తలు వచ్చెను. చక్రవర్తి సైన్యములు బయలుదేరెను. బాహ్లీకాశ్వదళమునకు దారదాశ్విక దళమునకుఁ దూర్పున యుద్ధము జరుగుచుండెను. రూమ్యకుఁడు తన కొంత సేనను కిరాతదేశము నుండి వచ్చు నాపద నొడ్డుకొనుటకుఁ బంపెను. కటకటయోగి దగ్గఱలేకపోవుట రూమ్యకునకు నధైర్యహేతు వయ్యెను. కాని కటకటయోగి హారరామఠ సైన్యముల నిరోధము కన్నులతోఁ జూచి యచట చేయునదిలేక హూణ సైన్యమును తీసికొని బయలుదేరెను. అతనికి సమస్య కలిగెను. ఈ సైన్యమును కిరాత శకదేశముల రక్షణ కొఱకు వినియోగింపవలెనా రూమ్యకునకుఁ దోడుతీసికొనిపోవలెనా? అతఁడు విచారించి

హూణసైన్యముతో నుత్తర బాహ్లీక రాజధాని నగరమునకే పోయెను. వాని యదృష్టముకొలఁది యీ సైన్యముతో రూమ్యక నగరము చేరునప్పటికిఁ జక్రవర్తి సేనలు రూమ్యక నగరమును ముట్టడింపలేదు. ఈసేనలన్నియు దుర్గాంతర్భాగ మునకుఁ జేరెను. రాజు కటకటయోగినిఁ జూచెను. అతని ప్రాణములు లేచివచ్చెను. అతనికోటలో పదివేల సైన్య ముండెను. హూణులు రెండువేలమంది వేయి యాశ్విక దళము దారదులతోఁ బోరాడుచున్నది. మూఁడువేల మంది కిరాతములనుండి వచ్చుసేన కెదురుపోయిరి. చక్రవర్తి సైన్యమటు లక్షయున్నది, యిటులక్షయున్నది. ఇందొక్క టియే లాభము, తమసేనలు పర్వత యుద్ధనిపుణములు. చక్రవర్తి సేనలకు పర్వతములయందు యుద్ధము చేయుట యలవాటులేదు. వారికి సంఖ్యాబల మున్నది. కటకటయోగి యిట్లనెను. 'నీవు దుర్గాంతమున నుండుము. నేను దుర్గము వెలుపలకుఁబోయి బహుసేనలకుఁ బరామర్శింతును. వారికి మాయోపాయములు నేర్పుదును. శత్రుసైన్యములు వారిని నిర్జింపలేనట్లు చూతును' రూమ్యకుఁ డంగీకరించెను. కటకట యోగి కోటవెలుపలికి వచ్చెను. బాహ్లీకసేన యెచ్చటను వందమందికంటె నెక్కువ యుండకుండఁ జేసెను. వారువాగు లలో దాఁగికొందురు. చిన్నిచిన్ని గుట్టలవెనుక పొంచి యుందురు. హఠాత్తుగా, గుహలోనుండి వెలికివత్తురు. ముందుకువచ్చిన చక్రవర్తి సైన్యభాగము వెనుక సాక్షాత్క రింతురు, చక్రవర్తి సేనకు బరువైపోయెను. లక్షసైన్యము పనికి రానట్లయ్యెను. చక్రవర్తి యూహించెను. తనసేనలో

నేఁబదివేలసేన సూటిగా రూమ్యకనగరము మీఁదికిఁబోవల యును. తక్కిన యేఁబదివేలసేనను ఖండఖండములు చేసెను. ఏఖండము ముందఱనున్నవారు, ప్రక్కనున్నగుట్ట వెనుక భాగము, వృక్షాగ్రములు, శిలాగ్రములు పరీక్షింపఁబడకుండ ముందుకుఁబోరాదు. నాభాగుఁడు ప్రధానసేనవెంట రూమ్యక నగరమునకుఁ బోయెను. చక్రవర్తి సామాన్య సైనికుని వేషము వేసికొనిపోయెను. ఈ సైన్య ఖండములను దనయదు పులోఁ బెట్టికొనెను. యవన సైన్య ఖండముల వెనుకనున్న యోధాగ్రణి యెవఁడు? వానిజాడలు తీయుటకు వేయి మందిని నియమించెను. వారందఱును నశించిరి. కాని ముప్పురు నల్సురువచ్చి వాని పోలకువ చక్రవర్తితోఁ జెప్పిరి. చక్రవర్తి యొకనాఁటిరాత్రి వాఁడున్నాఁడన్నచోటు ముట్టడించెను. అచట తీవ్రయుద్ధము జరిగెను. వాఁడుతప్పించి కొనిపోకుండ దాను తన గుఱ్ఱముమీఁద నెనిమిది దిశలయందు పరవళ్ళుత్రొక్కెను. వాఁడు వాని పరిమిత సంఖ్యాకమైన సైన్యము నశించిపోఁగాఁ జక్రవర్తి యెదుటనొక్కఁడు ఖడ్గ ధారియై నిలఁబడెను. ఇతఁడు చక్రవర్తియని వానికిఁ దెలి యదు. చక్రవర్తి తక్కిన సైనికులను నివారించెను. వానితోఁ గత్తియుద్ధము చేయుచుండెను. వానియందు శ్రీ విక్రమార్క చక్రవర్తి నిలువలేకుండెను. చక్రవర్తి యేనిముసమునఁ బడిన నానిముసమున వానికత్తి కెఱయగునని తక్కిన సేన యనుకొనుచుండెను. చక్రవర్తి డస్సిపోయెను. ఆయన చాల వృద్ధుఁడు. అప్పటికిఁ జక్రవర్తివయస్సు తొంబదియేండ్లు. ప్రతిస్పర్థియిట్లనెను. 'నీవు వృద్ధుఁడవు. నేను నీకంటె వృద్ధుఁ

డను. నీకుఁ దొంబదియేండ్లు. నావయస్సు మూఁడువేల యేఁబదియేండ్లు. అంతలోఁ జక్రవర్తి మనస్సున నొకమెఱపు మెఱసెను. హిమాలయ పర్వతములయందు తనకు వీణ నేర్పినవాఁడు, తనకు యోగభ్యాసము నేర్పినవాఁడు, తన జన్మవృంత్తాంతము చెప్పినవాఁడు, గురువైనమహానుభావుఁడు శ్రీ మధుసూదనయోగి సాక్షాత్కరించెను. చక్రవర్తి కంతయు భాసించెను. తనగురువు తుదకు వీనితోఁ దాను యుద్ధమాడవలసి వచ్చునని చెప్పెను. వానిని వధింపవల దనెను. వాని నుజ్జయినీ నగరమునకుఁ గొంపోవలయును. చక్రవర్తి వానికత్తి నొడ్డుకొని సైన్యమునకు సన్నచేసెను. వారు చుట్టివచ్చిరి. వారు రెండు వందలమంది. వందమందిని వాఁడు హతమార్చెను. తక్కిన వందమందిలో తుంజినుఁ డుండెను. తుంజినుఁడు వానిరెండు మనికట్లమీఁద గాటము లైన దెబ్బలు కొట్టెను. వానిని పట్టుకొనిరి. బందిచేసిరి. చక్రవర్తి వానితో నిట్లనెనుఁ 'నీపేరేమి ?'

వాఁడు :- నాపేరు కటకటయోగి.

చక్ర :- కాదు, నీపేరు జయద్రథుఁడు

వాఁడు :- అది యెప్పటిదో నాపూర్వపుపేరు.

వానిని బందిగా సింహపురమునకుఁ బంపి చక్రవర్తి యవనసైన్య ఖండముల నేరిఏరి వధించి రూమ్యక నగరాభి ముఖుఁడై పోయెను. రూమ్యకనగరమునకుఁ బోవుపరికి నగ రము తన సైన్యమున కధీనమై యుండెను. నాభాగుఁడు రూమ్యకునితో యుద్ధముచేసెనట. రూమ్యకుని బంధించెను. చక్రవర్తి సైన్యములచట నెలదినములుండెను. అచటినుండి

చక్రవర్తి సైన్యములు హూణహార రామఠ బర్బరోత్తర జ్యోతిష శకకిరాత దేశములన్నియు బోయి యచటిరాజు లందఱ నరిగాపులఁ జేసికొని యచట తన ప్రతినిధులనుంచి ప్రతిస్థలమునందుఁ గొంతకొంత సామ్రాజ్య సైన్యమునుంచి యురగ దేశమునకువచ్చి కామలహారినిఁ జూచెను. కామల హారి చక్రవర్తి తన్నేమో చేయునని యెంతమంది చెప్పినను వినక తానాత్మహత్య చేసికొనెను. ఇంతదూరమును బంధితుఁ డైన రూమ్యకుని చక్రవర్తి తనవెంట తీసికొనుచునే వెళ్లెను.

చక్రవర్తియు వరాహమిహిరాచార్యుఁడును మఱల నుత్తర జ్యోతిషములకుఁ బోయిరి. ఆతటాకము నొద్దకుఁ బోయిరి. ఆగుహలోనికిఁ బోయిరి. అచట మిత్రగుప్తుఁడును, మురారిభట్టును చక్రవర్తి పాదములపైఁ బడిరి. సవ్యసాచి కాయన చక్రవర్తి యని తెలిసెను. వేదవతి తన తండ్రివంకఁ జూచెను. ఆమె మనసులోఁ బదుమూఁడేండ్లు గిఱ్ఱున తిరిగెను. సూర్యకిరణములు సూటిగా వ్రాలినట్లు, దక్షిణదిశగా వ్రాలి నట్లు, మిక్కిలి దక్షిణముపోయినట్లు, మఱల వెనుదిరిగి వచ్చి నట్లు, నుత్తరమునకుఁ బోయినట్లు దూరముపోయి మఱలఁ దిరిగివచ్చినట్లు, ప్రాతఃకాలమైనట్లు. రెండుజాములైనట్లు, ప్రొద్దుగ్రుంకినట్లు, చంద్రోపరాగముకలిగినట్లు, అధికమాసము వచ్చినట్లు, క్షయమాసము సంభవించినట్లు. వేదవతి తండ్రి వంకఁ జూచుచు నిలుచుండెను.

# పందొమ్మిదవ యధ్యాయము

విజయలక్ష్మీ సనాథమయిన చక్రవర్తి సైన్యము మఱల నుజ్జయినీ ముఖముగా నడచెను. సైన్యమునకుముందు రెండు గుఱ్ఱముల మీఁద బంధితులిద్దఱును తీసికొని రాఁబడు చుండిరి. వారి చేతులు బంధింపఁబడి యుండెను. వారి కిరు దెసల నాయుధ పాణులైన యాశ్వికులు నడచు చుండిరి. వారికి ముందుఁ గొంతసైన్య ముండెను. వారికిఁ వెనుకఁ గొంత సైన్యముండెను. ఉజ్జయినీ పురాభిముఖమై వచ్చు చున్న సైన్యమున కిది ముఖముగా నుండెను. దాని వెనుక చక్రవర్తి మహాభద్రానేకపము నెక్కి యుండెను. ఆయేనుఁగు తాళవృక్ష ప్రమాణముగా నున్నది. ఆ పైనఁ గూర్చున్న చక్రవర్తికి బంధితు లిద్దఱు కనిపించుచుండిరి. చక్రవర్తి యిరు దెసల నంతకంటెఁ గొంచెము తక్కువైన యెత్తుగల యేనుఁగుల మీఁద మంత్రులను కొందఱు సామంతులును వచ్చుచుండిరి. ఈ యేనుఁగుల వెనుకఁ గొంత గుఱ్ఱపు దళము. ఆ వెనుక మఱల నేనుఁగులు. ఆ వెనుక మఱల కొంత యశ్వసైన్యము. ఆ వెనుక పదాతులు. ఆ వెనుక మఱల నేనుఁగులు. ఇది యంతయు యర్ధయోజనము మేర పొడుగుగా నడచుచుండెను. ఇంతపొడుగున రెండు వైపుల నైదుగురుసైనికులు వెడల్పుగా కాల్బలము, వారికిదెసలయందు నశ్వసైన్యమును నడచుచుండెను. ఆయశ్వసైన్యము కెలన రథ ములు వచ్చుచుండెను. బంధితులకు ముందు మిక్కిలి యెడ ముగా నాల్గువందల రథములు పోవుచుండెను. ఈ మహావా హిని దృషద్వతీ నదిని దాటిన తరువాత వరాహమిహిరునకు

ప్రస్థావంతీ రాజ్యములగుండ నుజ్జయినీ రాజ్యము చేరెను. గ్రామగ్రామముల యందు నీ మహా సైన్యమునకు నారతు లిచ్చిరి. లాజలు చల్లిరి. ఏన్గులఘీంకారములతో ముత్తైదువుల కంఠములు కలసిపోయెను. ఉజ్జయినీ నగరము ప్రవేశించిరి. సైన్యమంతయు నెవరి విడుదులకు వారు పోయిరి. మఱు నాఁడుమహాసభ. విజయసభ. ఆ రాత్రి యంతయు నుజ్జయినీ నగరమంతయు నృత్యములతో సంగీతములతో మేళ తాళములతో నిద్రయే పోలేదు. మఱునాఁడు సూర్యోదయ మయ్యెను. సూర్యదేవుఁడు తన సహస్ర కిరణములతో ననంత సహస్రములైన జీవకోటుల నొక్కొక్క కరమున న్యర్బుదాదికమైన జీవులను సమానముగా స్పృశించెను. ఒక్క కరముతో నొకనిని స్పృశింప వచ్చును. సూర్యదేవుని కరముల లక్షణ మెట్టిదో తెలియదు. వాని కరచేయి కలదా? వ్రేళ్ళున్నవా? ఒక్క కరములో ననంతకోటి జీవ కోటులను స్పృశించుట యెట్లు? కరమనఁగా కిరణ మందము. ఒక్క కిరణములో మాత్రము బహువిస్తారమైన ప్రదేశమును స్పృశించుట యెట్లు? వెలుఁగున కభివ్యాప్తి లక్షణము. ఆ యభివ్యాప్తి జరుగును అన్నచో వెలుఁగున కభివ్యాప్తి యెచ్చట నుండి వచ్చినది? సూర్యకిరణము పడినంత మాత్ర మున వస్తువు ప్రకాశించుట యెందుకు? సూర్యకాంతి లేనపుడు కనిపించక పోవుట యేమి? సూర్యకాంతి ప్రసార మాత్రమున కనిపించుట యేమి? కనిపించుట యన్నది సూర్యకిరణమునకుఁ గాదు. అనఁగా సూర్యకిరణ గత లక్ష ణముకలదు. కనిపించు వస్తుగత లక్షణముకాదు. ఈ కనిపిం

చుట యన్నది యెవ్వఁడో చూచెడు వానికి జరుగుచున్నది. చూచెడి వాఁడు లేనిచో? వస్తువునందు వస్తుత్వము లేదో? సూర్యకిరణము నందు సూర్యకిరణత్వము లేదో? అవి రెండును వృథా యగునో! ఈ సర్వ సృష్టియు చూచెడు వాని మీఁద నాధారపడి యున్నదో! వెలుఁగు వచ్చెను. ప్రకాశింపఁ జేసెను. ప్రకాశించెను. అనఁగా తత్ప్రకాశావగతి యెవనికో కలిగినప్పుడే యది ప్రకాశించుట కదా. ఇట్లే సర్వ సృష్టియు చూచెడివానిమీఁద నాధారపడియున్నది. ఒకమహా పర్వతమున్నది. అచ్చటకాంతారమున్నది. అచట జంతువులే లేవందము. సూర్యోదయమైనది. ప్రయోజనమేమి? తెల్లవాఱి నదనివిహరింప నారంభించు జీవులులేని కాంతారమున సూర్య కిరణప్రసారమువలన నేమిలాభము? అట్లుకాదు. ఆకాంతారము మీఁద సూర్యకిరములుపడవలయును. కాంతారవృక్షపత్రముల మీఁదనున్నహిమబిందువులు తొలఁగ వలయును. అచటను గాలియాడవలయును. నేలమెండవలయును. మంచుకురియవల యును. చెట్లు వృద్ధిపొందవలయును. అదికాంతారము కావల యును. లేనిచో చెట్లు మొలవదు, చెట్లు వృద్ధిపొందదు. గాలిచేత, సూర్యకిరణములచేత, మంచుచేతఁ బక్వమైనప్పుడు గాని కాంతారము కాంతారముగా లేదు. అచట ద్రష్టలేఁ డందమా? ద్రష్టయుండి యేమిచేయును? వట్టి దర్శనమాత్ర మున ప్రయోజనమేమి? దర్శనమనగానేమి? ఒక గొప్ప తటాకమున్నది. దానినిండ కమలములున్నవి. హంసలున్నవి. తీఁగలున్నవి. మనము దానినిఁజూచితిమి. చూచినంతమాత్ర మున నేమైనది? ఎంత రమణీయముగా నున్నదని యను

కొన్నామము. చూచినవెంటనే యనుకొనుట జరిగినది. పట్టి యనుకొనుటలో నేమున్నది? ఆయనుకొనుట యెట్టిది? తద్రామణీయ కానుభూతి పూర్వకమైనది. అనుభూతియనఁగా ననుసరించియుండుట. ఆరామణీయకము ననుసరించి నీవుంటివి. అనఁగా నారామణీయకమచట నున్నదని యర్థము. అది యున్నదా ? నీవు చూడకముందుఁగూడ నున్నదా ? ఉన్నది. ఉండుటయనగా నేమి ! ఉన్నంతమాత్రముచేత నేమిమైనది ? ఏమి కావలయును ? నీవుచూచి యానందించినతరువాత నే యాయున్నదాని యునికికిఁ జారితార్థ్యమా ? అని నీవనుకో వచ్చును. అది యనుకొనదు. అది యుండును. అట్లే సూర్య కిరణములు వానియంతటనవి ప్రసరించును. ఉండును. ఉండుట యెట్టిదో ప్రసరించుటయు నట్టిదే. తత్ప్రసరణము వలన మఱి యొకఁడేదో దీప్తమగుటచేత దీపించిన దాని లక్షణముచేత సూర్యకిరణములు కాధిక్యములేదు. అవి వికారము పొందవు. అవినిత్యములు. ఇట్లుండగా నొక చమత్కారమున్నది. ఆతటాకముయొక్క రామణీయకమున్నది. అది మహా కాంతార మధ్యస నున్నది. అడవిజంతువులున్నచోఁ దటాకమున నీళ్ళు త్రావును. హంసలున్నచో బద్మ ములనడుమ సంచరించును. ఆవనజంతువులకు నా మరా ళములకుఁ దత్తటాక సౌందర్య జ్ఞానములేదు. వానికి వెసులు బాటున్నదేమో ? సౌందర్య జ్ఞానముగూడ గలదేమో మనకుఁ దెలియదు. మానవుఁడు చూచును. ఆజంతువులతో నాయీదుచున్న మరాళములతోఁ గలిపి యది యంతయు సుందరముగా నున్నదని యితఁడు భావించును. ఒక కిరా

తుఁడు భావించునా ? ఆజంతువులలో నొకదానిని ఈ మరాళములలోఁ గొన్నింటినిఁ జంపి తన క్షుత్తునాప్పుకొనుఁ పశులక్షణముగల కిరాతుఁడు తత్సౌందర్యాస్వాదన తత్పరుఁడు కాలేఁడు. వాఁడుగూడ జన్మచేత మానవుఁడేకాని ప్రకృతి చేత నావనజంతువులవంటి వాఁడు. హంసలవంటి వాఁడను టకువీలు లేదు. వనజంతువు లన్యజంతువులను హింసించి బ్రదుకును. వానికి బ్రదుకే పరమార్థము. హంసలుగూడ నట్లే జీవించునా ? అవియుఁగూడ కీటకములను సంహరించి తినును. కాని ప్రధానముగా శైవాలము మీఁద బ్రదుకును. పద్మపత్రాంచలముల మీఁద బ్రదుకును. మృణాళ నాళముల మీఁద బ్రదుకును. హింసయన్నను యీ ముద్విధములైన జంతువులలో నున్నది. మరాళములయందున్నది. కాంతార జంతువుల యందున్నది. కిరాతుని యందున్నది. తారతమ్య వివక్షచేత కిరాతుఁడు దుష్టుఁడఁగుచున్నాఁడు. కాంతార జంతువులు వధ్యములగు చున్నవి. మరాళము వధ్యమగుట లేదు. వధ్యముగాఁ జేయఁబడుచున్న మరాళముచేతఁ కిరాతుఁడధికకిరాతుఁ డగుచున్నాఁడు. కిరాతుఁడు కాని మానవుఁడు దీని నంతయు సౌందర్యరాశిగా భావించుచున్నాఁడు. వాని కంటె నింకొకఁడు దానినిఁ జూచుచున్నాఁడు. నిశ్చలుఁడగు చున్నాఁడు. ఇది యంతయు నేమియులేదు. భూమియు, జలమును, వాయువును, సూర్య కిరణములును కలిసి పొందిన మహా వికారమని భావించుచున్నాఁడు. ఇది యింత విచిత్రముగా నున్నది. ఒకని కిచ్చట నేమియులేదు. మఱియొకని కిచ్చట సౌందర్యము పండినది. ఇంకొకని కిచ్చట నవ్యాహత

మైన భోజన పదార్థ సంపాదనా భూమిగా భాసించుచున్నది. మఱికొన్ని యవి యున్నవి. ఆ యునికి భావనా విరహిత మైన, ఆలోచనా విరహితమైన జీవుల యందుఁ గూడ నున్నది. ఆ యునికి యన్నది యుండఁగా నీ సౌందర్య విజ్ఞాతయందు నా వైరాగ్య చిత్తునియందు భావనా సమ్మ్మిశ్రితమైన, యొక విలక్షణమైన యధికచైతన్యము కలదు. ఒకటి యుండుట. రెండవది దానినిఁ గూర్చి యూహించుట. మూఁడవది దాని వలన ప్రయోజన మందుట. ప్రయోజ నము భిన్నముఁగా నున్నది. కిరాతుని యందాహార సంపాద నముగా నున్నది. భావుకునియం దానంద హేతువుగా నున్నది. యోగి యందుఁ దద్వస్తుగత వస్తుత్వమాత్ర పరి జ్ఞానముగా నున్నది. వస్తుగత వస్తుత్వమాత్ర పరిజ్ఞానము గాని, తదానందానుభూతి గాని కిరాతునకుఁ గాని కాంతార సంచర జంతువులకుగాని, తటాక విహరన్మరాళసంచయము నకుఁ గాని లేదు. సూర్యకిరణములు ప్రసరించు చున్నవి. కిరణముల యందు జ్యోతిస్సను పదార్థము కలదు. ఆ జ్యోతి స్సునకు నేను జ్యోతిస్సన్న యభిజ్ఞ కలదో లేదో! ఇది సూర్యకిరణగత జ్యోతిస్సన్న యభిజ్ఞ యుజ్జయినీ మహా నగరవాసు లందఱ కున్నది. బంధితులైన కటకటయోగికిని రూమ్యకాధి పతికిని గూడఁ గలదు. వారీ సూర్యకిరణగత జ్యోతిస్సును పూర్వము నెఱుఁగుదురు. ఇచటను జూచు చున్నారు. ఈసూర్యకిరణగత జ్యోతిస్సు వారికి వారి దేశముల యందు నానందహేతువైనది. ఇచ్చట నగుటలేదు. చక్ర వర్తి వారిని గెలిచి బంధించి తీసికొని రానప్పుడు వారా

సూర్యకాంతి వలనఁ బొందిన యానంద మొకటున్నది గదా! ఇప్పుడుజ్జయినీ నగరవాసులొక యానందమును బొందుచున్నారు. ఈ యానందమునకు నా యానందమునకు సంబంధ మున్నదా? తెలవాఱినది. కీటకములకుఁ దెలవాఱెను. జంతువులకు దెలవాఱెను. మానవునకుఁ దెలవాఱెను. రాజునకుఁ దెల్లవాఱెను. పేదవానికిఁ దెల్లవాఱెను. ఈ తెల్లవాఱుటలో నిన్ని భేదములు గలవు. ఆ భేదము లన్నియు తెల్లవాఱుచు కొన్ని జీవులయందున్నవిగాని తెల్లవాఱుట యందు లేదు. నిర్జనమై నిర్జంతువై నిష్కూరాతమైన కాంతారము నందెట్లు తెల్లవాఱినదో చక్రవర్తి సైన్యముచేత నాశనమైన సైన్యములు గల యవన దేశము నందెట్లు తెల్లవాఱినదో విజయలక్ష్మీ సనాథమయిన యుజ్జయినీ నగరము నందుఁ గూడ నట్లే తెల్లవాఱినది.

భవనము అనగా నుండుట. అనుభవము అనగా ననుసరించి యుండుట. భవనము నందు నూహ భవనమునందే యిమిడి యున్నది. అనుభవము నందలి యూహ విడిగా నున్నది. భవన మొక్కటియే! అనుభవము నందు రెండున్నవి. రెండు వచ్చి నంతనే రెండవవాని నాశ్రయించి యనంత భేదములు సమకూరు చున్నవి. ఇప్పుడుజ్జయినీ నగరవాసులు సూర్యకిరణ ప్రకాశము ననుభవించుచున్నారు. అనంతవిధానుభూతులయందు నేటి యుజ్జయినీ నగర వాసుల సూర్యకిరణ ప్రసారాను భవములో నొక వైలక్షణ్యమున్నది. అనుభూతులన్నియు నొక్కటికావు. వైలక్షణ్యమునొక్క వైలక్షణ్యముచేత నవి భిన్న భిన్నము

లగును. ఉత్తమాధమములగును. అంతేకాదు. ఉత్తమ మధ్యమాధమ విభేదము పొందును. ఈమూఁడు విభేదము లొక్కొక్కటి యనంతవిభేదములు పొందును. ఈ యుజ్జయినీ నగర నివాసుల యిప్పటి యనుభూతి యీమూఁడింటిలో నేది? ఇతఃపూర్వోదిత వస్తుగత వస్తుత్వ పరిజ్ఞాన, తదనుభూతి విశేష, తద్భావనా విశేషముల యందన్నింటియందు జంతుహింసాదిక లక్షణోత్పత్త్యా భాసమానమైన వాని యందు నధికత్వము కనఁబడుచున్నట్లు కనిపించు చున్నది. అనఁగా హింసయెందెందు తక్కువ తక్కువగా కనిపించునో యందందు జీవలక్షణముయొక్క యధికాధికత్వము భాసించు చున్నది. కిరాతునికంటె భావుకుఁ డధికుఁడు. ఎందుచేత? ఒకటి భావించుటచేత, రెండు హింసాల్పత్వముచేత. భావుడుఁకు భావించిన మాత్రముచేత నతఁడహింసా మూర్తి యనుటకు వీలులేదు. అతఁడును భోజనము చేయ వలయును. అంత భావుకుఁడైకూడ మాంసాది భోజనము చేసెడివాఁడు కావచ్చును. లోకములో నొక సామెత యున్నది. ఎంతమంచి బ్రాహ్మణుఁడైనను సంవత్సరమున నేనుఁగు తలకాయయంత మాంసము తినునని. సృష్టియందున్నదంతయు సజీవము. దానిహింస హింసయే. నేను వట్టి గాలిపీల్చి బ్రదుకుదును. నేను వట్టి నీరముత్రావి బ్రతుకుదును. గాలియందుఁ బ్రాణులున్నవి. నీరమునందుఁ బ్రాణులున్నవి. వానిని లోనికి స్వీకరించునపుడు ప్రాణిహింస జరుగుచునే యున్నది. మనము లోనికిఁ బీల్చుచున్న దాని పేరు ప్రాణవాయువు. ప్రాణవాయువనఁగా బ్రాణమును బోషించు

వాయువనియా, ప్రాణసహిత వాయువనియా ! దానియందుఁ ప్రాణములేనిచో మనప్రాణము నది పోషింపఁజాలదు. నది పొంగవలయున్నచో వేఱజలమువచ్చి దానిని పోషింపవలయును. అందుచేత హింసలేకుండ నేదియు బ్రతుకదు, పోషింపఁబడదు. హింసయందుఁ దారతమ్య వివక్షకలదు. తన బంధువుల నందఱను జంపుటహింస. ఈహింస నేను చేయనని యర్జునుఁడనఁగా తద్ధింసాస్వరూపము భగవంతుఁడు చెప్పెను. అన్నియు తమస్థితియందే హింసింపఁబడియున్నవి. పరమేశ్వర మహాస్వరూపము నందన్నియు నశించియే యున్నవి. వానిబ్రదికియుండుట భాసమాత్రమైనది. హింస లేకుండ బ్రతుకుటకు వీలులేదు. హింసలోఁ దారతమ్యమున్నది. ధర్మాధర్మములున్నవి. కాని యాథార్థ్య పరిజ్ఞానసహితమైన హింస, యపరిహరణీయమైన హింస హింసకాదని యనుకొననిచో లోకము సాగదు. పెద్దపులి లేడినిఁజంపి తినును. అది హింసయే. హింసాజ్ఞానము పెద్దపులికి లేదు. క్షుధాపనయనమను భావమే కలదు. అది పశువు. కిరాతుఁడు మృగమును హింసించి పొట్ట పోసికొనుచున్నాఁడు. వీడు బ్రతుకుట కన్యమార్గమున్నది. ఇది పరిహరణీయమైన హింస. వాఁడాహింసను హింసగా భావింపఁడు. వాఁడు కిరాతుఁడు. నాగరకుఁడున్నాఁడు. హింసాజ్ఞానము కలవాఁడు. మాంసభోక్త. ఆభోజనముకొఱకు తాను హింసింపఁడు. ఇతరులు చేయు హింస నంగీకరించును. ఇతఁడొక విధమైనజీవి. వాని జీవనమునందు హింసావాసన కలదు. మఱియొకఁడున్నాడు. వాఁడు తన యాహారముకొఱకు జంతుహింసచేయఁడు. జంతు

హింసాస్పర్శకల యాహారము భుజింపఁడు. శాకాదుల నాహా రించును. శాకాదులయందుఁ బ్రాణమున్నది. ఇదిపరిహార్యము కాదు. ఆహింస తప్పదు. హింసయొక్క హింసత్వము వధింపఁ బడెడివానియందలి దృశ్యమానబాధాధిక్యముచేత బాగుగా గోచరించును. ఒకరాజున్నాఁడు. శత్రువును సంహరించుచున్నాఁడు. ఈరాజు ధర్మావలంబి యందము. ఆశత్రు వధర్మావలంబి యందము. ధర్మావలంబియో, యధర్మావలంబియో కత్తిపెట్టి నఱికినపుడు జీవుఁడు పడెడిబాధ సమానమే. ఈ ధర్మావలంబియైన రాజు చేసినహింస హింస యెందుకుగాదు? హింసయే! కాని యితఁడు చేయకతప్పదు. దైవవశమున నధర్మావలంబియైన రా జధికబలవంతుఁడైనచో వాఁడును ధర్మావలంబియైన రాజును జంపును ఇచటి ప్రశ్న హింసయన్న దానిని మించిపోయి ధర్మాధర్మ వివిక్త నాశ్రయించుచున్నది. ధర్మాధర్మముల నిర్ణయించు వాఁడెవఁడు? ఒకనికధర్మమైనది మఱియొకనికి ధర్మము. ఒకనికి న్యాయ్యమైనది మఱియొకని కన్యాయ్యము. ఈ ధర్మాధర్మములను న్యాయ్యాన్యాయ్యములను వాఁడు వాఁడనుకొనుటలో నున్నవా, లేక వేఱెవరైన నిర్ణేతయున్నాడా? ఒక నిర్ణేత్రు వాక్యము వాని నిర్ణేతృత్వము నంగీకరించిన యిద్దఱియందు సమాన ప్రామాణ్యము పొందునుగాని వారిలో నొకఁడు తన్నిర్ణేతృత్వ మంగీకరింపనిచోఁ బ్రామాణ్య విరహిత మగును. యవనులకు భారతీయులకుఁ బ్రమాణ సమానత లేదు. విక్రమార్క చక్రవర్తి యవనులను హింసించె ననవలయును. చక్రవర్తి ధర్మమును నిలఁబెట్టెననఁగా భారతీయుల

కొక ధర్మమున్నది. దానిని నిలబెట్టెననియే యర్థమా? ధర్మమనునది స్వయంవ్యక్తిత్వము కలది యొకటియున్నదా? ఉన్నచో దాని స్వరూపమెట్టిది! భగవత్సంకల్పమిట్లుండును. దాని స్వరూప వివరణ మెంతచేసినను దాని నంగీకరింపనివాఁ డంగీకరింపనే యంగీకరింపఁడు. వాఁడు దానికి వేఱవ్యాఖ్యానము చేయును. వాఁడు చేసినదానిని వీఁడు దుర్వ్యాఖ్యానమనును. తాత్పర్యమున నేమగుచున్నదనఁగా సర్వము ననంతకాలమునందు నిబిడమైయుండి కాలమే భగవత్స్వరూపమై దాని ప్రకార మది సాగుచు సాగినతరువాత ఫలితమును కొందఱు విచారించినప్పుడు కాలస్వరూప మిట్లుండును. అని ఊహించుటకు భావించుటకు నొక వస్తుమాత్రత్వసిద్ధి కలిగియున్నది. తద్భావన యెట్టిది? మానవుని యొక్క శక్తి కతీతమైనది. మానవుఁడల్పుఁడు. దేశకాలాధీనుఁడు. ఆ మహావిషయము దేశకాలానవచ్ఛిన్నమైనది. అట్టి మహాస్వరూపమును భావించి మానవుని బ్రదుకు దానితో జోడించు లక్షణమును భావించి భాసింపఁజేయునది. తదితరమైన దానికంటె నధికధర్మమని చెప్పవచ్చును. వేదమతమునందట్టి లక్షణమున్నది. మానవుని యల్పత్వము, జీవుని తాత్కాలికత్వము ననంతమైన మహాపదార్థమునందు సంయోగముపొందుటకు మానవుని జీవితమొక సాధనమని నిత్యభావనచేయుచుఁ దప్పనిసరిగా బ్రదుకుచు మానవుఁడు బ్రదుకుచున్నాఁడు, గావున తత్తత్కాల యోగ్యక్రియాచరణముచేయుచు, హింసాదికమును వీలైనంతవఱకుఁ బరిహరించుచుఁ దన్నిత్య వస్తువుయొక్క భావసాంతత్యము

చెడకుండ భిన్న కాలములయందు భిన్న దేశములయందుఁ దద్దేశకాలముల యొత్తిడి తప్పించుకొనరాదు, గనుకఁ దదను కూలముగఁ బ్రవర్తించుచు మనుచుండుట యుత్తమధర్మమను టకు వీలున్నది. వేదధర్మ మారీతిగాఁ దీర్పఁబడినది. శ్రీ విక్ర మార్క చక్రవర్తివంటిమహాప్రభువులుతద్వేదధర్మమునుఁ బ్రతి ష్ఠించుట కవతరించిన యవతారమూర్తులు. ఉజ్జయినీనగరము నందలిప్రజలు తచ్చక్రవర్తి జీవజ్యోతిచేఁ బ్రభావితులైనవారు. సంతోషము మనుజునకుఁ గలుగును. ప్రమోదము కలుగును. ఆనందముకలుగును. ఈమూఁడు లక్షణములుకూడ ననంత భేదములతోఁగూడి యుండును. అనంతవైవిధ్యముకలవి. చల్లని గాలి, పుత్త్రోదయము, ధనాగమనము, వ్యాధి నిరాసము. భార్యా సంగమము మొదలైన యెన్నో సుఖహేతువులు లోకమున నున్నవి. అన్నియును సంతోషమును కలిగించును. కాని యే సంతోషమున కా సంతోషమే! ఈ సంతోషముల యందొక యుబ్బు కలదు. అదిపొంగును. దాని కాటుపోటులు కలవు. వరదగా వచ్చును. మఱల తీయును. ప్రమోదమని యున్నది. అది యించు మించుగా సంతోషము వంటిదే! కాని దీని కంటె కొంచెము విలక్షణమైనదని చెప్పవల యును. దాని కాటుపోటులు తక్కువ. కాని యున్నవి. ఆనందమున్నది. దాని కాటుపోటులులేవు. అది యొక విలక్షణ మైన పదార్థము. దానికిఁ బంచేంద్రియవ్యవహార సన్నికర్ష తక్కువ. అది మిక్కిలి యెక్కువ భాగము మానసికమైనది. అదియు సహేతుకమేగాని హేతువునందుఁ గాలుష్యము తక్కువగుటచేతఁ దన యందు నెగుడు - దిగుడులు నాటు

పోటులు లేకుండఁ జేసికొనును. ఆనంద మెట్టి దనఁగా నది యొక ప్రయోజనమును వాంఛింపదు. ఒక ప్రయోజనమునుఁ బురస్కరించుకొని రాదు. దాని స్వరూపము మున్ను చెప్పిన భావనా విరహితమైన వట్టి స్థితి వంటిది. వట్టి యునికి వంటిది. నిర్జననిష్కరాతనిర్జంతు కాంతార స్థిత తటాక గత కమల వికసనము వంటిది. ఒకొక్కప్పుడు దానికి హేతువున్నట్లు కనిపించును. నిజానికది హేతువు కాదు. దానియందు హేతుత్వమును లేదనుటకు వీలులేదు. హేతువులు రెండు. ఉపాదాన హేతువు, నిమిత్తహేతువు. ఉపాదాన హేతువనఁగా కార్యకారణముల యందనుస్యూతమై భాసించు సమానలక్షణముల యునికి. నిమిత్తహేతువనఁగా దాని యందుఁ గారణత్వము లేకయుఁ గలిగినట్లు ప్రకాశించుట. దీని కది పూర్వము నందున్న దనుట మాత్రమే దాని లక్షణము. ఈ యానంద మెవరికిఁ గలుగును? తదానంద పరిజ్ఞాన వంతులైన వారి చేత నిర్మితమైన ధర్మ మార్గమునఁ జలించుచు నిత్యతద్భావనా భావితమైన చిత్తవృత్తులు కలవారి యందు భాసించును.

శ్రీ విక్రమార్క చక్రవర్తి చేత వేదధర్మమునందు శాసింపఁ బడుచున్న యుజ్జయినీ ప్రజలు బాలమార్తాండ సిందూరవర్ణ వర్ణిత మందార కుసుమ కేసరాభిరామ కిరణ సంతాన దర్శన వశమునఁ దదానంద స్పర్శ పొందిరి.

ఈ రీతిగా విరిసిన సూర్యకిరణములు ముదిరి రాజసభా భవనము నుద్దీపింపఁ జేసెను. ముప్పదిరెండు సాలభంజికములతోఁ బదునాలుగు సోపానములు గల బంగారు సింహాసనమును దగద్ధగాయమానముగా వెలిఁగించెను. మంత్రు

లయు, సామంతులయు మహాపీఠములను ధగధగ లాడించెను. రాజునకుఁ గుడివైపునఁ దొమ్మిది రాజత సింహపీఠములు కలవు. వానిమీఁద నే పీఠము నందెవరు కూర్చుండవలయునో వారిపేర్లు బంగారపుటక్కరములతోఁ జెక్కఁబడి యున్నవి. మొదటి పీఠమునందు ధన్వంతరి. రెండవపీఠమున క్షపణుఁడు. మూఁడవ పీఠమున నమరసింహుఁడు. నాల్గవదానిమీఁద శంకువు. అయిదు భేతాళభట్టుఁడు. ఆఱుఘటకర్పరుఁడు. ఏడవ దానిమీఁద మహాకవి కాళిదాసు. ఎన్మిదవ దానిమీఁద పరమవిఖ్యాత వరాహమిహిరుఁడు. తొమ్మిదవ దానిమీఁద వరరుచి. ఈపీఠములు వెండితోఁ జేయఁబడి కూర్చుండు స్థలములు బంగారు తామర పూవులుగా నుండెను. ఆరేకుల నడుమ మెత్తని పఱుపులుండెను. ఆ మహాపండితులువచ్చి యా విశాలమైన పద్మపత్రములనడిమి పఱుపులమీఁదఁ గూర్చుండఁగా బంగారమునందు రత్నములు పొదుగఁబడి నట్లు భావింపఁబడును.

రత్నములు పొదుగఁబడెను. ప్రకృతివర్గమంతయు నాసీనులైరి. అంతలో వందిమాగధులిట్లు స్తుతింపసాగిరి. 'జయ జయ విక్రమార్క నరపాల! జయజయ యక్షేశ్వర! జయ జయ సుఖప్రియ ప్రమద ప్రమోదాతి శాయ్యానంద సంధా యక! జయజయ! ఉజ్జయినీరమారమణ! జయజయ వేద ధర్మస్థాపక! జయజయ యవన మత్తేభదంత సంతానకుట్టాక కరవాల భయంకర! జయజయ ధన్వంతరి క్షపణకాది నవరత్న ఖచిత జాంబూనదాసన మహాసభా భవనాంతరాళ విభూషిత దిగంతరాళ!' అనఁగా చక్రవర్తి లోనికిఁ ప్రవే

శించెను. సింహాసనమునం దాసీనుఁడయ్యెను. సామంతు లందఱు నొక్కరొకరువచ్చి శిరసులు సింహాసనము చివరి మెట్టునందుమోపి పశ్చాద్గమనులై పోయి తమతమ పీఠములం దాసీనులైరి. చక్రవర్తి కిరువైపుల నారగ్వధ కిసాలయ రమణీయదేహలు, హేమకంకణవిభూషితమణిబంధలు. ఫాలాది సీమంతాంత సంభూషిత సిందూరాభిరామలు, నేత్రాంత కజ్జల రేఖా సంయోజిత శ్రవణ పురోభాగ నీలాలక కుటిల రేఖలు. చిబుకనిర్మిత నవార్ద్ర కస్తూరీ బిందులగ్న సూక్ష్మ ముక్తలు, కేశబంధోపరి విలగ్న కిర్మిరిత మయూరీపింఛలు, చామరగ్రాహిణులు సేవించుచుండిరి. ఇట్టులువచ్చి రాజబిరు దములను చదివిరి. తరువాత యుద్ధమునందు సహాయపడిన మహావీరు లొకరొక్కరు సమావేశ పఱుపఁబడుచుండిరి. తొలుతనాభాగుఁడు వచ్చెను. చక్రవర్తి యతనిని మహాసేనా పతులలో నొకనిగాఁ జేసెను. మురారిభట్టువచ్చెను. చక్రవర్తి యతనిని చిఱునవ్వుతో నాదరించి యొక బంగరు పళ్లెము నిండ దీనారములుపోసి బహూకరించెను. మృగేంద్ర సింహుఁడు వచ్చెను. చక్రవర్తి యతనికిఁ దన మెడలోని హారమును సమర్పించెను. అంత శ్రీ చక్రవర్తి యెదుట నిద్దఱు ప్రవేశపెట్టఁబడిరి. ఒకఁడు టికటిక, రెండవవ్యక్తి మధుగుంజ. టికటిక నేఁడాటవికునివలె లేఁడు. రాజపురుషుని వలె నుండెను. రాజు వానినిఁజూచి నవ్వి యిట్లనెను. 'ఓయీ! నీవురగాకృతివి. నిన్నురగదేశమునకు రాజునుచేయుచున్నాను. మీమామ యురగదేశపుమంత్రి. ఉపగదేశపురాజును రాజు, కొడుకును మరణించుట చేత నీకుఁ దద్దేశాధిపత్య మొసఁగఁ

బడుచున్నది.' అని యాజ్ఞాపత్రమును టికటిక చేతికీయఁ బోఁగా టికటిక యిట్లనెను. 'మహాప్రభూ! నాకు రాజ్య మెందులకు? నాయేకతారనుఁబూని ప్రభువుల సాయంవేళా వాహ్యాళి సమయములఁ దనువినోదార్థము యౌవన సంగీతము వినిపించుచుందును'. అనగా చక్రవర్తి నవ్వి 'నీసంగీతము వినవలతుమేని మేమేవచ్చి విందుము. నీపెండ్లి మేమే చేయ నెంచితిమి. కాని నీవు రాజుగానున్నపుడు చూడవలయునన్న కోరికతో మేము చేయుటలేదు. నీవు నీరాజ్యమునకుఁబొమ్ము. అచట వివాహము చేసికొనుము. పట్టాభిషిక్తుఁడవు కమ్ము. ఒక రాజు మమ్మానంద పఱచు గాయకుఁడని మేము సంతోషింతుము. మేము నీ పెండ్లికి వత్తుము. టికటికయు మధుగుంజయు వెనుకకుఁ బోవుచుండఁగా నురగ దేశ రాజమర్యాదా సమీచీన వందిస్తోత్రములు వినిపించెను. సవ్యసాచి యుత్తర జ్యోతిషములకు సేనాపతిగాఁ జేయఁబడెను. భరత సుమంత సహదేవులు కటకసింహపురోరగ దేశములకు సేనా నాయకులుగా నియమింపఁ బడిరి. సర్వ జనులు యథోచితముగాస త్కరింపఁబడిరి.

అప్పుడు కటకటయోగియు రూమ్యకుఁడును తీసికొనిరాఁబడిరి. రూమ్యకుఁడుతలవంచినిలుచుండెను. కటకటయోగి నిర్భీతుఁడై నిలుచుండెను. చక్రవర్తి కటకటయోగితో నిట్లనెను. 'మనికట్ల బాధ తగ్గినదా?' కటకటయోగిమాటాడలేదు. రాజు తుంజినుని వంకఁ జూచెను. తుంజినుఁడు కటకటయోగి వద్దకు వచ్చి యిట్లనెను. "ఓ యోగీ! నీవు మూఁడు వేల

యేండ్లలో ముప్పది జన్మలైన నెత్తి యుందువు. అన్ని జన్మలలోఁ శక్తి యుద్ధమునందు నేర్పరివే. ఆనాఁడు త్తర శాస్త్రీకముల శ్రమపడియున్న నీ మనికట్లమీఁదఁ గొట్టితిని. ఇప్పుడు నీ వలసిలేవు. నే నలసిలేను. కత్తియుద్ధ మాడు దము.' కటకటయోగి తుంజినుని వంక క్రోధముతోఁ జూచెను. రాజాజ్ఞ వలన కటకటయోగి చేతుల బంధములు వదలింపఁ బడినవి. వారిద్దఱి కత్తి యుద్ధము సభకు ముందు సర్వ సభాస్తారులు చూచుటకు వీలైన ప్రదేశము నందు సాగెను. చక్రవర్తి యిట్లనెను. "ఓయి కటకటయోగీ! నీ వొకవేళ తుంజినుని వదలి యే వేళనో మా మీఁదికి దూఁకు దువేమో! మే మప్రమత్తులమై యున్నాము. నీకుఁ గోపము పదిమంది మీఁదనుండవచ్చును. నీ వెవ్వరి దెసకును మఱల రాదు. మఱలుటకు వీలులేదు. నీ కంటె లఘుశరీరులు, నీ కంటె ఖడ్గవిద్యా విశారదులు గగనము నందెగిరియైన నిన్ను ఖండింపఁగల కరవాలధారు లున్నారు. తుంజినుని తోడనే యుద్ధము చేయుము. నీవు తుంజినుని గెలిచినచో నిన్ను వదలి పెట్టెదము. అనఁగా నిరువురు యుద్ధమాడిరి. యామ కాలము యుద్ధము సాగెను. తుంజినుని యొడలెల్ల నెత్తు రయ్యెను. కటకటయోగి చెక్కు చెదరలేదు. అప్రుడు తుంజి నునకు మనసులో నొక మెఱుపు మెఱసెను. అతని హృద యాంతరమునందుఁ జక్రవర్తి ప్రకాశించెను. తుంజినుఁడు 'ఓరి వేదధర్మ విద్రోహీ! ఇది నీ కనువైనకాలము కాదు." అని యఱచెను. అఱుపుతోఁ కటకటయోగి మీఁద దూఁ కెను. వాని శిరస్సును ఖండించెను. రాజు తుంజినుని చికిత్సా

లయమునకుఁ బంపెను. తరువాత కాశ్మీర దేశమునకుఁ బంపెను. అతనిని కాంభోజాధిపతిగాఁ జేయుమని యాజ్ఞ యిచ్చెను.

అంతట సభామధ్యభాగమునకు నొక దేవతాకృతియైన స్త్రీ రాజకుమారికా పరివేష్టితయై వచ్చెను. చక్రవర్తి తన సింహాసనము నుండి దిగి యామెకు నమస్కరించెను. వేద పండితులు త్రయీ పాఠములు చదివిరి. కాళిదాసు లేచి "యా సృష్టి స్స్రష్టు రాద్యా" యనిన శ్లోకమును జదివెను. వరాహమిహిరుని నేత్రము లామెయందు లగ్నమైయుండెను. వరాహమిహిరుఁ డిట్లనెను. 'మహారాజా! నీవు కాలాకృతివి. ఈమె బీజగణిత మూలగణితముల స్వరూపము. ఈమె భగణాకృతి. ఈమె మేరుపర్వతోపరి భాగమున స్థాపింపఁబడిన సర్వగణితమునకు మూలస్థానమైన శంకువు. ఈమె కన్నులను కాంతులు పదుమూఁడు శలాకలు. అనంతాకాశమును పంౘెండు రాశులుగా విభజించు కాంతి యీమెనేత్రము లందున్నది. ఈమెయొక్క సాహాయ్యముతో నేను నీవడిగిన మహానిర్మాణము చేయుదును. పూర్వమెప్పుడో యయోధ్య యందు, హస్తినయందునున్న యహస్కరకిరణ పరిమాణ ప్రపాత చ్ఛాయా సర్వసంపుటి యయిన యాకాశిమధ్య బిందుగత భూగోళనిష్ఠ కాలముయొక్క లక్షణము శిలారూపమున పరిణమింపఁజేయఁబడిన కట్టడములు నేను మీయుజ్జయినిలోఁ గట్టెదను. ఇదయొక సంప్రదాయ మగుగాక! ఇది భవదుపజ్ఞకము. ఇది క్షత్రియ సంప్రదాయ మగుగాక!'

తరువాత బంధితుఁడైన రూమ్యకుఁడు చక్రవర్తి యెదుటకుఁ దీసికొని రాఁబడెను. చక్రవర్తి యతని బంధములు సడలింపించెను. అతఁడు సింహాసనమున కెదురుగాఁ జేతులు జోడించి నిలుచుండెను. చక్రవర్తి యిట్లనెను. 'ఓయి రూమ్యకా! నీతండ్రి పేరేమి?'

రూమ్య:- సింహబలుఁడు.

చక్ర :- అతఁడు యవనుఁడేనా?

రూమ్య :- యవనుఁడే!

చక్ర :- నీతాత యవనుఁడేనా?

రూమ్య :- యవనుఁడే!

చక్ర :- అతనితండ్రి?

రూమ్య :- ఆయన యవనుఁడుకాఁడు. క్షత్రియుఁడు

చక్ర :- నీతాత యవనుఁడైనాఁడన్నమాట.

రూమ్య :- అవును.

చక్ర :- నీవు క్షత్రియుఁడవా, యవనుఁడవా?

రూమ్య :- నేను యవన క్షత్రియుఁడను.

చక్ర :- యవన క్షత్రియుఁడేమి? యవనులలో క్షత్రియులుండరు. క్షత్రియులు వేదధర్మావలంబులలో నుందురు. చెడిపోయిన తరువాత క్షత్రియ శబ్దమున కర్థము లేదు. క్షతమునుండి రక్షించువాఁడు క్షత్రియుఁడు, ఇతరుల గాయములను మాన్పువాఁడు క్షత్రియుఁడు. గాయములను కల్పించెడివాఁడు క్షత్రియుఁడెట్లగును? మీరుక్షహేతువులు. క్షతికారులు క్షత్రియులుకారు. ధాత్రిమీఁద దేశములున్నవి. ఒకొక్క దేశమున కొకరాజుకలఁడు. రంజింపఁజేయువాఁడు

ఝా. ప్రజలను హింసింపక
తోని తనదేశములోఁ బండినవా
చుచు నాహారము చాలనిచో నాహా
మునుముతోఁ దెచ్చికొనుచు ధర్మముని
గును గుడ్డలు సర్వజనులకుఁ గలుగఁజేయుచుఁ,
సుపిట్టి రాజైనవాఁడిచట సుఖపడి యచట సుఖపడవల
యు. ధర్మమనునది యొకఁడున్నది. స్వర్గమనునదియున్న
నీయు ప్రమాణమైన జీవితములో నదిలేదన్నచో లేకపోద
నేనిదు నిన్ను గెలిచితిని. నీవు నన్ను గెలిచితివనుకొనుము
ఈశేముల నన్నింటిని చించి చెండాడెదవు. యవనులచేత
నింరవు. యవనాచారములకు వృద్ధికల్పింతువు. అపుడు
మాత మేమైనదోయీ! లక్షమందిలోఁ తొంబడితొమ్మిది
వేలతొమ్మిదివందల తొంబండుగురు వందయేండ్లు నిండక
చచ్చెవారేకదా! నీవును జత్తువు. తరువాత నేమియగును?
నీవ దుర్జనులు వేలమంది యొకొక్కఁడు తన యాయుః
ప్రవణామువఱకు త్రుళ్ళిసలాడుటయేనా మఱి యేమైన
నునవా?

నిన్ను విముక్తినిఁ జేసితిని పొమ్ము!



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B111 |
| పుస్తకం పేరు | వేదవతి |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 317 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 316 |
| లేని పేజీలు | 1-2 |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Apsar |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |